# నలజారమ్మ

[పద్యకావ్యము]



కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి



కవికోకిల పబ్లికేషన్స్,

నెల్లూరు.

# బాష్పాంజలి.

---

నీబాలలేనగ వెలయు హృత్కుముదంబు
వికసింపఁజేయు చంద్రికలగుంపు,
నీకంఠ మపినేందు వింపారనాకన్ను
వెన్నెలల్లులఁగులు గన్నవిందు,
నీకొమ్మ మువ్వింపు ముకిణంబులు మేన
వ్రిందు సుమృతంపు వానజాలు,
నీహాస మురిపెంపుఁ దీపు క్రొంబలుకులు
నీగుణ రమ్యత్వమైన మదము,

అట్టి నాపుణ్యసుమ ప్రణయప్రకాశ
మన్నుప్రాయంబున దివిఁజేరినట్టి
మత్ప్రియసమేహ పిన్నారి రుక్మిణమ్మ
నామచెల్లెలి స్మరియింతు నాదరమున.

కలలమునంతఁ గ్రొమ్మెఱుఁగుదాడ్పునఁ గన్నులఁగట్టియంతలో
సెలయులఁ బోయితే ప్రకృతి జీవనమెంతయు దుష్టమంచు; నీ
కలికిమొగంబు నేఁటికిని గన్నులఁగట్టు, ననూనభావనా
విలసితమూర్తివై; ప్రణయవేగము కాలము లెక్కసేయునే?

నిన్నుఁ దలపోసినయంతనె
కనుగొనలను దుఃఖబాష్పకణములు జాఱున్;
మన ప్రేమ లతలఁ గాలం
బను ఖడ్గముగోయఁజాల దనుజాతా! వెసన్.

ఇరువదివత్సరంబులకై యేమని దెల్పుదుఁ జెల్లెలా! వ్యథా
భరమునఁ గ్రుంగెఁ జిత్తము; ప్రభాతమనోహరమయ్యు లోకము
త్కరతిమిరావిలంబగు విధంబునఁ దోఁచు; మహిం జరించు పే
విషము నసహ్యమయ్యెఁ; జనగాఁదడవేలొకో స్వర్గభూమికిన్.

ప్రణయసూత్రంపు టురులలోఁ బదిలపఱచి
చేదికో నన్ను దివిసేర శీఘ్రగతిని
చెల్లెలా! యేమిచెప్పుదుఁ జిత్తమిపుడు
చెప్పరానట్టిశూన్యతఁ జెందెనేమొ!

కష్టసుఖవార్థి కల్లోల కాండములను
ముందువెనుకలు దెలియక మునుఁగ నేను
నంబరాపగా సికతాస్థలంబులందు
నాదరమ్మని పిలిచెదో యమ్మ! నీవు,

విమలసంధ్యామహోజ్జ్వ పశ్చిమదిశాంబు
జాక్షిగర్భంబునందు గాఢాంధకార
సంతతులువుట్టె చెల్లెలా, చతురసృష్టి!
చిత్రశల్యంబ యిజ్జగజ్జీవనంబు,

మంజులనందనాంతర సమంచితకల్పలతాకుడుంగ మం
దంజిక లేక రత్నరచితాయతవేదిక విశ్రమించి, గం
గం జరియించు చల్లనగు గాడ్పులసోక ముదంబునొందుచున్
సంజమనోజ్ఞదీధితుల సఖ్యమునెంచెదు రుక్మిణమ్మ, బా
ష్పాంజలితోడ నీకుఁ గృతి నంకితమిచ్చితిఁ గొమ్మ పేర్మిమిడిన్.

ఇట్లు, నీ ప్రియసోదరుఁడు

# సలజౌరమ్మ

శ్రీ సింహపురీ మండల
కాసార మరాళమనఁగఁ గాంతిల్లి రమా
వాసంబయి సతతంబును
వాసి స్థాయూరు మిగుల వర్ధిలుచుండున్.

ఖలులను సంస్కరింపఁ దమకమ్మున శిష్టుల రక్షసేయఁగా,
నిల హరి విగ్రహంబయి రహింపఁగ, నంత వికుంఠవిష్టపం
బలరఁగ దేవతాయతన మయ్యెనో నా నతికెక్కె నప్పురిం
గల ప్రతి దేవమందిరము కందు సమాశ్రిత గోపురంబుగన్.

నెలకొని భూసురోత్తములు నీరజషండ పరాగ పూగ సం
కలిత జలప్రపూర్ణయయి కాలు జలాశయమందు వేకువన్
సలిలములాడి వేదవిధి సక్కఁగఁదీర్చి విధాతలో యనం
జెలువుగ వేదశాస్త్రములు సెప్పుచునుందురు శిష్యకోటికిన్.

జానపదులు గోరు చక్కెఱ బెల్లంబు
నుప్పు మిరపకాయ పప్పులాది
వస్తునికరమ్ము వైశ్యులాప్రోలను
సప్తనిధులఁగూర్చి యలరుచుండ్రు.

కుక్కుట జాలంబు కొక్కొరో యనికూయ
నీల్గుచు మూల్గుచు నిదుర లేచి
యతివల కౌగిళ్ళ నల్లన సడలించి
తల్పంబులన్ డిగి తడవికొనుచుఁ
బడకటింట్లను వీడి తడుపుఁబాతయుఁ జేతి
కఱ్ఱయుఁ గైకొని కను రయమునఁ
పైరుపచ్చలుచూడఁ బసులను గాపాడ
మడవలుగట్టంగ మడులుదున్న

ఎండవాన లనాక యుద్దండలీలఁ
బ్రొద్దువొడిచిన దాదిగాఁ బ్రొద్దుగ్రుంకు
వఱకుఁ బొలములఁ గష్టించి వచ్చుచుందు
రప్పురంబున యువకులౌ హాలికవరులు.

పైరులుఁ బంటలుం గలిగి పంటవలంతికిఁ బచ్చఱాల బంగారపుఁ గొప్పుబిళ్ళలనఁగాఁ జెలువొప్పును నప్పురంబు ముక్కారులు పండుచేలు, మును గాఁపులొసంగిన యప్పుడేర్పు నన్నారుణి ధాన్యరాసులను దాఁచిన గాదులనంగ మీఱుచున్.

ప్రోలికి దక్షిణంపుదిశఁ బుష్కరపుష్కలమై, ప్రకంపనాందోళిత వీచికానికర తుందిలమై, కలహంసచక్రమీనాలయమై, విశుద్ధ సలిలాశయమై తనరుం దటాక ము[illegible]ల తటావృతంబునయి తగ్గక నీరు నిదాఘకాలమేన్.

చెఱకు గానుగలను జిందిన రసబిందు
లాన నీఁగలు జుమ్మురంచుమూఁగ;
జెఱకుఁబిప్పిని మేసి చెలువాఱు నెలపెయ్య
దాఁటులు బీళ్ళకుఁ దరలుచుండ;
నెమరు మోసులు తుంగ కుదుడులు తెగ మెక్కి
యూరపందుల బారు నేరితిరుగ;
గళమునందున వ్రేలు గంటలు మ్రోయంగ
మేఁకమందలు పచ్చ మేఁత కేగఁ

బనికిఁ గొఱగాని సోమరి పసుచువాండ్రు
దిరుగుచుండఁగ బాజారు తెరువులందుఁ,
బల్లెటూరి మిటారులు పణ్యవీథి
జేరమాడఁగ నవ్వేడు గోరమలను.

ఆపురమందునఁ గాఁపుల
కాఁపురములు పెక్కుగలవు కంజాలయకుం
గాఁపురములు, నతిఘులకుఁ
దాపురమైనట్టి యున్నదానపుటిక్కల్.

అవ్వీటి కాపుమేటులందు.

కొలిచిన మూరకెక్కుడగుగొప్పయురంబును, మాంసలంబులై
నులికలుకొన్న బాహువులు, మిట్టిగోనల్, రుదురాకవన్నె చె
న్నొలసెడు మేనినిగ్గుగల యొక్కఁడు వెంకటరెడ్డినాఁగఁ బే
ర్వొలసెను గష్టజీవియయి పెద్దలనాఁటి ధనంబు లొప్పఁగన్.

వాయురోగంబునంచాను బాల్యమందు
వసర, నతనికి జనయిత్రి పసపుఁ జేత
నుదుటఁ గాల్చిన మచ్చసొంపొదవుచుండు
నిటలలోచను మూఁడవ నేత్రమనఁగ.

చెరువునీటనుమున్గఁ జేవురించె నెగాని
పెన్నెరి విప్పిన వెన్ను దాటు;
స్ఫోటకచిహ్నాలు వాటిల్లి నేగాని
మొలకనవ్వాలుగుల్కు ముద్దుమోము;
కావడిమోఁతలఁ గాయగాచె నెగాని
భుజపాళి యుబ్బి సొంపులుఘటించుఁ;
జనువురాకుండుటఁ గోదుకుమాటలెకాని
చతురత సుంతైన సందువోదు;

మడవకట్టుగాండ్ర మడవవ్యాజ్యములలో
దనదె పెద్దగొంతు దనరుచుండు;
సేద్యమందు వళవుసెప్పఁజాలిన మేటి;
పట్టువిడుపు దెలియు దిట్ట యతఁడు.

పెరుమారెడ్డి సువంశమందుఁగలిగెం బెంపార నొక్కర్తె మున్
సిరివారాన్నిధి నుద్భవించినటులన్ శృంగారపుష్టివియో,
సరసంబౌ నవనీత విగ్రహంబొ నా జానొప్పు నక్కన్యకన్
హరువొప్పారఁగఁ బెండ్లియాడె హాలికుం డానందనిర్మగ్నుఁడై.

నలజారమ్మయనంగను
సలలితమా పేరుగల్గిసారసముఖి, కాఁ
పుల పూఁబోణులఁ దానొక
తలమానికమట్టులఁ దనరెఁ దలమా పొగడన్!

నిమ్మపండువంటి నెమ్మేని జిగితోడఁ
గురుల నీలిపసలు గునిసియాడ,
గంగ యముననీరు గలిసిపారినరీతిఁ
జెలియసోయగంబు చెలువుమీఱె.

కన్నుఁదమ్ములు పెద్దవేగాని, కొనలఁ
బచ్చవొడిచిన సోగలు పరిఢవిల్లఁ
గాంచువారికి మఱియింతగాఁగ, జిగులఁ
గ్రుమ్మరించుచుఁ గందోయి కులుకులెసఁగు.

సందిటఁ బచ్చలబాజీ
బందులపస నొసఁగుచుండుఁ బచ్చవొడుపుఁ బూ
వుందీవల యందము లా
కుందరదన బాహులతలకుం దొడవులన్.

పూవుఁగొమ్మల నెలదేంట్లు మూఁగి జుమ్ము
జుమ్మురంచని రవళించు జోకదోఁపఁ
గాంత మణిబంధయుగమునఁ గాంతిగొల్పు
జిలుఁగు నీలాలగాజులు నులివులొలయ.

నల్లబూసల పేరులో నాణెమైన
గన్నెబొట్టు, కడానివంకీలు, మట్టె,
లంచుకమ్మలు, ముక్కర యందమెసఁగుఁ
గలికి నెమ్మేని నిగ్గుల చెలిమి కలిమి.

దైవభక్తిగల్గి దైవాఱు నాసతి
పతియెదైవమంచుఁ బ్రణుతిసల్పుఁ,
గొలసి పూజసేయు దురితకార్యంబులఁ
జిత్తమందుఁ జింతసేయ దెపుడు.

ఇంటికి నమ్మ, భిక్షమని యెవ్వరువచ్చినఁ బొమ్ముపొమ్ము నీ
వంటిరుచాలమంది యని వాదులుసల్పక వడ్లొ, బియ్యమో
నంటకమో తగుంగొలఁది వచ్చినయర్థుల కిచ్చి పంపు వా
ల్గంటి ప్రమోదచిత్తయయి, కల్గినదిద్దియె యంచుఁ జెప్పుచున్.

ఇరుగులనున్నవారి తగువెయ్యది యేమనితీర్పనేగదా
పరమపతివ్రతామణి ప్రభాతమునందున గేహకృత్యముల్
సరగునఁదీర్చి రాట్నమును సజ్జొసిత్రిప్పుచు వడ్కుచుండు సుం
దర బిసనాళ తంతువు లనందగు సన్నని నూలుపోఁగులన్.

పరపురుషాస్యముం గనినఁబద్మవిలోచన మోమువాంచుఁ;దాఁ
దరపనిలేకయున్న నిలుఁ దా విడనాడదు; పోదు మాటికిం
బరగృహ పణ్యవీథులకు; బాదులఁజూచినఁ దల్లిదండ్రులం
గరమనురక్తిఁ గాంచినటుగా మరియాదలు సల్పుఁ బ్రీతిగన్.

పతి చిత్తవృత్తిఁ గనుఁగొని
సతతము నతఁడాజ్ఞయిచ్చు చాడ్పున వ్యతిరే
కత లేక కార్యముల నా
సతి సేయుచునుండు భక్తి సౌశీల్యములన్.

ఈరీతిఁ గొంత కాలము
సైరిక మిథునంబు ముదము సంధిల్లఁగ సం
సారము సేయుచునుండెను
దూరీకృత దురితముగ నధోక్షజభక్తిన్.

పొలమున కేగియున్న పతి భోజనవేళకు రాకయున్న నా
వెలఁదియు రాట్నముఁ రవళివెట్టఁగఁ ద్రిప్పుచుఁజూరునందుఁగి
ల్కిలమని పల్కు పిచ్చుకల క్రీడలుసూచుచునుండ నంతలో
వెలుపలనుండి పిల్లలకు వేగమమేఁతలు దెచ్చె తల్లియుఁ.

తల్లినిజూచి పిల్లలు ముదంబునఁ గంధరముల్ నిగుడ్చి సొం
పుల్లసిలంగఁ జంచువుల నొండొరు మీఱఁగఁజాఁపి యొప్పునం
గిల్లని తల్లియున్న దెసఁగ్రిక్కిఱియం, గలవింక మంత న
ల్లల్లన మేఁతవెట్ట నది యంతయుఁగాంచుచునుండెఁగాంతయుఁ.

ఔరా! సృష్టివిచిత్రమెన్నఁదరమా? యంభోజగర్భుండు సొం
పారం బిట్టకునైన నిట్టి వలపత్యంతంబుఁ గల్పించి సం
సారాంభోధితరంగ డోలికల నూఁచంగ దగె నీ లోకముఁ;
ఈ రీతిఁ విధి సేయకున్న నగునే యెందైన సంసారముల్.

ఱెక్కలు వచ్చినంతనె తఱిఁగని పాఱి వీడి నీడ మే
దిక్కున నేకుజంబులనో తేఁకువ గూండ్లు రచించి తల్లియుఁ
మక్కువ లేకయుండు కసుమాలపుఁ బిల్లలమీఁదఁ బక్షికి
మక్కువయున్న దే! యిఁకను మానవులన్వాలపుంట దొడ్డయే!

పిట్టలకైనఁగాని యిటు పిల్లలఁజూచినయంత నుల్లమం
దెట్టులనుండునో మమతయెవ్వరికైనను జెప్పశక్యమే?
కట్టిడిగాఁడె బ్రహ్మయిటు కౌతుకయుక్తులఁజేసి పక్షులన్
దిట్టతనాన నన్నుఁ గడుదీనత స్రుక్కఁగఁజేసె నక్కటా!

మును బుడబుక్కవానికిని మోదమునన్ జరిచీరయిూయ నా
కనువుగ వెండితాయెతున యంత్రముసంఘటియించి యిచ్చెనా
యనఘుడ; దేమొకాని యటులైనను నొక్కయపత్యమింతకుం
బనవుయెకాని కల్గదుగ! ప్రాగ్భవ దుష్కృత మెంతగాఢమో?

నాసరివారిజాక్షులు మనంబునఁ బ్రేమతురంగలింప నా
శాసురు సన్నిభాత్మజుల జక్కిలిగింతలువెట్టి పాదవి
న్యాసవిలాసముం గనుచు నాననచుంబన మాచరించుచున్
వాసరముల్ తమింగడుప నాకిటు వంజతనంబు చెల్లునే?

పూర్వం బెట్టియఘుంబు సల్పితినో? యేపుణ్యాత్ములన్ సాధులన్
గర్వాంధంబునఁ గష్టవెట్టితినో? యేకల్యాణి సత్పుత్రు నే
సర్వాంగంబుఁ గఠోరశస్త్రికలచే స్రగ్గించినానో? ననుం
బర్వెం దద్వృజినావళుల్ కటకటా! వంధ్యాత్వరూపంబునన్.

కలుగునో కల్గఁడో సుతుఁడు గన్నులకామెతగాగ; పాలడాల్
గులికెడు లేఁతబుగ్గలను గూరిమి ముద్దిడు భాగ్యమబ్బదో?
యిల సుతహీనయైన సతి కేమిసుఖంబగు? భోగభాగ్యముల్
దలకొనియుక్ వృథాగద సుధాకరహీన నిశా విధంబుగన్.

అని యిటులఁదలపోయుచు దుఃఖాక్రాంతమానసయై.

కలువలజంటనుండి దొనకన్ దిగజారెడు కమ్మనీటికా
ల్వలవలె బాష్పపూరములు పైకొని లోలదృగంచలంబులం
దొలఁకి పయోధరాగ్రములతో నెకసక్కెములాడుభంగి, న
ప్పొలఁతుక వెక్కి-యేడ్చె నిజపూర్వకృతాఘ నిదాఘతప్తయై.

అంతఁ బొలంబెల్లఁ గలియంగ్రుమ్మరి యుస్సురనుచునాహాలికుండు.

పటు సూర్యాతప సంహతి
నిటలంబున ఘర్మబిందునికర మొలయ, నాఁ
కటితోఁ జని యింటికిఁ బ్రీ
స్ఫుట దుఃఖవివర్ణవదన సుదతిని గాంచెన్.

కాంచి, విషాదమొదం దను
ముంచుకొనం బల్లవోష్ఠిముందుకుజని యూ
హించన్నెరక హేతువు
కొంచెముసేపూరకుండి గోణఁగె నతండున్.

ఇరుగుపొరుగుగలత లెవరైన నీతోడఁ
దగవుపెట్టుకొనిరో? తల్లిదండ్రు
లేమితిట్టినారొ? లేమరో! సెప్పుమ
హృదయమందుఁ గుందు టుదుటుదీఱ.

విరిసిన తమ్మిఁ దేఁటిజత వేడ్కమరందములాని వెక్కుడై
న రసముగ్రక్కెనోయనఁగ నాతిరో కన్నులబాష్పపూరముల్
పొరలఁగనేల? కేలనుగపోలము నూనఁగనేల? బేలవో?
చిరుతవొ? చెప్పరాదొ? యని చింతదొలంగఁగ భర్త వేడినన్.

విని, విరిబోణి లేచి మృదువీక్షులకాంతి విషాదతప్తమై
కణికలు గట్టెనోయనఁగ గజ్జలసమ్మిళితాశ్రుబిందువుల్
దొనఁక నిజాంగుళిం దొలగద్రోయుచు నిర్మల దంతదీధితుల్
ఘనముగనోష్ఠరాగమును గప్ప వచించె హృదంతకవ్యథన్.

బిట్టలకైన సంతసము పేర్చును బిల్లలఁగూడియుంట; నా
కట్టిడి బ్రహ్మ యేలొకో సుఖంబులు సంపదలిచ్చి యొక్కనిం
బట్టినిగల్గఁ జేయఁడు? ప్రపంచము నందిఁక నిట్టిజీవితం
బెట్టులఁబుచ్చనౌను; హృదయేశ్వర, యీశ్వరచిత్తమెట్టిదో!

అనవిని, భర్తయిట్టులను: నంబుజలోచన, యీశ్వరుఁ వృథా
పనవుచు దూఱనేల!; మనపాపము కొండలమీఱ నూరకే
వసరిన నేమిసేయఁగల వారము? పాపము ముట్టకుండునే
మనయభిలాష? వృద్ధులమె? మానుముశోకము; బూనుమోరి
మిఁ.

అనియిటు భార్యను హాలికుఁడు
చనవునఁదాగుస్తరించి సంతోషమునఁ
మునుపటివలె సంసారం
బొనరుచుచుండంగ దైవయోగముచేతఁ.

నెలమసలె; చీరచిక్కెను;
బులుసులపై నిచ్చగలిగెఁ; బొసఁగె గతులయం
దలసత; నెలఁతకు జెక్కుల
వెలిజిగి దలకొనియె; వళులు బెరసెను జదునై.

చనుమొనలు నల్లవాఱెను;
మినమినవిడి పెదవులోలసె మృత్తికతావిఁ;
దనరెను జిహ్వము లరుచియుఁ;
దనువున శ్రమహెచ్చెఁ; గాను తరుణికి బలిసెన్

ఇటులనాదోటి దుర్భర గర్భాలసయైయుండ నొక్కనాఁడు.

కాలశాక్తేయుఁ డంధికాకాళి కధిక
భక్తిఁ గడసంజ తగరును బలిగనీయఁ
గ్రొత్తనెత్తుటిధారలు గురిసెననఁగఁ
జేవురించెను దిక్కులు చెలువుమీఱి.

పాఁడి యఱ్ఱులువాచు పైరుజొంపములకు
జాళువాపూఁతలు గీలుకొల్పి,
కన్నెపయ్యెర కల్లఁ గదలచు దోఁగాడు
జలదబాలల కెఱ్ఱ కలప మలది,
కుజకోటరంబులఁ గూర్కెడు పెనుగుడ్ల
గూబల మాంద్యంబుఁ గొల్లగొట్టి,
యెండరాపిళ్ళకు నెరియు క్రొన్ననలకుఁ
బూర్వరాగంబును బొదలఁజేసి,

ఆలమందలఁ గదలించి, హాళికులకుఁ
గనులు చాలింపఁ గనుసన్నఁ బరగఁ దెలిపి
భర్తలనుగూడ నుత్కంఠ భామినులకుఁ
గొలిపి, రజనీముఖంబునఁ గొఱలె నినుఁడు.

సాంధ్యరాగంబు వృక్షాగ్రశాఖలందు
నలమికొనినంత వహ్నికీలలుగ నెంచి
పక్షులెల్లను గూయుచుఁ బఱచుచుండెఁ
గాలిపోయెను గూళ్ళంచుఁ గడురయమున.

తార లుల్లసిల్లె; జారుల మనములు
కలువలట్లు కాంతి గడలుకొనియెఁ
జక్రవాకకాంత స్వాంతంబుపోలికఁ
దమ్మి మోముమోడ్చె నుమ్మలించి.

అభ్రకేదారమునఁ జంద్రుఁడనెడు గోప
బాలకుం డుడుగణమను పసినిమేపు
చుండు సోయగ మత్తఱినొప్పె; నటులఁ
గాక, చిహ్నమట గొంగడి గలుగుటెట్లు?

హంసబాలిక లంబు విహారలీల
నంబరాపగ తరగల నాటలాడఁ,
గంపితంబయి యంభోజకాండరజము
లలమికొనెనన వెన్నెల లలరెమింట.

అంత నాకాంత భర్తకు సన్నమునిడి
చంద్రికామోహనంబైన శర్వరి నట్టు
పవ్వళింపఁగ మంచము బయటవైచె
నచఁగువెట్టుట యామడ యట్లుఁగాఁగ.

పతియు భుజించివచ్చి 'సతి, పందులుదున్నలు గోవయావులున్
సతతము జొన్న చేలఁబడి సర్వమునాశముచేసెనంట; యా
వితమును నేఁటిరాత్రిఁగని వేకువవత్తు'నటన్న భర్త, యా
సతియిటుపల్కె 'నాథ, మదిసంధిలెఁగోర్కె యొకండుదెల్పెదన్

ఊఁచబియ్యముమీఁద నాకూహ వొడమెఁ,
దిరిగివచ్చెదునప్పుడు తెమ్ము జొన్న
కంకు లోకపది!' యనిచెప్పఁ గలికి, హాలికుఁ
డట్లనే యని తలయూచి యరిగెనపుడు.

పొలఁతి యొకింత సేపు కనుమోడిచి, స్వప్నమురాఁగ లేచి యీ
కల ఫలమేమొ? మట్టియలు ఘల్లని వీడెను, క్రొత్తచీర నా
తలపయిఁ గప్పినట్లుపడె, దారుణ వహ్నిశిఖాముఖంబునం
బలుపురు దండసంభృతులు బల్మి ననుంబడద్రోచి రుగ్రులై.

సారసగంధి యుప్పగిది స్వప్నవిధంబును జింతచేసి 'యో
సారససంభవాది సురసత్తమవందిత పాదపద్మ, ని
ష్కారకృపాపరా, పతికి బాధయొకింతయు నెప్పుడేనియుఁ
గూరకయుండుఁగాత!'మని కూర్మిఁదలంచె రమామనోహరున్

మాటికి స్వప్నసంగతులు మానసవీథిఁగలంచఁ గాఁపు సీ
మాటి భయార్తచిత్తయయి మంచము గేహమునందువైచి, దీ
గూటను దీపమున్నిలిపి కూర్కొనుచుండెను... యాత్ర శ్రావ్యమై
పాటలెఁ గిల్కిలారవము పక్షికులాయములందుఁ బెల్లుగన్.

కొక్కొరోయని కూసెఁ గుక్కుటనికరంబు
రెక్కలు దట్టించి నిక్కినిక్కి;
చెరువునీటికిఁబోవు చేడెల యందెల
ఘల్లుఘల్లురావము గడలుకొనియెఁ,

బైరుచేలకు నేగు సైరిక ప్రకరంబు
లొండొరుఁ బిల్చు పెన్నులివు లొప్ప,
గోష్ఠమందలలోన గొల్లల పిల్లన
గ్రోవిసంగీతంబు కొమరుమీఱ,

లేఁగదూడలు పల్పులు లాగికొనుచు
నఱ్ఱులెత్తుచుఁ దోఁకలు జాఱ్ఱకొట్టి
యంభరావంబు సల్పుచు నాలమందఁ
బాల కఱచుచునుండె నిబ్బరముఁగాఁగ.

కాముకేళుల నిశియెల్లఁ గడపి యొడలు
మఱచి నిదురించు యువతుల మందలింపఁ
జూరుసందులనుండి బంగారుసూదు
లవలె వ్యాపించె నరుణాంశులవము లింప్లి.

ప్రకృతి చైతన్యభావమువాపినట్టి
సంతమసమును హరియింప సమయమై ద్యుఁ
డలరు పారద సిందూర గుళిక నై చె
నసఁగ నుదయించె రవిబింబ మరుణదీప్తి.

పడకలనుండి లేచి చలివాయుఁగఁ జీరలుగప్పి, చేతులం దిడికొని పేడచేటలను, 'హే' యని బత్తెనదల్చి నాదియా కడియని యుత్తఁబల్కుచుఁ గాఁపులపిల్లలు బత్తెతండములఁ బసిఁడను వీధులందు నడువచ్చుచుఁ బోవుచునుండిర త్తఱి.

దుర్భరంబగు గర్భంబుతోన నపుడు
కదలఁజాలక కదలుచుఁ గాఁపువెలది
పాఁచిపనులెల్లఁ దీరిచి బత్తెమూడ
నడలి పాల్వాసె గంకణక్వాణన మొలయ.

అంత నెడనెడ నొప్పులు గానిపించుటయు, గర్భవేదన కాఁ దలంచి, నలజారమ్మ తన తల్లినిం బిలువనంప నామెయు మంత్రసానింబిలిచికొని కూఁతురుంజూడవచ్చె. ఇట్లుండ మా దిగ యొకండు, తనజొన్నచేనిలోఁ గంకులు విఱిచియుండుటఁ గన్గొని చేనిప్రక్కన యాలమేపు మాలపిల్లల విచారించి, వెం కటరెడ్డి గోసెనని తెలిసికొని, యుజారదారుఁడును నలజారమ్మ తండ్రియునగు పెంచలరెడ్డిఁ జేరి యిట్లని విన్నవించుకొనియె:

ఎన్నఁడెఱుగని మీయల్లుఁడేమొ కాని
నిన్నప్రొద్దునవచ్చి మా జొన్నమడికిఁ,
బెద్దకంకులు బుట్టెడు విఱిచెనంట!
కంచెయే చేనుమేసినఁ గలదెదిక్కు?

పిల్లలు పెండ్లము నేనును
నిల్లనకయు వాకిలనక యేఁగి మడులకుఁ
బెల్లుగఁ గష్టముచేసియుఁ
జెల్లించఁగలేము శిస్తు జేజే, సామీ.

మీరే తల్లులుదండ్రులు
మీరే బంధుగులు మాకు, మీసలవన మా
వారలు పిల్లాపిసుగులు
గారాబముతోడఁ బ్రతుకఁగలిగితిమయ్యా.

మీరు పెంచిన మొలకను మీరె గోట
బ్రక్కలించిన మాకేది దిక్కు తండ్రి?
కడుపులోపలి యుంబలి గదలకుండఁ
సాఁకుచుండిరి మీతాత సాలినుండి.

పెంచలరెడ్డిమ, దణ్ణము,
కొంచెము మనసుంచి మాదుగోడు వుఫుమి; మీ
పాచల నుందుముగద; ర
క్షించినఁ గష్టంబులిడినఁ గీర్తిమీదే.

ఇవ్విధి జాలిపుట్ట వచియించిన మాదిగవానిఁ జూచి యీ
సన్యాడి యల్లునిఁబిలిచి చక్కవిచారణచేసి, యింక నీ
కెవ్విధమైన కష్టము రహింపకోయుండెడు నట్లొనర్తు, నీ
విర్యాగ మాని పొమ్ము, మడిగేగుమ యన్న వినమ్రశీర్షుఁడై.

దండము దేవరా, సలవదాతలు కాఁపులు; బుద్ధి బుద్ధి; మీ
యండలఁ గాక మాకదుపు టంగద దీరునె? గోవయాల రా
కుండగఁ జేయుమయ్య, యవియుక్కనఁ గంకులు మేసిపోవు;నా
దండుగనోర్వలేము; దయదప్పక మమ్ములఁ జూడురెడ్డిమా.

ఇటుల శ్వాబచుండు వచియించి యోఁగినంత
శోకసంతప్తచిత్తుఁడై స్రుక్కి రెడ్డి
గోడమోవునఁ గూర్చుండి కొంతసేపు
మనమునం దిట్లు తలపోసె మాన్యుఁడగుట:

మాలమాదిగవారల మందమతులఁ
గష్టపెట్టిన మన కేమి గలుగు సుఖము?
సర్వజనులను బాలించు జగదధీశుఁ
డరయుచుండఁడె సకలాంతరాత్మ యగుచు.

ఇప్పుడైనను రేపైన నెప్పుడైన
ననుభవింపక తీరునే యఖిలకర్మ
ఫలము? లటుగాన జనులకు భద్రమగును
న్యాయ్య మార్గంబుఁ దప్పక నడచుకొనుట.

సుతుఁడైనను హితుఁడైనను
సతియైనను నల్లుఁడైన సదమల ధర్మ
వ్యతిరేకత వర్తించిన
మతిమంతులు వారి పొత్తుమానుదురు ధరన్.

పెంచెలరెడ్డి యల్లుఁడట! పెంపఱి మాదిగ జొన్నచేనిలోఁ
గొంచెపు బుద్ధిఁ గంకులను గోసినవాఁడఁట! యంచు నూరివా
రెంచరె? దుర్యశంబు నిపు డెవ్విధిఁ బోకడవెట్టనౌను; నే
మంచితనంబుఁ బూన నిఁక మానముదక్కునె? కీర్తినిల్చు

అల్లుఁడటంచు నాతఁడు దయామతి మన్ననచేసెఁ, గాక తాఁ
బెల్లుగ శిక్షసేయఁడె? విభేదము లెంతురె యోగ్యులంచు న
న్నల్లరుఁ దూలనాడరె? యహీనయశంబెటు వీడనౌను? నా
పెల్లవిధంబులన్ విధిగ నేర్పడె నాతని శిక్షసేయఁగన్.

నలజారమ్మను గర్భిణిఁ
దలపోసిన నామనంబు తద్దయునీరౌ;
తెలుపక పతికృత్యము నే
సలఘు యిమ్మాదు ధర్మసందేహమునన్,

అనియిటు లేవఁబోవు సమయంబున బల్లెతమోర్తు చేరవ
చ్చి నగుమొగంబునం బలికె చిన్నినిసుంగు జనించె నిష్టకూఁ
తునకు నటంచు; నంత నెదఁ దోరము సంతసముప్పతిల్ల వే
చని పురిటింటిలోఁ గనియెఁ జక్కని పాపను బొత్తిగడ్డలన్.

నలజారమ్మయుఁ దండ్రి, గాంచి మది నానందమ్ము దైవాఱ వె
న్నెలఁ గ్రొన్నిగ్గులు కన్నుఁ దమ్ములో లయవీక్షించి యోతండ్రి యా
జలజాతాక్షు కృపావిశేషమున మత్సర్వాఘములూలి ము
ద్దులకందౌ కట్టిగల్గెఁ గాంచుమిటు సంతోషంబు దీపింపగన్.

అని పితచేతులఁ శిశువునొప్పిన గాంచి వచించునాతఁడో
తనయ స్వబాంధువర్గము ముదంబును బొందఁగఁ గందునోర్తు నా
వనజభవుండొసంగె; మునుభక్తి నొనర్చిన నోములియ్యెడం
దనుగ్రహించి కూతురుగ ధాత్రిజనించెనుగాక యన్యమే?

అనవిని నలజారమ్మయు
దనయను మంచమునబెట్టి తాను బరుండెన్;
జనకుండిట్లనె, మొగముం
గననీయక లోని వెతలు గనరానియటుల్.

నామది నొక్క సందియము నాటెను; బాటిగ దానిఁబుచ్చ స
త్యామల నీతివాక్యముల నమ్మ, వచింపుము యుత్తరంబుగన్;
ధీమహితుండయేని యొకతీరునఁ జిత్తము తత్తఱింపఁ దా
నేమియుఁ జేయఁజాలఁడు, మఱెవ్వరు యోచన సెప్పునంతకున్

చౌర్యము నీచకృత్యమని, శాస్త్రవిరుద్ధమటం చెఱింగియున్
దుర్యశమొప్ప సల్పు నతిదుష్టున కెమ్మెయి శిక్షసేయఁగా
నార్యులకు స్మదంబగును న్యాయముసెప్పు; మిజారుదారు దు
ష్కార్యనియుక్తచిత్తులను గాఱియవెట్టగ వీడవచ్చునే?

అని జనకుండువల్కు, వినయంబునఁ బుత్రి వచించు నాయనా,
మనము తురుష్కభూపతుల మాటలతిక్రమణంబు సేయఁగాఁ
జనదు; తదీయధర్మములె శాస్త్రములట్లు దలంచి శిక్షలం
బూనరుప శ్రేయమౌను; దలపోయుము వేఱువిధంబుగల్గినన్.

యవనుల న్యాయము దలఁప నారటఁగూరును జిత్తమందుఁ బ్రే
మవిలసనంబు శూన్య; మొకమానిసిచౌర్యముసల్పఁ గొత్తయే
దవిలిన శిక్షయంచుఁ బ్రథితంబుగఁ జాటును; పూర్వభూభుజుల్
సపురుగ నిట్టిశాసనముల రచియించిరె క్రూరచిత్తులై?

అని యీరీతిగఁ బల్కెడు
తనయను దిలకించి తండ్రి ధర్మంబునకుం
దనవార లగారివారని
చనునే భేదంబు? నొడువు సత్యంబనఁగన్.

సరసిజబాంధవుండు కరజాలము లోకమునందు భేదముం
బొరయక సర్వవస్తువులఁ బూర్ణముగాఁ బ్రసరింపఁజేయు న
ప్పురుసున న్యాయదాత తమవా ర్పెఱవారను భేదబుద్ధి యెం
దరయక ధర్మరక్షణ నయంబుగఁ జేయఁదొలంగు నిందయున్.

మును రక్షోహృతయైన సీతను సతీమోహంబునన్ రామచం
ద్రనరేంద్రుండు గ్రహించెనంచు బలు నిందల్వాల్కఁ బౌరుల్ధరా
జను గాంతారనివాసినిం సలుపఁడే శంకింప కారాముఖన్;
మనవారల్పైఅవారలంచు సుజనుల్ న్యాయంబునోఁజూతురే?

మును గౌరవ్యులు ద్రౌపదింగినుకయై భూపాలసంఘంబు మూఁ
గిన పేరోలగమందుఁ జీరలొలువం గిడ్పుటు వీక్షించుచున్
ఘనులౌ పాండవులుండరే కనలియున్ న్యాయైకబద్ధాత్ములై,
జనకా, కూడవు పక్షపాతవిధముల్ సత్యంబుఁ బాలించుచో.

అని తనుజాత వల్క విని యాఁకటదోరముగూరఁ గన్నులం
జినుకఁగ బాష్పతోయములు చెప్పెడిదేమియులేక దీనతన్.
జనకుఁడు వెచ్చనూర్పుచు వనారిలుచుండఁగఁ జూచికూఁతు రీ
వనటకు హేతువేమి యని వందురుతండ్రిని బ్రశ్నచేయఁగన్.

అక్కట! యిట్టివార్త నెటులాడుదు? నాడకపోవరాదు; నే
నక్కటికంబుమాని యెటులాత్మజభర్తను జాపనేర్తు; నం
చొక్కెడఁ గూఁతుఁజూచు; మఱియొక్కెడ మోమునువాంచు లేఁచుఁగై
పెక్కినవానిపోల్కి నటులేఁగును వచ్చును, నేడ్చఁబెల్లుగన్.

తనయా, యంచను, నేమియున్నవినుమాధర్మంబనుచున్, ఏమినా
నిను నెవ్వారలు పిల్చిరంచుఁ గినియున్, నీవేగదాయన్న ఏ
మనుచుఁ;దండ్రీ,యిదియేమి వెఱ్ఱియనఁగా హాయంచునవ్వంగదున్
ఘనశోకావిలచిత్తుఁడై శిరము పేఁకందాకుఁ బెన్బిత్తికిన్.

మాటికి జొన్నకంకులన, మాదిగవాఁడనఁ గొత్తవేఁత ము
మ్మాటికిఁ దప్పనేయన, క్షమాపణలేదన, నౌను గాదనం,
గాటిలె దుఃఖమొల్లు విడఁబాటుగు నంచనఁ దండ్రి, భీతి న
ప్పాటలగంధి పొదము గభాలన గంటకితాంగవల్లియై.

నలజారమ్మ తండ్రిని బరికించి నాయనా, మాదిగవాఁ డెవండు! జొన్నకంకు లెక్కడివి!. కొత్తవేఁత యేమి? యని ప్రశ్నించుచుండు నంత, వెంకటరెడ్డియు జొన్నకంకులు దుప్పటి యందుఁగట్టి భుజముపై నైచికొని యిలుసేరి, భార్య ప్రసవించుటవిని సంతోషించుచుఁ బురిటింటిలోనికి వచ్చె.

వచ్చినభర్తమూఁపుపయిఁ బట్టుగ మూఁటెడు కంకులుంట నే
తెచ్చిన కంకులెచ్చటివి? తెచ్చితివో మన చేనినుండి, లే
కెచ్చటనుండి తెచ్చితివి? యేమనఁదొయ్యాలి, వెల్లబోయి రా
పచ్చు పడంగఁజిత్తమున నచ్చటఁ గంకులువోసి భర్తయున్.

జొన్నపాదుసేయు దున్నలఁ బందులఁ
దోలితోలి కొంతసోలి, రాత్రి
నిదురవోయి లేచి నిదురమత్తున మాది
గ చినవాని చేని కంచెదాటి.

నేనటు కంకులు గోయఁగ
మానసమునఁ దట్టినదియు మాదిగ చేనం
చోనలినాక్షిరో, యంతట
మానితిఁ గంకులను విఱువ; మడిఁబిడి వెసఁగా.

వచ్చితి; నని చెప్పుచు నేఁ
దెచ్చిన కంకులను జూడు తెల్లగ ముత్యా
లచ్చొత్తినట్లు సొంపగు;
గిచ్చినఁ బాల్గారుననుచుఁ గెలన నిలువఁగా.

అంతఁ బెంచలరెడ్డి యిట్లనియె:

గొప్పవారికైనఁ జొప్పడుఁ బొరపాటు
ఇదియె తప్పుగాఁగ నెంచఁదగదు;
బుద్ధిదెలిసి యెవఁడు పొనరుచుఁ జౌర్యంబు
నట్టివాఁడ శిక్షకర్హుఁ డిలను.

అని జనకుండు వల్కు సుతన్యాయపురీతి వచించుఁ దండ్రి. నీ
వనుఁనుడి కార మెంతయునయం బె? యశం బె? వెలుంగునిప్పుకల్
గనకయుత్రొక్కినం బదము గాలకయుండు నె? ధర్మమార్గముల్
మనమెలొలంగినం బరులు మాన్యతఁ జూతు రె? నిందదప్పునే?

ఇటులఁ బల్కుచు నలజారమ్మ, భర్తను విలోకించి,

విను హృదయేశ, నాపలుకు వీరుల వంశమునందుఁ బుట్టియా
దినమున నిట్టి దుర్యశము దెచ్చిన యల్లుని శిక్షసేయకే
తనయనుజూచి మోహము నిజధర్మము పెంచలరెడ్డి దప్పెనం
చను నపకీర్తి రాని విధి యారసి యట్లుచరింపఁ బోపగున్.

సతము శరీరమంచుఁ బెలుచం దలపోయు టెకాని, వృంత సం
చ్యుతకుసుమంబురీతి నెటనో యొకచోటను, నేఁడొ రేపొ, యె
వ్విధమున నైన నేలఁబడు; విశ్వమునందు యశంబె నిత్యమై
పతి విలసిల్లు దిఙ్ముఖవిభాసితమై సుజనప్రపూజ్యమై.

నలజారమ్మయు నిట్లని
తళుకుల కడగంటి చూపు తనపతిఁ గప్పం
దిలకింప, భర్త యిట్లనెఁ
బొలఁతీ నిన్నటుల వీడిపోఁ గలనొంటిన్?

శారికమిథునంబటువలెఁ
గూరిమి నివసింపఁజేసి క్రూరత నిపుడా
వారిజసంభవుఁడేలొకొ
దారుణ విరహంబుగూర్పఁ దలఁచెను గట్టా!

అని దీనగద్గదోక్తులు
మొనయగఁ వచియించు భర్త మొగముంగని, వేఁ
మని యదునాథా, నీసతి
నిను వీడునె స్వర్గమందు నిరయంబుననేఁ?

అన విని, కన్నీరొలయగ
గొనబగు పసిపాప ముద్దుగొని పతిగేఁగన్
మనమున శ్రీహరిఁ దలఁచుచు
ననవుగ బాలెంత స్నానమాడి పసపునన్.

జాళువా బంగారు డాలుడీలఁగఁజాలు
హారిద్రచేలంబు నంతఁగట్టి;
పసపునిగ్గులు దేరు ఫాలభాగంబున
సిందూర తిలకంబు పొందుపఱచి;

కన్నుఁగల్వలుకొంత వన్నెమీఱఁగఁగ్రొత్త
కాటుకరేఖలు నీటుపఱచి,
గుబగుబ నెత్తావి గుల్కెడు జవ్వాది
కలపంబు బాహులఁ గలయనలఁది;

సన్నజాజులు మల్లెల సరులుకీలు
గంటునకుఁ జుట్టి వాల్గంటి కరుణమెఱయఁ
బేర్చుఁడిప్పుడు గుండము భీతిలేక
యనఁగఁ, దండ్రియుఁ గమభక్తి నట్లుచేసె.

అల్లుఁడు దుర్మరణంబు సెందెనని విలపించి పెంచలరెడ్డి భార్య, పుత్రిగూడ గుండంబునంబడ నుద్యమించెనని తెలిసి.

కన్నీరుమున్నీరు గాఁగ నేడ్చుచువచ్చి
సుతనుగాఁగిటఁ జేర్చి వెతలఁబడుచుఁ,
గూఁతురా, మమ్మిట్లు గుందించి నీవేల
గుండాన దూకంగ? గుణమె చెపుమ,

కూఁతురైనను నీవె కొడుకైన నీవె, మా
కెవ్వరున్నారిఁక నిజ్జగమునఁ
గాటికిఁగాల్చాచు కాలంబునన్ మమ్ము
దుఃఖాన ముంపంగఁ దొడరితఁటనె?

నన్నుఁగన్నతల్లి, నామాట వినవమ్మ,
కన్నకడుపు సిల్లు కలఁచిపోవ
ధర్మమగునె? యంచుఁ దల్లి యెలుఁగురాయఁ
బలికి, చెక్కునిమురఁ బడఁతి యనియె:

నాకొఱకుఁగాదె నాపతి
వీఁకను బ్రాణంబు విడిచి విశ్వమునందుం
బ్రాకట యశమును బొందెను;
నాకును నట్టిదియసూవె న్యాయముతల్లీ.

నావుడు బంధుజాలము వనారిలె, 'మాభవనంబు లమ్మరో
పావనమాను ద్వల్లలిత పాదసరోజ పరాగసంపదన్
బావని, రమ్మ'టంచును సునాసిను లర్మిలి వేడ, నామె ప్రే
మావృతచిత్తయై కదిలె నందఱి బందుగులిండ్లకున్ వెసన్.

బందుగులఁ జెలిమికత్తెల
నందఱఁ గౌఁగిటను జేర్చి యాదరమున వా
అందందు నిచ్చు కానుక
లందుచుఁ జను దెంచి చంచలాంగియు భక్తిన్.

తల్లిదండ్రులకున్ మ్రొక్కి యుల్లమందు
దేవదేవుని జింతించి దీప్తిఁ జెలఁగి,
మందహాసము సెలవులఁ గ్రందుకొనఁగ
నగ్నిగర్భంబు సొచ్చె నయ్యతివ మిన్న.

సాంధ్యరాగచ్ఛటా సంఛాదితాస్తాద్రి
కటకసంచర దభ్రఖండ మనఁగ,
జలజరాగ పరాగ కలితోర్మి మాలికా
డోలికా చంచ న్మరాళ మనఁగఁ,
బల్లవితాశోక పాదపాశ్రయ నవ
ప్రసవభారానత వల్లి యనఁగ,
గైరికసింధూర కలితపూర్వాచల
పీఠస్థ పూర్ణేందు బింబ మనఁగ,

సతి రహించెను గుండానఁ జటులవహ్ని
శిఖలు నల్గడ వ్యాపించి చిటపటోగ్ర
శబ్దభీమంబులై ధూమచయము గ్రక్కఁ,
బ్రేక్షకావళిగుండెలు పెటిలిపోవ.

పంచభూతాత్మకంబైన పడఁతి మేను
ప్రకృతి లీనమై పూతమై పరిఢవిల్లె,
మిగిలియుండెడు సత్కీర్తి పగిది సాధ్వి
యాత్మసర్వంబు తానయ్యై యతిశయిల్లె.



Printed at the Aruna Press, Nellore.

# వనకుమారి

[ పద్యకావ్యము ]



1918 వ సంవత్సరపు టాంధ్ర కావ్యపరీక్షలో శ్రీ విజయనగర
సంస్థానముచే సమ్మానముఁ బడిసినది.

# వనకుమారి





కవికోకిల

## దువ్వూరి రామిరెడ్డి




## కవికోకిల గ్రంథమాల

పెమ్మారెడ్డిపాళెం — ఎల్లాయపాళెం (P. O.)

నెల్లూరు జిల్లా



# వనకుమారి

## ౧

**అ**టవులఁ లేఁజివుళ్ళు తిరుగా తప తాపము నెల్లడింప, బై
తటమున గోష్ఠాలన్విడిచి దప్పికవో సెలయేటి సరు ద్రో
సిటఁగొని త్రాఁకివల్లికలు చిక్కఁగ నల్లిన పూవుటోవరిం
గుటిల శిరోజయోత్త కనుకూర్చ జనింపకి యుంచెఁజల్లగన్.

సగుసఁ బత్రిపుంజముల సందులదూరుచు సూర్యకాంతులం
తరమునుజొచ్చి, కూర్చులల దామణి మోమున మొల్లలెత్తి పొం
పిరిగొని హాలు ఘర్మజలబిందువులం బ్రసరించె మిన్నులుం
బురువులుసంచరించునను పోలికఁ బూఁబొద కంగుగూర్చెడిన్.

పవమాన చలితవల్లీ
నివహాము సుమరజముఁ రాల్ప, నెలఁతుక కాంతి
ల్లై వసంతవనేందిర క్రొం
జివురాకుల సెజ్జఁదూగు చెలువునహింపన్.

ఈతరి నెండవేఁడిమి యొకింతశమింపఁగఁ జూచి పుష్ప సం
ఘాతపరాగసమ్మిళిత ఘర్మ కణావళిఁ బైటనొత్తుచున్
నాతిసమీర పోతచలనంబున రేఁగెడు చూర్ణకుంతల
వ్రాతముకన్నులం దొరఁగఁ బై కెగఁద్రోయుచు లేచి,
చెంగటన్.

పుప్పొడి కప్పురాలవలపుల్ చిలికించుచుఁ గోసలోసి ఆ
తిప్పల జాఱుచున్ గలక దేఱు నెడన్ స్ఫటికద్రవంబు నా
నొప్పెడు చల్లనీటిమలయూఁట గనుంగొని ముద్దు నిచ్చఁగోఁ
జిప్పిల నప్పొలంతి మొయిచేలవదల్చి తటానదూఁకినన్,

జలజమరందమాను నళిసంతతి ఝుమ్మని రేఁగె; తోఁగ జీ
బులనిసురించుచున్ బెదరి మోమొగిఁ, జాపుచు
ఱెక్కలార్చుచున్.
వెలువడె టిట్టిభంబు లటునీజల కుక్కుటముల్; పొరంగ సం
చలనము ముమ్మడింప జలజాతములుయ్యెలలూగ నిమ్ముగన్.

నెలఁత యురికిన యురవడి నీరమొగసి
శీకరంబులు జల్లుగాఁ జెదరిపడిన
వర్ష మనుభ్రాంతి, సంచులఁ బ్రాఁచి తెరల
బెక బెక విరావములు సల్పె; భేకచయము.

అనుదినంబును నభ్రగంగాంబువులను
స్నానమాడెను తెఱగంటిచాన విసిగి
వ న్య ఝురమున నీరాడ వచ్చెననగ
అమల జలమునఁ జెలియచే నందగించె.

ఒఱనుదూసిన కరవాలు రీ ఱపుడోప
వెంకినాకు చోకారంబు వెల్లివిరియ
ప్రకృతి లతపూచు పువ్వ న వన్య రమణి
వాఁగునీటఁ దేలును సుఖస్వప్నముల.

జలవనాంతగనిత స్వాభావికంబన
మీలలోఁ బ్రతిబెమ్మిడ్డి శీలనేము ;
శాలె చేపను బట్టుభాషిగాఁ దలముంచి
యడుగు నున్ననిరాళ్ళ నందితెచ్చు ;
కమలినీషండంబు కడు గాఢముగఁ బొంచి
నీటికోళులను వంచించిపట్టు ;
పుక్కిళ్ళనిండుగా బూరించినీరంబు
వారియంత్రము పోల్కి బైకిజిమ్ము

అట్టులలవోక జలకంబు లాడియాడి
గట్టునకు జేరిపుట్టంబు గట్టికొనగ
అతివగన్పట్టెఁ గ్రొంబొగలావరింప
నడుమ వెలుగొందు హోమాగ్ని నాల్కవోలె.

చికురముల వ్రేళ్ళ ద్రువ్వుచుఁ జిక్కుడల్చి
మెల్లదడియార్పుకొంచుఁ బ్రఫుల్లవదన
గాలి కెదురేగ రాహువు కబళనేచ్ఛ
చంద్రబింబంబు వెన్నాడు సరణిదోచు.

అఱగొఱచీర యంసముల నందియునందని పైఁటచెంగ యా
తరుణికి లోకమిచ్చినయుదారపు నాగరికంబు; శేష సుం
దరత సమస్తముం బ్రకృతి దాన యొసంగెను; నాగరాంగనా
పరిచితమైనలజ్జ యొఱువంటిదొకన్న యెఱుంగ దింతకున్.

కరమునదోటికఱ్ఱ, మొలకట్టునఁ బిల్లనగ్రోవి, క్రొమ్ముడిన్
విరిపోరలందగింప నడవిం జనుదెంచుచు నొక్క చోట ము
మ్మరముగ ఝుంకరింప మధుమక్షికముల్, తలయెత్తిచుట్టు ప
ల్లరయుచునుండెఁ దేనె పెరయాకుల దాఁగెనటంచు
నెంచుచున్.

తరుశాఖలసందున న
త్తెత్తెఁ దేనియ తెట్టెఁగాంచి తరుణియుఁగోలన్
గుతిపెట్టి నొక్కి మధు రస
ముఁ లఁగ మోకాలు దొప్పనోడిచియానన్.

ఆఁకలి శమింపవనస్య ఫలాళిమెసవి
ప్రొద్దుచాయలఁ దిలకించి పొలఁతిమిన్న
గొఱ్ఱెమంద మరల్పఁగఁ గోరిచనియె
వేణుగానంబు సేయుచు విపినసీమ.

ఇంతకుమున్నె గొఱ్ఱెలు తృణాగ్రములన్ గసిమేయుచుచుండి యల్లంతలనున్న తెల్లుపొదనాకట బెబ్బులిగాండ్రిలన్ భయాక్రాంతములై మహీయెడన్ క్రన్ననదాటుచు జాడలేనంతటన్ ప్రాంతశిలోచ్చయంబుల ఖురాంకము లేర్పడు వీలు లేమిచేన్.

లలితరసార్ద్ర వేణురవలాలితయైన కురంగకాంత కో
మల కసలంబులన్ మెసవమాని చెవుల్ వెసనిక్కవెట్టి క
న్నులఁ బ్రణయావలోకములు నూల్కొనఁగన్ మెడయెత్తి
యల్లనం
గలికిచరించు మార్గమును గాంచుచునుండె విముగ్ధచిత్తయై.

మునుదామందనువదలిన
ఘనమగునెత్తంబుఁ జేరి కలయం బరికిం
చిన నొక్క గొఱ్ఱెగొనియు
గను పట్టకయున్న నబలకా తరమతిమై.

కొలఁకులఁ గోనలన్ గుహలఁ గ్రూరమృగాకుల కాననంబులన్
బొలఁతుక చూచిచూచి యేఁగుపోయిన పోఁబడిగాంచలేక, బె
గ్గలి నయనాంచలాశ్రువులు గ్రుక్కుచు నేమియుఁ దోప
కచ్చటం
గలవెలిఱాల పేఁటుపయిఁ గంపితయై మెయిమోపిచింతిలున్.

ఎచ్చటికేఁగెనో తెలియదియ్యెడ గొఱ్ఱెలమంద యింక నే
నెచ్చటఁజూతుఁ జూడఁగలవెల్లను జూచితిఁ గంటకాశ్మముల్
పచ్చికనుండగానకయ పాదమువెట్టిన గాయమాయె మై
హెచ్చెఁగతిప్రయాస, మిఁకనేగతిఁ బోఁగలదాన నింటికిన్.

జనకుఁడు నాదురాకకయి సాంధ్యరుచుల్ విలసిల్లినంతఁ ద్రో
వను దిలకించుచుండును గృపామయ బాష్పజలార్ద్ర
దృష్టులన్;
మనమునఁ జింతనొందఁడొకో మందలు లోయలువట్టిపోయెనం
చని వచియించినంత; నెటులాయన మోముగనంగఁ
జాలుదున్.

ఇనముదారంగు పత్రములఁ బులుచిక్కఁడు పూలగుత్తులన్ వనసరసీజ శాంభవుని నందనలక్ష్మి సమర్చసేయు ప్రాద్భవాంశువు వేళలన్ మురళీశోడయి వీనులవిందుసేయ మందనముల మేపుచుంటిని ముదంబలరం దొలిమాఁచు పచ్చికన్.

ఇంక నే వ్యాజమున వచ్చి యీ ప్రదేశ
ములను దర్శింతుఁ – జెల్లెఁ బో మోహనంబు
లైన ప్రకృతి విచిత్రంబు లరయుకోర్కె ;
కాల మెవ్విధిఁ గడదాఁకఁ గడపికొందు.

చటులానిలము వీచి సెటపెటఁ దరుశాఖ
లొండొంటు విఱిగి వనోర్వ్యజాలి,
నీడ జంబులుగట్టు నీడముల్ చిందఱ
నందఱై పోవంగఁ బక్షిశాబ
కములు గాయములొంది ‘ కావుకా ’ వని కూయఁ
గరుణమై వృక్షకోటరములందుఁ
జివురుటాకులు పేర్చి చిన్నికూనలఁ జేర్చి
కాచుచుంటిని గదా గహనసీమ

నట్టియానందమింక నాకెట్టు లబ్బుఁ
గలలనై నను గొండలఁ గాననముల
బూవుఁబొదరిండ్ల సెలయేండ్లఁ బుష్కరిణులఁ
దలఁగు సమయంబుఁ దలఁపనే తలఁపనైతి.

కొండనెత్తమ్ములఁ గోరాడుమబ్బుల
గమనసౌందర్యంబుఁ గాంచికాంచి ;
మేఘోదయంబున మిసమిసపురివిచ్చి
యాడునెమ్మల యొప్పు లరసియరసి ;
యమృతధారలరీతి నచ్ఛమై ప్రవహించు
సెలయేళ్ళలోఁ గ్రీడ సలిపిసలిపి ;
ప్రకృతిమంజులమైన పక్షులగానంబుఁ
దమిదీఱ వీనులఁ ద్రావిత్రావి ;

యెండవేళలఁ బూఁబొదరిండ్లదూరి
హరిణగర్భిణులకుఁ జివురాకు లొసఁగి
ప్రసవమాలల ధరియించి ప్రతిదినంబుఁ
గాననంబున రాణినై గ్రాలుచుంటి.

తలఁచుచు నిట్టులా వికచతామర సాయతనేత్ర తారకా
చలన విహీనయై కనులజాఱెను నశ్రుల దానమాను చూ
పులను నఖండితరాశిమునఁ బూర్ణపు లైక్యముసల్పి భావని
శ్చలత వహించియుండెఁ గడసంజవిలాసము లంకురింపఁగన్.

సమయపుఁ దూలికం బ్రకృతి సాంధ్యసువర్ణముగూర్చి యభ్రప
త్రమునఁ బలాహకావృతి ధరాధర శృంగములన్
నికుంజపుం
జములను శాద్వలంబులఁ బ్రసన్న ఝరంబుల ఖేచరంబులన్
రమణాలఁకన్ లిఖించెనన రాజిలు నయ్యపరాశయయ్యెడన్.

నాటక దృశ్యనానామునఁ బ్రతిసీర ఘూర్ల్లి రంగముల్
నూటుసుసీని నక్కహారమండలి వ్రేలుతినూఁబు నల్గడం
గాఁచలి దృశ్యలోక సుషమం దసకుక్షి నుఖుంగునెట్టి యె
ప్పాటను నద్వితీయమగు భాసిలె మాయకుఁ దోడఁబుట్టునై.

సకల శిల్పులకును వేష్టసలుపు కొంచును
నవని గోలిక చదలు చందువకమామి
సరమణి గట్టు రసగుండ్ల గారులనఁగఁ
దారకావళియుదయించెఁ దరళ కాంతి.

కిల కిల కావు కావు కిలకీచని పక్షులు నీడసీమలఁ
జిలి బిలి కమ్మగానములు సేయుచునుండె; విశీర్ణపర్ణసం
కలితమ్ము దూర్వపై హరిణ కాంత శయించె; గుహాళిఁ గాసిలో
యల హరి పుండరీకనిచయంబులు సొచ్చె మృగామిషాప్తికిఁ

విరహిణీ ప్రాణసామగ్రిమరుఁడు వేగ
వేద నా ద్వీపమును జేర్చు వేడ్కఁ గొఱకు
నీల గగనాబ్ధి జలదకల్లోలములను
బాలశశి యానపోతంబు పరిఢవిల్లె.

వాతేరితంబైన వంశపుంజము రేఁపు
రాపిళ్ళకిఱ్ఱను రవళదప్పు;
అరకంట నిదురించు చాకుచలించిన
నులికియార్చెడి పక్షియులివుదప్ప;
తోనికి బండలజాఱి తుంపరముత్యాలు
వెదచల్లు సెలయేటి రొదలుదప్ప;
పగలెల్ల గుహాలలోఁ బడియుండి రాతిరి
ఎఱకేగు మెకముల యెలువుదప్ప;

శాంతనిశ్శబ్దతా లక్ష్మి సంతసమున
గిరివనాంతర సామ్రాజ్యభరము మోచి
సకల జీవసుఖస్ఫూర్తి సలుపుచుండెఁ
జీమచిటుకని యన్నను శికుగలదు.

సంజ కెంజాయలుడుగుట, సంతమసము
లలమికొనుటయుఁ బక్షుల కలకలములు
శీతలానిల సంస్పర్శ శిశిరకరుని
రాకపోకలు నెఱుఁగ దారమణి యపుడు.

భావనామూఢ మిథ్యా ప్రపంచమందు
సంచరించుచునుండె నాచాననమము;
బాహ్యవిషయాను భూతికి బాహ్యయూట
వానమబ్బులు గ్రమ్ముట గానకుండె.

అరరె! యిదేమి చిత్రమొ వియత్తల మంతయు నీల నీరదా
కరమయి తారకానికర కాంతుల సైతముగోలు పోయి శ
ర్వరిని మఱింత సాధ్వసకరంబుగఁ జేసెఁ;
బృషన్ని కాయముల్
తఱచుగరాలు చుండెను గులాయములన్
ఖగముల్ వణంకఁగన్.

కన్నులకున్ విద్యుల్లత
క్రన్నన మిఱుమిట్లు గొల్పఁ గంపితయయి యా
కన్నియ విభ్రాంతిని దా
నున్న విధం బేమియనుచు నుమ్మలికమునన్.

అటు నిటు పాఱఁ జూచి జలదావృత యామినిగా నెఱింగి యక్కట, తిమిరంబు నల్లడలఁ గాఱుకొనెం, గనుగానరాదు. మిక్కటముగ వానపట్టె; మెయి కంపిలెఁ జల్లని కొండగాలికిం, బటములనీరు జొబ్బిలె, నుపాయము సాయముగాన నిత్తఱిన్.

ఎంత నిశియయ్యెనయ్యయో, చింతఁ జక్క-
యెఱుఁగ సంధ్యయడంగుట, నిరులు గ్రమ్మ;
తెఱువులఁ బోఁగల నొంటిగ నిభయాక
రమ్ములగు కొండలోయలఁ బ్రాంతరముల.

నను జింతించుచుఁ దండ్రి యేమనునొకో, యేమాడ్కినే నే
నొంటిగాఁ గా
నన మధ్యంబుననుంటి నేనిశల, నీనాఁడేమొ దుర్బుద్ధి రేఁ
చినయట్లాయె; మృగంబు లేవయిన నం జెండాడెనో యంచుఁ బా
యని శోకమ్మునఁ గుందునో, కనలునో యత్యంత
మీచేఁతకున్.

నను నన్వేషించువనిఁ
జనుదెంచి తమోనిరుద్ధ చక్షుండయిబా
టనుదప్పి జనకుఁడేగతి
ఘన కాంతారములఁ జొచ్చిగాసిల్లెడినో.

తన యనుగాజనించి యిటు తండ్రిని గష్టము పాలుసేయఁబూ
నినననువంటి దంట లవనిం గలరేయెవ్వరైనఁ; బిన్ననాఁ
బ నె జనయిత్రి వోయిన దిటంబగు కూర్మి కొఱంత లేకసా
కెను బడరాని పాటులకుఁ గేవలమూఁ గుఱియయ్యె

నయ్యయో.

మంజులారామ వీథులు మనము నెంతొ
సంతసంబునఁ దేలింప జాలియును ని
రంత శోకార్తుఁ డౌతండ్రి స్వాంత మందు
నిస్తు లానంద శాంతుల నింపలేవు.

జ్ఞాన సమాశ్రయంబగు విశాలలలాటము శోకలాంఛనా
నూనవళి ప్రభంగముల నొప్పటియెం; బొరలెక్కి కన్నులీ
తూని శితత్వముందొఱఁగెఁ; జంచలభావము నొందెనాత్మ;తం
డ్రీ, నెలవయ్యెనీ తనువు టెక్కుదొలంగిన యంగపాళికిఁ.

అట్టినిన్ వయఃపరిణతాంచితకుంతలు, సాధుచిత్తునిన్
దిట్టతనానఁ గష్టములదించితి, ముంచితిదుఃఖవార్ధి, నా
యట్టి యదృష్ట హీన తనయంగను తండ్రికి శోకభారసం
ఘట్టన గల్గుటబ్బురమె; కష్టములొంటిగ వచ్చునే యెటన్.

అని జనకున్మదిం దలఁచి యారటఁ గూరుచు నీరజాక్షి దృ
ష్టిని బ్రసరింప నీయక కడింది గలంచెడు బాష్పపూరముల్
గనుగొనలందొరంగి చిఱు కాల్వలుగట్టఁ గుటీరసీమకుం
జనఁ దమకించునంత నొక చాయను లవ్వని కూఁత రేఁగినన్.

వినియది యేమటంచు నతివిస్మితయై లలితాంగి యంతఁ ద
ద్వననికట ప్రదేశములఁ బాఱగఁ జూచి చలత్తటిల్లతా
జనిత నితాంతకాంతి, గిరిసాను తలంబుల నున్న గొఱ్ఱెలం
గని శునకంబు మంద చెడగా నెడమీయక వెన్నడింపగన్.

పెన్నిధిఁ గాంచినట్టి నిఱుపేద విధంబున సంతసించి యా
కన్నియ యందఁ జేరి తమ కమ్మునఁ గాపరి కుక్క నెత్తిపై
కొన్నదయన్ శిరఃస్థలము గోళులదువ్వుచునుచ్చుగొట్టుచున్
మిన్నకముద్దు వెట్టెనుదమిన్ శునకంబు గదల్పఁ బుచ్ఛమున్

అట పయిగొట్టెలఁ గనుగొని
కట కట! సగమాయెమంద; గాఢాంధమునం
దేఱు చెట్టు పుట్ట కొకటయి
తటములఁ గ్రమ్మరునొ పులులు తత్తరపెట్టన్.

ప్రాచి వెలివాఱి నిద్దుర లేచి, కొండ
దండ నడయాడు తఱిపి లేయెండలఁ జలి
గ్రాఁగుచుం బోయి వెదకెదఁ గాననముల
మందఁ జెదరిన గొఱియల కందువలను.

అని చింతించుచు నంధకార బలమత్యంతంబు శంపాలతా
జనితాశాంత విభావిరాజమున హెచ్చంగొంత సేపాఁగి, త
ద్వన వల్లీ విచలత్పలాశ నిపతద్వర్షాంబు బిందూత్కరం
బనయంబుంబయి రాలిఁ గంటకితమై యంగంబు కంపిల్లగన్.

జాఱునటంచుఁ శాదములు, చెట్టుల మొట్టలదారి దీఱు, నా
చేరువఁ జేతికఱ్ఱనెడ సేయక తొట్టును బుర్వు పుట్రలున్
దారుల నుండునంచుఁ; బెడదారులఁ బోయెడు గొఱ్ఱెపిల్లలన్.
సారె కదల్చి కొంచు నగచాట్లకులోనయి, గుండెదీటునన్.

అడుగడుగున నొక యాపద
జడియక తప్పించుకొనుచు శాతోదరి పెం
జడినుబ్బి పాఱువాఁగులఁ
గడచుచు మలదాఁటి, యలసి, క్షణమాఁగునిలువన్.

జలదముఁ జీల్చికొంచు నొక చంచల చంచదుదార కాంతి ది
క్తలములఁ బ్రేలు సంతమస కాండములం దొలగింపఁ జెంగటన్
జలజవిశాల నేత్రగనెఁ జారుశరీరు వికీర్ణ కేశు ను
జ్జ్వల రుధిరాంక చేలుఁ గటిబంధనివిష్టనిశాత ఖడ్గునిన్.





# వనకుమారి

## ౧

వనిత గనుఁ గొన్న వీరుండు వనములందు
మున్నె సరిదారిఁ దప్పి తానెన్నొ యెడలు
దిరిగివేసారి, దూరాన వఱలు నెగడిఁ
గాంచి యచ్చోటికేఁగంగఁ గౌతుకమున.

దారిని బోవుచుండ నొకతట్టున గొఱ్ఱెలకూయి వీనులం
గూరిన నీప్రదేశమున గొల్లలు కాఁపుర ముందురంచుఁ దా
నారవమేదెస న్వినియెనయ్యెడ కేఁగుచునుండ నొక్కచోం
జేరువ భీతచిత్తయొక చెల్వగనంబడె మందవెంబడిన్.

కని, విసుమానమంది తనకన్నుల నమ్మఁగఁ జాలకీ నిశీ
థిని నిబిడాంధకారమునఁ దీవ్రపు జల్లులఁదోఁగి గొఱ్ఱె మం
ద నెలఁత యొత్తు దోల్కొని చనందగు కారణమేమటంచుఁ దా
ననుకొని యంతయుం గనఁగ నానరపాలసుతుండు నిల్చినన్.

అచ్చెలువయుం దటాలున
నచ్చట నవమూర్తిఁ గాంచి యాశ్చర్యమునన్
రిచ్చవడి యంత సాధ్వస
మెచ్చఁగ దేహంబు వణక నిలపై నొరగెన్.

ఒరగిన కాంతఁ గాంచి యయయో! ననుఁగన్గొని యేమొ భీతయై
ధరపయిఁ గూలె నిత్తరుణి; దాపున నెయ్యెడ వాసయోగ్యమౌ
నిరవులు గానరావు; మఱి యెచ్చటికేఁగునొ, లేక కొండ ద్రి
మ్మరులవలె న్వసించునొ క్షమాధర ఘోరగుహాంతరంబులన్

లలిత నవీన యౌవనవిలాసము లొల్కెడి ముద్దరాలి గో
త్రాలను ఘోర కంటక దరీముఖ భీకర శైలసాను భా
ముల నిటు మేపఁ బంచెనకొ మూర్ఖుఁడెవండొ; సుమంబు
నెవ్వఁడే
దలనిడి శోకపాదములఁ దాచునె రూపునశించిపోవఁగన్.

అనుచు దదీయ శోచ్యదశ నాయువకుండొక ఱెప్పపాటు చిం
తన మొనరించి మంచుచలికాఁకున నింపఱు వారిజంబు రీ
తిని దలపించుచున్న యువతీమణి నల్లన నెత్తి, జల్లు పె
ల్చిన నమలంబుగందగు శిలాతలమందు పవిష్టఁ జేసియున్

అనుగాఁ దానుగూర్చుండి యతివశిరము
రొమ్మునకు మోపుకొని, మోము గ్రమ్మియున్న
యలక కింజల్కములనొత్తి యల్లనల్ల
నిమిరి, తలపోయుచుండె దుర్నియతిగతుల.

నిరుపాయకరుల నుపకృతి
పరులై వర్తించువారిఁ బావనమతులం
బొరయును గష్టములిల ము
ష్కరులను జేరంగఁబోవు సాహసులనియో!

జలజలముత్యపుఁ జిగిసంబులువాఱెడి యూటనీటి కా
ల్వలు పలుమాఱు తొలనలనంతలఁగుందుచు శీకరాస్రు సం
కలితములై మనోవ్యథలు గానము సేయఁగ వార్షికాంబు క
శ్మలనె వహించు వాహినులు సాగునుగాదె నిరర్గళంబుగన్.

యామినికాంత శోక బాష్పాళియనఁగఁ
బారిజాత ప్రసూనముల్ ప్రత్యుషమున
మందశిశిరానిలాహతి గ్రిందికుఱల
నిలిచియుండవె జల్లుఫూల్ నెలలకొలఁది.

వెలఁది తలపొరలఁ ద్రిప్పెను ;
బలుమఱు నిట్టూర్పు విడిచె భావభరంబున్
వెలికూర్చుచున్నదోయన ;
తలపులు చెదరంగనీక తాఁబోరాడెన్.

కోరకములువిచ్చుతీరుగాగ నిమీలి
తాక్షులల్లఁ దెఱచి యా లతాంగి
వలియడంగ మేను వలిపముతో నద్దు
సదయుఁగాంచి చకితహృదయయగుచు.

పలుకను నోరాడక యెం
దులఁ దాఁగూర్చుండి నదియుఁదోఁపక తుదకుం
గలగని మేల్కాని నట్టుల
నులికిపడుచు లేచె దరుణి యుద్వేగమునన్.

ఏ యెడనున్న దాన, నిటకెవ్వరు దెచ్చిరి, నవ్యరూపముం
బ్రాయముగల్గు నీ వెవరు?, స్వప్నమొ! లేక నిజంబె
యౌనా! మా
నాయననుం గుటీరముఁ గనందగుదారెది, శోణితాంకితుం
డై యువకుండుదోఁచె నపు, డాతఁడె నీవని సంశయించెదన్.

ఓ వనవని యాక్కృపాహృదయుఁడుంగ సంగాంచి లతాంగీ, సాధ్వసం
బుసఁ బుయిలోడ నేల, వెలుపుం గలిగించు పదార్థ మెద్దియున్
నిను స్పృశియింప లేదు; జనని జనకుల్ వసియించు గేహ మీ
వని నెట నున్నఁగాని తెడసంబని లేదిఁక నిన్నుఁ జేర్చెదన్.

కాని మఱొక్క ప్రశ్న యడుగందలకొంటిని, నష్టమైనచో
దానికనారాఱు నల్కుమనఁ, దన్వి యనాహ్యామనోనురక్తి నే
నూనక విన్నవింతు ననుమాటకు నాతిఁడు సంతసించి యో
మానా, నిశధనిన్ మలలచక్కని గోత్రలఁ దోలనేలకో?

వెలుపునాయనఁ : త్తిమ్ము కలఁక దేఱి
గోత్ర కదుపులు వోప్పుట, స్త్రీ వాఁగు
చెట్లు పుట్టలు వెదకట, చెలియ యొంటిఁ
తిర్మానస్పడిచుంట నచించె.

అమృతమయమ్ముగ్ధమైన వచనామృతముం దమిఁదీఱఁ గ్రోలి యే
మేమొ దలంచుచున్ వలపుటేను విలాస వినాకరంబునం
దామతి నుంచుచూడ్కి కనయంబు మెఱుంగులు
చెప్పవేయ శో
భామయి మూర్తి దీపియి భానవిహారము సల్పె నాతఁడున్.

అసితసూత్రంబులంగూర్చి బసలుగుల్కు
మంచి ముత్యాల సరములు మదికివచ్చుఁ
గన్యకా స్వర్ణకుంతలాగ్రములనుండి
తొలఁకువర్షాంబుబిందుల చెలువుగనఁగ.

వానజల్లుల వలువలు మేను దడిసి
నీరుచిల్కు నొయ్యారంపు నీరజాక్షి
తియ్యదేనెల సోనలఁ దిరుగుచున్న
చైత్రమాసపు వనలక్ష్మి సాటిగేరు!

అని యిట్లు మెచ్చుచుండె నతఁడు, డాఁగవలోఁ దలపోయు నిట్లని
వనములకేలవచ్చెఁ గరవాలము దేనికి, నెత్తురేమి, నా
యన యటువంటి వారె ధరయందు వసింతురటంచు నెంతు నే
మనుజుని దేహసౌష్ఠవసమంచితరూపము సాంద్రదీకున్నదే!

ఫాలతలమున ముడుతలు పడుటలేమి
దీనభావమ్ము మోమున దోనుకొనమి
వెంట్రుకలు పండినొసటిపై వ్రేలలేమి
నెసఁగునాకృతి భేదమ్ము లిడువురందు.

ఇతనిఁ దిలకింపఁ దిలకింప నేమొగాని
పూర్వ దయాకులత్వంబు పొడవడంగి
జనక సందర్శనంబున మనము పొంగు
సఖులఁ బ్రణయోదయమ్మయ్యెనని తలంచు.

అవని జనకునికన్నను నన్యమైన
మనుజరూపంబుఁగాంచి యా వనకుమారి
స్వీయజీవితకావ్య ప్రవృత్తియందు
నభి నవాశ్వాసరచనకు యత్నపడియె.

క్రొత్త యనుభూతి బలమునఁ జిత్తమందు
నవనవాశయ ఘూర్ణణం బవతరింప
మునుపు సంకుచితంబుగఁ బొనరుజగతి
విరివిగాఁదోఁచెఁ ద్రుటిలోన వెలఁదికపుడు.

కనుగొనెంచి నవప్రపంచమనియెం గంజాక్షి యావీరునిం
గని, యాలోక నివాసులెల్ల భయముంగల్పించు ఖడ్గంబులం
గాని చేలంబులు శోణితాంకితములై క్రూర ప్రచారంబులన్
దినముల్ పుత్తురె చెప్పుమా, జనకుఁడీ తీరుల్ వచింపం
డుమున్.

నిన్నఁ గన్నుఁగొన్న వికసింపనున్న సుమము
రీతి పొడకట్టు; మాతండ్రి, యా తపమ్ము
హాతినిశోషిల్లి వృంతసంచ్యుతిని బొందు
సాంధ్యకాలపుఁ బువ్వునా సడలుచుండు.

వెలఁది వచించుపల్కులకు విస్మయమొంది, యిదేమిజన్మ మా
ది లలిత పుష్పపత్ర తరుదీప్తి మనోహరమైన కానలం
జెలియవసించెనో మనుజజీవిత తత్త్వమెఱుంగదో, భువిం
గలిగిన మంచి సెబ్బరలుగాంచ దమాయిక యంచునిట్లనున్

సకల తారాశ్రయంబైన చదలుఁగనఁగ
నెంత విరివియై చూపట్టు నిలయునంత;
జన్మమరణముల్ రెండు విశ్రాంతిలేక
జరుగు చుండును నీ ప్రపంచంబునందు.

జననమునొంది, తల్లి తమిసాఁకఁ బెరింగి, విముగ్ధశైశవం
బున మది నెట్టిదుఃఖమును బూనక యాటలఁ బ్రొద్దుపుచ్చి, యౌ
వన సమయంబునన్ విషయవాంఛలఁ దేలి, జరాగృహీతుఁడై
మనుజుఁడు లోకజీవనము మాని చనుంబరలోకమంగనా.

అనిన విని లతాంగి యనేనాటుస్మృతి పథ
మంటియుండు శైశవానుభూతి ;
దానిఁ జింతసేయఁ దనరుఁ గన్నులఁ గట్టి
నట్లు బాల్యచర్యలన్ని యిపుడు.

గిరిఁగిరంబులనల్లి, ఘుంఘుమరవాకీర్ణ ప్రవచ్ఛారు ని
ర్ఘరిణీ శీకరపోషితంబులయి యశ్రాంతంబు సౌరభ్య బం
ధురతంజిల్కులతావితానములఁ బ్రత్యూషంబునం జేరి సుం
దర వర్ణాంకిత పక్షముల్ గలుగు సీతాకోకముల్ పట్టుదున్.

స్వచ్ఛముగఁ బాఱు సెలయేటి జలమునందు
అకుపక్కులు ద్రెళ్ళింత లాడుచుండఁ
గలువపుష్పాడి నత్త్రావిగ్రమ్ముచుండ
మునుగుచుంటిని ; జేపలఁ బుఱుకుచుంటి.

గొఱ్ఱెపిల్లల నమ్మలఁ గూడఁ గదిపి
పాలుద్రావించి యావలఁ బట్టుపఱతు ;
ఎన్ని ముద్దులు పెట్టిన నేమి యనవు ;
అట్టి కొఁదముతె పసినాఁటి యాటచెలులు.

కన్నెవచింప నిట్లుతమకమ్మున శూరుడు పల్కెముద్దియా
మున్నెపుడైన నీవు వనభూములుదక్క బహిఃప్రపంచముం
గన్నది లేదుగాన ధరఁగల్గిన చిత్రములెల్లఁజెప్ప నీ
తెన్నున సాఁగదింటికడఁ దెల్పెద వేగఁగదల్పు గొఱ్ఱెలన్.

వనభూమిన్ గృహమేప్రదేశమున దైవాఱన్, నినుంగాంచకే
జనకుండెట్లు తపించువాఁడొ, జననిసంతాపపాథోధికిం
గననౌనే యొకమేర? ఘోల తడయంగళ్యాణి, రావమ్మ ని
న్గని దుష్టాత్ముఁడేని గీడు దలపన్ యత్నించునే యెన్నఁడేన్.

కరుణాకలితర సోక్తులఁ
దరుణుఁడు భాషింపఁబొలఁతి తరళాక్షులలోఁ
బొరలుచు బాష్ప కణావళి
యురలఁగ గద్గదరవంబు లొప్పఁగ బలికెన్.

పాలుద్రావెడు చిన్నారి ప్రాయమందె
మరణమొందెను జనయిత్రి, మాన్య, నాకు;
నదియునేఁగన, నాన్నయే యనియెనెపుడొ;
తల్లు లందఱుఁ జత్తురో ధరను జెపుమ.

తల్లులేగాదు, పుట్టిన యెల్లప్రాణి
కోటులకుఁ జావుసిద్ధంబు పాటిగోష్ఠి ;
యెవరెవరి యాకు పైఁడేలు నింతలోన
వారు చనుదెంతు రఖిలంబు వదలిపెట్టి.

అనవిని యాలతాంగి వ్యసనాకుల చిత్తతనిట్లు పల్కెనో
మనఃజన రేణ్య, యీ విషమమార్గము దప్పదో నీవు నేను మా
జనకుడు స్వర్గముఁ మృతివిషాదము నందుట, చాలు
నోయి యీ
మన మెరియించు బోధనలు మందగదల్చెదఁ బోదమింటికిఁ.

నావిని యల్లికానని వనంబుల గొత్తెలఁ దోలికొంచు శం
కా విలమౌ నెలంత దరినవ్వల నివ్వల ముందు వెన్కలం
గావలమైన సత్త్వతతి గస్పడుసంచుఁ గృపాణిపాణియై
పోవుచునుండె నప్పురుష పుంగవుఁడామెకుఁ దోడునీడయై.





# వనకుమారి

## 3

అనయము నింపుగన్ సుమలతావళి చెట్టులకల్లి మేలు క
ట్లను దలపించు కానన తలంబునఁ దాళపలాశశాల వృ
ద్ధ నరుఁడొకండు వెల్వడి వ్యథాభరకుంచిత ఫాలభాగుఁడై
కనదనలంబు నం జిదుగు కంపలువైచుచు, వెచ్చనూర్చుచున్

పలుమాఱు లేచు ; నటునిటు
నలుదెసలం జూచు ; యోచనన్ నిశ్చలుఁడై
నిలఁబడు ; కలగని మేల్కొను ;
కలతపడున్ ; లోని కేఁగుఁ ; గ్రమ్మఱ మరలున్

అఱువది వత్సరంబులకు నవ్వలిమాటయెగాని లొచ్చు లే
దరయఁగఁ బ్రాయమాతనికి, నాయతఫాలము దీర్ఘబాహువుల్
గరము వెడంద వక్షమును గంధరయొత్తు శరీర సత్త్వ ని
ర్భరత నుపన్యసించు; మదిరంజిల దెప్పుడు శాంతి సుంతయేన్.

హరిణచర్మమ్ము పఱచిన యరుఁగుమీఁదఁ
గూరుచుండెడి యా వృద్ధుఁడు కొంతవఱకు
నట్టెయుండెడి చివుక్కున ద్వారసీమ
కరిగి యటుచూచి యొక కొంతయాలకించి.

రేయిసగమయ్యెఁ, దడవేమొ ప్రియకుమారి
రమ్మ, యనిపల్కెఁ బ్రత్యుత్తరమ్ము రామిఁ
బవనకంపిత పర్ణనిస్వనమటంచు
నతఁడు వనులోనికెంతొ హతాశుఁడగుచు.

మునుపటి యట్టులశోకము
తనునలముగ వేదిమీఁదఁ దడవుంచి స్మృతిం
దనరెడు పూర్వాస్మత్యము
మనమునఁ దలపోసికొంచు మాటాడుకొనున్.

కనుఁగొనవచ్చునే సమయగర్భము నందేటువంటి చిత్రముల్
జననము నొందునో, యపరసాంధ్య విలేఖిని పశ్చిమాశనే
దినమున నెట్టి రూపములఁ దీర్చునొ చెప్పగనౌన సత్కవీ
శునికినిసైతము; ప్రకృతిసూత్రసమన్వయ మూహకందునే.

పుడమిని బ్రాఁకు పుర్వుఁజిఱుపుల్గలపుల్గును డేగ, దాని వ్యా
ఘుఁడు నిజపోషణార్థమయి త్రుంచుఁ; బరస్పర మిట్లె పోరుచే
పడి యిహలోకజీవనము వ్రాలుఁదనంతన హెచ్చులొచ్చులం;
గడిమినె యాశ్రయించుఁగలకాలము నైహిక భోగసంపదల్.

వననిధి నూర్మికల్ పఱచు పందెములం దిలకింప లోక శ్రీ
వనపు రహస్యముం దెలియవచ్చును, ముంజరియించు నీచికం
జెనకును మీఁది పెందరఁగ; చేడ్పఱుచు న్నశిగొంయుదాని; నై
జనియతి నిట్టులే భువనచక్రము శేషము సంభ్ర మించెపుర్.

పరిణామశక్తి శాశ్వతముగఁ గాల చ
క్రమునకు మనుజ సంఘములఁ గట్టి
త్రిప్పుచుండుటచే నొకప్పుడు కొన్ని సం
ఘము లుత్తమస్థితి గలిగియుండు;
మఱికొన్ని యధమ సమ్మానంబు నొందును
నవియె విజృంభించు నవలఁదొడరి;
సమయ చక్రాహతిఁ జదునైన రాజ్యమ్ము
లెన్నియో చారిత్ర మెఱుఁగఁగలదు

ఆదిమధ్యాంతరహిత కాలాబ్ధియందు
నిట్టిమాఱ్పులు బుడగల యట్టు లుండు;
నిన్న తలపోయ నా మదినున్న యూహ
పట్టులేక యభ్రమియించు బహుళగతుల.

పతులకునోడి రాజ్యరమ, బంధులఁబాసి, సమస్తసౌఖ్యముల్
గోల్పడి, గొప్ప దుర్గమ వనాంతర వాసము జేసి, క్రమ్మఱం
దరి సుమకోమలాంగి ప్రకృతి తత్త్వమెఱుంగని ముద్దరాలిని
ట్టెఱుఁగునఁ గోనలన్ గిరులఁ ద్రిప్పుచునుంటిఁ గఠోర చిత్తతన్

రాజ్యభోగంబులొందు ధరాతలేంద్రు
నన్నుఁ బరపీర భైరవుఁ జిన్నపుచ్చి
వన నివాసంబునకు నలవాటుపఱిచె
నౌర! దుష్కాలమహిమ; యేమనఁగవచ్చు.

నాకయి పలవింపను బ్రే
మాకలితార్ద్ర హృదయఁగు సుమాంగి సుతంగ
న్నాకులమతిఁ జేసితినని
శోకించెదఁ జిత్తకళిక శోషిల్లంగన్.

పట్టుపొత్తులలోనఁ బన్నుండుగతిమాలి
    పులితోలుపై మేను మోపవలసె ;
సౌధోపవనకేళిఁ జరియింపనోఁచక
    గిరులఁ గాననములఁ దిరుగవలసెఁ ;
కనకాంబరంబులఁ గై సేయుసిరిలేక
    మోటుకంబళిమేన మోయవలసె ;
నంతఃపురీ భోగ మనుభవించుటలేక
    పర్ణశాలలఁ గష్టపడఁగ వలసె ;

ఆఁకలెట్టిదో యెఱుఁగక యావుపాలు
కండ చక్కెఱ యుక్కెఱ కమ్మనేయి
పొగయు కలమాన్నము భుజింపఁదగిన తనయ
కసవుకూశులనర పొట్ట మెసవవలసె ;

రాజ్య సంచ్యుతుఁడైన ధరామహేంద్రు
తనయ తానంచు నెఱుఁగదు వనకుమారి ;
పలవరింపదో చిత్తమ్ము పగులనెప్పు
డైన సత్యమ్ము తెలియంగనైననయ్యొ.

ఏమొకో యింతసేపు నట కెయ్యెడ నున్నదో ముద్దుపట్టి, పెన్
బాములుఁ బుర్వులుం దిరుగు బాటల, లోయలఁ గ్రూర
సత్త్వముల్
వేసటలు బొబ్బరించు; గదలించిన గొఱ్ఱెలమంద పెంజడిం
బోమరలింప లేకనుమఁ బొందుచునున్నదొ చిమ్మచీఁకటిన్

అని యిట్లు వృద్ధరాజు తనయన్ వెదకంగఁ దలంచి దీప పం
జను వెలిగించి చేకొని ముసుంగుగఁ గంబళి గప్పి చిట్టు మం
చనయము వర్షబిందు తతులాకులపై దిగజాఱి రాల న
ల్లన వనదుర్గమాంతరములం జనుచుండగ నొక్కచోటునన్.

ఎల గురివెంద వల్లిక లనేక విధంబుల నల్లిబిల్లిగా
మొలిచొని యుండ నందు మిడిమేలపు శల్యమృగంబు శాబకం
బులఁగని సొమ్మసిల్లి యరమూర్ఛఁ బరుండిన దాని చెంగటన్
వెలుఁగును గాంచి తత్తఱము పెల్లడరం బొదదాఁటె దివ్వెనన్

తనలోఁ దా సుకుమార బాలికకుఁ బ్రాప్తంబైన యిక్కట్టు లె
ల్లను జింతించుచు దోలికా చలన లీలం గేరు చిత్తంబుతోఁ
జను వృద్ధున్ వెను చక్కిఁ బిక్కలదరన్ శల్యంబు కొమ్ముత్తి పె
ల్చనఁ గూలంబడ ద్రొక్కలోఁ బొడిచెఁ గీలాలంబు జొబ్బిల్లగన్.

పోటున రక్తపూరములు పొంపిరివోవఁగఁ జేల పొత్తులం
బాటిగ వద్ది నొప్పులకు వందురుచున్, సుత నెట్లుగాంతు ని
చ్చోటును దెచ్చి పెట్టెఁగట! పాపపు దైవము నిర్దయాత్మతన్;
ఓటమి నాఁడె పోరమృతి నొందినఁ గష్టము లిన్నిగల్గునే.

పరభూమీశుల సంగరాంగణములన్ బాహాబలస్ఫూర్తిఁ గ
క్రూర ఖడ్గంబునఁ ద్రుంచుటో, యరులచేఁ బ్రాణంబు గోల్పోవుటో
సరియౌ క్షత్రియ వీరపుంగవునకున్; సామ్రాజ్యముం బాసి ని
ర్భర శోకమ్మునఁ గాననాంతరములన్ వాసింపగాఁ జెల్లునే.

అనయము మత్కుమారి నయనాంచల ముగ్ధ విలోకనామృతం
బున ననుముంచుచుండఁ బ్రియపుత్రికినై కడగండ్లొందియున్
మనుపుటయుఁ బూర్వ పుణ్యమని మాటికి నేననుకొందుగాని జీ
వన సుఖమిచ్చగించి వనవాస మొనర్తునె యట్లుగానిచో.

చిఱుత తనమ్మునుండి వనసీమలఁ గొండల నుంటలోక మే
యెఱుఁగని ముద్దరాలుసుత; యేగతి నేమృతినొంద నొంటి కాఁ
పుర మొనరింపనోపు వెఱపుం గఱపించు వనాంతరమ్ములం;
బురమున కేగినైన నొకపూట వసింపఁగఁ జాలునే కటా!

పరిణయార్హ వయస్కయుఁ బ్రణయజలధి
నోలలాడెడు పూతేకు టోడతనయ
భీకరారణ్య తలముల బెగ్గలింప
మఱుఁగు పఱచునొ మరణంపు మబ్బునన్ను.

ప్రజల యత్నంబులెల్ల నిష్ఫలములయ్యె;
హితులతంత్ర ముపద్రవ హేతువయ్యెఁ;
దలఁచినది మున్నెఁ; దలవని తలఁపు దేలె;
ఏమిసేయు నరుఁడదృష్ట మెదురు దిరుగ?

అల్లు పందిరి నెడబాఁప నలరు తీవ
పట్టలేకయ యటు నిటు ప్రాఁకురీతి
మరణ మొందగ నేను, నిర్భరతరార్తి
నెటులఁ బెఱపంచలం బ్రాఁక నేఁగుఁబుత్రి.

అనియిటు, తేలుగుట్టె నటులాఁగని పోటులు డొక్కలోఁ గలంచిన నిలుసేర నెంచి యిలఁజేయిడి లేవఁగడంగఁ గన్ను లల్లనఁ దిరుగంగసాఁగె; నొడలం జెఱు చెమ్మట లుప్పతిల్లె; దప్పినిగొని శక్తిచాలక భువిన్ శయనించె నతండు మూల్గుచున్

మరణము గాంతునంచికఁ గుమారికి నెవ్వరు సెప్పువారొ
మరణపు శయ్యనైన నొకమాఱు ప్రియాత్మజ గౌఁగలించిము
ష్మరమగు కూర్మితియ్యమున మంజుల ఫాలము మూర్కొనంగ ని
త్తఱి లభియించు నే కటికదైవము, యంచు దలంచికుం దేడ్చె౯.



# వ న కు మా రి




౪

ముందసు దోల్కొని వచ్చెడు
సుందరియును దరుణుఁడపుడు శుష్కపలాశ
స్పందారవమేటు వినఁబడు
నందాఁగుచు మరలఁ జనుదు రటవీ వీథిన్.

ఆరీతిం జనుదెంచుచుండ నొకచో నక్కానలో గాలిలోఁ
దోరంబై పరికీర్ణమై మిళితమైతోఁ జెన్నొరావంబు లా
ధీరుండా రవమాలకించి నిలువన్ దీనోక్తులున్ మూల్గులున్
ఘోరావస్థఁ గలంగు మానవుని పల్కుల్గాఁగఁ జూపట్టెనన్.

కాంతఁ గనుంగొని యిట్లనెఁ
జింతా పీడితుఁడెవండొ చీఁకటికోనన్
వంతలఁగుందుచు మూల్గుచుఁ
బ్రాంతంబుల నున్నవాఁడు, వ్యథ యెట్టిదియో.

నిర్జనంబైన యీ కాన నేటివఱకు
నరుఁడెవండును చొరఁడు మానాన్నదప్ప ;
నాకు సంశయ మొదవెడి, నమ్మఁజాల ;
గుండె యీ గుబ్బుగా లోనగొట్టుకొనియె.

అని చెలివల్క నచ్చెలువ నచ్చటనుండగఁ బంచి ఖడ్గముం దనకరమందుఁ దాల్చి కడుధైర్యమునంజని యొక్కతావునం మనుజుఁడొకండు నేలబడి మాటికి లేవఁ గడంగుచున్ మోయి దనరెడి నొప్పిరాపిడికిఁ దాళక మూల్గుటఁజూచి యిట్లనున్.

అయ్యా, మీ రెవరివ్వనిఁ
గుయ్యోడు చుండెదరు ; నేల గూలుట కిందే
మయ్యెను దెల్పుడు, నాచే
నయ్యెడు సాహాయ్యమున్న నది యొనరింతున్.

కరుణారస నిష్యందము
లరుసపు వాక్యములు వీను లలరఁగ విని యా
తురతన్ వృద్ధుఁడు కన్నుల
దెఱచి శరీరమునిగుడ్చి దీనతఁబలికెన్.

తలపని తలఁపుగ వచ్చితి
తలకొంటివి రక్షకొఱకుఁ దడయక వని క
వ్వల కొంచెము దూరము చనఁ
గలదు కుటీరంబు, నన్ను గడుపుము యటకున్.

అలవుంగొని యా మీఁదట
దెలిపెద నా చరిత సేద దేఱిన వెనుకన్ ;
బలహీనత మాంద్యమున
న్నలయించెడు జాగుసేయ కటుగొని పొమ్మా.

అని యిటుపల్కుచు ముద్దుల
తనయం దలపోసిపోసి తఱుగని దుఃఖ
మ్మునఁ గుంది వనకుమారీ
యని యొక నిట్టూర్పువిడిచె నశ్రులతోడన్

వృద్ధుఁ డిటులఁబల్క విని యను యువకుండు
వనకుమారి యెవతె? వనములందు
నామె యున్నదొక్కొ. యలఁతి ప్రాయముగల్గి
గొఱెలమేప గిరులఁ దిరుగుచున్నె?

మృత్యుదేవత కోఱల మిడుకుచున్న
వాని కమృతంబు దొరకిన పగిదినలరి
ముసలి ఱేఁడను, గానల ముద్దు కూఁతుఁ
జూచినాఁడవె గొఱియల గానుచుండ.

అవునవునని తలయూఁచుచు
యువకుఁడు విస్మయమునొంది యుర్వీకిడా కాల్
దవులంగవంచి వృద్ధుని
యవయవములు హస్తపాళి నంటుచునుండన్.

మల నెటులున్నది నా క
న్నుల వెన్నెల, ప్రాణపద, మనుంగు తనయ, జ
ల్లుల వలివడి వడఁకుచు గొ
ఱ్ఱెలఁ దోల్కొని చీకఁటిని గిరిందిగఁగంటే.

సెలయేళ్ళ నెటుల దాఁటెనొ
పులులుం దోఁడేళ్ళు శివలు బొబ్బలు వెట్టన్
లలితాంగి చిత్తమేగతిఁ
గలఁగెను యని వృద్ధరాజు కటకట పడియెన్.

వందురఁబోకు మాచె నిరపాయత నున్నది మందతోడ, నీ
వెందుకు మూల్గుచుంటి వచియింపవ దేమొకో వ్యాధి బాధచే
గుందెదవో, వనోర్విఁబురుగుల్విషసర్పము లేవియైనఁ గా
టొందగ ముట్టెనో చెపుము, యొప్పగు సేఁత యొనర్తుమిత్తఱిన్

చెప్పక యేమిగాని మృదుచిత్తుఁడ, మత్సుతకీయుదంతముం
జెప్పిన నప్పుడే పొగులుఁ జిత్తముశోక విపాటితంబుగన్ ;
అప్పొలఁతిం గనుంగొన వనాంతరముం జొరఁబాఱుచుండఁగా
గుప్పన శల్యమొండిచటఁ గొమ్మునఁ గ్రుమ్మెను డొక్క నెమ్ములన్

నెత్తుట జొత్తిలె నంగము
చిత్తమ్ముత్తలమునొందెఁ, జెవులను గీమం
చొత్తెను శబ్దం బెద్దియొ,
బొత్తిగ దేహంబు సడలె మూర్ఛావిలమై.

అనవుడు వీరుఁడిట్లనియె నయ్యయొ, యివ్విధి నుండనూరకే
మనమిట జాగుసేయఁగఁ బ్రమాదము వాటిలునేమొ, వేగమే
తనయను దెత్తు, నందఱముఁ దద్గృహసీమకుఁ బోదమంచు దా
నన విని వృద్ధుఁ డిట్లనియె నయ్య, కుమారికి నేమి సెప్పెనో.

జనకుఁడు కుక్షివేదన మసంగఁగఁ, దాళక మూల్గుచున్న వాఁ
డని వచియింపుమీయనిన, నట్టులె కాక నియంధకారి కా
ననమున వేగవేగ చని నాతుక భీతిలుచుండఁగాంచి యో
వనిత, కదల్పుగొఱ్ఱెలను బల్కెదనవ్వాల వృత్తమంతయున్.

నిను నన్వేషించుచు వని
జనకుఁడు రా నుదరబాధ జనియించినఁ బో
వను రానుశక్తి చాలమిఁ
బనవుచుఁ బడియున్నవాఁడు పచ్చికబయలన్.

ఇఁకనొక తెప్పపాటయిన నింకఁ జరింపగరాదు; పోదమో
సకియ గృహంబుఁ జేర ననస్వాంత మకాండము గ్రీలిపోయిన
ట్లొకటియు భావనన్ నిలుపనోపక యాఁపగలేని శోకముం
బ్రకటముసేయు బాష్పనికరంబుల గోళులమీటు చిట్లనున్.

కన్నుల్గానఁడు వృద్ధుఁడౌట, మఱి యీకాంతార దేశమ్మునన్
మన్ను మిన్ను నెఱుంగరాక తమముల్ మార్గమ్ము రోధించి క్ర
మ్మెన్నల్ ప్రక్కల; నాన్నజల్లులవలెన్ మేనెల్లఁ గంపిల్లఁగన్
నన్నుంగానక కానల న్వెదకుచున్నాఁడేమొ శోకార్తుఁడై.

పొలతీ, చింతలనేల, వేగగొఱెలం బోఁదోలెం, మంభోదముల్
బలమయ్యె౯ దిశలందుఁ మార్గము, తరుల్ పల్లంబులు౯ మిట్టలుం
దెలియ౯ రావిట; శీతలానిలహతి౯ దేహమ్ము మ్లానమ్యె; భూ
స్థలి జాగ్రత్తగ మెట్టు మీా, జనకుని౯ దర్శింత మిచ్చోటనే.

ఆతఁడిట్లులఁ బల్కనతివయుఁ జిత్తమ్ము
లేని కీలుబొమ్మరీల, గొఱెలఁ
దోలికొంచుఁ జనియెఁదోడుగా యువకుండు
ఖడ్గపాణియగుచుఁ గడిమిమెఱయ.

జనకునిగాంచఁ జిత్తజల జాతముశోషిలి కాంతయు౯ ఘనా
ఘన పతితాంబు బిందులట్టుఁ గాదరబాష్పములు కంఠసీమకుం
దొనకఁగ నేడ్వఁదండ్రియును దోరపుటుమ్మలికంబుమ్రింగి యి
ట్లనియెను గద్గదస్వరముల స్ఫుటమై కరుణార్ద్రమై తగ౯.

అమ్మా, ముద్దులగుమ్మ, యేల మలసంధ్యారాగముల్ వాయమే
ఘమ్ముల్ గ్రమ్మిగ నొంటినుంటివి, జడింగంపమ్ము వాటిల్లదే?
నె మ్మేన౯ గగురు నొందదే చలికిఁ; జన్నెయిట్లు వర్షమ్ము నం
జెమ్మల్వాఱిన బాటల౯ నడువఁ; గొంచెమ్మైన భీతిల్లవే?

వనతరువాటికామ్రదుల పల్లవపాళుల సంజకెంజిగుల్
సన, నిను వేచుచుంటిని విచారశరాకులితాత్మతన్ సుధా
జనక మనోహరస్మితము చల్లెడునీరు చిరాస్యబింబముం
గనఁ గుతుకంబునం జెలఁగు కన్నులనించుకయప్పళించుచున్

వనతరుచ్ఛాయల వనధరచ్ఛాయల
నంధకారము సాంద్రమగుచు నెఱయ,
మార్గమ్ముగానక దుర్గమారణ్యానిఁ
బెడత్రోవ వట్టితో ప్రియతనూజ
గిరిగహ్వరంబుల హరిపుండరీకాది
మృగ గర్జలకుఁ జిత్తమెట్లడరెనొ
పర్వ తాగ్రమునుండి పర్వెడు సెలయేళ్ళ
వఱ్ఱువాఁగులదాటఁ వలనుపడెనె?

నదిని పడిపోవువానికి నావయటులఁ
బూర్వ సుకృత విశేష సంభూతిచేత,
భవ్యుఁ డీతఁడు దైవంబుపగిది వచ్చి
నిన్ను రక్షించిననుఁ జేర్చెఁ గన్నతల్లి.

ఆసవిని, తనయయు నేమో
జనకునకు వచింపఁబోవ జాగగునని యి
ట్లనియెను వీరవతంసుఁడు
జనకుని సుతఁగాంచి మధుర శాంతరసోక్తిన్.

చనదు భాషింపనిటఁ బరస్పరము మీరు
వాసమున కేఁగి సర్వంబుఁ బలుకవచ్చు;
వర్షచిహ్నము లాకాశపదమునందుఁ
గలుగుచున్నవి పోదము కానదాఁటి.

అనుచు యువకుండు వృద్ధునిసట్టియెత్తి
వీఁపుపై నైచికొని వనవీథి వెడలె;
వనకుమారియు గోత్రాల బాదికొంచు
నతిరయంబున నాతని ననుసరించె.

చనిచని యొక్క చోదహాన సంస్థితిగాంచి, య దేకుటీరమం
చనుకొని దారివట్టెను రయంబుగవీరుఁడు, పోనుబోను నా
తనికి లతాకుంజ వలితంబుగ నొక్కగృహంబు వెల్గునంని
గనఁబడెఁ దాపసాశ్రమ వికాసముఁజిల్కుచుఁజూడనందమై.

అంత వనకుమారి యనియెనిట్టుల నయ్య
యిదియె మా కుటీర మిందుఁ జొరుము.
దొడ్డివెట్టి గొత్త తోటములనేవత్తు
ననిన నట్లకాక యనియె నతఁడు.

ఆలయంబుఁ జొచ్చి యజినం బరుంగు పైఁ
బఱచి యుంటఁగాంచి బాగుపఱచి
వృద్ధునల్లదింపి వేదిపై శయనింపఁ
బెట్టి, యంత నాత డిట్టులనియె.

గొఱియల దొడ్డిఁగోలి యిటకుఁ సుమకోమల వచ్చునంతకుం
ద్వరితగతిఁ రచింపవలెబంధము, నట్టులొనర్చుకున్న న
త్తరుణియుఁ గ్రొత్తనెత్తురులు ధారలుగా స్రయింపగాంచియు
ద్ధుర హృదయాకులత్వమున దుఃఖ పయోధిని మున్గిపోవదే.

అని యీరీతి వచించు నయ్యువకునయ్యా, యేలబంధంబు, పో
యెను గీలాలము రక్తనాళముల, నింకేలీల నా ప్రాణముల్
మనునిమ్మైన, వృథాప్రయాసపడఁగఁ లాభంబె? నిస్సత్వభా
జనమయ్యెఁ సకలాంగకంబులును; వాచాశక్తి జీర్ణించెడిఁ.

అనిపల్కి, యంత వృద్ధుఁడు
మనమునఁ దలపోసి యిట్టుల మందాస్ఫుటలీ
లను వచియించెను గన్నుల
దానికి శ్రుతి పుటముల నశ్రుతోయముజాఱన్.

కడచెను బదునే డేఁడులు
పడితిమి పడరానిపాట్లు వనసీమల, మా
యిడుమలకు లెక్కగలదే
కుడిచితిమి మునీశులట్లు కూరలుఁ గాయల్.

నావిని వీరుఁడిట్లనె మనంబనుకంపవహింపఁ, బూజ్యుఁడా
యీవనభూమి నేల లలి తేకణతో సుకుమార బాలతో
నే విభవంబుగోరక మునీశులలీల వసింతు చెప్పుమా
నావుడు వృద్ధరాజనిమె నశ్రుముఖం బిగుడ్చిచూచుచున్

ధరసప్తాదశవత్సరంబులు భుజాదర్పంబునన్ శాత్ర వో
త్కరముంద్రుంచి ప్రజాప్రమోదకర సౌఖ్యస్ఫూర్తిఁ
బాలించితిన్;
నరనాథుల్ నను నిత్యముం గొలువ దిజ్ఞాగాస్య పత్రంబులం
దరశామేయ యశోక్షరంబుల లసత్ఖడ్గంబునన్ వ్రాసితిన్.

కాల మహాత్త్వ మెవ్వరికిఁ గాంచనశక్య; మొకానొకప్డు కా
ర్యాళి యయత్నలబ్ధమగు; నబ్బవుకొన్ని ప్రయత్నయుక్తి నేఁ
లీలలయించు భాగ్య; మవలీల దరిద్రతపోవు; నిట్టులే
తేలును మున్గుఁగాల జలధిన్ సకలంబును న స్వతంత్రతన్.

కష్టజీవితు కన్నీటి కాల్వనైనఁ
గాలచక్రము నిలువదు కనికరమున;
ధారుణీపాల పాలనదండమునకు
వెఱచి యాఁగదు; త్రుటియైన విరతిగొనదు.

కాలసాగర కల్లోలకాండ చలిత
తృణ గణంబులు ప్రాణులు; స్థిరత లేదు;
రాజ్యములు, సంఘములు, నాగరకతలెల్ల
నిట్టిన్యాయమునన్ భ్రమియించుచుండు.

ఎవని విశ్వాసపాత్రకుఁడే యటంచు
నాత్మనమ్మితి నాయమత్యాగ్రముండు
పరన రేశుని కేకాంత భక్తుఁడగుచు
స్వామి వంచించె బ్రబల సంగ్రామసీమ.

పరధరణీశుఁ డొక్కరుఁడు బాహుబలోద్ధతి మీఱఁ గేరిఁచు
ద్ధుర పృతనాసమేతుఁడయి దుర్గము ముట్టడివేయ మంత్రి మా
పురమున నున్న సైన్యములఁ బోఁబని చేత నిషబెట్టి పట్టణాం
తరమున కయ్యెడం; గపటతంత్రుని మంత్రి నిసిమ్మి కూలిరిక్.

తరుణమునందు సన్వీడిచి దాయలకున్ విజయంబు గూర్చుము
ష్కరతవహింపఁబోని బలశాలురు యుద్ధకళాఘ్యులైన కొం
ద అపుడు స్వామిభక్తులయి దర్పమెలర్పఁగఁ దోఁషునిల్చి భీ
కర సమరప్రకారములఁ గాఁకయి వెట్టిరి శత్రుసేనలన్.

వైరులు బొమ్మలాటలవలె భావముగోల్పడి యూరకుండ దు
ర్వార రణంబునన్ విమత వాహినులం గలగుండునెట్టుచున్
ధీరులు మాపురప్రజలు దీర్ణపరాక్రము కేళిలోలురై
పోరిరి మత్తపుష్కరులు పుష్కరిణిం గలగించునట్లుగన్.

ఆయిననదేమొ శత్రుజనమంతకు సంతాకసంగతమై సము
జ్జయ శుభ సూచకారవము సల్పుచు వార్ధివిలోల వీచికా
చయములు మధ్యపర్వతపుఁ జాలులఁ దాఁకెడురీతి హేంతులన్
హయరథమత్తకుంభి పృతనాముఖనంబుగఁ దాఁకి రెంతయున్

నాకై ప్రాణము విడిచెను
వీరకా మా సైన్యమెల్ల వీరస్వర్గ
శ్రీకమ్ముగ, నరుదెంచితి
నీ కష్టము లనుభవింప నే నివ్వానికిన్:

కొందఱు సైనికుల్ ప్రజలుగోరిరి విప్లవముం బొనర్చి నన్
ముందటి యట్ల రాజ్యమున భూపతిగా నొనరించి సౌఖ్యముల్
పొందఁ; దదర్థమై విపినభూమి రహస్య సమీక తంత్రముల్
సందెడలంగనీని మఱిచాతురి సల్పుచునుండి రత్తఱిన్.

గొఱియలమేపఁ దోల్కొనుచు గొల్లల వేషములన్ ధరించి శా
బర జనవాసముల్ దిరిగి, పల్లెలలోఁ జరియించి, నాపయిం
చెరుగు ప్రియంబు, నవ్య పృథివీపతిపైఁ జెలరేఁగు ద్వేషమున్
మఱిమఱి రేఁపుచుం బ్రజలమానసముల్ హరియించుకోరికన్

జతనంబు సలుపుచుండిరి
మతి మంతులు నామహితులు; మాకు నృపాజ్ఞన్
మృతిగలుగు ననుభయంబున
సుతనున్ నను జేర్చి రడవిసోనల యెడకున్.

కొంత కాలమిట్లు కొనసాఁగె; నచ్చటి
వార్తలెల్ల మాకు వచ్చుచుండె;
అన్ని యత్నములును ననుకూలమై నట్లె
తోఁచుచుండె; నేను వేచియుంటి.

ఎప్పుడు పిల్పువచ్చునొ మఱెప్పుడు శాత్రవసేన నాజిలో
చిప్పి యొనర్తునో విమతభీషణ కేతనమెప్డు పూర్వమ
ట్లప్పురి దుర్గశీర్షమున నాడునొ, యత్నఫలంబకుంఠమై
చొప్పడునే యటంచు నెదసొక్కఁగఁ జింతిలుచుంటి రేఁబవల్.

ఇటులుండ నొక్కప్రొద్దునఁ
బఱురయమున గొఱ్ఱెతుటుము ఁబాదికొనుచు ని
ష్కుట మార్గంబునవచ్చెడు
భటునింగని యొడలు మొద్దువాఱెఁ దటుకునన్.

ఏమని హెచ్చరించు కొననేనియు నాలుకయాడ; దాతఁడుం
బూనునుగాని శోక పరిపూర్ణమనంబున రుద్ధకంఠుఁడై
మౌనమునూని యొక్క క్షణమాత్రము, గద్గదికన్
వచించె; మీ
యానసుమీ, నిరర్థకములయ్యెఁ బ్రయత్నశతంబు లిత్తఱిన్

చలపట్టి మంత్రి వేగుల
బలమున సర్వంబు దెలిసి బహుదారుణ శి
క్షల విప్లవాగ్ని నార్పెను,
పలువురు మొగదార్లు కొఱతఁబడి మరణింపన్.

ప్రజలు భయపడి యన్య రాష్ట్రములకేఁగ
రాజపురి మాఱుమణఁగిన యోజఁదోఁచు,
వింతవింతల పన్నుల విత్తమూడ్చి
రైతు నెత్తురు ద్రావు దుర్జనుఁడు నృపతి.

ప్రస్తుతము పునర్యత్న మాపత్కరంబు
గాన, సమయంబు వేచిన కార్యమగును;
తమకు భక్తులమైన మాతనువులందు
ప్రాణముండెడు నందాకఁ బ్రతిన విడము.

అనివచియించి మీకిచట నాపదగల్గిన గల్గవచ్చు; నీ
వనమున కవ్వలన్ గిరులపట్టులఁ బచ్చికలోయఁగాఁపురం
బున కనుకూలమైన సానపొంతల గొఱ్ఱెల మేపికొంచు మీ
దినములు పుచ్చుచుండుఁడు; విధి ప్రతికూలత మాఱకుండునే.

అనియిట్టులు కొంతవడికును
అనునయవాక్యములు పల్కి యాశా దీపం
బును వెలిగించి, యవశ్యము
చనవలయుట నేఁగె నతఁడసమ్మతి నయ్యెన్.

పంక్తు చెల్లెగాని యింతకునాఁడదు
ఆసదివ్వె యింతె యక్కజంబొ!
ఏటఁబోవు మనుజుఁ డెవ్వఁడైన వరిపోచ
పట్టుకొనుటఁ జూడనిట్టిదేమొ!

పరభూపాల కరాళకంఠదళన ప్రారంభ సుత్యాగమా
కరవాలంబు, శరాసనంబు లిషువుల్ కార్త్రిస్వాంగారదగ్ధం
బురుశీర్షణ్యము భూమిఁబూడిచితివయ్యా! శౌర్యచిహ్నంబులి
ట్లు గర్భంబునఁ ద్రుమ్మఁబట్టెడిని; క్షాత్రస్ఫూర్తి యిట్లాయెనే!

అనవిని వీరపుంగవుఁడు సంగమునం బులకల్ జనింపఁ, గ
న్గొనలఁ గినాల శోణిమముగూడఁగ దిగ్గున లేచివచ్చి యి
ట్లనియె నిశాత ఖడ్గము కరాబ్జమునన్ ధరియించి; చెప్పుమో
ఘనుఁడ నినున్ సమిద్ధరణిఁ గాటియ వెట్టిన దుష్టభూపతిన్.

బలయుత శత్రురాజ పరివారనివారణకేళి దుర్దమం
బు, లసితరత్నముష్టిఁ బుజమూఁపటు కంఠనవాగ్రపాయి, ఁము
జ్వాల దరుణాంశుసన్నిభము, శౌర్యపరాక్రమచిహ్నమిదింరా
కలితము మత్కరాసి, యదిగల్గఁగ నా కెదు రేరి శూరులన్:

అన విని వృద్ధుండిట్లనె
మనుజాధిపు డింద్రసేన మాద్గల్యుఁడు నన్
గనికరము లేక వంచన
ఘనరాజ్యచ్యుతునిఁ జేసి కంకట పఱిచెన్.

తరుణాంశు నఃస్ఫురదంతము శతారము పేరెదఁ జొచ్చి యట్టిటుల్
మెఱమిన యట్లొనర్చి, నసిమేదిని జాఁబగ ఘూర్ణబింబు లు
త్కరముగ మోముకన్నెరయఁ, గాలిమిఁ జిత్తపి కారఘూర్ణగా
స్ఫురణములోన నాపుకొని. పూనికనె నళీక ధైర్యమున్.





# వనకుమారి

౭

గొఱియల దొడ్డివెట్టి యటకుం జనుదెంచికుమారి, మానియా
తరుణినిగాంచ సంశయము దట్టిమనంబున; నాతఁడుం గరాం
తరమున గడ్డమాన్చి నయనంబుల నార్పక నేలఁజూచుచుం
జిరము తలంపులన్ సుడినిజిక్కి, యెఱుంగఁడు కాంతవచ్చుటన్

లలనయునిట్లనె : మేల్కని
కలగనుట యిదేమిసఖుఁడ, గాంచుమజనకున్;
వెలవెలవాఱెను వదనము;
బలముడిగిన యట్లుఁదోఁచు బాహులుకాళ్ళుల్.

అనివిని యుల్కి లేచి, చెలియా, యపునాననిలోని తత్తరం
బును వెలిదోఁపనీక, జలముంగొనిరమ్ము, తృషార్తివాయ ద్రా
విన నొక కొంత మేలగును వేగమ దెమ్మనఁ, బోయి తెచ్చి చ
ల్లని మలయూట నిర్మలజలంబులు, దప్పికదీర్చెఁ దండ్రికిన్.

శారద శీర్ణపర్ణముల చాయలఁ దేలుచు వెల్లనౌ వ్యథా
భార సమంకిత భ్రుకుటిఫాలము, జీవకళావిహీన దృ
గ్వార లతాలవాలమగు కన్నులుగాంచి యిదేమితండ్రి, ని
స్సారములయ్యెనంగములు, చల్లబడెందను వెల్లఁ జెమ్మటల్

అనుచునిటాల ఘర్మకణికావళిఁ గుంతల రౌప్యసూత్రముల్
మునుఁగుచుఁ దేలుచుం గనులమూఁగ, చినింగిన
బైటచెంగునన్
జనకుని మోమునద్ది విలసన్నవ పల్లవకోమలంబు తా
తన యధరోష్ఠముల్ గదిపెఁ గదిపెఁ దండ్రికపోలముఁ
గాంత ప్రీతితోన్.

కన్నుల బాష్పపూరములుగాఱుచు వీనులనంటిజాఱ, నా
నన్న మృతింగనుంగొని విచారముతో జనకుండుపల్కె నా
కన్నులవెన్నెలా, తనయ కాలపయోనిధి బుద్బుదంబు నా
నిన్నల వుంద్యజించి దివికేఁగు దినంబరుదెంచె నిత్తఱిన్.

లలిత వసంతవేళఁ గిసలంబులఁ, దావులఁజల్లు పూల ను
జ్జ్వల లగువల్లికల్ తమదుచక్కఁదనంబు శరత్సమాగమం
బలవడనోడి పండు వగుడాకులరాల్చుచు నస్థిపంజరం
బులో యనునట్లు చూపఱులఁ బొక్కఁగఁజేయు నహ్రుద్య
రూపతన్.

కావున నెట్టివారలును గాలముడాయ సమస్త వైభవం
బే విధినైనఁ బాసి దివికేఁగకతప్పదు ; మృత్యుదేవతా
భావమునన్ దరిద్రులని భాగ్యయశః ప్రథితాత్ములంచు సం
భావనయున్నె? కూటమియుఁ బాయుట నిత్యనిసర్గధర్మముల్

మరణద్వార కవాటముం దెఱచి సమ్మానింప మీ తల్లి ప్రే
మరసావిష్కృత దృష్టులన్నెఱపి యమ్మా, నన్నుఁ గన్నన్నలన్
వరగంగాసికతా ప్రదేశములఁ గల్పక్ష్మాజ కుంజాలయాం
తరితచ్ఛాయల విశ్రమింపఁ బిలిచెందాపమ్ము శాంతింపఁగన్.

జనకుండిట్టులఁ బల్కుఁగూఁతురనె నాశ్చర్యంబు దోపంగ మా
జననిం జూచుట కేఁగెదో దివికిఁ జంచద్గాంగ కల్లోలసం
జనితాలోల మరుత్కిశోరములు విశ్రాంతి న్నివేదింప; నే
నును నీతోనరుదెంతుఁదల్లిఁగని యన్యోన్యంబుముద్దాడఁగన్

నా జనయిత్రి యెట్టిదోక నన్మది పుట్టెడు, జన్మమాదిగా
నా జననీమతల్లి, ప్రణయాంకిత కోమల సుస్మితంబు ని
ర్వ్యాజ కృపామహత్వము నిరంతదృగంచల శీతలత్వముల్
రాజిల నన్ను ముద్దిడియెనా యెపుడైన వచింపు నాయనా.

గిరుల సెలయేళ్ళ దోఁగెడు తరుణములను
అందుఁ బ్రతిబింబితంబౌ మదాననంబుఁ
గాంచి యనుకొందు మా తల్లియించు మోము
సైత మిటులుండునోయని సంతసమున.

ననునొంటిగ నీవనివిడి
చనుదెంచఁ దలంచినావె? సర్వమునీవే
యనుకొందు జీవితంబున;
నినుబాసి క్షణంబు బ్రతుకనేర్తునె తండ్రీ.

అని వచించెడి నంతలోనతని వదన
మందు మృత్యువు తాండవమాడఁ దొడఁగె;
నెత్తలేక పక్ష్మలములనెత్తి సుతను
దరుణా భావగర్భిత దృగ్విధానంబు గోఁపఁ.

గాంచుచుండఁగ, మెలమెల్లఁ గన్నుదోయి
ముకుళితంబాయె రేదమ్మి పూవుపగిదిఁ;
బక్ష్మలంబులు జీవ కవాటములును
నొక్కసారిగఁ బిహితమై యుండునేమొ!

వీరుఁడు వృద్ధుని మరణము
నారసి లోలోన శోకమాఁపి, చెలియతో
నోరాడక గద్గదగతి
నీరీతి వచించె నేమి యెఱుఁగని యట్టులన్.

జనకుఁడు సొమ్మసిల్లి యిటుశయ్యపయిం జలనంబు లేక నె
మ్మన మొకయింత శాంతిగన మాంద్యమున న్నిదురించు వాఁడు; నీ
కనులను దోఁచె నిద్ర; విహగంబులు నీడములందు రాత్రి వో
యెను సగమంచుఁ గూసెడిని; ఏల హృదంతక చింతనల్ చెలీ.

అనియిటు తరుణుఁడు పల్కిన
మనమున శంకింపకా యమాయిక శయనిం
చెను; వక్రీకృత తనులత
కైన యగుటకుఁ జంద్ర రేఖ యెంతతపించెన్!

అంతననంత చింతలకు నాలయమైన హృదంతరంబు దా
నెంతయుఁ బూన్కితో ననునయించి దృగంచల బాష్పధారన
త్యంతమునాఁపికొంచుసదయాత్ముఁడు చింతనసేయుమెత్తపైఁ
జెంత శయించియున్న సరసీరుహనేత్ర యవస్థగాంచుచున్.

నెరయు దవానల కీలలు
తరుకోటర నికటమునకు దార్కొనుచుండన్
మఱచి సుఖనిద్ర జెందెడు
కరుణాస్పదమైన శారికను దలపించున్.

మరణసౌఖ్యమ్ము రుచిచూప మానవులకు
స్వప్నమా, నిన్ను సృజియించె వనజభవుఁడు;
కాకయున్నఁ దృషా విలలోకమునకు
నొక్కత్రుటియైన విశ్రాంతి దక్కఁగలదె.

శోకసంతాపమున నాత్మ సొమ్మసిల్లు
కష్టజీవికి నిశ్చింత గలుగఁజేయ
స్వర్గ నిశ్వాసమోహన పవనములు
నిద్దురా, వీచుచుందువు నిశల యందు.

నీదు సంస్పర్శనంబున నిఖిలజగతి
యేక జీవసమాధిగ నెసఁగుచుండు;
గగనమం దుల్లసిల్లు నక్షత్రగణము
పైని వెదచల్లు పువ్వుల పగిదిఁదోఁచు.

కాలమునదక్క మఱియేమి కార్యమందు
మరణమునకును నీకు నంతరము గలదు?
స్వర్గ సౌఖ్యమ్ము నిరయసంసర్గ బాధ
స్వప్నమౌ, నీదుగర్భాన సంభవించు.

ప్రణయ శేషుల మృత మిత్రబాంధవులను
గౌఁగిలింపఁగఁ గల్గు నీకరుణ కలిమి;
స్వర్గమర్త్య లోకముల సంసర్గసూత్ర
మీపు స్వప్నమౌ, యేమని యెనుతింతు.

ప్రొద్దు పొడుపున వికసింపఁ బోవుతమ్మి
పూవురీతిగ నిమురించుఁ బూవుఁబోణి;
ఱేకు లెడలినకంజ కర్ణిక విధాన
సమసి పోయెడి వృద్ధుని సంహననము.

జనకుండేఁగె నిసర్గసిద్ధ సరణిన్ స్వర్గంబు కాంతాయటం
చును నేనెట్లువచింతు; నాత్మఁగొఱకచ్చుల్ సోఁకినట్లౌఁగదా!
జనకుండే జనయిత్రి యట్టులఁదమిన్ సాకంగఁ గాంతరమే
తన లోకంబుగనున్న ముద్దియమనస్తాపంబు నెట్లాఁపెదన్.

జనకుఁ డొనర్చిన దుష్కృతి
కిని బ్రాయశ్చిత్త మనఁగఁ గే తన పురికిం
గొనిపోయి యీ నెలంతను
తన పితరాజ్యంబు తనకె దానము సేయన్.

శుక్తి గర్భంబునన్ దాఁగి శోభగనని
యాణి ముత్తెంబుపగిది నీ యతివమిన్న
కఠినకంటక భూయిష్ఠ కాననముల
నెటుల జీవితముంబుచ్చె నింతదనుక.

ఇన్నిపాట్లకు మాతండ్రి హేతువన్న
నిజమెఱింగిన ద్వేషంబు నెగడకున్నె!
గతమునకుఁ గుంద ఫలమేమి గలుగు నిపుడు;
అప్రియంబైన సత్యంబు హానికరము.

అనియిటు చిత్తాందోళన
మున యువకుఁడు త్రుటియుఁ గనులు మూయక రేయె
ల్లనుబుచ్చె; నా కుమారియుఁ
దనిసెను సుఖనిద్ర కలఁత దాఁకకయుంటన్.



# వ న కు మా రి

## ౬

కిలకిల పులుగులు తరు శా
ల్ ఖల రుతము లొనర్చె ; వంచకంబులు కూఁత
గొలుపుటమాని గుహాంతర
ముల దాఁగెను; దూర్పుదిక్కు పొదలెం గాంతిక్.

ఆయువను వైరి హరియింప ననుదినంబు
నుదయ గిర్యగ్ని నాళికనుండి తప్త
గోళమును బ్రేల్చుచున్నాఁడో కాలుఁడనఁగ
నలరెఁ దరుణార్క బింబ మత్యరుణ కాంతి.

ప్రాఙ్నగంబను నగ్ని పర్వతముప్రిదుల
దరణి రుచియను మృత్తికా ద్రవము రేఁగఁ
బరిసర నివాసులోయనఁ బక్షికులము
గూయుచును నాల్గుదిక్కులఁ గూడఁబాఱె.

ఊర్ణనాభుల తంతు సద్మోత్కరంబు
హిమకణావళిఁ జెలువొందెఁ గమల మిత్రు
నకు నుషః శ్రీసమర్పింప నవకమైన
క్రొత్తముత్తెపుఁ బళ్ళెరం బెత్తెననఁగ.

కలహంసాంగన లంబు జోదరరణద్గర్వాంధ భృంగాళిఁ జం
చులతోఁ మీటి మృణాలనాళముల గచ్చున్విచ్చుగం
ద్రుంచుచున్
జలజాతాకరమందుఁ గ్రీడసలిపెం జంచద్గరుద్భిన్న ని
ర్మల వీచీ మృదుడోలికా పరినట ద్రాజీవపుంజంబుగన్.

అలకుంజాంతరపర్ణశయ్యల కురంగానీకముల్ వీడి శృం
గ లతాగ్రంబుల గోకకొంచు తనువుల్ కాంతారముం
జొచ్చెడిన్
లలితగ్రాసకిసాలచర్వణమునన్ లాలాయితంబైన గం
ధిల డిండీరము జాఱిజాఱి వనవీధిన్ జల్ల కర్పూరముల్.

ఘనకండూతిదోలంగ భూమిరుహసంఘాత ప్రకాండంబులం
దనువుల్ రాయుచు డీలుచున్ గవయసంతానంబు
ఘాసంబులన్
వన పర్ణంబులు మేయు సానుతలముచు వర్ధించి ఛాయాతమో
జనితాభీల నిశాటవింజనియెనున్ సప్తాశ్వుఁడే తేరఁగన్.

రాత్రి నిద్రానిబద్ధమౌ ప్రకృతి యిపుడు
విమల కల్యానిలంబులు వీచుచుండఁ
దరుణ సూర్యాంశువులఁ బ్రభోధంబునొంది
నిత్యకృత్య ప్రవృత్తమై నెగడుచుండె.

నెలఁతుక నిద్ర లేచి యటు నీలిగి మాలిగి దేహమాంద్య ముం
దొలఁగి సఖుండ, రాత్రి యెటులు దూఁగెను దండ్రికి? శ్రమంబు తగ్గనే?
మెలఁకువ నున్నవాఁడె యని మిత్రుని గాంచ, నధోముఖుండుగం
బలుకక యున్న నాతఁడు, గుభాలున సంశయ ముప్పతిల్లగన్,

జనకుని గనుఁగొన నాతఁడు
కనుమూసిన యట్టులుండెఁ; గాంతిదఱిగె మో
మున; నూర్పు చిహ్న మేనియు
గనుపట్టదు, తనువు మంచుగడ్డటులుండెన్.

యువకుఁడు కాంతసంశయము నూహించెనొక్కొ నిజంబు దెల్ప నె
ట్లవు? మరణంబు దాఁచఁగలమా? యని ధైర్యముఁ బూని
పల్కె నా
యువు గతమయ్యె నాయనకు; నుమ్మలికంబున గ్రమ్మరింపనే
రవు; భువిఁబుట్టి చచ్చుటలు ప్రాక్తన కర్మఫలంబులంగనా.

కుసుమవల్లిక ప్రసవించు కోమలపుపూలు
వృంత మెడలక యుండునే కాంత, ప్రాచి
గనిన ముద్దులబిడ్డ యాయినుఁడు నపర
సాంధ్య రాగంపుఁ జితిలోన సమసిపోఁడె!

పూవుఁబందిళ్ళ క్రొందావి పుక్కిలింప
గున్నలేమావి నీడలఁ గూసె, చైత్ర
కాంతుఁ బరిణయమాడు వాసంతిలక్ష్మి
అంత మొందు శరజ్జరాగమమున.

అవియు నివియన నేల యోయబ్జవదన,
అంతరాళచరిష్ణుఁడౌ నర్కుఁడాది
యఖిల నక్షత్రచయము కాలానుస్మృతిని
ఐక్యమైపోవు మూల పదార్థమందు.

జలధి తరఁగలు పుట్టుచు సమసిపోయి
మరల జనియించునో జనోహారిణినయన,
ప్రకృతి మార్పులఁ జెందుచుఁ బరగుగాని
వ్యయము నుత్పత్తి లేదు మూలాంశమందు.

తండ్రి మరణించెనన్న యాతలఁపొకండె
హృదయమర్మాభి ఘాతమై మెదలుచుండె;
తడవతడవకు జనకుని తట్టితిరిగి
మరణమో కాదొయని యనుమానపడును.

చూపులుడిగిన కన్నులు చూచిచూచి
యూపిరెడలిన కాయంబు నొత్తి యొత్తి
కడకునిస్సంశయంబుగఁ బడఁతినమ్మెఁ
దండ్రి పరమించెనన్న సత్యంబు నెట్లొ.

కట్టఁ దెగదెంచుకొని యొక్కపెట్టున వెలి
చిమ్ము మందాకినీ ప్రవాహమ్ము పగిది
నింతవఱకును లోలోన నిమిడియున్న
వెలఁదిశోకమవార్యమై విస్తరించె.

కన్నుల బాష్పబిందువులు కాల్వలుగట్టగ వేడియూర్పులం
గ్రొన్నన బోనివాతెఱ జిగుల్పసనొడి ఫగుల్లువాఱఁగన్
నాన్నశరీరయష్టి పయినంబడి లేవక "నన్నుఁగూడ నీ
వున్నతలంబుఁ జేర్చుకొనవోయని మాటికి వెక్కి యేడ్చెడిన్.

ఎదకృశియింపఁ, బ్రేమమయ మీ జగమన్న తలంపసహ్యమై మదిఁబొడకట్టఁ; జిక్కు విడుమార్గము లేని సమస్యనా వ్యథా ప్రదమయి లోకజీవనము వ్యర్థముగాఁ గనుపింప, నాశలన్ వదలిన ముద్దరాలికొక భావముతోఁచె నతర్కితంబుగన్.

తోఁచినను లేచి తరుణుని తోవచించె.
మునుపునొక గొప్పనేత్తమ్ము మునకనుండి
జాఱిపడినంత ముద్దయై చచ్చెనదియు;
తనువువాయుట మనచేతి పనియెగాదె!

అనవిని రాసుతుండు వెఱగంది యిదేమి లతాంగి యాత్మహత్యను దలపోసితేల? పరితాపభరంబుననిట్లు బల్కెదో, మనసు భ్రమించెనో, విషమమార్గము నేలవరింప? నీకు మీ జనకుని యాసనమ్ము కలుషంబగు దుష్కరణంబు నెంచినన్.

చెలియా, యిట్టి నికృష్ట భావముల నీచిత్తంబు దూషింప కాశలపై ద్వేషముమాని దుర్విధి తిరస్కారంబు సైరించి ధీ బలసత్త్వంబుల లోకజీవన పయః పాథోధి తీర్ణంబుగాన్ గలుగున్ జన్మఫలంబునీకుఁ; బితనాకం బందు శాంతింగొనున్.

ప్రకృతిసంధ్య నిదే నీకుఁ ప్రథమదుఃఖ
వాఁట సహియింపరానిదై యలము కొనియె;
నెలఁత, కాలానుస్మృతిని జీర్ణించు నదియు;
చావునాఁటి నిర్వేదంబు శాశ్వతంబె?

తరుణి, సుఖదుఃఖములయాచితంబుగాఁగ
వచ్చిపోవును వాసంత వర్ష మట్లు;
వనర వ్యర్థంబుగాదె యవార్యవిధికి;
ఎవరు మృతి తప్పుకొనువారలీ జగాన?

ప్రబల ఝంఝా మరుల్లోల భంగజలధి
మనుజ జీవిత; మిందనుమాన మేల?
తిమితిమింగలక్షితి, లోనగకయున్న
జాలకుఁడు ముత్యముల నెట్లుసంతరించు?

మనము నిరువుర మేకమై మనుదుమేని
బ్రదుకు కోవలు పుష్పాడి తోటలగును;
చాలు చాలింకఁదీఱని సంశయంబు!
చెలియ, సెలయేటిస్నానంబు చేసిరమ్ము.

ప్రతిరోధము దొలంగిన యా
యతివ హృదంతరము మెత్తనయి పోవంగా
ధృతిలేని లేంత కొమ్మన,
నతఁడె మ్రొయిఁ ద్రిప్పివంచు నట్టులె నంగుళ్.

లేవలేక లేచి కడకా లేమ బుంగఁ
జంక నిడికొని మలయూట చక్కి కరిగ ;
ఏమి చేయుచు నున్నదో యెఱుఁగ దిపుడు ;
యంత్ర పాంచాలికవిధాన నడుగులిడును.

చూపుమేరకు నచ్చోటిఁ జూచి చూచి
యూటకాలువ దరిఁ జేరియుండు ననుచు
వేగిరము ప్రేమ సంస్కార విభుఁడు జరిపె
రాజపుత్రుఁడు విరిబోణి రాకమున్నె.



# వనకుమారి

## ౭



జనకుని నిర్యాణంబును
మనమునఁ దలపోసి మాటిమాటికి శోక
మ్మునఁ గృశియించెడు కన్యకు
నను నయవాక్యములు పలుకు నాయువకుండున్.

కొన్ని దినంబులం గడపి, కోమలి యుమ్మలికమ్ముఁ దీర్ప లో
కోన్నత వైభవంబు సరసోక్తుల బోధయొనర్చి, కొంత యా
పన్నత వాపి, యంతిపురిపై బలుకోరిక లుప్పతిల్లు న
ట్లెన్నియొ వర్ణనల్సలుపు నింతిమనంబు కరంగు నట్లుగన్.

తరుణుఁడు పల్కెడు లౌకిక
సరణులు చిత్రములుగాఁగ సకి మదిఁ దట్టున్
విరచింపఁబడిన జాంచి
త్రరువోయన నిశ్చలముగఁ దా వినుచుండున్.

చిఱుతెమ్మెర కంసమ్ముల
నెఱకలు చెరలాడుచుండ నెలతుక యెటకోఁ
బరుఁగిడు చిత్తము చలన
స్ఫురణము లేకుండ కనులఁ జూచుచునుండున్.

వెలఁదిసమీప మందునొక వేదికపైఁ బులితోలు పాన్పు నం
జలిత మనస్కుఁడై కడువిచారమునన్ యువకుండు ప్రాలి చిం
తలు బహిరంగ రూపములుదాల్చినవో యన వేడియూరుపుల్
వెలువడ నప్పడంతి యెదవేదన దీర్చు నుపాయమారయున్.

కలఁతంబాసి నెలంత కొంతవడి జాగ్రత్స్వప్నమున్ వీడి ముం
గల వేదిన్ శయనించియున్న తరుణుంగాంచున్విలోకించి కాఁ
బలికెన్ మిత్రుఁడ, తల్లిదండ్రులు ననున్ వర్జించి కాంతారసీ
మల, నాకంబున కేఁగన్యాయమె భయోన్మాదంబు
నన్నేఁచగన్.

గిరులన్ గొఱ్ఱెల మేపఁబోవు నెడలంగేలాన్ని చెక్కిళ్లపైఁ
గరుణా వేల్లితబాష్పముల్ దొరఁగగం గౌఁగింట బంధించి ని
ర్భరవాత్సల్యము పొంగముద్దిడుచు నంబంపించుమాతండ్రియ
మ్మరో! యింకెవ్వరి ముద్దుగొందుఁ బ్రతిసమ్మానంబు
గాంక్షించుచున్.

గిరికూటంబుల సాంధ్యరాగరసముల్, క్రేవన్ దిగంబాలు ని
ర్ఝర పూరంబుల లీనమానపుఁ బారాకం బ్రతీక్షించుచున్
సరణిన్ వేచుచునుండుఁ దండ్రి; యిఁక నన్ సంతోషమే పార నె
వ్వారు వీక్షించెడువారు లేరొ? పితతోఁ బాడాయె నేయంతయున్

నీరు వట్టిపోయిన సెలయేటి రీతి
నురులఁబడిన పక్షుల గూళ్ళ తెఱఁగు, నాదు
జీవితము శూన్యమయ్యె; ఆశింపు లేదు
పుష్పాదుల యొత్తు పఱపుల పూలబాట!

అనవిని వీరుఁడంతఁ జెలియంగని యిట్లను; గాంతయేల నె
మ్మనమునఁ జింతవోవ, వినుమా వచియించెద నొక్కమాట; నీ
జనకునికన్న మిన్నయగు చాడ్పున నం దలపోయకున్న, నీ
కనయము మేలు సేయు నొకయర్మిలి నెయ్యునిగా గణింపుమీ.

ఆలవాలంబునం బుట్టి యందె పెరిగి
పూవు రెమ్మలఁ బొదలెడు పుష్పవల్లి
ప్రక్క విలసిల్లు తరువునఁ బ్రాకకున్నె;
లతలు కాంతలు నాశ్రయోల్లసిత లెపుడు.

ధరణిపతి యంతిపురమునఁ
బరిచారక లణగి మణగి పనివినుచుండం
దరుణి, సుఖయింప నర్హావు;
ఉరుకష్టము లనుభవింప నుచితమె, వనులన్.

అనవుడు నీరుఁ, డంగనయు నాతనిగాంచి ప్రమోదబాష్పయై
యను, నరవాసయోగ్యమగు నా నవలోకము నన్నుఁ జేర్చె దే
కనుఁగొనవచ్చునేయచటఁ గానలనున్న మనోజ్ఞవస్తువుల్:
ఇనుఁడవనీ ధరాగ్రముల నెఱ్ఱనిరంగులఁ గ్రుంకుచుండునే?

గొటియల మేఁతకున్ గిరులు కోమలఘాస లతానికుంజ ని
ర్ఝర కలితంబులై యచట రాజిలునే; హరిణీకుమారి కో
త్కరములు నిర్భయాత్ములయి కానఁగనౌనె తృణాంకితావనిన్;
సరసకలా స్ఫుటారవమునల్పెడు కోయిలలున్నె మావులన్.

ప్రసవకిమ్మీరములు గాఁగఁ బరగులతలు
చెట్టుకొమ్మల మేల్కట్లు గట్టినటుల
నీల నీ రదమాలల నెగడుచున్నె
యింద్రచాపంబు స్వార్గిక సాంద్రకాంతి.

అని యీ రీతిగఁ గన్యపల్క విని నెయ్యంబాత్మఁ దోఁపంగని
ట్లనియెన్ వీరుడు : ఆ ప్రదేశము ప్రపంచాంశంబె యౌనేన్
గిరుల్
వనముల్ సూర్యుఁడు చంద్రుఁడుంగల; రిఁ కేలాతర్కమం
దెన్నియేన్
ఘనసౌధంబులు సౌఖ్యసంపదలు కాంతాగల్గునశ్రాంతమున్

నాంతో నివరుదెంచినం, గమలినీ నాళంబు లంద్రుంచుచున్
మేఁతల్మేయు మరాళబాలికలు, నున్నులత్సరోజంబులం
ప్రీతింగూర్చు సరోవరంబులు, ఫలోపేతామ్ర శాఖుల్, సరి
త్ప్రాతంబుల్ కుసుమాభిరామ లతికోద్యానంబులుంజూపదున్

నవరత్నఖచిత సుందరహార భూషలు
ధరియింపఁగలవు చిత్తంబు బడిని ;
చంద్రశిలా రమ్య సౌధభూమికలందు
వెన్నెల విహరింతు వేడ్కఁగోలఁది ;
జాళువాబంగారు జరియంచు మేల్పట్టు
పుట్టముల్లలవందుఁ బూవుఁబోణి ;
మదిగోరినట్టి యేమధురాసవంబైన
నాసదీఱ గోలంది నానఁగలవు ;

తరుణి; త్రుటిలోన నీ జీవితంబు మాఱి
సకల సామ్రాజ్య ధూర్వహాఖ్యాత లేంద్రు
పట్టమహిషి వౌదువు; భగ్న పర్ణశాల
నొంటి నివసింపనేల యీ కంటకోర్వి

నావుడు, కన్యకామణి మనంబున నించుక చింత చేసి నే
నీ వనసీమఁ బాసి యిపు డెమ్మెయి రాఁగల, జన్మమాదిఁగా
నీవిధిఁ బర్ణశాల వసియించుచు గొఱ్ఱెల మేపికొంచు నిం
దే విహరించుచుందు గిరులెంతయు నాకుఁ బ్రియంబు గూర్పఁగన్

జనక చితి భస్మధూళిఁ బావనములైన
కాన నోర్వుల విడనోప గడియయైన;
హర్మ్యమందు శోకమ్మున నడలుకంటె
శాంతిదాయక కానన స్థలమె మేలు.

అనవిని చిత్తంబున మే
కు నెరిమిన యటులఁ గలంగి, క్షోమలిఁ గని యి
ట్లనియెను గాంతుడు; రవమే
వినవు నగదా యెంత నేను వేడినగానీ.

తెలియక యంటివే మొహాలతీ, జగతిఁ జనియించువెల్ల ని
శ్చల బహుభాగ్యభోగములు సన్మతిమై భుజియింపనేగదా!
లలితసుమంబు కాననతలంబునఁబుట్టి జనోపభోగ్యమై
వెలయక వాడుచుట్టు లడవిం గృశియింపఁ దలంపఁ బాడియే.

మనదగు జీవితంబు, ఘనమార్గమునన్ దిగజారి దిక్కులె
ల్లను నిజకాంతి హేమడుచున్ వెలిగించి క్షణంబులోపలన్
మనిగెడు నుల్కరేఖయనుమాట యసత్యముగాదు; కావునం
దనువునఁ బ్రాణముండగనె తన్విరా, సౌఖ్యములంద మేలగున్

అనవ్రతము, యోచన మేయి న
వ్వనితయు మృదుమధురసరస వాక్యాననియు ; లే
పనుల వసించియు మిత్రుఁడ,
గనకంపుమె యట్టి సౌభాగ్యతలు ముదానన్.

అకలుష నిర్ఝరీజలరసాయనముల్, కిసలోజ్జ్వలల్లతా
ప్రకరములుం ద్రుమోద్వ్యాలును గాఁప కురంగకుమారి హేమర
త్న కలిత పంజరాంతరము నన్నివసింపగఁ జేయురీతిఁ గొం
కక యవరోధ సౌధమునఁ గట్టగ నెంచితె నన్ను నిచ్చలున్.

అప్పుడవిచ్చి తావులను సల్లనఁ జల్లుసరోజ షండముం
గుప్పునఁ జేరి షట్పదము గ్రోలుమరందము; కృత్రిమంబుగాఁ
జొప్పడు పూవమూల్యమయియుండియు నేమి గ్రహింప
నందు లం
జొప్పడునే మధువ్రతము చూఱలు గొట్టెడుకమ్మఁ దేనియల్.

పుట్టిననాఁటఁ గోలెఁ దరుపూగము నీడలు విశ్రమింపఁ గం
గొట్టములై చెలంగ వనిగొఱ్ఱెల మేపు ప్రీతిగా, రసం
బుట్టగ వేణుగానముల నోపినయట్లు లోనర్చికొంచు నా
యట్టి కుమారి నేనయని యూహచునుందుఁ బ్రభాతవేళలన్.

శ్యామలోర్వీ ధరంబుల సాంధ్యవేళ
జలధరాచ్ఛాదములపైకి నలమికొనెడు
కలిత కిమ్మీర వర్ణంపుఁ గాంతులకును
సకల సామ్రాజ్యసౌఖ్యంబు సాటియగునె?

సరసి మృదుపంకిలగ్నమై తరఁగలందు
గాలిఁ జెరలాడు కమలినీ నాళమేల
పెకలికినాఁడెదు మోహానఁ బెరటియుండుఁ ;
జానకయ్యది బ్రతుకునే సదమలాత్మ.

నను నొంప నీ యభీష్టం
బని తలఁచెదవేని నేఁడె యీ నరవాసం
బునకు నను గొనిపొమ్మా
యన నచ్చెలి, కాంతుఁడనియె నాశ్చర్యమునన్.

ప్రాణసమాన, నీదయినభావము నే నెఱుఁగంగఁ జాలమిం
బోణిమి దక్కి పల్కితిని, భూరిసుఖంబులు రాజ్యమేని త్వ
త్ప్రాణ సురక్షణార్థమయి వాయుదు, నీకొకకీడు సల్పు హృ
త్కోణమునం దలంచెద నె? క్రూరుఁడ నేయిటు కష్టపెట్టగన్.

ఇదియేమో నినుగాంచ నాతలపు లత్యంతంబుఁ బ్రేమాంకురా
స్పదమై పూర్వము చెల్మి యున్నటులఁ జెప్ప న్నానియిచ్ఛాలతల్
మదిలో నల్లడనల్లు వాతె; నిఁక నిర్మానుష్యమౌ కాన నో
సుదతీ, యొంటిగ నిన్ను వీడి చని యెచ్చోనైన జీవింతునే?

అనవిని చాన, లోననురియాడెడు రాగరసప్రవాహ మీ
చినిబిడ శీకరప్రతతి చిప్పిలెనో కనుదమ్ములందు నాఁ
దొనఁకెడు సమ్మదాశ్రువులు దూలగఁ బయ్యెదనద్దికొంచు ని
ట్లనియె నవీనవాంఛలు హృదంతరమందు ఖదంబు ద్రొక్కగన్.

ఖగముల్ నీడములందు జంటలుగ నెక్కాలంబు వాసించు నిం
  పుగ,నట్లే మనముందమీ సుమలతా పుంజాలయుంబుల్ వనీ
  సొగసుల్మీఱంగ విశ్రమస్థలములై, ఝుమ్మంచు నిత్యమ్ము శై
  ల గళన్నిర్మల నిర్ఝరీ ప్రకరమాలాపింప రాగంబులన్.

హారినీలంబుల హీరము ల్వోదివి నట్లాకాశ దేశంబు భా
  స్వర నక్షత్రములన్ వెలుంగఁగ శరచ్చంద్రుండుదూఁగాడుకం
  ధర పర్యంక ముడిగ్గుచుండ, మదినెన్నన్ రానిమోదంబునన్
  సరసీ సైకతసీమలందు మనుసంచారంబు గావించితిన్.

పవమాన చలిత పత్రా
  రవములు సెలయేళ్ళ గానరావము దక్కం
  బ్రవిమల రజనీ శాంతత
  కువిభంగము లేదుసరసి కూలము లందున్.

ఆనంద పరవశనైన నాగానంబు
  పవనకంపిత పర్ణరవమునందు ;
ఉన్నట్టులుండి చెన్నొలయంగ సెలవులఁ
  దులకించు నవ్వు వెన్నెలయందు ;

నిశ్చలజ్యోతివై నిర్మలంబైన చి
త్తము నిశాగర్భ శాంతత్వమందు;
నై మఱచి నటించు మంజుల క్రీడలు
సరసీ తరంగ లాస్యముల యందు;

ఐక్యమైపోయి వ్యక్తిత్వ మంతరించి
యఖిలవస్తు చయాంతస్థ నైతినన్న
ఏంతభావమ్ము లోలోన విస్తరింప
నిర్భరానందముననుంటి నిశనుక్షణము.

నీవిచ్చో నివసింప నిష్టపడినన్ నిత్యమ్ము దత్రాప్తంత సే
వావిద్యోతిత మానసాంబుజులమై ప్రాభాత నీ రేజ షం
డావిర్భూత సుగంధ గంధవహ సంచారార్ద్రంపు నీలాంబరాల్ రము
ణీవంగన్ విహరించుచుండెదము సంప్రీతిన్ వనీ వీథులన్.

జనకుని యట్టులంత్యమున సర్వము వీడి ధరాతలంబునన్
మనవగు పేరులెవ్వరు మనంబున నెంచని రీతిగాల వీ
థిని మన యంఘ్రి చిహ్నములు తేరనియట్టుల మృత్యు
సూత్రలం
బనమునఁ బ్రాఁకిపోవుదము స్వర్గము సేరఁగనోయి మిత్రమా.

అనవుడు, పలుకక కొంకుచు
వనితకుఁ బ్రత్యుత్తరంబు వచియించుటకున్
మనమునఁ దోఁపక మీసము
మొనదువ్వుచుఁ గ్రిందిచూపు మొనయఁగనుండెన్.

తరుణియు జనకుని నామ
స్మరణమ్మున నాత్మచింత మది నెఱయఁ దొం
తరలుగఁ గన్నుల బాష్పము
లురలఁగఁ గనఁ బడక యుండ నోరగనిలిచెన్.



# వ న కు మా రి

## ౮



ఇరువురు రేయుంబవళులు
తఱుగని సంభాషణములఁ దవిలి దినంబుల్
జరిపిరి ; తరుణికిఁ గ్రమముగ
నెఱుకపడెన్ లోకవిషయ మిట్టిదియనఁగన్.

చెలి మనము ననుసరించుచు
మెలఁకువఁ దనదృక్పథంబు మే కొనునటు లం
గొలఁదిగ యువకుఁడు యత్నము
సలుపుచు నొకకొంత జయము సంపాదించెన్.

సరససల్లాపముల వాంఛసందడింప
ప్రణయమాధురి చూపుల బయలుపడఁగ
నెదతలంపులు మాటలై పెదవి విడని
జంకు గొంకులనుండిరా సకియనతఁడు.

తరుణి జరఠరాంశుమండలి
  యొర పులకుఁ నీలగిరుల యుఱుపులు మూఁతన్
  గరువలి పూవులు రాల్చెడు
  తరుపుంజముపట్టు స్వర్గ తలమొఱులుండన్.

తరుణ మరకత చూర్ణంబు పఱచినటుల
  లేఁత పచ్చికల విలసిల్లి ప్రీతిగొలుపు
  చల్లనెట్టునఁ గూర్చుండి చానతోడ
  రమణుఁ డిటువల్కెఁ బ్రేమసౌరభ్య మొలయ.

అళిపక్షాహతి మొక్కవోవని మనోజ్ఞాంభోజ లావణ్యముం
  దొలఁకంజేసెడు నీదుముద్దు మొగముం దోరంబు వీక్షింపనో
  లలితాంగీ, ప్రణయార్ద్రిమాచు రసవాల్లభ్యంబు నంబొంగుని
  చ్చలు నా చిత్తము ; పూర్వకర్మఫలముల్ సంబంధ
                                    బాంధవ్యముల్.

నిశఁదమంబులడంచ వెన్నెలల కందు
  గున్నపొదరిల్లు వలపింపఁ గొమరుపూవు
  లటులఁ బురుషుల జీవితం బలరఁజేయ
  స్త్రీల నిర్మించెను విరించి సృష్టియందు.

మనుజుం డేమయి యెట్లు వోవునొ గదా మాధుర్య ధుర్యాంగనా
జనసాంగత్య సహాయతల్ దొలఁగినన్! సద్భావముల్ మానిపు
ర్జనుఁడై ఘాతుక సత్త్వయుక్తుల సహోరాత్రంబులుం గ్రూర వ
ర్తనమే వృత్తిగఁ గ్రూర శాత్త్వుఁడయి నిందంబొందు నేమో చెలీ.

ప్రేమకు జన్మస్థానము
హై మొలఁతలు కటికవాని యాత్మను నైనం
గోమల కరుణాంకురర
ప్రసవము మొలపింపఁగలదు శుభదృష్టులచేన్.

సలిలప్రవాహ వీచీ
చలితంబు తృణద్వయంబు చాడ్పున మనమో
హలితమా, దైవ ప్రేరణఁ
గల సితిమీ వనులఁ; గౌతుకంబగు నిదియున్

అనవిని కాంత యిట్లనియె: నక్కజమున్ యెవ్వ నెదోయనూహ్యకా
మన, గురుతింపరాని రసమాధురి నా యెదలోఁ జిగిర్చెనిన్
గనినను, మాటలాడినను, గాయమునంటిన సంతసంబు గూ
ర్చు; ననను భూతపూర్వమిది; సూ కెలనుండు నకాంత్మి
తంబుగన్.

ఇంతవఱకుఁ బ్రచ్ఛన్నమై యెఱుఁగఁబడని
భావవిప్లవమెద్దియో ప్రస్ఫుటించె;
శాంతమైయున్న మన్మన స్సరసిలోనఁ
బెనుతుపాను కరళ్లు తుంపెసలు గొట్టు.

ఇట్టి తహతహ కెయ్యది హేతువంచు
డెందమును నేను ప్రశ్నించుకొందుగాని
యొక్కమాత్రైన రాదు ప్రత్యుత్తరంబు!
దానినూహింపఁగలవె నీవైన సఖుఁడ!

తరుణి ముద్దరాలి తనమున కొక్కింత
కనికరించి యిట్టులనియె నతఁడు;
సహజమైన ప్రేమ సంస్పర్శ నీయందు
నభినవానుభూతి యంకురించె.

బాల్యమంతరింపఁ బ్రణయ మోహనమైన
యౌవనంబు తోడ నవతరించె;
కొమ్ముపుట్టు తఱిని క్రొత్తసంచలనంబు
పొదలుగాదె దుప్పికోదమ కతివ.

తెలియవుమున్ను నీ హృదయ దేశము నందిటువంటి వింత శ
క్తులు జనియించునంచుఁ; గొలఁదుల్ గనఁజాలక యుంటి
వేమొ; పూఁ
గలికయు భావి విస్ఫుట వికస్వరతంగని సౌరభంబు ని
చ్చలుచిలికింతునంచెఱుఁగజాలునె చైత్రముడాయునంతకున్.

పూలకారు రాకఁ బుష్పించె మల్లిక;
తుమ్మెదలకుఁ దావిదూతి యయ్యె;
ప్రకృతిసిద్ధమైన ప్రణయ మార్గంబిది;
తప్పికొనగ నెవరి తరము సకియ.

పుధన్ ద్వీపమునం దెడారుల ధ్రువ ప్రాంతంబు లందైన ని
ర్జన కాంతారములందుఁ గాని యెటనేం, బ్రాయంపుఁ
బూఁబోణి యుం
డునో యచ్చోటనె యుండు డెంద; మటనుండున్ బ్రేమ;
పెన్ తావిమ
ధ్యను గప్పన్ జలముంచు నావిధి కసాధ్యంబెద్ది విశ్వంబునన్.

అని యువకుఁడు వచియించిన
నిన రశ్మికి మంచుమసుఁగు లెడసిన భంగిన్
మనసు ప్రసన్నము కాఁగా
వనితకుఁ గన్పట్టె భావిపథ మద్భుతమై.

క్రొత్త యాసలు లోలోనఁ గోరగింపఁ
జెలియవదనంబు కొంగ్రొత్త చెలువుగనిచెఁ,
సరసుఁడా మాధ్వునకు సంతసంబుగొంద
యనియెఁ బ్రియురాలి భుజముపై హస్తముంచి.

కాని మఱొక్కమాట : నినుఁగాంచిన దాదిగవీడి పోవఁగన్
మానస మొప్పదేమొ ; వనిమాపరివారము నన్నుఁగానకే
నేనెట కేఁగితోయని యనిశ్చిత బుద్ధిఁజరించుచుండు నో
చాన, యెటింగివత్తు ; ననుసంశయమెంతయుఁ దీవరించెడిన్.

అనవుడు కన్యక విస్మయ
మున నిట్టులఁబల్కె : నేమి, మునునొక్కఁడవే
వనికరుదెంచితివనినే
ననుకొందు ; నిజంబుసెప్పుమా ప్రియసఖుఁడా.

నావిని కాంతుఁడిట్లనియె ; నాతుక, నే మృగ యా వినోద చిం
తా వివశుండనై వనులదవ్వుల బోయల నిల్పియొంటిగన్
ద్రోవను బట్టిపోవ నెటనోసరి మార్గముదప్పి చీఁకటిన్
రా వని నిన్నుఁగంటిని ధరాధర పార్శ్వముఁ జేరుచుండఁగన్.

ఇఁక గొంతసేపు కానన
నికట తలంబులను వెదకి నే మృగయుల నూ
రికిఁ బంపించి యమాత్యున
కొక వార్తను బుచ్చివత్తు యువతీ, యనిరన్.

తరుణికి నీ యుదంతము వెతంబురికొల్పెను; నిన్నువీడి యొం
టరిగఁ గుటీరసీమ మగుడన్ వసియింపఁగనౌనె; మాటికిన్
మెఱయును నాన్నపైఁదలఁపు; మిత్రుఁడ, వచ్చెదనీకుఁదోడుగా
దిరుగుచుఁ, గాననంబుల నదీపులినంబుల భూధరంబులన్.

చెలియిటులేలసంశయము చెందఁగఁ, గొండల ముండ్లడొంకలం
బలుమఱుఁ గ్రుమ్మరం జరణ పల్లవముల్ కసిగందు; శుష్కమై
బలము దొలంగియున్న తనువల్లి శ్రమంబున కోర్వదంచుఁ, జె
క్కులఁ జిబుకంబుఁ చేనిమిరెఁ గొమ్మయుఁ జక్కిలిగింత
నవ్వఁగన్.

తిరిగివచ్చెద రాత్రికే తియ్యబోణి
వేటబోయలఁ గనుఁగొన వీలుపడిన;
నిన్ను విడనాడ నాకొక్క నిమిషమైన
నెడఁద కుదురుగ నుండుట దేమిమాట!

అనవిని సమ్మతింపఁ దరళాక్షియుఁ గాంతుఁడులోనిప్రేమ గు
ప్పున నెగదట్టెనోయనఁగఁ బొల్పగు నెచ్చెలి యోష్ఠపల్లవం
బునకు నిజోష్ఠముంగదిపి మున్నడి బాహులఁజాపి కౌఁగిటం
గౌనె ఘనసాత్త్వికోచ్ఛ్వసితఁగోమలినుల్లముపల్లవింపఁగన్ .

ఎంతసే పిట్టులుండిరో యెఱుక పడక
యిరువురన్యోన్య నిశ్వాసపరిమళంబు
లానుచానంద పారవశ్యమున నుండఁ
దనకుఁదానుగ బాహుబంధంబు సడలె.

నేఁదలఁపలేను నీవు వాంఛింపలేదు
ఎటులనీసేఁత నడచెనో యెఱుఁగలేము!
చటుల ఝంఝా మరుద్ధూత జలదలవము
పగిదిమన్మనస్సంయమ మెగిరిపోయె!

తలకుమించిన సుఖిలోన దవులుకొన్న
యపుడు నేననసేమి నీవైనఁగాని
తాళుకొని గట్టుచేర సాధ్యంబె చెలియ;
ఆదిమ పశుత్వ మొక్కప్పుడాజ్ఞ వినదు!

అని కాంతుఁడనఁగ వనితయు,
మనమున, వర్ణింపరాని మధుర స్ఫురణల్
అనుభూతమౌట పరవశ
తను మౌనంబూని కొంత తడవటులుండెన్.

మారుతచాలితంబయిన మంజులవల్లికయో యనంగ శృం
గార శరీరకొంతవడి కంపిలి యర్ధనిమీలతాక్షులం
గూరిన మాంద్యముందొఱఁగి కుంతలముల్ సరియొత్తికొంచు నా
వీరునితోడ నిట్లనియె; వే యరుదెంతువె సంజకీవలన్.

వీరుండెటువలెకాకని
సారసలోచనను వీడి చనుదెంచుచుఁ బ
ల్మాఱును వెనుకకు ముందుకుఁ
దారుచుఁగను చూపుదాఁటెఁ దద్వనసీమన్.

యువతియుఁ జెట్టుపజ్జఁగుసుమోజ్జ్వల మానెలగొమ్మఁ బాణిప
ల్లవమునఁబట్టి నెన్నుదుట లాస్యములాడు శిరోజమాలి కం
జెవులకునెట్టి, పూరసముఁజిల్కు సమీరము వెంటనంటు భృం
గవిసర మట్టులం బ్రియుని గాంచగ నేఁగు నిరీక్షణావళిన్.

వెనుక మరల్పులేక పలవించుచు నెట్టకునేని లోనికిం
జనఁ దమకించెఁగాని తనస్వాంతము కాంతునియందు లీనమై
తనరుట నెట్లుచూచినను దన్వికినాతని సుస్వరూపమే
కనఁబడుఁగా; వియోగమునఁ గాంక్షయుఁ బ్రేమయు
మల్లడింపవే.

తటుకున నిల్లుసొచ్చి క్షుభితంబగు చిత్తమునన్ మరాళ సం
త్రుటిత మృణాళమట్లు వసిదూలిన యంగముతోడ వేదిపైఁ
గుటిల శిరోజపండుకొని కోర్కెలు ద్రెళ్ళుటకన్ భవిష్య ద
స్ఫుట నిజదిష్టమాత్మఁ దలపోయుచునుండెఁ దదేకచిత్తయై.

ప్రతినిమేషము చెలికి హృద్భవనమందుఁ
గ్రొత్త కిటికీలు వాకిళ్లు గోచరించె;
నింతవఱకుఁ దమచ్ఛటా క్రాంతమైన
మూలలెన్నొ బాహ్యాంశులఁ జాలవెలిగె;

ఇన్నియేండ్ల జీవితయాత్ర నెటుఁగనట్టి
మానవత్వ రహస్యముల్ మదికిఁదోఁచె;
పుట్టు గ్రుడ్డికిఁ జూపులు పుట్టినటుల
వింత లోకంబులోనున్న విధముగాంచె.

నవకపు సాంధ్యరాగ కిరణంబులు చూరుల నల్లువాటి లోఁ
దవిలి కుటీరకుడ్యములఁ దామ్రసుమావళి జాలెగట్ట నిం
తవఱుక చేలరాఁడో, ననిఁ దప్పెనొ మార్గము కాంతుఁడంచునా
యువతి విదీర్ణభావయయియుంటఁ దమిస్రమునిండె నల్గడన్.

పూపుఁబొదరింట నిండారఁ బూచిక్రొత్త
పరిమళంబులు వెదచల్లు ప్రసవమొండు
గాలితాఁకున ముండ్లలోఁ దూలినటుల
అతివ హృదయంబు శోక సంపతితమయ్యె.

జనకుఁడు లేఁడు; కాంతుఁడను సంజకురాఁడు; తమో
వితానముల్
దనరెను దిక్కులందు; మదిదాపము వోదు; కుటీరమందు నెం
దు నెగడు శాంతికిం బొలఁతి దుఃఖరసంబె విభంగహేతు, వ
వ్వని నిశనొంటిగా నెటులవాసము సేయును గాంతచింతతోన్.

తనమనసు కలఁగియుండుట
వనితామణి పవనచలిత పర్ణరవంబుల్
వినఁబడ వచ్చెను నాప్రియుఁ
డని చూచుచునుండుఁ దమిని ద్వారమువంకన్.

ఇదివఱకెల్ల వేళల మృగేక్షణ మోహానుసంధియుంటఁ గా
నెదఁ దలపోయదయ్యెఁ బితయేగినలోపము ; నిప్పుడన్ననో
పొదలెడి భీతిమైఁ దనదుపూర్వ చరిత్రము సంస్మరించి యా
పదలను జిక్కికొంటినని పల్మఱు నుమ్మలికంబు నొందెడిన్.

చెలియ మనంబు పూర్వమునటు చెన్నలరారుట లేక ఘూర్ణనా
కుల బహు విభ్రమాశయతఁ గుందుచునుండె నిరంతచింతలన్ ;
లలితసుమాంగి; లోకకుహనా గతులన్ మతిలేనిముగ్ధ, య
క్కలికి, హృదద్మనోవ్యథల గాటియకున్ సహియింపఁజాలునే?

వింతవిజ్ఞాన పతితమానాతిమనము
ప్రతినిమేషముఁ జిత్రించుఁ బ్రచురవివిధ
భీకరాకారముల భావ విగ్రహములఁ
బాహిరంబైన నిస్స్వాన వర్ణయుక్తి.

అరరే, జీవితచిత్రవైఖరి! త్రుటిన్ హర్షంబు శోకంబగున్;
భరమగు శోకము హర్షమగును! సుమనోవల్లి మనోజ్ఞాంగి, సుం
దర పద్మాయతనేత్ర, నీలకచ, విన్నాణంపు బింబోష్ఠి, య
ద్దిర! యున్మాదిని నా వికీర్ణకచయై దీనాస్యయై చూపడున్.

నిదుర పట్టియుఁబట్టక సుదతికపుడు
చిత్రచిత్రాకృతులు స్వప్నసీమఁ దోఁప
నుల్కిపడిలేచి యొంటితానుంట యెఱిఁగి
గాలి గర్భాన నేడ్పులుగరఁగఁ బొగిలె.

కడకేటులో ప్రభాతరమకాంత నెగుల్గనలేక శాంత ముం
గుడుపగవచ్చుచున్నదని కూరిమిఁదెల్పు నఖిజనంబు నా
వడి నరణాంశు మాలికలు పర్ణగృహంబు నలంకరింప న
ప్పుడతుక మేలుకాంచి కుటిపార్శ్వవనిం బ్రియుఁగోయుఁ
దెంపునన్.

మారుతోద్ధూతమై నభోమార్గ మందు
సుడియు శుష్కచ్ఛదంబునా సుందరాంగి
యేఁగుచుండె గమ్యస్థల స్మృతియలేక
దైవమీడ్చెడు కానన స్థలులకెల్ల.

తూలున్ ఊప్పలు కంటకంబులు తృణాగ్రంబుల్ పదాబ్జంబులన్
డీలంజేయ నహస్కరుండు నడిమింటిం జేరి తీంద్రింపఁగం
గాలుంబెట్టక లేక, ప్రేయసుని యిక్కల్ గాంచలేకెంతయున్
రోలంబాలక, చెట్టునీడఁబడియాక్రోశించుఁ బేరెల్గునన్.

కాంతుఁడ, యెట్లువోయితివి, కానలనన్విడనాడి, సంజకీ
ప్రాంతము చేరవత్తునని పల్కియు, నొంటరినైన నన్ను ని
ట్లింతయుఁ గష్టపెట్ట మది యెట్లుసహించె ; శిరీషపేశల
స్వాంతుఁడవన్న నాతలఁపువట్టిదియయ్యె; భ్రమించితింగటా!

విరహమనార్తిదాయకము వీడకనిం దలపోయుటన్ మనో
హరుఁడ, కఠోరకంటక సమాకులమైన గులాబిపూఁబొదం
జొరఁబడి మంచుతుంపురులుజొబ్బిలుపుష్పముఁబొందురీతి; ప్రే
మరసమునింపి పాత్రఁగను మాటుగ దాఁచెద వేల క్రూరతన్.

జనకుని నిర్యాణంబును
నినుగాంచుటయుం దలంప, నిద్దురలోనం
గనులకునిజమై గనఁబడి
కనువిచ్చినయంతమటుఁగు కలలటుదోఁచున్.

అనియిటుచింత చేసి, చెలియంతటఁ గాంతుఁడు పర్ణశాలకుం
జని తనువేచుచుండనని చయ్యన లేచి కుటీర సీమకుం
జను; నటనెవ్వరున్ మెదలుశబ్దముగానక భగ్నవాంచలన్
గొనుఁగుచుఁ బోవుచుండు నెటకోపటుశోక విపాటితాత్మయై.

ఒకనాఁడు గిరికూట నికట గహ్వరముల
సానుభాగంబులఁ జక్కఁజూచు;
ఒకనాఁడు భీతిదాయక కాననముఁ జేరి
త్రొక్కనిదారులు త్రొక్కి వెదకు;
ఒకనాఁడు నిర్ఝరీ సికతాతలంబుల
కేగిఁ పాదాంక పరీక్ష సేయు;
ఒకనాఁడు పిత చితియొద్దనె కూర్చుండి
కన్నీరు కాల్వలుగట్టఁ బొగులు;

తల్లి బాసిన లేఁజింకపిల్ల యటుల
దాను మెట్టని కాననస్థలము లేదు
నాఁగ వెదకియుఁ బ్రియునిగనంగ లేక
ఖిన్నమానసయై యేడ్చుమిన్నుగనుచు.

దినదినమిట్టులఁ గాంతా
రనగములన్ వెదకి వెదకి రాత్రియుఁబవలున్
మనము గలంచెడు చింతా
ఘనశల్యమునం దొలంగెఁ గలికి బెడంగున్.

నీరునన్నంబు విడనాడి నిదురమాని
విరహశోషిత చిత్తయై తరుణి యపుడు
చేత నాచేత నజ్ఞాన సిద్ధిదొఱఁగి
పలుకసాఁగె మనోవ్యథ పక్షులకును.

కలరవ కోమలంబగు వికస్వర సుస్వరమెత్తి నీ హృదిం
గల సరసానురాగమెసకమ్ముగఁ బాడెద ; పిట్టి విద్య నెం
దుల మునునభ్యసించితివి : దుఃఖనిమగ్నను జేయు ప్రేయసుం
డలవడఁడే మొనీకును బికాంగన, పల్కుమముద్దుగాఁ బల్కఁగన్.

నీ సంతోషమునన్ శతాంశమయిన న్నిత్యమ్ము శిక్షించు మో
వాసంతంబ, మనోవిషాదపథముల్ వర్జించి, కాంతారసం
వాసోద్బుద్ధమదీయ గానలహరీవ్యాసంగ హృష్టాత్మనై
నీ సఖ్యంబునఁ గాలముంగడుపుదున్ స్వేచ్ఛాప్రకారంబులన్

అనిల హతింజలించి యనయంబును డోలిక యట్టులూఁగు కొ
మ్మను బసికందునుంచి మృదుమంజుల గానము సేయు శారికా
నను విధి నీదు గర్భముననాఁడె జనింపఁగఁ జేసియున్న మో
హన వనవీథులం దెగురులాడుచు నుందునుగాదె మావలెన్.

నిర్మలనిర్ఝరంబ. రమణీయ కలాస్ఫుట గీతికా స్వనం
బర్మిలిఁ జేయుచున్ గిరితటాగ్రములం బ్రవహించుచుండు, వా
మర్మముఁ జెప్పి నీ యుదరమధ్యమునన్నను జేర్చుకొమ్ము; త్వ
చ్ఛర్మద గర్భశీతలత సంతతశాంతికరంబ యాత్మకున్.

అనుచు విషాదతప్తయయి యాసుకుమారి నిషాదబాణ సం
జనిత నితాంత బాధఁ బెలుచం బతితంబగు హంసియట్లుదాఁ
జని యొక పూర్ణహరిద్వర్ణ విశాల తృణాంకురశయ్యపై శయిం
చెను నిజజీవితాంత్యభ్రమముఁ జెన్నుతెనో కడసారి తారనాన్.

కొఱలు బహిఃప్రపంచమునకుం దెరచీరగాఁ గఁ బిం
జర జరఠచ్ఛదంబులును, జంపుగఁ బుప్పొడిపైన రాలినం
బురుడననొప్పె, శాపమునఁ బుష్పసమాధి నిలీనయైన య
చ్ఛర పువ్వుఁబోణితోఁ జెలి, లసచ్ఛటులాలక గుప్తపాలయై.





# వనకుమారి

## ౧

వేటాడుచు మృగయులు ఘో
రాటవి నరపతినిగాన కడలుచునాయా
చోటులు లోయలు భూ భృ
త్కూటంబులు వెదకి జాడగూడకయున్నన్.

వేట తమకమ్మునన్ రాజువీడి మనల
వనులలోఁ గ్రూరమృగముల వాతఁబడెనో,
గాకయుండిన నెందేని గానరాఁడె
యనుచుఁ బలవించి పరివారమేఁగెఁ బురికి.

నృపకుమారుండు మృగయుల విపినమందు
వెదకివెదకియుఁ గనలేక విసుగుఁబొంది
పర్ణశాలకు మరలుచుఁ బథముదప్పి
క్రుమ్మరుచు రాత్రిఁబుచ్చెనా కుధరములనె.

చని సరిదారిగాంచి విలస త్తరుణార్క మయూఖమాలికా
జనిత సువర్ణ కాంతుల పసల్ కిసలంబులఁ బ్రోదిసేయుచోఁ
గనె ఖగవర్జితంబయి వికాస విహీన కులాయమట్టులం
దనరు కుటీరసీమ నతిదారుణశోక పరీతచిత్తుఁడై.

ఇంతకుమున్నె ప్రేయసి
కాంతుడు రాఁడనుచు నిబిడకాంతారములం
జింతమెయి వెదకఁ బోవుట
నింతినిగనఁడయ్యె ధారుణీశ సుతుండున్.

కనక యిదేమికాంత యిటుఁగానఁగరాదు, ప్రదోషవేళ దాఁ
కను ననువేచి వంచకునిగాఁ దలపోసి, హతాశయై కడున్
వనరి ప్రపంచ జీవనము వాయుచు శాంతి కరంబటంచు నే
వన తరువాటికా లతల బంధము లంద్యజియించెనో యెయిన్.

అటునిటు పాఱఁజూచుఁజెలియా, చెలియా యనుచెట్ల నీడలం
జటుల లతానికుంజముల చక్కనిగాంచు, విషాదబాష్పముల్
తటుకున రానడంచు విదితంబుగఁ జేతులుదట్టు వీరుడు
త్కట రవమేర్పడం బిలుచుఁగాంతఁ గనుంగొన లేక దీనుఁడై

వెలఁదియును దాఁ బరస్పరాన్వేషణంబు
సేయుచును దుర్గమారణ్య సీమనొకరి
కొకరు వోయిన మార్గమ్ము లొనరుపడక
తిరుగుచుండిరి వెతఁగొన్ని దినములిటుల

కుసుమాప చయమునకుఁ దర లెనోయని
నవలతా కుంజంబు దవిలిచనును;
అట లేకయున్న మిక్కుటమగు చింతతో
మరలి, నీరాడఁబోవు రమణి యని
నిర్మల నిర్ఝరినికట సైకతముల
కేఁగి వీక్షించు; నందెందు లేక
యున్న, వృద్ధుని చితియున్న వాటిక కేఁగి
అటనైనఁ గానక యరచిపిలుచు;

తరుణుఁడేమన్న దత్ప్రతి ధ్వనియెగాని
యువతి ప్రత్యుత్తరంబు రాకుంట యెఱిఁగి
యచట బాటల నూత్న పాదాబ్జ చిహ్న
లొనరఁ దన్మార్గమునుబట్టి చనుచును డెం.

చలిచలియొక్క-చో, వికచసారస షండమునందు సుప్తిమైఁ
గనుగనమోడ్పు హంసివలెఁగాంచెలు నోర్తుకఁ బుష్ప
పుంజ మం
దు నిదురవోవు మాధవఘూమణిఁ బోలినదానిఁదీవటిం
టను బడియున్న బోటిని దటాలునఁగాంచె నృపాల
మౌళియున్.

కాంచి దృగంచలంబులనె కాంచనగాత్రిని మ్రింగునట్లు కుం
జాంచలవీథిఁ జేరి హృదయప్రతిబింబ సమానయిద్ది, నా
చంచలఁ నేతయంచవి విషాదము విస్మయమంత మోదముం
గొంచక చిత్తమునగలఁప గుండె దడాబడ గొట్టుచుండఁగన్.

ఏమునియెంతొ నా సుకృతిమీగతి ముత్ప్రతిపాదియయ్యెఁ; గాం
తామణి గానవోయని వెతిన్నశియించెడునాకుఁ బేదకు
ద్దామధనంబు నా దొరకె, ధన్యుఁడనైతి; నటంచుఁ గోమలిన్
శ్యామల పత్రపుష్ప నిచయంబులనుండి తెరల్చె మీదికిన్.

కమలినపద్మనాళ సుఖకాంతి దొఱంగిన దేహవల్లి న
మ్రమముగ నెత్తుచుండఁబయిప్రాలెను డూలికవిగ్రహంబు నా
స్తిమితములైన కన్నులునిశిన్ ముకుళించిన తమ్ములట్లు మం
జిమ మెడబాసి వ్యాపినము చేసెను సుందరతా ప్రదోషమున్.

అళి పక్ష్మాంకుర నీలిమస్థగితమై యంసచ్యుతంబై సుదు
చ్చలితంబైన వికీర్ణ కేశభవమున్ సంధించి బంధించి ఘ
ర్మ లవంబున్ నిట లంబునం దుడిచితెమ్మా, యింకనో
ప్రేయసీ,
పలుకన్ లేవెయటంచు వేడుననుతాఁ ప్రగస్తుఁడౌ కాంతుఁడున్.

చాయదొఱఁగిన ప్రత్యూష చంద్రికయన
మొగమున నొకింతహాసంబు మోసువాడువ
అరసె హృదయేశు వైశాఖ మంతరింప
మాధవుని గాంచు వనలక్ష్మి మాడ్కిఁ జెలియ.

మెలఁత కన్నులువిప్పు నిమేషమందె
పరమసంతోష లోక కవాటములును
గళ్ళుపడలెఁ గాంతునకుఁ దాఁ గాలనడచు
నో తలనడచునో యదియుఁ దెలియఁదు.

తామరపాకు దొప్పవసుధాధర నిర్గత నిర్ఝరీజలం
బామెకుఁ దెచ్చియిచ్చి చివురాకుల వీవనవీచు చంగనా
కోమల పాదపల్లవము గోమఱిగాయము వాఱియుంట జిం
తా మతియై స్పృశించుచు సుధామధురంబుగఁ బల్కె
కాంతతోన్

పదముల్ గందఁగ దేహవల్లి కృశియింపన్ ముద్దునెమ్మోము సం
పద యింపేదఁగ దుర్గమాటవులలోఁ బల్మాఱుఁ గాల్మ్రొట్టి డ
స్సి, దెసల్ చూచుచు నేడ్చుచుం దుదకునన్ ఛీకొట్టుచున్ గుంజమం
దుమటన్ శోకముతోడ మూర్ఛపడితే యో ప్రేయసీ, దీనతన్

సూర్యుఁడపరాద్రి భవనమ్ముఁ జొరకమున్నె
మృగయులను గాంచి గృహమున కేఁగుదెంతు
నని వచించితిఁగాని, యావనములందు
మార్గముందప్పి రాత్రిఁ గ్రుమ్మరితిఁ జెలియ.

కలశ కుంతరవమ్ములు గడలుకొనెడు
ప్రత్యుషమ్మున వచ్చియుఁ బర్ణశాల
నిన్నుఁ గాంచక చింతించి యన్ని దెసలు
ననుదినంబును వెదకుచు నడలిబడలి

పారములేని పుణ్యపరిపాకవశమ్మున నిన్నుఁ గంటి నీ
తీరునన్నైన నేఁడు పొలఁతీ, నినుఁ గాంచఁగ బూర్వరూప శృం
గారపు టస్థిపంజరముగాఁ గనుపట్టెద ; వెంతలోపలన్
మాఱెను మంజుల ప్రకృతి మంచుచలిన్ జలజాతమట్టులన్.

అనుడు, నెలంత యిట్లనియె : నబ్బురమే ప్రణయాను బంధ వ
ర్ధన హృదయుల్ వియోగమునఁ గ్రాఁగుట; జక్కవ వెంటి
వెన్నెలం
దనప్రియకాంతుఁగానక వృథాకరుణంబుగఁ గూయుచున్ సరో
వన జలతాకుడుంగముల వందురుచుం జరియించుచుండదే.

నను నిట వీడిపోయితని నమ్మివనంబులు సొచ్చిచూచి యెం
దును నినుగానకే మరణదుఃఖము నొందుచుఁ బూవుటింట నె
ట్టనఁ బడిపోన, నంతనె నిటాలమునం జమరంకురించె; నా
తనువు వినిష్ట సత్త్వమయి దప్పికకున్ విలపించితింగదున్.

కన్నులఁగట్టు నాయికను గాంతుడిటంచు నిరంతరంబు ని
న్నెన్నుచు మాలదైవమున కేడ్చుచు, లేవను శక్తిలేక యూ
పన్నత నూర్చుచున్ బడలి పాటలు సూచుచునుండమూర్ఛమై
గన్నులు పచ్చనయ్యె; నొకకాలము పోవునొగాన నవ్వలన్.

మారుతా సీతశబ్దంబు మాడ్కినల్ల
శ్రవణపథమున నెద్దియో చలనమయ్యెఁ;
జంద్రికా శీతలంబైన స్పర్శదేహ
మందు నూతనోజ్జీవన మలరఁ జేసె.

కన్నుఱెప్పల నెత్తంగఁ గట్టయెదుటఁ
బ్రేమసాక్షాత్కృతిగఁగంటిఁ బ్రియుని నిన్ను;
విరహశోషితచిత్తంబు వీక్షణామృ
తంపు సేచనమున రసార్ద్రంబుగాఁగ.

అనవిని వీరుడిట్లనియె : నారట మొందితివా నిమిత్త మి
న్వానులఁ జరించిడస్సి ; శోకపాటు నెఱుంగని ముద్దరాలి నా
వనజభవుండు కష్టముల పాలొనరించెఁ; గురంగి కంటని
రు నిడిన వేటకానికి మరుల్ జనియించునె; చింతపుట్టునే?

పర్ణశాలకుఁ బోదము పద బిరానఁ
జెప్పెద రహస్యమొక్కండు చెలియనీకు;
నడువఁజాలవు మెలమెల్ల నడుగు లిడుము;
మద్భుజాలంబయష్టి నెమ్మదిగ నూని.

చెలువయు నట్లకాకని విశీర్ణపు వాతెఱనాల్కనద్దుచున్
బలితపుమాంద్యముందొలఁగిపయ్యెదకొంగును జక్కనొత్తిముం
గలజరియించు కాంతుభుజకాండ మెయూఁతగఁ జెట్లనీడలన్
సలిలపుఁ బట్టులన్ నిలిచి చల్లని పయ్యరకూరడిల్లుచున్.

ఎఱలకుఁబోయి నీడములకేఁగెడు పక్షులతోఁ బ్రదోషపుం
దరుణమునందు మందగమనంబునఁ బర్ణగృహంబుఁ జేరి య
త్తరుణియుఁ బ్రేయసుండు మునుదామటనొందిన కష్టపుంబరం
పరఁ దలపోయుచుండఁ దెలవాఱెను దిక్కులలక్షితంబుగన్.

తరణి యుదయింప లేఁజిగి
నిరువురు విహరించుచుండ, నిట్లనియెను సం
బరముగఁ గన్నియ, ప్రియుఁడా,
పరమరహస్యంబ దేదో పలుకమనాతోన్.

నావుడు కాంతుఁడిట్లను, మనంబు తిరంబొనరింపు ముగ్ధ కా
రావిలమైన రాత్రి నమృతాంశుని వెన్నెల నవ్వ్యరీతి నీ
జీవితమున్ మనోజ్ఞముగఁ జేయు నుదంత మొకండు దెల్పెదన్
భావి శుభానుభూతులకుఁ బాత్రమనై దయివాఱు నట్లుగన్

ధరణీఖండము నేలు రాజునకు మోదంబార జన్మించి బం
గరు టుయ్యాలల నూఁగియున్ విధితిరస్కారంబునం గొండలన్.
గోఱెలన్ మేపుచు లోకవృత్తముల శాగుల్ గాంచ కేముగ్ధవై
తరుణీ, యుంటివిగాని నీకుచితమే దాస్యంబు దారిద్ర్యమున్.

పరభూమీశునకుఁ నిజ
ధరణీ భాగంబునోడి దారుణ శోక
స్ఫురితాత్ముండయి నీకై
పురమునువిడి వననివాసమునుగొనెఁ బితయుఁ.

అనవిని తత్క్షణంబు మదియందు హఠాజ్జనితంబులైన భావనలు పరస్పరాహతుల భ్రాంతములౌచుఁగలంగ లోకమవ్వనిత కగోచరాశయ నిభంబు దురూహ్యమునై గనంబడం దన హృదయేశుఁగాంచిచిఱునవ్వు మొగంబునలంకరింపగఁ.

ననునచ్చో గొనిపోవనెంచి కడువిన్నాణంపుఁ బన్నాగముం గనుగొంటే, గిరులేడరాజ్యములు బంగారంపు టుయ్యాల లేడ, నిరాలంబమునీదు వాక్యమనుచుండం గన్యయక్కాంతుఁడిట్లనియెం జేరెదఁ జేయి వెట్టికొని సత్యాలాపధుర్యంబుగఁ.

నన్నుఁ గపటాత్మునిగా మది నెన్నకొంటె!
ప్రత్యయం బిప్పుడే నీకు బయలుపఱిచెద;
నాన్న దాచిన క్షాత్ర చిహ్నములుకొన్ని
వసుధ గర్భంబునం దుప్పు పట్టుముగుద.

అని కుటి కుడ్యపార్శ్వ నిచితావని, నెచ్చెలిచూచుచుండఁ ద్ర
వ్వీన శరచాప వర్మములు వెల్వడ నబ్బురమంది బాపురే!
జనకుఁడు గూఢచిత్తుఁడయి సంతతముఞ్ వెతవోవుఁగాని యి
ట్లని వచియింపఁ డెద్దియును హా! తెలిసెం బితదుఃఖ హేతువుల్

అనుచుగవచమ్ము శీర్షణ్య మస్త్రములను
బ్రీతిఁగైకొని బాష్పముల్ విడిచితడిపెఁ;
దంష్ట్రిఁగాంచిన యట్టులాతన్వి హృదయ
మందుఁ బ్రేమానుబంధంబు క్రందుకొనఁగ.

అతివ వచ్చెదవే యిప్పుడైన నీవు
జనకపాలితమైన దేశమునుగాంచ;
హర్మ్యములు మీవి చంద్రోపలాంచితములు
పౌరు నేఁటికి శిల్పనై పుణ్య మెసఁగ.

అనవుడు మాత నేచ్ఛ మదియందుఁ జెలంగిన, స్వీయసౌధముల్
గనఁగుతుకమ్మునఞ్ సకియ కాంతునితో నిటువల్కుఁజిత్తమో
హాన, గొనిపోయెదే యటకు నమ్మవసించిన యాంధ్ర దేశముల్
గనుఁగొనదుర్దమంబయిన కాంక్షజనించె; నపూర్వమిద్దియుఞ్

అనవిని ప్రేయసుండు అవునా, చను దెంతువె, నిశ్చయంబె, మీ
జనకుఁడు మున్ను నేలిన విశాలధరావలయంబు నేన పా
లన మొనరింతు, నీవును విలాస యుతంబుగ రాజ్యభోగ వ
ర్ధన గృహిణీపదంబుఁ బ్రమదా, ముదమార నొసంకరింపుమీ.

కాంతా మూకీభావమె
కాంతుఁడు సమ్మతిగ నెంచెఁ; గాంతారగిరి
ప్రాంతంబులు విడి యిరువురు
చింతాశల్యంబుఁ బాసి చేరిరి పురికిన్.

—: సంపూర్ణం :—



# జలదాంగన

(పద్య కావ్యము)

కవికోకిల

కవికోకిల గ్రంధమాల

పెమ్మారెడ్డిపాళెం — ఎల్లాయపాళెం (P. o)

నెల్లూరు జిల్లా



# జలదాంగన

నీఱుపునీరునఁ బండి రాణించుచున్న
పైరుపొలముల విహరించు పాటలక్ష్మి
యెఱపుఁబయ్యెద బంగారు మెఱుపులనెడు
సంజసిగ్గుల వరిమళ్ళ చాయలొలికె!

పొలముల కాలమేఁపుటకుఁ బ్రొద్దున నేఁగిన కాఁపుబిడ్డలా వుల పదధూళిసోఁక నెడవోయెడు దూడ లదల్చికొంచు, నింపులు చికిలించు వేణురవము ల్పలికించుచు, గూళ్ళఁజేరు పక్షులకును మున్నె యూరిదెసకు న్మరలించిరి యాలమందలన్.

గగనసీమంతినీ కంఠ గళితమైన
మల్లెపూదండ తేకులు దుల్లెననఁగఁ
బైనఁ జరియించు కొంగల బారు లెంతొ
యలరుచుండెను దర్శనీయంబులగుచు.

ప్రకృతి యెల్లను శాంతమై పరఁగుచుండ
శాలి కేదారములలోనఁ జల్లగాలి
నల్ల నల్లన విహరింప నుల్లమందు
నంతులేని యానందంబు నందుచుంటి.

కనుఁగొనుచుండఁగా జలదకాంతల కుచ్చెలకోక చెంగులం
దనరు జపాసుమార్ద్రరుచి దగ్గెను; దిక్కుల నుప్పతిల్లె నం
తనె యిరు; లక్కడక్కడను దారకలుం గనుపట్టె; మిక్కుమం
చనయము మిణ్గురుంబురువు లాడుచునుండెను జేలగుల్లలన్

గగన రత్నాకరంబు నాగ్రహమునొంది
కాలమనెడు నగస్త్యర్షి, కమలబాంధ
వాంశునీరమ్ము గ్రోలిన నచటఁ దోఁచు
రత్నములనంగ నక్షత్రరాజి మెఱయు.

అంత సుధాంశుబింబము వియత్తలమం దుదయించె, నా రతీ
కాంతుఁడు యామినీరమను గాంచుటకుం జను వేళ మల్లెపూ
బంతి శతాంగముం జలదచాటుఁ జకోరపు వారువాలచే
వింతగఁ బూంచెనా మొయిలుపిండిహిమంబుగ రేఁగునట్లుగన్.

గగన స్రవంతికా కల్లోలడిండీర
ఖండంబు లభ్రమ్ము గప్పెననఁగ;
నందన కల్పద్రు సందోహములు పూచి
యెల్లెడఁ బుప్పొడి చల్లెననఁగ;
ప్రాగద్రి శిఖర ఘర్షణమునం దొలివడి
యుడుభర్త యమృతంబు నొలికెననఁగ;
దిఙ్మత్త కరిదంత దీప్తులాకాశ ద
ర్పణమున బింబించి వఱలెననఁగ;

శర్వరీ మందిరాంతర స్తంభములైన
హీరమణి దీపముల కాంతి సారమనఁగ,
మెత్తఁదనమును శైత్యమ్ము మిళితమైన
పండువెన్నెల నల్గడ నిండుకొనియె!

వెన్నెలఁజూడ నందమగు వేసముదాలిచి కొండనెత్తమం
దున్న పయోదమొండు పవనోపహతిన్ మెలమెల్లనూగుచున్
సన్నని యంబరంబటులఁ జందురుఁగప్పుచు వీఁగిపోవు చె
న్నన్నొ మనోహరాకృతుల నెత్తుచుఁ గన్నులఁగట్టె వింతగన్.

చూడనుజూడ నందమగు సుందరి రూపుధరించి, వేణి రా
పాడు జరీముసుంగు హరిణాంకు కళన్మ్రిసలాడఁ గాంతునిం
గూడి నభో విహారవన కుంజతలంబుల సంచరించు పె
న్వేడుక రోహిణీ రమణి వే యరుదెంచెననంగఁదోఁచినన్;

జలదకాంతను గాంచి యాశ్చర్యమొంది
కన్నువాల్పక నందమ్ము గనుచునుండఁ
గవి కుమారుఁడ నొంటఁ దక్షణమె నేను
భావమున నబ్బ సారూప్యపదవిఁ బొంది

చెలియ! యథేష్టరూపములఁ జిత్రగతిం జరియించె దీవు; నీ
చెలువముగాంచ మోడయినచిత్తముగూడఁ జిగిర్చు; నేలోకో
వలిపపు మేల్ముసుంగునిడి వచ్చితివొంటిగ, వాసమొద్ది, యెం
దుల విహరింపఁబోయెదవు, తుందుడుకొందకనిల్చి తెల్పుమా!

నిన్నుఁగనుఁగొన్నదాదిగ నీదు చరితఁ
దెలిసి కొనఁ గౌతుకంబు చిప్పిలెడి నబల,
యెవరిదానవో? తలిదండ్రు లెవరొగాని
ఘనుల సంతతిగా నీవుగానఁబడెదు!

అనవిని కాంత యిట్లనియె నంత, మదీయచరిత్ర మంతయుక్
వినుచు విషాదమోదముల విచ్చినచిత్తముతోడ దైవసృ
ష్టిని దలపోసి యబ్బురముఁజెంద నభీప్సితమేని నాకథక్
వినుము కవీశ్వరా, ప్రణయవిస్మయముల్ తలపుక్ హరింపగక్.

నీవె ఱుంగని వింతలు, నీమనంబు
చొచ్చు శక్యంబుగాని దెచ్చోటఁగలదు?
ఐన నానోటఁజెప్పింప నాసయేని
వినుము పుట్టుపూర్వోత్తరంబును కవీశ!

జలజభవుండు, సూర్యుఁడు నిశాకరుఁ డుర్వియు, దారకల్దిశల్
కలగిరు, లవ్వియివ్వి యనుకోఁబనియేల? సమస్తముక్
సలుపకమున్న నాదు సరసంబగు పూర్వపు రూపొనర్చె న
న్నలవము నాత్మసంస్తుతి యనంజనరెమ్మెయిఁ దత్వదర్శనుల్!

జంట నినుంగులట్లు, నను సంతమునమ్మనుగాంచి మాయవా
ల్గంటి యదృశ్యగాఁగఁ గడగండ్లనుసైపుచుఁ దల్లిలేని మా
చంటి తనమ్మపుచ్చు, నిమిషమ్మను వీడనిమమ్ముఁబాప మా
యింటనుగా నిగోళములు హెచ్చెను లెక్కకు మిక్కుటంబుగక్.

అనుజను గోలుపోయి మదియుం దెడవోని వినియోగ వేదనల్
వసరుచునుండఁ బృథ్వియను బాలయొకర్తుక చేరవచ్చి న
న్ననునయ వాక్యముల్పలికి, యార్తియొకింత శమింపఁ జేసినా
మనమున కెక్కుడాస్యమున మాగృహమందె వసించియుండినన్;

కాలుఁ డనియెడు సుందరాకారుఁడొకఁడు
మమ్ము నిరువుర నీక్షించి మానసంబు
ప్రణయముగ్ధంబుగా వచ్చి వలపుదెలిపి
పరిణయంబాడె సౌఖ్యసంపదలు పొదల.

కొన్నిదినాలు మువ్వురముఁగోరికలీరికలెత్త సౌఖ్య సం
పన్నతఁ గాఁపురంబు సలుపన్ ఫలియించెను నాదుగర్భ; మా
పన్నతనొంది పృథ్వి మదిఁ బాటిలునీసున నాసుఖంబు సైఁ
పన్ననరింతలేక చలపట్టి గృహంబుఁన బోరువెట్టుచున్;

ఆక్రమించెను నావాసమందుఁ గొంత
స్థలము; 'నదియేమె' యన్న, 'నీసవతిఁగాన
హక్కు లేదఁటె? నాకింట' ననియెఁ బృథివి,
చేరదీసిన ఫలితంబు సిద్ధమయ్యె!

ఇది పతిచనవని గనుఁగొని
తుద కేమియుఁ జేయలేక దుఃఖముపాలై
కుదురెటుఁగక తొందరపడ
నొదవెను నీఫలమటంచు నూరకయుంటిన్

అంతటఁ గొన్నేండ్లకు నా
కాంతకు సంతానవృద్ధి గలిగెను, నైసం
బంతంబు విడదు నాసయి
నంతింతకులేని తగవులాడుచు నుండున్

సవతులకు గిల్లు జగడాలు సహాజమైన
బిడ్డలైనను నొండొరు ప్రీతిమెయిస
నొఱపు పొరపొచ్చములు లేక యుందురన్న
నదియు నొనఁగూడదాయె నీర్ష్యాళులగుట

అసురులకు న్నిలింపులకు నయ్యెడు తియ్యని పోరులట్ల వె
క్కసముగ మాయపత్యములు కయ్యములాడుచునుండఁబ్రుద్ధి
యుం గసిగొనిమందె మేలమునఁగాంతుని చిత్తము మ్రుచ్చిలించి
యుం పెసంగెడు బుద్ధి నాత్మజులకీ నొనరించె రహస్యరీతిగన్

పైతృకంబగు "బుద్ధి" సంపదనుబడసి
విఱ్ఱవీగుచు మమ్ముల వెతలుగుడుప
నెన్నొ సాధనములఁబన్ని యెట్టయెడకు
నాదు సంతతిఁబట్టి తినంగనైరి.

అంతంబోక మదీయగర్భమున గోప్యంబౌనటుల్ చేర్చినే [ముల్
నెంతో మక్కువ దాచియున్నమణులున్ హీరంబులున్ ముత్య
కాంతింజిల్కు ప్రవాళవల్లులు బలాత్కారంబుగా నాచికో
శాంతింజెందునె నామనంబెటులనో సైరించుకోఁ బోయినన్?

తనరె బలంబటంచు విధిధర్మ మధర్మ మనాక కార్యముల్
పొనరుచు పృథ్విగంతతుల పోతరముంగని, యింతగర్వముం
డినఁగొనసాఁగుచే కడకు డెప్పర మౌనని యెంచికొందు; నం
తనె శివమేల? యెప్పుడయినం దుదినాకవె దుష్టకల్పనల్?

తమకు బలంబు శౌర్యమును ధైర్యమునిచ్చి సమస్తసౌఖ్యముల్
క్రమముగఁగూర్చి వైరినికరంబు పదానతమౌ సమీకమా
ర్గము గనిపించుబుద్ధి ముదర ప్వాషమించి నిజాశ్రయంబుగూ
ల్ప మొదలువెట్టుఁ; బరిపాటికి మించిన నిక్లైయాఁ గదా!

ప్రకృతిశాస్త్రంబు విద్యయు భవ్యకళలు
గావసంపూర్ణతకుఁ దోడుపడుటమాని
ప్రజల నాశనమందె పర్యాప్తమగుట
దాపురంబయ్యెఁ బుడమికిఁ బాపఫలము

నావలుచేసి, నావ్యాదయ నాళములెల్లను జుంజురౌనటుల్
త్రోవలుదీసి, యాత్మకడఁదోసి, శరీరసుఖంబెగోరి యా
హ్వావిలచిత్తులై తుదకు నందఱు భోగము కారణంబుగం
గావలమెత్తిపోరిరి వకావకలై తమతల్లి బెగ్గిలన్.

గారవించిన నాగరికంబు కడకు
ధూమ ఫూత్కారములలోనఁ దూలిపోయె
మనుజసంతాన మాహావ మత్సరమునఁ
గంతదళనా వినోదంబు గడపు నహాహా!

నన్నుఁ బెట్టిన కష్టంబులన్ని సవతి
పొందుచున్నది పుత్రిల మూలమునను;
కన్నబిడ్డల నెత్తురు కాల్వలందు
నీఁదుచున్నది పృథ్వి సహించి యెటులొ!

కోరుచుండిన తరుణంబు గూడికొంట
సవతి పుత్త్రుల రక్తంబు చవులుపుట్టఁ
దనివి దీఱఁగ నేను సంతానములును
ద్రావినారము క్షీరపూరంబు లటుల!

మాటకుమాటవచ్చి చనుమానముతో నిటులంటేఁగాని. నా కేటికి మున్నమున్న శమియించిన గాథలు ద్రవ్వికోఁగ; నా పాటికి నంతరాళమునఁ బత్త్యాఽనం బొనరించి పిన్నబిడ్డాటల సాడికొందుఁ బవనార్భకుఁడర్మిలినన్నుఁగూడఁగన్;

అసవిని పల్కితి: జలదాం
గన, యిట్టిసురూపమెటుల ఘటితంబయ్యెన్?
మునువున్న వనధిరూపం
బును నెట్టుల మార్చితివి అపూర్వప్రరీతిన్!

తెలుపుమటన్న, నౌనవును, దెల్పుటకు న్విషయాంతరంబు వ
ర్తిలుటయు నెట్టులోమఱచితిన్, వినిపింతును శేష;మిద్ధరన్
గలుములులేము నెప్పుడు వికారము లొందక యేకరీతి ని
శ్చలముగ నుండఁబోవనెపు సామెత సీ కెఱుఁగంగ రాని దే?

కొన్ని దినములు చీఁకటి కొన్ని నాళ్ళు
వెన్నెలనియెడు లోకోక్తి విదితమయ్యె,
నాకు మనసీక వర్తించు నాహృదీశుఁ
డెలమి వశవర్తియయి నన్నె వలచియుండు;

ఒకనాఁడిద్దఱ మిష్టగోష్ఠిఁ బ్రిణయం బుప్పొంగి లోకంబుదోఁ
పక సౌఖ్యంబులఁ దేలియాడి కడకుం భావంబు శాంతింప, నా
యకలంకంబగు పారవశ్యమును నెయ్యం బారవర్ణించి మా
మక సౌందర్యరసాబ్ధి నీఁదుచు వచోమాధుర్య మేపారఁగన్;

కాంతుఁడు ముద్దుచెక్కిళులు కమ్మనివవ్వ ముసుంగులోన నం
తింతనరాని నొారు రచియింపఁగ నింపగురీతిఁ బల్కె 'నో
కాంత' క్షమింపు మున్ను నినుఁగన్నులఁ గప్పికొనంగ లేక య
త్యంత ముపేక్షతో మనముడాఁచిన నావిరసంపుఁజెదముల్!

'వడలె గ్రహచార వేళయుఁ' బృథివియన్న
నీవ యన్నను వేఱేమి నీరజాక్షి.
మునుపు సలిపిన యపరాధములను మఱచి
నన్ను నీదాసునిగ నేలు మన్న వినవె?

'కలదు రహస్యమొండు; కినుక న్వహింయింపకు మోసమంచు నేఁ
జెఱుపక యూరకొంటిఁ బొలఁతీ! గతమెప్పటికిన్ గతంబె; యం
దులకు విచారమేల? ననుదుష్టుఁడ నంచు దిరస్కరించి నం
జెలిమి నెఱింగి దగ్గరకుఁ జేర్చిన నియ్యవె పాపపుణ్యముల్ ?'

అని మగవారికిం దెలుప నల్కుజనించెడు నెన్నొ తియ్యముల్
మనము గరంగఁబల్కి నను మన్ననవేడి, యనంతరంబు జం.
కును గపటప్రిచారమునకు న్వొడనవ్వను సిగ్గుదోఁప ని
ట్లనియెఁ బ్రియుండు నాతలఁపులాకుల పాటున సంచలింపగన్:

వనితా! యేమని చెప్పువాఁడఁ? బ్రియవ్యామోహచిత్తుండనై
నిను గాలుండను పేరఁ జేరితిని, నే నీ రేజబంధుండఁ: బ
చ్చని గుఱ్ఱంబుల తేరిపై గగనసంచారంబు గావించుచుం
దును; నారూపమెఱుఁగఁగోరికయునం దోడ్తోన వీక్షింపుమీ;.

అని వచియించి, కాంచనశతాంగము హీరకిరీటమొప్ప మో
హన నవకాంతులీనెడు సహస్రకరంబులతోడ వెల్గుచున్
గనులకు వెక్కసంబగుచుఁ గానఁబడం, దలయెత్తిచూడలే
క నిలిచియుంటి నూరక వికారము నొందని జాతిబొమ్మగన్.

అంత నిజస్వరూపము దయామయుఁడై కుదియించి, సూర్యుడుం 'గాంత' ప్రభాతకాలమునఁ గాంచనచేలము దాల్చి నామనం బొంగయు మురిప్పిలించితివి. యింక నినుస్వీడనాడఁజాల, నా చెంత నె సర్వసౌఖ్యములు చేకుఱఁ గాఁపురముండుమిా' యనన్.

కలలోఁదోఁచెడు వింతమార్పులటులం గాలంబునందోఁచె, నీ జలజాతాప్తుని బ్రిత్యహంబుఁ గనుదున్ సంతోషమేపార, నీ చెలువంబుం గమనీయమూర్తియును నే సేవింపలేదింత, కొ చ్చెల! నాభాగ్యము పండెఁగావలయు నీచిత్రింబు సంధిల్లుటన్

ఒక్కనిమిషంబులోన నాయుల్లమపుడు
పూలతేఁకుల తెక్కలంబూని యెగిరె
స్వర్గపవనంబు వీచు నావరణమునకు,
నౌర! రూపాంతరం బెత్తినట్టు లయ్యె.

అభ్రసంచారియౌ మోహనాభ్యుఁడేడ?
క్రింద ఘోషించు నేనేడ? క్రీడయేడ?
అందరాని ఫలంబుల కాసచేయు
నట్లు ప్రణయ పర్యవసాన మానొ యేమొ!

అని తలపోసికొంత, ప్రణయంబు ముదంబు విషాదముఁ మనం
బునఁ బెనఁగొన్నలోనఁగఁబుచ్చినహృదీశునిగాంచి కాంత యి
ట్లనియె, మనోహరా, గగనమందుఁ జరించెదుమీరు, నాకు నె
ట్లనువగుఁ గాఁపురంబు. మునుపట్టులెవృత్తము భావికాలముఁ

అయిన సనుకొందు, మీదుపాదాంబుజముల
రజములకు నైన సరిపోఁ దరంబె నాకు?
అట్టి నన్నును వలచి రూపాంతరంబుఁ
బూను టెంతయు నాపూర్వ పుణ్యమేమొ!

అనవిని సూర్యుండిట్లనె
మనమున నెల్లింతో నీవుమానిని, నీ రూ
పును గాంచ దివ్యసుందర
తనువటు గన్పట్టునాకుఁ, దథ్యంబిదియుఁ.

శీకరమౌక్తికంబుల రచించిన కంకణపాళి మోవ నీ
చీకరముల్ మనోహరపుఁ జిట్టకముల్ పచరింపఁ జూఁపి సం
ధ్యాకమనీయవేళల ముదంబున నం గవుఁగింటఁ జేర్చు నీ
నాకతము న్మదిందలఁప స్వర్గసుఖమ్ము నధఃకరింపదే?

అవని సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తఁ
జేసెదను రమ్ము, నాతోడఁ జెలువమీర.
లోక మెల్లను నీయాజ్ఞ లొంగియుండ
నేలెదవుగాక సస్యవిశాలధాత్రి!

అని కరముల్ సహస్రమును నల్లనఁ జాఁచి ప్రమోదబాష్పబిందునికరముల్ దొరఁగ నవతోయజమిత్రుఁడు గాఁగిలింప, నేనును వచియింతు బాష్పమయునై యుపగూహనమునందె లీనమైతిని, తదనంతరంబు నను దేఁకువఁ జేర్చె నభోంతరాళమునఁ.

వలిగాలిం దనుతాపముం దొఱఁగి దివ్యంబైన యీరూప ముజ్జ్వల శంపాభరణంబులుం గలుగ నే సంతోషముం బొంది నిచ్చలు వాతార్భకతోడ నీతలములన్ సంచారముం జేయుచున్ మలనత్తంబులఁ దీవటోవరుల లోనం జేరి క్రీడించుదున్

సాంధ్యవేళల పడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుకోటి
యందు నీరాడి, పెన్నెఱు లార్చుకొనుచు
వచ్చుచుందును గవుల భావాబ్ధు లలర!

పండువెన్నెల లలరు శర్వరుల యందు
వలిపపు ముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పుఱుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతరసముఁ బూరించుచు నెయ్యంబు గదుర.

ప్రొద్దువొడుపున విరియు క్రొంబువ్వులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలగట్టి
వైచుచుందును నానందవర్ధనముగ.

అభ్రగంగాప్రవాహంబు నవల దాఁట
గమ్రమణుల సురేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోదు
జలక మాడిన తెరవంటి చెలులతోడ.

కనులకు నిచ్చ క్రొత్తలయి గానఁగవచ్చెడు వింతలెల్ల నేఁ
గనుచు నభోంతరాళమునఁ గాంతునితోడ వసించియుంటి నం
తన మఱికొన్నినాళ్ళకు నతర్కితరీతి నెఱుంగవయ్యె నా
యునికి పిశాళిమోసు, మిఁక నెంతయొనర్పఁగ నాగవింపఁడో!

ప్రొద్దున శయ్య వీడి చెలి, పోయెదనంచు వచించి యేఁగుచో
నెద్దియొ సందియంబు మది హెచ్చ రహస్యపురీతి వెన్నడిన్
నన్గొనరింప కేగఁగ, జల్లఁగఁబోయెను సంగమెల్ల, నిం
కెద్ది వచింతుఁబో కలుగనే కలిగెన్ నవతమ్మ నాకనున్!

నను నటు నమ్మఁబల్కి గగనంబులకుం గొనితెచ్చె, పూర్వపుం
దనుక దాఁచంగఁజేసె; మమత న్ననుశాయని పిన్నపాపలన్
నన రొంయుంత లేక విడనే విడివచ్చితి; నింతకున్ ఫలం
బనఁగ నరోజినీనళిని నర్మిలిఁ బెండిలియయ్యెఁ గమ్మలన్!

అలరులబంతి యమ ట! తనువందిన కమ్మని మోహమంట! సొం
పొలుకు మిటారియంట! తనయుల్లమునం గలకోర్కె పంటయం
ట! లలితచిత్రయానఁట గనంగన ముద్దులమూటయంట! యీ
పలుకులఁ గాంతుఁజే నవశిఁబల్కిన, నేవిధి యెట్టులోర్వఁగన్?

కొదమ పిసాళి తుమ్మెదల గుంపులు ఝుమ్మని పాటపాడ వా
యుదళిత చంచలోర్మికల యుయ్యెలనూఁగుచు జిల్గుమంచు ప
య్యెదనర వేఁచముదోఁపఁగపయిన్మనుగట్టులనైచి పద్మినీసుదతి
పరిమోదమున్ గొలుప. సూర్యుఁడు నావలిపమ్మిదీయుచున్

అలరులమిన్న, రమ్మని సహస్రకరంబులఁ గౌఁగలింప నా
జలజ లతాంగి యంగమున సన్ననిపుల్కలు నాఁటవోసిన
ట్లలరఁగ, నింతమోము నిఁకనంతగ విచ్చి యొయారపుం దెఱం
గులఁ బతిచిత్తముం బడయు, గోడడకిఁ పదె నన్ను మిత్రమా!

కామినికి బాణితుల్యుఁడౌ కాంతుఁ డెవతొ
యొకతె వలపింప ముగ్ధుఁడై యుల్లమిచ్చి
మొదటి కాంత నొప్పరికించి పోవునతఁడు
గాంతుఁ గోయలేఁడే తడిగుడ్డఁ జుట్టి?

ఖరకరుండఁట! లోకంబుగాల్చునంట!
అట్టివానికిఁ జిత్తమింకెట్టు కోమ
లంబుగా నుండు? మోహవిలాస ముగ్ధ
సౌటఁ గపటంబుఁ దెలిసికోనైతివకట!.

నన్నొక భోగకామిని యనం దలపోసి, యభీష్టసిద్ధి యగా
ట స్నను వీడనాడి కలట జ్జలజాంగనఁ గూడెనేమొ! యీ
తెన్ను నెఱుంగకుంటఁ గడతేఱఁగరాని సపత్నిమత్సరం
బెన్నుచు వంతలం గుడుచు చెట్టులో కాలముపుచ్చ నేర్పడెఁ.

ఇది యిటులుండఁగానె మఱి యింకొకవార్త వినంగనయ్యె, న
య్యది వినఁబుంట నుప్పిడిసయట్టుఁల, గాల్చినసూది వీనులం
దదిమినరీతి నయ్యె నవురా! తరుణార్కుని దుండగంబు, దా
నిదివఱ కొక్క ఛాయయను నింతిని నిల్చె రయొనర్చెనంటకా!

అంతకంతకుఁ బఱి యకృత్యములు హెచ్చఁ
జల్లనైచిన పాలునా జవికి మనము
విఱుగ, నాత్మహత్యయుఁ గొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేఁగఁ బ్రయాణమైతి.

అంచలబారు మానస సరోంబు విహారము గోరి పోవుచోఁ
గాంచి తటస్థమయ్యె విధికల్పన నర్హ్మాపుదారితో డటం
చెంచి, యులంత లేక పథ మేడ్తె అనాగ వచించు గాథ లూ
కొంచున మంచుకొండ యెడకుం జనఁగల్గితి నాసపెంపునన్.

అరరే! యేమని దెల్పుదాన సుకవీ. యాకొండయండంబు! ని
బ్బరమై మంచొలికించు తెమ్మెరలు వీవన్ దిక్కు లివ్వంచుఁజూ
పులు లెన్నంగ నశక్యమౌట, నచటం బల్లంబులు న్మిట్టలుం
దరులుం గాల్వలులోయులంచుఁ దెలియనాప్రికుండఁ జూపట్టెడిన్

అంబుధరగర్భములు చీల్చు చాకసమున
హిమధరాధర శృంగంబు లెదిగి యెదిగి
కన్నులకు నందు మేరలకన్న దాఁటి
తారకామండలంబును దాఁకుచుండు.

తరువులెల్లఁ దుషారంబు దవిలిగడ్డ
గట్ట, నద్దంపుఁదునకల కళలు దేలి
మంచు మునుఁగులఁ బచ్చ రాణించుచున్న
చివురుటాకు జొంపంబులఁ జెలువుగొలుపు;

శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుఁగుచున్న సమర్షకీలలు శమించెఁ;
జుట్టుపట్టుల నడయాడి చూతమంచుఁ
దరలితిని మంచుగడ్డ నెత్తమ్ములకును.

అనవిని నేను బల్కితిని. 'యంగన' నీదగు భాగ్య మేమి సె
ప్పను! గనుఁగొంటివే కనులుపండువుగా హిమవద్ధరాధరం
బునఁగల వింతలన్నియుఁ? బ్రమోదము పుట్టెడి నీవుదెల్పఁగా
విని, యిఁకజూచినం గలుగు వేడ్కలకుం బొలిమేరలున్న వే?

'ఏనును నీప్రకారముఁగ నెక్కడికైనను నేఁగు రూపముం
బూన వలంతినైన హిమభూధరశృంగము లెక్కియాడమో
దానఁ జిపృక్కమం చెగిరి దాఁటనె! యంతటి నోము నోచు లే
దో నటులక్కటా! గఱులతో నొకపుల్గనైనబుట్టనే?

అనవిని యంబుదాంగనయు, నౌనవు! నాగిరి యంద మాడకీ
వును జని చూడకున్న ననుబోఁటి వచించిన యంతమాత్రఁ దీ
ఱునె తమి, పుట్టతేనియలు గ్రోలినవాఁడు రుచిన్వచింపఁ దీ
వును నెఱుఁగందరంబె యొకబొట్టయినం జవిచూడకుండినన్?

అవుఁగాని యటుమీఁద, నాకొండ మంచుగ
డ్డలువీలఁ బగుళుల నొలుకుచున్న
సెలయేళ్ళ వెండికమ్ముల లీలఁ జాల్కొన
నటకేఁగి చలినీళ్ళ యందు దోఁగి
బలువైన మంచుతుప్పలు గాలిఁ దూలిన
నోరగా నటునిటు నోసరిలుచుఁ,
గన్నులుగట్టియుం గట్టక మాయమా
కలయట్లు నెల్లెడఁ గలయఁదిరిగి,

విష్ణుపాదాబ్జమునఁబుట్టి విన్నువాఁక
వెడలు గుహ కడ నొకకొంత వేచిచూచి
శంకరుని మొద్దుగిట్టల జాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబు దరికి

ఎడకాల మంజీర మింపుగా రవళింప
గుడికాల బిరుదందె గులుకుచుండ,
వలకేలఁ గంకణమ్ములు ఘల్లుమనిమ్రోయఁ
గుడికేలఁ జాప పెందోడవు లలర,
వలరొమ్ముపయ్యెద వలపుగుబ్బలి నిక్కఁ
గుడిరొమ్ము బూది నిగ్గులఁ జెలంగ,
ఎడమకొప్పెద నాపులీను గేదఁగిపూవఁ
గుడితల నెలపువ్వు గొమరునూప,

డక్కచేనూని, మేనులు సొక్కసోలఁ
బ్రమథగణములు నాడుచుఁ బాడుచుండఁ
బ్రకృతి యాత్మయు మిళితమాపగిదిఁ దాండ
వించు నర్ధనారీశ్వరు వేడ్కఁగంటి!

అక్కడనుండి, దేవతల యక్క అదీర్పఁగ మన్మథుండు దా
నెక్కటి పూవువిల్లు గొని యిందుకళాధరు నోఁపవచ్చినం
గక్కసమెత్తి నెమ్మదిటి కంటిసెకం గరఁగించినట్టి యా
పరిక్కకుఁబోయి చూడనటఁ బట్టదు పచ్చని పూరిమేనియున్

బదరికాశ్రమ వాసులౌ పరమమునుల
యజ్ఞవాటులు నేఁటికి నలరుచుండు,
నెండ కెండి వానకు నాని యిప్పటికిని
నమరు నచ్చోట యూపకాండముల గములు.

అటనుండి విధి వశమ్మునఁ
దటరుహా వల్లీ నికుంజ తతుల మనం బు
త్కట మోదంబునఁ దేల్చెడు
మటుమాయల కొలనుగాంచి మంజులమనుచున్;

విమలజలములఁ గ్రుంకిడ వేడ్కగలుగ
మునిఁగితినో లేదో యంతలోఁ దనువునందుఁ
బలుక శక్యంబుగాని పెంజలియు వణఁకు
గదిరి యటునిటుఁ గదలు లాఘవము దొలఁగ;

అక్కటా! మోసమంచు శోకార్త నగుచు
దిక్కు దెస లేనిదాననై సొక్కుచుండి
ప్రాణమేఁగిన మెయి కట్టెవాలు నటుల
మంచుటాయిగ సంతలో మారిపోతి!

అప్పటి నాయుదంత మిసుమైన నెఱుంగను; లేచి చూచుకో
న్నప్పుడు లేఁతనవ్వు లొలయఁగ జలజాప్తుఁడు జేరవచ్చి న
న్నొప్పరికించినట్టి కొల యూరడగం బరిచర్య సల్పినం
దప్పుడుమించమం చదుగఁ దగ్గఱ నిల్చియె యుండె దీనుఁడై.

ఆతని నవ్వుఁగాంచి హృదయంబునఁ బట్టఁగరాని రోషము
త్పాతతరీతి గుబ్బటిల నాస్యముఁ జూడఁగనైన రోసి నా
నూతనమైనరూపము గనుంగొని నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగ లీనమైతి; నిదిమేలె యగుంగద నన్నుబోఁటికిన్!

పగ దలపక, నాకష్టపాటు గాంచి
సవతి యైనను పృథ్వీనాసరసఁ జేరి
యార్తి యొకకొంత శమియింప ననునయించి
కన్నుఁ దనయుంట నిలిపెను గొన్నినాళ్ళ!

అచ్చటఁ బచ్చతా మొలక లట్టుల నింపగు పైరుచేల యం
దిచ్చకు వచ్చినట్లు చరియించి, యనంతర మూటకాల్వలం
జొచ్చి, కొలంకులం గలువజోటులు పుష్పాదికాన్కలీయఁగన్
హెచ్చిన సంతసంబున గ్రహించి నిజాలయ మేఁగుకోరికన్;

బలిసి, కూలంకషంబుగఁ బాఱునదులఁ
గలసి, స్వస్థాన మేఁగితిఁ గాంక్షదీఱ;
దేనికై మూఁగు నీఁగల తెండెమటులఁ
బిల్ల లెల్లరు నను గూడి ప్రియమునిడిరి.

కాంతు నుపేక్షచే నయిన కష్టము బిడ్డల ముద్దుముచ్చటం
గొంత శమింపఁజేయు చటు కొన్ని దినంబులు పుచ్చనొక్కనాఁ
డెంతొ మనోహరాకృతి వహించి సరోజహితుండు రాఁగ నా
స్వాంతమిఁ కేమి సెప్పు? రెపలాడెను బూర్వము విస్మృతంబుగాన్

ఎట్టులొ తెచ్చికొన్న బిగియింపౌక యింతయు సళ్ళనీక లో
నట్టిటు వీఁగుచిత్తము రవంతయిన న్వాలిదోఁపనీక యీ
సుట్టిపడన్ మొగంబుపయి నుల్లముసూపిన, జంకిగొంకి నా
తట్టుకువచ్చి యేమన కతర్కితరీతిగఁ గౌఁగిలించినన్;

ఏమిది? యన్నయంత తడవేమియు లేదుపగూహనంబునన్
గోమటి బాష్పరూపనయి కూడనయేఁగి నభోంతరంబునన్
శ్యామల కోమలాంబుదము నై చరియించుచున్నదాన. నిం
కేమన నేమిలాభము? కవీశ్వర, యూరెను బోయె నింతకున్

ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచుఁ
గాఁపుర మగడు సేయుక గడపకున్న,
నింక నీమాసముల నెవ్వరెఱిఁగివత్తు
రంతకూలికి విషమాను కాంత యెవతె?

అని వచియించుచుండు నెడ నల్లనఁ జల్లనిగాలి వీవ నా
వనద లతాంగియున్ మసుఁగుపయ్యెద వే సవరించుకొంచు న
ప్పని కవిశేఖరా, నిను నకాండము వీడి చనంగఁ జిత్త మొ
ప్పని యటులుండియుం జను టవశ్యకమాటనుఁ జింతగల్గెడిన్

నవురు వెన్నెల కమ్మదనాన నూరి
యువని యెల్ల నానందమయంబు గాఁగ.
బండి యొరఁగిన మొలగొల్కు పైరుచేల
కడకు రమ్ము పరస్పరేక్షణము గలుగ;

అను చలవోకనేఁగు జలదాంగనఁ జూపులకందు మేరకుం
గనిగని, బాష్పపూరములు కన్నులఁ గాఱుచునుండ చిత్తమో
హన శశి రాంశుబింబము వియత్తలమందు రహించియుం దెస
ల్గనఁబడవోర! యాత్మవికలత్వము కన్నులఁ గప్పిపుచ్చుటన్

ఒలసెడు పిల్ల తెమ్మెరల యూర్పుల నీకలు మేన రేఁగఁగం
బులుఁగులు గూళులన్నిదురబోవుచు, నెండినయాకుజొంపముల్
గలగలలాడ మేలుకని గమ్ముఁగనార్చెడు నల్కుఁడొక్కఁడే
చెలఁగెడి తోడుగా గృహముఁజేరి శయించితి వేగుజామునన్.

చల్లవెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళ్లు, లంచబారు,
లిందు శేఖరతాండవ మేమొ యేమొ
కలను గాంచుచు నిదుర మేల్కాంటి నపుడె!

సంపూర్ణము.

# ప్రేమాంకము

అన్నా, మన్నెము శేషురెడ్డి, యెట్టులో
యావిర్భవంబొంది
స్నేహానన్యత్వంబు పరస్పరంబు రమణీ
యానేక భావంబులం
జెన్నారెఁ హృదయానుబంధరచనా
చిహ్నంబుగఁ, మాయుపా
ధ్యెన్నండుం దలచూపదిందనుక
దైవేచ్ఛా ప్రభావంబునఁ.

అట్టి నిర్మలమైత్రికి నానవాలు
నవ్య కవితాసుమంబుల దివ్యమాల
నెమ్మిఁ గీలించుచున్నాఁడ నీదుకీర్తి
కామినీ కంఠసీమను గాంతులొలయ.

ప్రియమిత్రుఁడు
దువ్వూరి రామిరెడ్డి.

# ఉపోద్ఘాతము.

ఆంధ్రవాఙ్మయమున ప్రకృతము ప్రసిద్ధికి వచ్చుచుండెడు గేయ్యములగు నూతనసృష్టులలో నీ కావ్య మొకటి. విషయమందును భావములందును ఇయ్యది మనదేశముయొక్క నవజీవితమునకుం జేరినది. అచ్చటచ్చట శైలియందును నారోపములు మొదలగు నలంకారముల యందును ప్రాచీనవాసన యింకను కొంత వదలవలసియున్నటుల తోచెడిని.

కవి కాఁపుయువకుఁడు; విషయము కాఁపులజీవితము, దృష్టి యభిమాన ప్రేరితము. కృషీవలుల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుఁగు గ్రంథములలో నిదియె మొదటిది. యీ విషయ నవ్యతను దలంచియ కాఁబోలు రామిరెడ్డిగారు యీ క్రిందివిధమున వితర్కించి యుండిరి:

అన్నా హాలిక! నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్నన్, నిష్ఠురసారవేగమున వాక్పూరంబు మాధుర్యసం
పన్నంబై ప్రవహించుఁగాని, యితరుల్ భగ్నాశులై యీర్ష్య తో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్ పల్కరే!

తాను పూర్వలాక్షణికుల కరిగాఁపుగాఁడనియు స్వచ్ఛంద విహార శీలుఁడనియు నీక్రింది పద్యములలో బాహాటముగ చాటించియున్నాఁడు.

వనలతయైన నాకవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణమయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధననియమానుసారముగఁ, దల్లత యెవ్వఁడుఁ దోఁటమాలి పా
ణినిఁ గనుగొని వన్యరమణీయతఁ జెల్కు నపూర్వపద్ధతిన్.

పంజరనిబద్ధ కీరంబు బయలుగాంచి
యడ్డుకమ్ముల దాఁటంగ నాసచేయు
నటు బహిర్నియమంబుల నతికరించి
మన్ననంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు.

కాన, యెవరేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాలమనంతము. ఇలవిశాల,
భావలోకము క్రమముగాఁ బడయుమార్పు:
ఏల హృదయంబు కలిపుచ్చ నింత యళుక?

తన కవిత వనలత; స్వచ్ఛందవ్యాపనముగలది. చెన్నపురిలోని పూ తీ ల దోహదములు కత్తిరింపులు మొ ద ల గు చికిత్సలచే కృత్రిమసౌభాగ్యము వహించిన పూలచెట్ల వంటిదిగాదు, "సహజ ప్రరోహవగ్గన నియమానుసారముగ" నల్లుకట్టితీఁగె. "అపూర్వపద్ధతి" నవలంబించినది. శాస్త్రకారుల యాదేశములను, పారంపర్యప్రాప్త బహిర్నియమంబుల పాటింపదు. ఆగమపుంజములకు చేరనగ తాను గతికముకాదు. స్వాతంత్ర్యసీమను జరించునది. ఏమి! పూర్వకుల విధులను అతిక్రమింపవచ్చునా? వారేర్పఱచిన కృతి విధానములుగాక అన్యము లెక్కడనైననున్నవా? అని మూషభక్తు లెవ్వరైన ఆక్షేపించినయెడల "కాలమనంతము, ఇలవిశాల, భావలోకము క్రమముగాఁ బడయుమార్పు" అని కవి వారిని తిరస్కరించి తన దారిన తా నేగడిని. వీరు చేసియుండెడు కవితావిషయమైన చర్చనుకొన్నియేండ్ల క్రిందట సందర్భానుసారముగ నేనును "కవిత్వ తత్త్వవిచారము" లో చేసినాఁడను.

"ఐరోపాలోని కవీశ్వరులు కొందఱు కాఁపువారు, సైనికులు, మొదలైన తక్కువ వృత్తులవారి బ్రతుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగఁ గావ్యములలో వ్రాసియున్నారు. మనగ్రంథముల

మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రము యొక్క స్థితిగతుల నరయఁజూచువారికి యీదేశమున పేదసాదలపై నాదరముగల కవియెవఁడైన నున్నాఁడా? తుదకు బీదసాదలైన నున్నారా? యను సంశయము పుట్టినను తప్పు వారిది కాదు! శోకరసము వర్ణింపవలయునన్న ననుకూలముగు సందర్భమెయ్యది? క్రొవ్వుకారెడి నాయికానాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరు కార్చుటకైన నవకాశములేక కుములుచుండు పరిపరివిధములైన గోడులా? శాంతరసమునకుఁ బోషకమెయ్యది? తనకుఁ గష్టము లేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా? ఆఁకట మాడి మలమలమాడుచు నింటికివచ్చి వంట సిద్ధము కాకుండినను భార్యపైఁ గోపింపక, కన్నులు నీరుఁదేలుచుండ విధిని ధ్యానించుచు నొకమూలఁ గూర్చుండు పాలసుకాఁపులయొక్క నడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదినవృత్తములలో నెంత భావము, రసము, గుణము సంగతములై యున్నవో ఘనకవులకుం దెలియవుగదా! రాజపుత్రులను రాజకన్యలను, చాలనందుకు బ్రాహ్మణులను వేశ్యలనుబట్టి ఘుంఘూటపూడుటదప్ప కవితకు మేలైన యన్యకర్మములు లేవా?

ఇన్నివి యనుటకు యీ "కృషీవలుఁడు" ను, అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన యువకులు విరచించియుండెడు నవ్యకావ్యములును ప్రమాణములు.

యీ గ్రంథమునందు పాలసుకాఁపులయు కాఁపుటిల్లాండ్రయును దైనందిన చర్యలతోడ ఋతువర్ణనములను కవి బహు చమత్కారముగ సమన్వయించి యున్నాఁడు. ఇది భావగంభీరులకేగాని శుష్కపండితులకు సాధ్యమగు క్రియగాదు. ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రపోవువఱకు కృషీవలులు చేయు కార్యములొకటున్ను. పనిలో సమ్మేళించిన విధమున చేయఁ

బడియుండెడి ఋత్వాది ప్రకృతివర్ణన మింకొక కూర్పు. రెండును భావకళానిర్మితములును శోభితములును అయినప్రకృతి ప్రతిబింబములట్లు సత్యముగ రామణీయకమును దాల్చియున్నవి. కృతి పరిమాణమున చిన్నదైయున్నను గుణమున నానాసౌభాగ్య శోభితముగనున్నది. వీని నన్నిటిని విడఁదీసి ప్రదర్శింప వలయునన్న సూత్రమున కన్నను వ్యాఖ్యానము విపులమగును. అట్లు చూపుటచే చదువరుల భావపరిశ్రమ విక్షేపములకు నిరోధము గల్గును. కాన, కొన్ని యంశములను పేర్కొని పరిశీలించెదను.

ఇందు గ్రామాంతర నివాసము వ్యవసాయవృత్తి ఇత్యాది ప్రకృతి సామీప్యజీవితమునకును, మనుష్య స్వభావ ప్రవృత్తికిని వుండు సంబంధము చూపఁబడియున్నది. మొత్తముమీద పట్నవాసు లంత 'మంచివారు గార నియు, గ్రామవాసులు నడవడియందు మేలుతరమైన వారనియు కవి యొక్క యభిప్రాయము. ఇది నిర్వివాదము కాదని నామనవి. పట్టణస్థులకు గ్రామస్థులకు చర్యాభేదములు, స్వభావభేదములు లేవనలేముగాని, పోలికలను పెంచి యెక్కువతక్కువలను రూపించుట సాహసకార్యము. దేశాభ్యుదయమునకు పల్లెటులతో పురములును నట్లే యావశ్యకములు. మఱియు ఆర్థిక ప్రపంచమునకు ఆధారము వ్యవసాయమని కవిగారు చూపియున్నారు. ఇది నిజమేగాని తక్కిన వాణిజ్యాది యభ్యుదయములు లేనిచో దేశము సమగ్రత పొల్ప నేరదు.

నవ్యపాశ్చాత్యసభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె.

నేటిఁ నాగరకత నీ మేలుగోరక-
యప్పుచేసి బ్రతుకమని విధించు!
నాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చెఁ జిత్తశాంతియున్నె?

కవికి పరిణామము వలయునో వలదో తెలియకున్నది. కవితా భావము లను శాస్త్ర తత్త్వములం బలె తార్కిక దృష్టితో విమర్శింపఁ దగదు. వానియందు రసికులు గమనింపవలసిన విషయము సౌందర్యము. ఆగుణమీ కావ్యమందు అఖండముగ నున్నది.

అసంబంధములగు వర్ణనలు సంగతులీగ్రంథమున లేవు. ప్రతియంశ మును చిత్తరువున కనుకూలించినదియు అగత్యమైనదియుఁగా నున్నది. సంయోగతాలక్షణ మిందు ఏమాత్రము భంగము చెందకుండుట కవియొక్క భావనా గాంభీర్యమునకు అమోఘమైన సాక్ష్యము. తావర్ణించు జీవితమును విషయములును తనకు అనుభవ వేద్యములు కాఁబట్టియు, వానియందు తనకు మనసు హృదయ సంపూర్ణముగ లీనమై యుండుట చేతను వర్ణనల న్నియు హృద్యతాగుణ పరిశోభితములు, వానియందు సత్యస్ఫురణ, మనో హరత, హృదయాకర్షణాది శక్తులున్నవి. ఇదియ శిల్పము యొక్క పర మార్గము.

పాశ్చాత్య భాషలలో "పా, స్టొరల్సు" నాఁబడు పాశుపాల్యాది గ్రామాంతర వృత్తులవారి అకృత్రిమ జీవితస్వభావాదుల వర్ణించు కావ్య ములనేకములున్నవి. అయ్యవి గ్రీకు లాటిన్ భాషలలో పుట్టి ఆధునిక ఐరోపా వాఙ్మయములయందును వ్యాపకమునకు వచ్చియున్నవి. హైందవ భాషలలో యీ తరగతికిం జేరిన కావ్యములలో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, బృందావనజీవితము, గోపగోపికాసంచారములు ఎంతయు హృదయరంజక

ములు. భాగవతమునందలి దశమస్కంధమును, విశేషించి యెఱ్ఱాప్రెగడ యొక్క హరివంశ పూర్వభాగమును, దేశీయవాక్ప్రపంచమున తమస్సునడంచి చల్లని వెన్నెలను కురిపించి చిత్తానందము చేయు చంద్రబింబమువలె నున్నవి. జయదేవ కృతమైన గీతాగోవిందమును నిట్టిదియే. గోపికలను వదలిన గ్రామాంతరజీవిత మలభ్యమనియో, కృష్ణకాంతలకు తదనంతరము గోపికాసంతతులు నశించిరను భ్రమగొనియో మనకవులు అట్టి వర్ణనలను, ఇతరసందర్భముల ముఖ్యాంశములుగ నైనఁ గొని వర్ణించుట మానివేసిరి. యీనాఁటికి ఆ వృత్తములు మరల కవితాదృష్టికి నష్టములని భావింపఁబడుట తటస్థమైనది. ఇట్లెప్పుడో నశించిన మహోత్తరమైన వృత్తమును పునరుజ్జీవింపజేసి దివ్యాకృతిగ మనముందర రామిరెడ్డిగారు నిలిపియుంచుట వారి యసాధారణప్రజ్ఞను సూచించుచున్నది.

కృషీవలుని జీవితమంతయు పువ్వులపాన్పు గాదని కవిగారెఱుంగక పోలేదు. పట్నవాసులకు వారికినుండు ఆర్థికస్పర్థ, సర్కారువారు వారియెడల చేయు అనాదరణము, ముఖ్యముగా వారి నావరించియుండెడు అజ్ఞానాంధకారమును, దానిచే వారినిబట్టి బాధించెడు దురాచార పిశాచముల విషయమును రాజకీయ సాంఘికాదిసేతులును, సంస్కారముల యావశ్యకతను సూక్ష్మముగఁ దడవియున్నారు. మింటికెగయు పక్షియైనను భూమిమీద పెట్టియుండెడి గూటిపై చూపు వేయక యుండునా? కాఁపువారియొక్క దుఃస్థితి యెప్పుడు తొలఁగును? వారిఁక ముందైన పూర్వపు రెడ్డిరాజుల కాలమందువలె ఉన్నతపదవికి రారా? అను విచారములు అసలు సహజములే గదా. "కాలగర్భమునందెట్టి ఘటనగలదో; భావిపరిణామమెవ్వరు పలుకఁ గలరు" ఎవ్వరు పలుకఁగలరో గాని నావలన మాత్రము గాదు. రైతులెట్టి దారిద్ర్యముపాలై యున్నారు! "కార్యారంభమును ధైర్యము విడకు మయ్యా" అని కవిగారు సంబోధించుచున్నారు. వీరి మాటలు నాలకించి యాదరింతురు గాక. ముఖ్యముగ మాకులమువారికి

అతిథి సత్కారము ఒకరు చెప్పక చూపక వచ్చిన సదాచారము. అన్న
దానము మావారివలె చేయువారితరు లున్నారో లేరో. ఎట్లును మించిన
వారు లేరనుట అతిశయోక్తి గాదు. యీవిషయమును రామిరెడ్డిగారు యీ
క్రిందివిధమున రమ్యముగ నుడివి యున్నారు.

ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు;
నాఁక లెత్తఁగ నీపంచ కరగు నతిథి
తినక త్రావక పోయిన దినములేదు.

కోఁపుటిల్లాంధ్రను గూర్చి కవిచేసిన స్తుతులన్నియు సత్యమునకు మీఱినవి
కావు; తక్కువ. వారియొక్క "శాంతినీతియు నురుకష్టసహనశక్తి, నెవ
రెఱుంగుదురు" శ్రీలంగూర్చి వీరొనరించిన ప్రశంస యెంతయు సత్యము;
గంభీరమును,

అతుల సంసార సాగరమందుఁ గాల
జలము సుకృత దుష్కృతవాత చలితమగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండ
పడవవై గట్టుజేర్తువు పతిని, గృహిణి!

సంగ్రహించి వ్రాయుశక్తియందు యీ కవి మించినవారుండరు కాఁబోలు.
యీ గ్రంథమును జదువఁ జదువ ఏరీతిని ఇన్నియంశములను ఇన్నికొద్దిపుట
లలో నిక్షేపించినాఁడు అను ఆశ్చర్యముఁ దాల్పనివారుండరు. పునరుక్తి
నిరర్థకవృత్తి, యిత్యాది కాలవ్యయమును, స్థలవ్యయమును చేకూర్చు పద్ధ
తులు లేవు. తన కులస్థులయట్లె యీకవియును మితభాషి. అర్థము ఎక్కువ
పదములు తక్కువ అను శ్లాఘనకు పాత్రుఁడు.

మనుచరిత్ర కళాపూర్ణోదయాదులలోని పద్యముల ననుకరించిన తల
పోతలు వ్రాతలు ఒకటి రెండుచోటుల నున్నట్లు తోఁచెడిని. ఇది

దోషముగాదు. ప్రమాదము కావచ్చును. వీరి యాదార్థ్యవర్ణనాశక్తిని గా పించుటకై కొన్ని పద్యముల నుదహరించుచున్నాను.

## లయవిభాతి

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి,
లలిత కలధౌత మృదు విలసనము పోలెన్
మొలక లిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పన్
గలువపొడి గందవొడి దొలఁక సుడిరేఁగుచును
మెలఁగు నెల పయ్యెరలు నలసలఁ జరింపం,
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబున్.

స్నానమొనరించి వెన్నెల చలువ బయల
ఒడ్డులున్నవు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి,
పొడుపు కతలు, సమస్యలుఁ, బూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప.

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదక చింతలు, నిదుర యనెడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము సైరికా వేగువఱకు.

నేనును విశ్రమించెదను, వేగువఱకుగాదు, మఱి రామిరెడ్డిగారు ఇంకొక గ్రంథము వ్రాయువఱకు. వ్రాసినతోడనే పఠనమునకుం దొడంగెద.

ఇట్లు,
కట్టమంచి రామలింగారెడ్డి.

# కృషీవలుఁడు

సమయమమూల్య, మొక్కనిమి
షంబువృథాచనఁగ్రమ్మఱింప నే
రము; మనయాయు వాత్రుటిప
రంపరయౌట నెఱింగి నిద్రమాం
ద్యమునుఁదొలంగి మీపనుల
నారయుఁడో జనులారయంచు డం
బగము మెడన్నిగిడ్చి కృక
వాకువుగూసెడి నింటికొప్పునన్.

వడఁకెచుఁ బాడుమేల్కొలుపు పాటకు రాటముఘుమ్మునంచు జే
సెడిమధురారవంబు శ్రుతి చెల్వు వహింపఁగ, రాజనూఁదిముం
గడ నిడికొన్న కుంపటిసెగన్ సొగియించుచు నమ్మలక్క లో
క్కెడ గుమిగూడి నూల్వడకు నిత్తఱిఁ దోఁచెను రెడ్డిచుక్కయున్.

అత్తలయూఁడుబిడ్డల భయంబొకసంకయుఁ గోర్కె వేఱొకం
జిత్తములాఁగఁ గ్రొవ్వదయుఁ జీరయు వే సవరించితూఁగుచై
నుత్తున నున్నవల్లభుని మంచము మెల్లన వీడి దీనయై
బిత్తఱికోడలిల్వెడలె వేకువఁ బ్రాఁచిపను ల్వొనర్పఁగన్.

రచ్చ చవారమందు నిడి రాతిరిఁబుచ్చిన బోటసారులుం
జిచ్చు రగిల్చి మంటలకుఁ జేతులు చాపుచుఁ గూరుచుండి వా
రచ్చకు వచ్చినట్టి కతలెల్ల వచింపుచుఁ దెల్లవాఱఁగా
వచ్చిన మూటముల్లెగొను 'పైనపుసందడి' రేఁగె గొల్లునన్.

"అమ్మా! తూరుపుదెల్లవాఱె నిఁక లేమ్మా" యంచనన్
మాల్గి, మం
చమ్మున్ డిగ్గక, బుజ్జగించినను, "పోచాల్చాలు, వేన్నీళ్ళు లే
కేమ్మై నేఁబలుదోముకొందుఁ జలిలో, నింతాగడంబా? యటం
చమ్మం గూఁతురు కోపగించుకొనుఁగన్ వాత్సల్యంపు గారా
మునన్

కృషీవలుఁడు . . . . . . . . . . . . . . . . .

ప్రొద్దుపొడుపను కాఁపు పూఁబోఁడి రాజ
నముల వరియెన్నుఁగంప గేహమున దింప
సంబరంబున నెగురుచు సరసఁజేరు
పిల్లలనఁ బుల్గుతుటుములు వింటికెగసె.

అరుణమయూఖముల్ తరులతాంతరమార్గముదూరి గేహగో
పురములఁ బ్రాఁకు ప్రొద్దుపొడుపుం దరుణంబున నీటికోసమై
సరసుల కేఁగు కాఁపు నెఱజాణల నూపురమంజులార్భటుల్
నెఱసెఁ బ్రభాతమున్ శిశువునేర్చెడి ముద్దులమాటలో యనన్

తరువులఁ జూరులందుఁ జరియించి తమోహరణైక దక్ష భా
స్కర కిరణాళి నీమృదులశయ్య సువర్ణమయంబు చేసె ని
ద్దుర నింకనైనమాని వెలిదోలుము బీళ్ళకు నాలమంద, ని
త్తఱిఁ దమిదీఱ మేయుఁబులుదంటలుఁగమ్మనిమంచుపచ్చికల్.

ఓయిహాలిక! యెంత ప్రొద్దాయెఁ జూడు
మింతనిదురేల? పాలకై గొంతురాయ
లేఁగ యాదూడ పలుపును లాగిఁకొనుచు
నఱచుచున్నది "యంభ యంభా" యటంచు.

కృషీవలుఁడు

పొదుగు నిండుగఁ బాల్చేపి గుదులుఁ ద్రెంపి
దూడకై దొడ్డిగోడ రాపాడి దాఁటుఁ
దఱిపి పెయ్య యింకేల మాంద్యమునఁ బాల!
తెమ్ము నిద్దుర; పాల్దీయుఁ దెమ్ము చెంబు.

బిఱ్ఱుకడుపుగ నన్నంబుఁ బెరుఁగుఁ గుడిచి
దొడ్డి వెడలించు చున్నాఁడు గిడ్డగములఁ
దమ్మిఁగుఱ్ఱఁడు; లేదూడ లమ్మలకును
బరుగు లిడనీక కట్టుము పలుపువెట్టి.

చెమరు ముత్యాలు చెక్కిళ్ళఁ జెదరిజాఱ
పైట తెరవెన్క జమరి పోరాటమొసఁగ,
గాజునీలాలు మధుర నిక్వాణము లొలయ
దధి మధించెడు కాంత గీతములు వినవో!

ఉయ్యెల నిద్రలేచి తనయుం డెదుటన్ జనయిత్రిఁ గాంచకే
కుయ్యిడు చున్నవాఁడు కలుకుంగనుదమ్ముల బాష్పబిందులో
య్యొయ్యనఁ జిందువాఱ, సతియు స్నికటంబున లేదు, లేచియు
బయ్యను నెత్తిమేను పులకాంకితమౌనటు ముద్దు వెట్టుమా,

కృషీవలుఁడు

చలికప్పగొప్పి విచ్చలవిడి లేయెండ,
        గ్రాగు ముద్దులకూఁతుఁ గౌఁగిలించి,
పునికి దోఁగాడుచు బొమ్మలతో నాడు
        పసిబిడ్డ మోము చుంబనము చేసి,
మొగతాలి సరసాలు సిల్లాలు పలుకుచు
        నవ్వించు దుకు మూఁలుపవ్వు నవ్వి,
పనివాండ్రు వచ్చియుండినఁ దండ్రియేమను
        నో యను శంకలో నొరసికొనఁగఁ,

జావిది కడుపారఁ గుడిచి యెద్దులను దోలి
కొనుచు మడి కేగుచున్నారు, గనుము యొరులు
వారు నీతోడివారలు గారె? రెడ్డి
యువకు లెచ్చటఁ గొఱగాని యుందురయ్య?

మనపనిఁ జేసికొన్న నవమానమె? ప్రాఁచిపనులొల్లనర్చు చుక్
వనిత యతిప్రయాసమునఁ బర్వులిడం గనుఁగోవె? కావడిం
గొని సరసీజలంబులను గోపము సేయక తెచ్చియిచ్చి కాం
తను బరితోషపెట్టుము వృథాచన వెప్పుడు నట్టిసాయముల్.

కృషీవలుఁడు

సోమరిపోతనై జనకు సూక్తులలక్ష్యముచేసి కొంటెపో
రాములఁ బ్రొద్దుపుచ్చకు, నిరర్థకభూములనైనఁ జెమ్మటన్
శ్యామల సస్యవంతముగ సల్పెడు కాఁపులు నోఁగులైన నిం
కే మెడువార లెవ్వరు జనోత్కరమున్ సరసాన్నదాతలై!

అరుణకిరణుండు తూర్పున నవతరింపఁ
బ్రాణిలోకంబు మాంద్యమ్ము బాసె; నింక
నింటనుండుట మర్యాదయే కుమార!
చలిదిచిక్కంబు గట్టుము పొలముఁ జేర.

అప్పుడప్పుడె విచ్చి యలరు చేమంతుల
కమ్మని నెత్తావి గడలుకొనఁగ,
రత్నకంబళ మట్లు రాణించి బీళులఁ
బలువన్నె పూవులు బలిసి విరియ,
వ్రాలఁబండిన రాజనాల కేదారంబు
పంటలక్ష్మికి నాటపట్టుగాఁగ,
ప్రొద్దునిగ్గులు సోకి పొగమంచుమబ్బులు
బంగారు వలిపంబు పగిది వ్రేల,

ఈ నిమేషమునందు నిల యెల్ల నందమై
స్వర్గశిల్పి యింద్రజాల శక్తి
వ్రాసిపట్టె చిత్రపటమున విలసిల్లెఁ;
రంగిమూడు మిపుడు పూర్వదిక్కు!

వేకువనె లేచి వైకుంఠవాకిళులను
ముంగిట రచించి గుమ్మడి పూలతోడ
గొబ్బిముద్దల నిలిపి కుంకుమను జల్లె
నీయనుంగుకూఁతురు! గాంచుమోయి సొబగు.

గనిమల తుంగకుఁ గఱికకాడల కల్లిన సాలెగూళ్ళ స
న్నని పటికంపుమంచు పడి నాణెపు ముత్తెసరాల పోలికం
గనుఁగొన రమ్యమయ్యె రవికాంతులఁ దేలుచు. నిట్టిభావమో
హనపు నిసర్గశిల్పముల, హాలిక! త్రొక్కక దాఁటిపొమ్మికన్.

పొలముల కేఁగు పల్లెతలు పుత్తడిగాజులు ఘల్లుమంచు రా
పిలి యులివెత్తఁగం జిటికవేయుచు నిన్గని యేలపాటలం
జెలువుగఁ బాడ నుప్పతిలు సిగ్గున నూరకపోక మాఱుపా
టల నెలుఁగెత్తి పాడుము. మిటారుల నవ్వుల కాస్పదంబుగన్.

కృషీవలుఁడు

గ్రామవాసుల కిట్టి నిష్కైతవంపు
ముగ్ధపరితోషములు సుఖభోగ్యములగుఁ;
బట్టణ నివాసకుల శుష్కభావములను
నిట్టి సామాజికానంద మెసఁగఁగలదె?

ఓయి రెడ్డియువక! యూరక యిందందుఁ
దిరుగ నేమి ఫలము? తిండిచేటు!
తండ్రి కోఁతమడుల దగ్గఱఁ బనిసేయు,
నన్నమునకు నింటి కనుపుమయ్య.

వ్రాలిన కొప్పులోపలి పూలరేకులు
    సడలి యొక్కొక్కటి జాఱుచుండఁ,
బరువంపు రొమ్ముపైఁ బయ్యెదచినుగుల్లు
    గాలికి నట్టిట్టుఁ గదలియాడ,
నెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
    సారు లెక్కసకెము సలుపుచుండఁ,
దమ్ములపుంబూఁత దవిలిన వాతెఱ
    పైఁ బలుచాలు నవ్వాకయె నవ్వఁ,

పేఁకోఁడవలె గ్రుక్కిళ్ళుమ్రుచుఁ జిన్నెలాఁడి
కన్నెమామాలెత విడిచుట్ట మున్నమున్న
మునుపు లెత్తెఁగడి; నింటికిఁ బోవువేళ
సంజెతోడ యీలేవె కర్షకుమార?

ఆఁకటి చిచ్చుబాధనగ్నమైన యొడళ్లను నంటు డొక్కలుం
జీకటిచూపులుం బొలకు జేనెడుపేలిక గల్గి జీవితం
బే కడగండ్లుగాఁ, బరిగయేరెడు బీదల వెళ్ళగొట్టి చీ
కాకొనరింపఁబోకు; వెలిగాదల యాఁకటిమంట నీకునుం.

పసి డిపూసల పేరుల పగిది దోర
పక్కముగఁ బండి నేలకు వ్రాలు కంకె
గుత్తులఁ బిచుకతిండికిఁ దెత్తుననుచు
నింతిం జెప్పి మఱచితే యింతలోన?

పడఁతి యొంటికత్తె; పనిపాటు సేయను
బిడుగు ఱేఁడుగులకును నెవరు లేరు,
చంటిబిడ్డ యొకఁడు సంసారభారంబు
పిల్చి పిప్పిసేయు బీదరాలి.

కృషీవలుఁడు

చెలియా, యిత్తఱినిన్నుఁ గన్గొనిన నాచిత్తంబు తాఁ పొర్లెడున్
కలఁగుం. గష్టకుటుంబకార్యముల నెక్కాలంబు నిర్విఘ్నవై
మెలఁగంజూతువు మంచిచీర రవికెల్ మేలౌ నలంకారముల్
దలఁపంబోవు. తల్లైనదువ్వ; విఁక లేదా మేన నీపాటుకుఁ?

మున్నూటరువది దినముల
నెన్నండును గన నశక్య మేపనియును లే
కున్న నిమేషము; కాఁపుం
గన్నియ, నీ కాటవిడుపుకాలము లేదే!

నిత్యకృత్యములం దొక్క నిమిషమైన
దొంగిలింపుము కై సేయఁ దోయజాక్షి!
యఖిలకామినీ సామాన్యమౌ ప్రసాద
నప్రియత్వము నీయందు ననలుకొనదొ?

స్వాంతమున నీకు రామణీయకపిపాస
యంతరించె నటంచు నే ననను. గాంత,
కాని, యెడలేని సంసారకష్టములకు
స్త్రీప్రకృతి బలివెట్టుట చెల్లదమ్మ;

కృషీవలుఁడు . . . . . . . . . . . . . . .

త్యాగమునకైన లోకహృద్యు దగునుగాని
శలభ మత్స్యుల నాత్మనాశనము మేలె?
పొలఁతికి సత్త్వ సౌందర్యములును రెండుఁ
ప్రార్థనీయవరంబులై పరఁగుఁగాదె!

ఓశివ. నాయూరడింపుల యందె దవిలి
చిన్నకాఁపుఁగోరి సంపవు జొన్నమడికిఁ,
పావురంబులుఁ జిల్కలు పాలకంకి
విఱుచుకొని యాకసంబున వెడలెఁ జూడు!

పడసటఁ జిల్క లన్న మిషఁబైట దొలంగినఁ జూచిచూడకే
యొడిసెలత్రాయి, బెట్టు పొలమోరలఁ బోయెడి బాటసారిపైఁ
బడఁ దెగ రువ్వెదేల మగువా యిటులం బడుచుందనాలతుం
ముదుకుదనంబు నీయెడఁ దఁ సౌందర వెక్కెనె? నైజమేగదా!

“ఏనవయ్యోఁగాని, యాఁకలి బలుపోడ్మ,
రెండు కంకు లిమ్ము రెడ్డిసడుచ!
ప్రొద్దువోవు మాదు పొలిమేరఁ జేరను,
బాట నడచి నడచి బడలె మేను.”

కృషీవలుఁడు

అని కడువేడు పాంథులకు నచ్చుట, జేతికినందు కంకులం
దిన్నఁడని చెప్పిమంచెపయిఁ దియ్యనిరాగము దీర్ఘప్రాయపుం
గొనబుమిటారి, నీమనసు కుందు నెఱుంగదుగాని, యింటిలో
ననయము లేమిడిన్ సయిచు నమ్మ వెతల్ దలపోయ వేల్పొకో!

చిన్నప్రాయమందె చీడపుర్వును దెచ్చి
నీదుహృదయకలిక నిలుపఁదగదు;
పచ్చపైరుచేల బాంధవ్యమునఁ జేసి
పెరిగినావు ప్రకృతిబిడ్డవోలె.

పూలకారుగాలి పొలముపై వీతెంచె
వలపు మొలిచి యొడలు పులకరింప,
మనసుకోఁతలెల్ల మానిపోఁ గోయిలఁ
గూడి పాడు మొక్క క్రొత్తపాట.

పైరుంబచ్చలులేని లోపమును బాపంబోలెఁ గ్రొంబూలసిం
గారంబుం గయిసేసి లేఁజివురులం గాంతిల్లె వల్లీతతుల్,
దారింబోయెడు బిచ్చకత్తె యయినం దావుల్ గుబాళింపగం
బూరేకుల్ చికురంబులందుఱిమి సొంపుంబెంపుఁ బాటించెడిన్

కనుము; యాబిచ్చకత్తెకుఁ గలసుఖంబు
నందు సగపాలు లేదు నీయాలి కకట!
పవలు నిద్రించెదే కాఁపుపడుచువాఁడ,
పొలఁతి నిట్టూర్పు నీయెద పొగిలిపోదె?

కాఁపులెల్లరు నాగళ్లు గట్టి కోడె
యెడుఁగు దున్నెద రిపుడు; నీ వద నెఱుఁగవో!
యాలసింపక యెల్లఁ గయ్యలను దోలు
హోయి, యెండలు ముదిరె నెల్లుక్కవెట్టె

శ్రమలు లేకయె ఫలములు దుముకఁబోవు;
పిండికొలఁదియె రొట్టె; యోపిన విధానఁ
గష్టపడుము కృషీవలా, గలుగు సుఖము.
ఉత్తయాసలకన్న మే లుద్యమంబు.

అర్కబింబము మధ్యందినాతపంబు
గాయుచున్నది మేనెల్లఁ గములిపోవ;
నురుగుఁ గ్రక్కుచు నూర్చుచుఁ నోరు తెరచి
యొక్కయడుగైనఁ బెట్టవు దుక్కిటెడ్లు.

కృషీవలుఁడు

ఖరకరతాపతప్తమయి కాయము ఘర్మకణాళినీనుచుఁ
సారెగెడు సత్త్వహీనముగఁ జూపులు దీనములయ్యెఁ బ్రొద్దునం
బొరసిన మోము తేటలెటువోయెనో! దప్పియు హెచ్చె
నోయి యి
త్తఱిఁ దరుమూలశాయివయి తాపము వాయుము చల్లనీడలన్

కరము కష్టించు నినుగాంచి కనికరమున
నెండవేడిమి దొలగించు నిచ్చతోడ
వారిదం బాతపత్రమై వచ్చెఁ గాని
మారుతాహతిశిథిలమై మరలెనదియు

తరువులఁ గోటరంబులకుఁ దారెను బక్షికులంబు, బఱ్ఱెలున్
సరసుల జొచ్చె రోజుచు. గసంబడ రెవ్వరు దారులందు, నీ
సరణి సచేతనప్రకృతి చల్లదనంబున గాసచేయ మే
నెరియఁగ నీవుమాత్ర మిటులేల శ్రమించద వెఱ్ఱియెండలన్?

బాటలు వేడిదుమ్ములకుఁ బాదములం జిరుబొబ్బలెత్తెఁ గ్రీ
యూటగఁ జెమ్మటల్ మొగమునుండి దొరంగఁగ గూటిదుత్తతో
బాటగలంధి వచ్చెడిని పాపము! వేగమ నీట మున్గి య
చ్చోటనె మజ్జిగన్నము రుచుల్వచియించుచు నారగింపుమీ.

తరుణీ! ఘూళులఁ గాడ్పుగాలెనని సంతాపంబునం గాంతువిం
జిలుముత్త్రాడక, గేహసర్వహరణమున్ సేద్యంబు సాగంగ ని
ష్టలు గష్టింపఁ గుటుంబరక్షణము సాధ్యంబౌను; భిన్నాధ్వసం
చరణాసక్త్రహయద్వయంబు రథమున్ సొంతంబుగా లాగునే?

శ్రమకుచితంబుగా ఫలము సంధిలదోయని చింతనొందకో
రమణి నిదాఘ తాపము దొరంగెడునంతకు మత్త్రియూపజాం
పములయి యాలలూఁగి పదమాత్రైన యింటికిఁ బొమ్ము పాలకై
కుములుచు నేప్పనేమొ యనుగం బసిపాపఁడు నిద్రలేచుచున్

చాఁరిజరించుచున్నపుడు దగ్గఱనున్న తటాకమందు నిం
పారు సరోజముల్ గొని గృహంబునకుం జనుదెమ్ము, బాలకుం
డారమణీయ పుష్పములనచ్చెరువొందుచుఁ గాంచి యాడుకో,
దీటిక వంటయింటి పని దీర్చుము కొంతుఁడు వచ్చునంతకున్.

పూవుందేనియ లారగించి మధుపవ్యూహమ్ము కర్ణప్రియం
బై వర్ధిల్లు మనోజ్ఞగీతముల రాగాలాపముం జేయఁగా
నీ వేలా కలఝుంకృతిన్ స్వరములెంతే నైక్యముం బొందఁగాం
తా! వాకోవక పల్లెటూరి పవమ్మోసం జిత్తము పొంగఁగన్.

................................ కృషీవలుఁడు

సిరిగల యాఁడుబిడ్డలు విచిత్రపుటాలనగల్ ధరించి బం
గరుసరిగంచు చీరలను గట్టి చరింపఁగఁ గాంచి యాసలోఁ
బారయకు కృత్రిమంబులగు భూషలు దాల్ప; నమూల్యరత్నమౌ
సరసపుఁ బ్రేమ చిత్తజలజంబు వెలుంగ నలంకరింపుమా.

వెలగల రత్నభూషలను వేలకొఁదాల్చిన సిన్నఁగాంచుచోఁ
గలుగదు ప్రేమ భర్తకు వికస్వరమౌ వదనారవిందమం
దాలికెడు ముద్దులేనగవు లొక్కనిమేషము దోఁపకున్న; భూ
షలు ప్రణయానుబంధసదృశమ్ములుగావు కులాంగనాళికిన్.

అతుల సంసారసాగర మందుఁ గాల
జలము సుకృత దుష్కృత వాతచలిత మగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండ
పడవవై గట్టుచేర్తువు పతిని గృహిణి!

ఈయెడ నాతపంబు శమియించెను, నీడయుఁ దూర్పు
దిక్కుకుం
బోయెడు భర్తతో నలిగి పొందెడయం జను జాయపోలికన్
వాయువు సుప్రసన్నమయి పైఁబయి వీచెడు లేచిరమ్మా, లే
దోయి విలంబనం బనెడియుక్తి కృషీవలవాఙ్మయంబునన్.

కృషీవలుఁడు . . ..........

మనుజసమాజనిర్మితి సమంబుగ నీకొక ముఖ్యమైన వృ
త్తినియత. మట్టి ధార్మికవిధిం జిరకాలము గౌరవంబుతో
మనిచిరి నీపితామహు లమాంద్యసుశీలురు సర్వవృత్తిపా
వన కృషిజీవనైక పరిపాలనలోక హితార్థకాంక్షులై.

అనుదిన మిట్లుకష్టపడ నావిధి వ్రాసె నటంచు నీమదిం
బనవకు కర్షకుండ? యిలపై జనియించినదాది చెమ్మటల్
పోనక శ్రమించి పౌరుషముతో బ్రతికించెదు నీకుటుంబమున్,
మనమునఁ గైతివాశయము పొందునకైనను లేదు నీయెడన్.

నేలనూతుల కుగ్గలు నిలుపువారు,
బోడితలకు మోకాళ్ళకు ముడులువేయు
వారుఁ జిటికెలఁ బందిళ్లుపన్ను వారు
నిన్నుఁ బోలరు. తమ్ముఁడా, యెన్నఁడైన.

పఱుపులు పక్షిమంచములుఁ బట్టుతలాడలు సంబరంబులుం
గరులుఁదురంగముల్ ప్రియయుగాంచనమున్మతియేమి
యుండినన్
ధర సకలంబు సొంతమయినం దనివోదు మనుష్యతృష్ణ, త
త్పరిచితులైన వారి నెడఁబాయదె తృప్తి నిసర్గశత్రుతన్.

కృషీవలుఁడు

అన్నా హాలిక! నీదు జీవితము నెయ్యంబార వర్ణింపమె
కొన్ని నిర్ఝరసార వేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుఁగాని యితరుల్ భగ్నాశులై యార్తితో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్పల్కరే!

వనలతవైన నాకవిత పత్రిపుటంబులఁ బూవురెమ్మలన్
దినదినజృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధననియమానుసారముగఁ; దల్లత యెన్నఁడు దోఁటమాలిపా
ణిని గనుఁగోని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్.

పంజరనిబద్ధకీరంబు బయలు గాంచి
యడ్డుకమ్ముల దాఁటంగ నాసచేయు
నటు, బహిర్నియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు

కాన, యెవరేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాల మనంతము ఇల విశాల;
భావలోకము క్రమముగాఁ బడయు మార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు?

సైనికా, నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండ మెపుడు
నీ హలంబు కన్నను ప్రార్థనీయమగునె!

సైనికావశ్యకమ్ముల దాటిపోవ
నెగుర ఱెక్కలురాని నీయిచ్చ లెపుడుఁ;
పైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
నీవిచారము, నూహయు, నిపుణతయును.

ప్రొద్దువొడిచిన దాదిగాఁ బ్రొద్దుగ్రుంక
వఱకుఁ గష్టింతువేగాని యిరుగుపొరుగు
వారి సంపదకై యీసుఁ గూరఁబోవు
వెంత నిర్మలమోయి, నీహృదయకళిక!

పల్లె యెల్లయె సర్వప్రపంచసీమ!
ప్రియ యొకర్తయె రమణీయ విగ్రహంబు!
బంగరుం బంటపొలములే భాగ్యనిధులు!
అనుదిన పరిశ్రమమె మత మగును నీకు.

కృషీవలుఁడు

ఉండి తిన్నను లేక పస్తున్నఁ గాని
యాస చేయవు పరుల కష్టార్జితంబు!
నా కళత్త్రగ నీపంచ కరుగు నతిథి
తినక, త్రావక, పోయిన దినము లేదు.

కృషి సకల పరిశ్రమలకుఁ గీలుచీల;
సత్పరిశ్రమ వాణిజ్యసాధనంబు:
అఖిలవాణిజ్యములు సిరి కాటపట్లు;
సిరియె భోగోపలబ్ధికి జీవగఱ్ఱ.

కావునఁ గృషీవలా, నీవె కారణుఁడవు
సాంఘికోత్కృష్ట సౌభాగ్య సౌఖ్యములకు;
ఫల మనుభవించువారలు పరులు; నీకుఁ
గట్టుగుడువను గఱవె యెక్కాలమందు!

ఫలము మెక్కెడివారు తత్ఫల రసాస్వాదక్రియాలోలురై పలుమారు రమ్మధురత్వము న్నుతుల సంభావింతురే గాని. తత్ఫలహేతుక్రమ వృక్షమూం దలప రెవ్వారైన, నెల్లరమా కలితులౌ భోగములఁ భుజించుచు నినుంగన్నెత్తియుఁ జూతురే

గట్టి కృతిఘ్నులన్ మనమునందుఁ దలంపక సేద్యనాద్యపున్
ఘుట్టన నస్థిపంజరముగాఁ దనువెండినఁగాని, వర్షముల్
పట్టినఁగాని, క్షామములు వచ్చినఁగాని శరీరసత్వమే
పట్టుగ స్వశ్రమార్జితము పట్టెఁడు నన్నముఁ దిందు వెప్పుడున్!

రాజకీయ ప్రపంచ సామ్రాజ్యమందు
శౌర్యఖడ్గంబులకు లేదు శాసనంబు;
సంఘరాజ్యంబు నేలు విస్తారశక్తి
సతము నాచార ఘోర పిశాచరాజు.

శౌర్యమునకును నాచార చక్రమునకు
మధ్య-లోకంబు దవిలి సమ్మర్దితమగును;
కాలగర్భంబునం దెట్టి ఘటనగలదొ
పూర్వపద్ధతి విప్లవ స్ఫురణ గాలుప!

కల్యకాంతికి మున్నంధకారరాత్రి,
వర్షపాతంబునకు మున్ను వారిదముల
ధమధమాడంబరంబులు నమరు; నిదియుఁ;
బ్రకృతిభావంబునకు నూత్నపథముగాదు.

కృషీవలుఁడు

కష్టసుఖముల నీచోచ్చ గతులు గలవు
చక్రగండంబులకుఁ బోలె; సమయమందు
నిట్టిమార్పు లనంతమై యెసఁగుచుండు
భావి పరిణామ మెవ్వరు పలుకఁగలరు?

ఓ కృషీవల! నీవు కష్టోత్కటంపు
దుర్భరావస్థ యందె తోఁపువడఁగ
నెవరు శాశించువారు. నీ కేమికొదువ?
ఆత్మవిజ్ఞానమయముగా నలవరింపు.

దారిద్ర్యంబను పెల్లుటేటి కెదురై దాఁటం బ్రయత్నించుచుం
బూరా వేగమునం జలించి వెనుత్రోఁపుల్వోవు కాంక్షోడుపం
జేరా పొందక నెట్టు తెడ్డగు మన స్వేచ్ఛాప్రకారంబుఁ గా
ర్యారంభంబును ధైర్యమున్విడకుమయ్యా, నీవు వేయింటికిన్.

రార సైరిక. కనుఁగొమ్ము రమ్యమైన
సస్యకేదార ఖండంబు! సత్కవీశ
భావలోచన మెరవుగాఁ బడయకున్నఁ
గాంచనేర వంతర్లీన కాంతిసరణి.

అనిలాలోలవినీలసస్యములు భంగానీకముల్గాఁగఁ దె
ల్లని కొంగల్పయిఁ దేలు నుర్వులుగ లీలన్ రెక్కలల్లార్ప, మ
ధ్యను రాజిల్లు కుజంబు లోడలుగ వాతస్ఫూర్తిఁ గంపింప, స
స్య నికాయావనిసాగరం బటుల నేత్రానందముం గూర్చెడిన్

కుసుమ లతావళీ వలిత కుంజములు, గసల ప్రకాండముల్
పసరులు గ్రక్కు వృక్షముల బాలతృణంబులఁ జేలగట్లు సం
పెసఁగ, సమస్తరత్నముల నేరిచి కూర్చిన ఱాలబిళ్ళలన్
వసుధ కమర్చిరో కృషికవర్యులనన్ వరిమళ్ళు శోభిలున్.

మరకత చూర్ణవర్ణముల మండితమౌ నవశాలిభూమి సుం
దరతను గాంచ వైదిక దినంబులలో భరతక్షమాధురం
ధరయగు సస్యలక్ష్మి దయదప్పక నేఁటికి నార్యధారుణీ
భరణ కుతూహలస్ఫురణ భాసిలునో యనవొప్పు హాలికా.

కడమొదలులేని నీ దేహకష్టములకుఁ
బ్రతిఫలంబగు సస్యసంపత్తి గాంచి
కవివి గాకున్న వాగ్మిత గలుగకున్నఁ
బ్రణుతి వర్ణింపు మొకసారి భాగ్యగరిమ!

కృషీవలుఁడు

ఆకాశంబున మేఘమాలికల దూరాపైనం గనన్ రాదు, శు
ష్కారణ్యంబులఁ బైరులెల్ల నుసుమై యల్లాడెఁ. దీవ్రంబుగా
సోఁకెన్ సూర్యమయూఖతాప మిఁక నేజోకన్ ఫలించున్ వసుల్
మాకీకష్టము వెట్టె దైవమని యేలా నూటికిం జింతిలన్?

కఱకుగ నెండగాయ నిఁకఁ గాసము తప్పె ననంగ నేల! భా
స్కర కిరణాళిలోఁ గలదు సస్యసముద్ధరణైకశక్తి; త
త్కారణము లబ్ధివారి పయికిం గొని యావిరిరూపునన్, నభో
ంతరమున మార్చు నీరద వితానముగాఁగఁ బునఃప్రవృష్టికిన్.

అల వర్షాగమలక్ష్మి రేఖ యన దివ్యానేక వర్ణంబులం
బొలుపుంబొందు నవాబ్దమాల యదిగో భూభృచ్ఛిఖాలంకృతిం
దలపించుం గనుఁగొమ్మ, వాయునిహతిం దద్దేశముం బాసికొం
గలబారుల్ వెనువెంట నంటు శకలాకారంబులన్ వచ్చెడిన్

బావికి నీటికై యరుగు పల్లెత లంబుధరంబు గాంచి య
ప్పా! వినువీథి సాలికుల పాలిటి దైవమె యంబుదాకృతిన్
భావిఫలోదయప్రకటభావమునం జనుదెంచె నంచు మో
దావృత చిత్తలై సరసమాడుచుఁ బోయెదరో కృషీవలా!

కృషీవలుఁడు

పొలమునఁ గంచగా మొలిచి పువ్వులుపూచెడు కేతకంబులు
జ్వాలకుసుమోపహారములఁ బత్రపుటంబులనుంచి మారుతా
కలితకిసాలయోత్పలన మురిఁ బిల్చెడుఁ, జేరఁబోయి త
త్కలికఁ బరిగ్రహించి కల కాంతికఁ గానుకయిమ్ము, తమ్ముఁడా!

ప్రావృడంగ్గరలక్ష్మి యాగావాసమునకుఁ
బాఱఁగట్టిన నవరత్నతోరణంబు
నాఁగఁగోమల శబల వర్ణములతోడ
నింద్రచాపంబు శోభిల్లె నిదిగో చూడు.

వానతూనీఁగ లాకాశ పథమునందు
సరస ఝుంకార రవములు సలుపుచుండె
జల్లగాలికి నురుగప్పు వెల్లి నుడుల
బెక బెక మటంచుఁ గూసెడి వికటరుతుల.

తటములకు నాకసమున కంతరము లేక
నీలనీరదమాలలు ప్రేలుచుండ
నేలపై మిన్ను పడనీక నిలుపుచుండు
స్తంభము లనంగ గిరులు దృశ్యంబులయ్యె.

తపనుఁ డంబుదచ్ఛాదన తతులలోన
మరుగువడిపోవఁ గని నీలగిరులు చల్లఁ
దనము భువినాక్రమించిన యనువుగాఁగ
వాయుమండల మీమిరి పట్టియుండె.

తెల్లపట్టు మస్లీనుల తెరలలోన
నాడుకొనుచుండు పసిపాప యరువు దోఁప
వానముత్యాలు గూర్చిన వలల తెరల
దినరమామణి మృదుకాంతిఁ దిరుగుచుండె.

త్రావనీరైన దొరకని తరుణమందు
నిమిషమాత్రాన చెరువులు నిండిపోయె?
నఖిల లోకాశ్రయుండు కృపామృతుండు
కన్ను దెఱచిన జరుగని కార్యమున్నె?

జల్లు పెల్లుడుగంగఁ బిల్లలు, తల్లులు
నిలువఁబట్టిన నింట నిలువఁబోక,
వాననీరులు పాఱు పల్లపు టిసుకలఁ
గయ్యగాఁ గట్టలు గట్టి చిన్న
కృషీవలుఁడు ........

వాగెలుల బన్ని లేఁగదూడలఁ గట్టి
దున్నుచు విత్తులు మన్నుగలిపి
పచ్చయాకులు చల్లి పైరుపట్టె నటంచుఁ
గలుపుఁ దీయుచుఁ గోఁతకాల మనుచు

వరులు గోయుట నటియించి పనలుగట్టి
కుప్పవేయుటగా మన్ను కుప్ప పెట్టి
నడకు నేల చదునుగాఁగఁ గాలఁ దన్ని
మూఁకలొత్తిన నిండ్లకు నరుగుచుండ్రు.

జడివానన్ వలబడ్డ బక్క మొదవుల్ సంఘంబులై బీళులన్
విడియద్రొక్కుచు దొడ్డిఁ జేర నవిగో వేగంబుగ న్వచ్చెఁ; బె
ల్లడుసుల్ ద్రొవ్వని మెట్టనేలఁ బసిఁ గొయ్యాల్నాటి కట్టించి వెం
బడి వేయింపుము గడ్డిగాదములు చొప్పల్ బొందుపుల్లంటులన్

తొమ్ముదుకట్టి, గోచయము దాఁటులువెట్టుచుఁ గ్రేవుదామెనం
గ్రమ్మిచు జట్టకొట్టుచు, బరస్పరముం దల డీలుకొంచు ము
న్గొమ్ములఁ జిమ్మిచుం దిరుగఁ, గొట్టినఁ బట్టిన లొగ్గిరావు, సా
యమ్మొనరింపు మీయదన నాలమురల్పఁగఁ బల్పువెట్టఁగన్

తడసిన పచ్చికట్టియలు తంగెడు తప్పర తాటిమ్రాకులం
బడఁబొక బ్రొయ్యిలో దుఱిగి పైఁబొగలెత్తఁగ నూఁదుఁగాని కూం
డుడుకదు కాఁకకుం బొగకు నుప్పతిలెం గడగంట బాష్పముల్;
తడయక యెండు రెమ్మలను దట్టుఁడు ద్రోయుచుఁ జిచ్చుచేయుఁడీ

మును వేసంగిని గుచ్చివిడ్డ పిడికల్ బొప్పళ్లు బొళ్ళెంబులన్
వెనుకంబెట్టిన తాటిచుండ్లు బరికెల్ వెళ్ళించె నిన్నాళ్ళు; నిం
క నవాంభోధర మాలికా పిహిత దిగ్జాలంబులై వర్ష పుం
దినముల్ డగ్గరెఁ; గొంత బానసము నేటెరొప్పు సాగించెడిన్

పొలముల బీళులం దిరిగి ప్రొద్దెడ గ్రుంకఁగ నిల్లుసేరి పా
పల నొడిచుట్టుఁ బెట్టుకొని భార్యను నన్నముఁ దెమ్మటంచు నే
పిలిచెద, వొంటికాపురము, పిల్లల గిల్లల బుజ్జగించుకో
వలసిన యాలిపాటుఁ దలఁపం గరుణింప వదేల హాలికా

ఉప్పుతోఁ దొమ్మిదియున్న కాఁపురములు
సేయు గృహిణుల కేచిక్కు లేదు,
ఎవ్వి లేకున్నను నిరుగు పొరుగు కలాం
గనలకుఁ జేయొగ్గి గైకొనుటకు

కృషీవలుఁడు

నిష్టపడక, యున్నదే పెట్టి యక్కఱ
వాపుకొనెడు మానవకోటుల కెందు
లేమిడి సంసార మేమెయిఁ బరువుతోఁ
గడపంగ నిక్కట్లు గలుగుచుండు,
నెన్నికష్టములున్న నిట్లని పలుకక
పొసఁగినయంతకుఁ బొదుపు చేసి

మగనికిని బిడ్డలకుఁ బెట్టి మిగిలియున్న
యింతెఁ దాఁ దిని భిక్షుక కిడు పురంధ్రి
శాంతి నీతియు నురుకష్ట సహనశక్తి
నవరెలుంగుదు రంతటి యింతి దక్క!

తల తాకట్టులువెట్టి ధనికుల దగ్గఱఁ
బన్నుకై గొన్న రూపాయలప్పు
కూలికి నాలికిం గూటికిం జాలక
నాముగాఁ గొన్న ధాన్యంబుటప్పు
చిల్లర మల్లర చేబదులుగఁ దెచ్చి
యక్కఱ గడిపిన యట్టి యప్పు
పండుగపర్వాల బంధుల విందుకై
సామానుగొన్న బజారుటప్పు

...................................................... కృషీవలుఁడు

వాయిదా మించవచ్చిన వడ్డియప్పు
పడఁతిసొమ్ముల కుదువకుఁబడ్డయప్పు
వేగ తీఱిచి స్వాతంత్ర్యవీథి యందు
సంచరింపు నిశ్చింత సంతతంబు.

పవలు నడచుఁ బ్రొద్దు తోవవిందు రేవేళఁ;
బవలు రేయి నడచుఁ బాడువడ్డి!
అప్పుచేసి కుడుచు పప్పుకూళుల కన్నఁ
గాసు ఋణము లేని గంజి మేలు

సంఘపరివర్తనంబులు జరుగుచున్న.
రాజకీయ సంక్షోభంబు రగులుకొన్న.
విప్లవంబుల దేశమ్ము వీఁగుచున్నఁ,
గృషిఁ ద్యజింపకు కర్షకా, కీడు గలుగు.

నవ్యపాశ్చాత్య సభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె

కృషీవలుఁడు

పంచాయతీసభా భవనంబులో రచ్చ
 కొట్టంబు లోకమూలఁ గూలిపోయె,
పీఠిబడులఁ జెప్పు విజ్ఞానధుర్యులు
 నోజ్జలు దాస్యంబు నూఁతగొనిరి.
గ్రామపరిశ్రమఁ గలుగు నన్యోన్యమూ
 సహకారవృత్తంబు సమసిపోయె,
సత్యజీవనము, విశ్వాసమ్ము, భక్తియు
 నైకమత్యము, మున్న యంతరించె

బూటకములు, కుయుక్తులు, మోసగతులు
కోర్టువ్యాజ్యాలు ఫోర్జరీల్, కూటమైత్రి,
స్వార్థపరత, మూర్ఖ్యంబు, గర్వప్రవృత్తి
నేర్పు విద్యాలయంబులు నేఁటియూళ్ళ!

నేఁటినాగరకత నీమేలుఁ గోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు;
నాయవృద్ధికన్న నావశ్యక పదార్థ
సంఖ్య హెచ్చుఁ జిత్తశాంతి యున్నె?

.. ................................................ కృషీవలుఁడు

జీవనస్పర్ధ సామాన్య చేష్టయైనఁ
గాలమున వ్యక్తివాద మగ్రత వహించు
సత్త్వ విరహితుఁ డన్యభోజ్యత నశించు;
నర్హజీవియె యంతరాయముల దాఁటు.

కాన, జీవనసంగ్రామ కార్యమందు
విజయివగుటకు శౌర్యంబు విద్య బుద్ధి
సత్యసంధత యాత్మవిశ్వాస మనెడు
నాయుధంబుల విడువకు హాలికవర్య.

చాలు విజ్ఞాన మతబోధ! సాంధ్యరాగ
కాంతిఁ బండిన కేసరి కారుచేలు
స్వర్ణసైకత ఖనులుగా బరిణమించెఁ
గనుల కాప్యాయనంబుగఁ గాంచుమోయి.

బారులుదీర యంబరముపైఁ జరియించెడు నీటికోళ్లు లిం
పారఁగ సాంధ్యలక్ష్మి మెడయందు ధరించిన తారహార రే
ఖారమణీయతం జెలుకఁ గాలువనీటికి నేఁగు కన్యకల్
వారక కొంతసేపు కనువాల్పక చూతురు విస్మయంబునన్.

గోపద ధూళి ధూసరిత గోపకుమారులుఁ గాఁపుపిల్లలున్ మూఁపునఁ గఱ్ఱలుం జలిదిబోనపు దుత్తలు, చంకలోనఁ బె న్నొ్మ పెఁడు పూఁడపల్లు లిడి మోహనవేణురవంబు సేయుచున్ మాపటివేళఁగాఁ బసులమందలు దోల్కొనివచ్చి రిండ్లకున్.

స్వారిచేయు నిచ్ఛ భావంబు గలిగింప
బఱ్ఱనెక్కి వచ్చు బాలుఁ డొకఁడు;
వానిఁ గ్రిందఁ ద్రోయు వఱకు బఱ్ఱను బాఁది
సంతసింతు రితరసఖులు నగుచు.

బడి విడిపించంగ బాలురు వీధులఁ
బరుగెత్తి యుప్పరపట్లాడఁ,
బంటచేలకుఁ బనిపాటుల కేఁగిన
కర్షకులిండ్లకుఁ గదలుచుండ,
స్నానంబు లొనరించి సరసుల భూసురుల్
భక్తిభావన సంధ్య వార్చుచుండ,
'సందాకవళమమ్మ సత్తెమేజయ' మని
యాన్నార్థులగు భిక్షు లరుగఁ దేర,

పక్షు లెల్లను గూళులఁ బట్టిచనఁగ
నచ్చటచ్చటఁ దారక లవతరింప
మొలకచీ కటి దిక్కులు మలినమయ్యె,
సంజ రాతిరి గర్భాన సమసిపోయె.

ఇంతకు రాఁడు కాంతుఁడని యింతి విచారముతోడ ద్వారబంధాంతరమందు నిల్చి కనులార్పక దారులు చూచుచుండ నీవంతగ నాలసింపఁ దగవా? మగవారలయట్ల కాతర స్వాంతలుగాక, కామిను లనాగతకష్టము లెంతురెప్పుడున్.

ఆమెను రచ్చలోని వ్యవహారము లూరక పొల్లుమాటలం బోయెను నర్థరాత్రి, మిఁకఁ బొమ్ము గృహమ్ము జేర, బిడ్డలున్ నాయన నాయనంచుఁ క్షణమ్ముగ నేడ్చుచున్నవారు, మున్నాయిత పెట్టె స్నానమునకై నులివెచ్చని నీరు భార్యయున్.

ల య వి భా తి

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి
లలితకలధౌత మృదువిలసనమున పోలెన్
మొలకలిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పం

గెలువపొడి గండపొడి వాలుక సుడి రేగుచును
మొలగు నెలపయ్యరలు నలసతఁ జరింపం
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప, దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబునన్

స్నాన మొనరించి, వెన్నెలచలువ బయల
బిడ్డలు స్నివు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి
పొడుపుకతలు, సమస్యలుఁ బూర్వచరిత
లంత వచియింపు వారల సంతసింప.

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదక చింతలు నిదుర యనెడు
శాంతివారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము, సైరికా, వేగువఱకు.



అరుణాముద్రణాలయము — నెల్లూరు,

# కవికోకిల
# దువ్వూరి రామిరెడ్డిగారి

## సాహిత్యం

---

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కవికోకిల గ్రంథావళి మొదటిభాగము | | (కావ్యములు) | 6—0—0 |
| 2. | ,, | ,, | రెండవ భాగము (ఖండకావ్యములు) | 5—8—0 |
| 3, | ,, | ,, | మూడవ భాగము (నాటకములు) | 4—0—0 |
| 4. | ,, | ,, | నాలుగవభాగము (వ్యాసములు) | 3—0—0 |
| 5. | ,, | ,, | అయిదవభాగము (గులాబితోట) | 3—8—0 |
| 6. | ,, | ,, | ఆరవభాగము (పండ్లతోట) | 3—8—0 |
| 7. | ,, | ,, | ఏడవభాగము (డైరీ—ఉత్తరాలు) | —— |

# విడి ప్రతులు

| | | | |
|---|---|---|---|
| 8. | నలజారమ్మ | (కావ్యము) | 0–8–0 |
| 9. | వనకుమారి | ,, | 1–8–0 |
| 10. | కృషీవలుడు | ,, | 0–12–0 |
| 11, | జలదాంగన | ,, | 0–6–0 |
| 12. | కడపటివీడ్కోలు | ,, | 0–12–0 |
| 13. | యువకస్వప్నము | ,, | 0–8–0 |
| 14. | పానశాల | ,, | 2–0–0 |
| 15. | పలితకేశము | ,, | 1–0–0 |
| 16, | నక్షత్రమాల | (ఖండకావ్యము) | 1–0–0 |
| 17. | నైవేద్యము | ,, | 2–0–0 |
| 18. | భగ్నహృదయము | ,, | 1–0–0 |
| 19. | ప్రథమ కవిత్వము | ,, | 1–4–0 |
| 20. | మిత్రార్థ శతకము | | 0–4–0 |
| 21. | సీతావనవాసము | (నాటకము) | 1–4–0 |
| 22. | మాధవవిజయం | ,, | 1–0–0 |
| 23. | మీరాబాయి | ,, | 1–0–0 |
| 24. | కాంగ్రెసువాలా | ,, | 0–8–0 |
| 25. | సారస్వతివ్యాసములు | ,, | 3–0–0 |

# నారపరెడ్డిగారి గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1. | కవిత | (గేయసంపుటి) | 1–0–0 |
| 2. | అశ్రుమాల | (ఖండకావ్యాలు) | 1–0–0 |
| 3. | మధువనము | ,, | 1–0–0 |

# యువక స్వప్నము

(పద్యకావ్యము)

గ్రంథకర్త:

కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

కవికోకిల పబ్లికేషన్స్

నెల్లూరు

# సవరణపట్టిక



| పంక్తి | - | పుట | ముద్రణ | — | సవరణ |
|---|---|---|---|---|---|
| 3 | - | 6 | మంతయుసు | — | మంతయును |
| 9 | - | 6 | గ్రొందుకొఁనగఁ | — | గ్రొందుకొనఁగ |
| 4 | - | 7 | చూపిఁచు | — | చూపించు |
| 7 | - | 8 | వీక్షింపగ | — | వీక్షింపఁగ |
| 12 | - | 8 | గాంచుచునుఁడ | — | గాంచుచునుండు |
| 3 | - | 11 | పుల్లి | — | ఫుల్లి |
| 5 | - | ,, | పుల్లి | — | ఫుల్లి |
| 11 | - | 14 | విశ్వంబునఁదు | — | విశ్వంబునందు |
| 1 | - | 17 | బుడుకునిఁ | — | బుడుకునిం |
| 3 | - | ,, | పరంపరల | — | పరంపరలు |
| 10 | - | ,, | కఁటకులు | — | కంటకులు |
| 12 | - | 19 | గనుంగ | — | గనంగ |
| 16 | - | ,, | మియుఁదొప | — | మియుఁదోఁప |
| 8 | - | 20 | గొసగన్ | — | గొనఁగన్ |
| 9 | - | 20 | బాలుడ | — | బాలుఁడు |
| 11 | - | 21 | ముగ్ధుఁ | — | ముగ్ధు |
| 4 | - | 24 | తలంచు | — | తలఁచు |
| 14 | - | 24 | నిర్బంద | — | నిర్బంధ |
| 11 | - | 28 | నిద్రమో | — | నిద్రయో |
| 9 | - | 31 | స్పృశ్నవేది | — | స్పర్శవేది |
| 2 | - | 32 | మరలి | — | మఱలి |
| 5 | - | 36 | భవసఁబు | — | భవసంబు |
| 8 | - | 36 | కరింపగఁన్ | — | కరింపఁగన్ |
| 16 | - | 36 | ములటున్ | — | లటులన్ |
| 13 | - | 37 | మరచిలి | — | మఱచితి |
| 6 | - | 41 | యదార్థ | — | యథార్థ |

కవికోకిల

స్వర్గీయ

# దువ్వూరి రామిరెడ్డిగారి

గ్రంథములు

1. నలజారమ్మ (పద్యకావ్యము)
2. వనకుమారి ,,
3. కృషీవలుడు ,,
4. జలదాంగన ,,
5. యువకస్వప్నము ,,
6. కడపటి వీడుకోలు ,,
7. పానశాల ,,
8. పలితకేశము ,,
9. కవి - రవి ,,
10. మిత్రాగ్రశతకము
11. మాతృశతకము
12. గులాబితోట (కథలు)
13. పండ్లతోట (ద్విపదకావ్యము)
14. నక్షత్రమాల (ఖండకావ్యము)
15. నైవేద్యము ,,
16. భగ్నహృదయము ,,
17. ప్రథమకవిత్వము ,,
18. సీతావనవాసము (నాటకము)
19. మీరాబాయి ,,
20. మాధవవిజయము ,,
21. కాంగ్రెసువాలా ,,
22. సారస్వతవ్యాసములు
23. తెలుగుకవితలో క్రొత్తతెన్నులు
24. రేడియో వ్యాసములు
25. The Last Farewell
26. The Voice of the Reed

---

అరుణా ప్రెస్ — నెల్లూరు.

జననీ స్తన్యములాని పాలనురువుల్
సాంద్రమ్ముగన్ బుగ్గలం
దొనకంగాఁ బసిబిడ్డ పేరెదపయిన్
దోగాడురీతిం బయో
ధిని ద్రుళ్ళింతల వీచిపోతములు ధా
త్రీవత్సముం బ్రాఁకుచుం
డెను సాంధ్యారుణ తీరసైకతము డిం
డీరంబులన్ శోభిలన్.

అస్తమించెడు సూర్యునియంశుదీప్తి
జలదముల వింతరంగులు సంతరింప,
గగనతలమంతయును జిత్రకళ ప్రదర్శ
నాలయంబటు రమణీయమై దనర్చె.

పైనఁ గీలాంబుదంబౌ నభస్థలంబు
క్రిందఁ జటులవీచీ విఘూర్ణిత పయోధి,
చూపుమేరల నొండొంటిఁ జొచ్చుకొనుచు
జీవన ద్వంద్వయుద్ధంబు చేయుచుండె.

సందెచీఁకటి దిక్కులఁ గ్రందుకొనఁగఁ
జట్టుపట్టులు మసిబొమ్మలట్టు మాఱెఁ;
జదల మెఱసెడి నక్షత్రచయముదక్క
కన్నులంగట్ట దొండెద్ది కాంతియైన.

అంత సుధాంశుఁడు జలనిధి
యంతరముననుండి వెడలి నాఁడో యన నా
శాంతములఁ జల్లవెన్నెల
లెంతయుఁ బ్రసరింప గగనమెక్కుచుఁ దోఁచెన్.

అమృత శీతలమైన చంద్రాంశు వితతి
సోఁకిన నిమేషమందె యాలోక మెల్ల
స్వప్న మోహనమై స్వర్గ సౌఖ్య లేశ
ము రుచిచూపించుచుండె సమ్మోద మొదవ.

శుభ్ర సైకత తటమందు శుక్తిగర్భ
ముల శశి ప్రతిఫలించుట వలనఁ దార
కల విలాసము మాపంగ జలధి గుప్త
హీరముల బైటఁబెట్టిన తీరుదనరు.

జలధి తరంగమాలికల
శబ్దము దప్ప నిశా గభీర ని
శ్చలతకు భంగముం గొలుపఁ
జాలు మఱేసడిలేదు; పక్షులుం
బలుకవు చెట్లకొమ్మలఁ; బ్ర
పంచపుఁ జిన్నదనంబు చూపు చు
క్కలగమిపూలగుత్తులటు
కాంతిలుచుండె నభఃపుఁబందిరిన్.

కనుచుండం గడుదూరమందు వనధిం
గాన్పించె నక్షత్రమో
యన నేదో యొక కాంతి; యద్ది ధవళం
బౌ పక్షిరూపాంతరం
బునఁ గన్పట్టెను; గొంతసేపటికి నం
భోదంబునాఁ దోఁచెఁ ; జ
క్కన వీక్షింపగ యానపాత్ర బహిరా
కారంబుగాఁ జూపడెన్ .

ఏమిది యంచుఁ జిత్తమున
హెచ్చెడు నబ్బుర మాఁపలేక నో
భామయమైన యా కడలి
బాటను గాంచుచునుండ డగ్గఱెం
గోమల రత్నదీధితుల
కున్ గగనంబున నింద్రచాప రే
ఖా మధురాకృతు ల్వెలయఁ
గన్నులకు న్మిరుమిట్లుగొల్పుచున్

ఆ లలితంపుటోడ సాగ
సార నమర్చిన సింహపీఠి శం
పా లతికాంగి యోర్తుక వి
పంచిక మీటుచుఁ గూరుచుండె, రా
గాలతివిన్న తారలు ర
సాధికతం గరగంగ నుల్కలు
ద్వేలముగాఁగ రాలె ; నిఁక
వేల మనుష్యులఁ జెప్ప నేఁటికిన్ .

అలలున్ గానరసంపు మాధురికి నా
ట్యంబాడఁ జొచ్చెన్ ; నిశా
లలనారత్నము తన్మయత్వమునఁ బు
ల్కల్గాంచెఁ ; జైతన్య చి
హ్నలు దోఁచెం బ్రతివస్తువందుఁ ; బ్రకృతి
స్వాంతంబు ఛందోగతిం
జలియించెన్ లయదప్పకుండ నుచిత
స్థాయిన్ మనోజ్ఞంబుగన్ .

పరవశమైనమానసము
పట్టిక యుబ్బి తరంగితంబునై
పొరలు ప్రమోద నిర్ఝరిక
పోలములన్ డిగజాఱ నశ్రులై ;
చిరమటు గానలీనమగు
చిత్తమునన్ నిలుచూడఁ గాంచి యు
త్తరుణి యనూహ్యరీతిఁ దన
దగ్గఱకున్ ననునీడ్చె వింతగన్.

ఆ యువతిఁ గాంచినంతట
నా యుల్లమునందు భక్తి ననలెత్తఁగఁ జే
దోయి వినమ్రత మోడిచి
కాయము పులకింప నొక్క కడ నిలుచుంటిన్.
రకరకంపు మతాబుల రంగులీను
తరళమణిమయ మకుటంబు తరుణిశిరము
నందు వెలుఁగొందుచుండె బాలార్కబింబ
ముదయ మగుచున్నదో యను నూహవొడమ.

చల్లనిచూపులన్ భువన
జాలము నేలఁగఁజాలు దేవి సం
పుల్ల ముఖారవిందమునఁ
బుష్పొడియట్లు కిరీటకాంతి యిం
పుల్లసిలంగ ఘర్మకణి
కోత్కర బింబితమై యలేఖ్య వి
ద్యుల్లవముల్ జనించునటు
లొప్పె లలాట కపోల పాళులన్.

బొమలఁ గుటిలత్వ మమరిన నమరెఁగాక
చూచుపర్యంత మమృతంపు వీచు లలరుఁ;
బ్రతినిమిష నవ్యమైన యా రమణిరూపు
గనుటకై వేయికన్నులు గాంచవలయు.

ఆ లతాంగికిఁ బ్రక్క నాభీలవికృత
మనుజ శల్యపంజర మొండు కనులఁ గట్టె;
నది సజీవమనుష్యుని యటుల గాన
పారవశ్యమున నటించు బహుళగతుల.

పచ్చినెత్తుటఁ దడిసిన పట్టువలువ
క్రింద జీరాడ వీపున వ్రేలుచుండె;
నుక్కు కోటీరభరమునఁ జిక్కువడిన
యటులఁ బొడకట్టె బొమలు భయంకరముగ.

కరమున దండముంగొని వి
కారపు నవ్వు దొలంక శల్యమూ
ర్తి రయమునన్ నటించు చేతు
ద్రిప్పెనొ దండము నట్టిదిక్కునం
బురముల నిప్పవాగ్ని శిఖ
పుట్టి దహింపఁగ భూతినుండి య
త్తఱి జనియించు నంకురవి
తానము కోమల పల్లవంబులన్.

వల్లకీ తంత్రులను మీటు పల్లవోష్ఠి
పాదములకడఁ బడియుండె భగ్నదండ
ములును, సింహాసన కిరీటములును దరత
రంబుల నృపాలకత్వ గర్వంపుగరిమ.

నను( గని యా తేజస్విని
మనమున( గరుణా రసంబు మల్లడిగొన(గన్
జనని కుమారుని బిల్చిన
చనవున నను బిల్చి తేనెజాల్కొన( బలికెన్:

'ఇంత గభీర యామవతి
నియ్యెడ నొంటరివాడవై సము
ద్రాంతర వీచికా చలన
మబ్బుర మొందుచు( గాంచెదోయి, నీ
స్వాంతమునన్ మనోహరపు
భావము లెయ్యవి మోసులెత్తె? నే
కాంత విహార మభ్యసన
మాట( బయోధితటంబు( జేరితే?

'చదలన్ శోభిలు తారకాగణము నెం
చం బిచ్చియత్నమ్ము స
ల్పుదువో! గారుడ రత్నఖండముల డా
లుం జిల్కు నంభోధిపై
ముదమారం బయనింప నెంతో! గగనం
బున్ దాటు మేఘంబ వ
య్యెదవో! యోసుకుమార, రక్తి యిడ లే
దే లౌక్యసందర్భముల్ ?

'ఏల యధోముఖుఁడవయి
హృత్ఫలముఁ దహియించు శోకకీ
లాలవముల్ దృగంచల వి
లాసములం గసిగందఁ జేయ? నీ
ఫాలము చింతమై ముడుత
వాఱు, బొమల్ దిగజాఱు, బాల్యలీ
లా లలితంపు జీవనక
ళల్ పఱివోవఁ జఱించె దిట్టులన్?

చింతశుష్కించిపోయిన చిత్రకళిక
మఱలఁ దావి గుబుల్కొని విరియునటుల
సలుప నొకప్రాణియైన విశ్వంబునందు
నిన్నుఁ బ్రేమింపదా యేమి చిన్నవాఁడ?

'శోకమెల్లను మోహనాలోకనముల
నరయు నక్షత్ర మంజులమా నభంబు
రోషకుటిల భ్రుకుటి భంగ రూషితేక్ష
ణముల నిసుగాంచెనే? కానినాఁటి కకట!'

అని యిట్లు పల్కి మాఋషులు
కాపయొనర్చు కటాక్షరోచులన్
నను దిలకించు దేవి కరు
ణామృదులోక్తులన్ జిత్తవీణ తం
త్రి సికరముల్ చలింప, జన
నిం గని చెప్పినయట్లు మానసం
బును గలంగించు శోకభర
మున్ వచియించితి నిర్భయంబుగన్:

'తమమున డాఁగి చూపులకుఁ
దక్కని నాపదముద్రలన్ నిరం
తము జలరాశి తీర సిక
తాస్థలిఁ గన్గొన సంచరించి, గా
నమిఁ దననీడఁ బట్టఁ బయ
నంబగు మూర్ఖుని నాఁగ వ్యర్థభా
వమునకుఁ జింతలం బొగులు
బాల తపస్విని నేను శోభినీ.

'అంతుగనరాని సాగరమందు సలిల
బిందువటు లెన్నఁడో మున్ను వేఱుపడితి;
నడుమఁ జుక్కాని లేనట్టి నావమీఁదఁ
జనుచు నున్నాఁడఁ గాలవాహినిఁ దరింప.

'ఎన్ని రేవుల లంగరు లెత్తినానొ!
వెండి, యెన్నిట నింకను వేయవలెనొ!
నేఁడు నీవార్ధితటమున నిలిచినాఁడ
రేపు దెలియదు లంగ రే రేవునందొ!

'నట్టనడి బాటలఁ దుపాను గొట్టుకున్నఁ
గ్రిందిచట్టము గిరిదాఁకి వ్రీలకున్న
దెసలు గుర్తింప ధ్రువతార యెసఁగుచున్నఁ
జేరవచ్చు జన్మస్థానసీమ త్వరగ.

'జననీ, లోకచరిత్రముంగనిన నా
స్వాంతంబు కీలాలపుం
దునకల్ గ్రక్కెడు, నగ్ని పర్వతము స
ద్యోభిన్నమై పేలఁగ

ఘనఘూమంబు శిలాద్రివం బుడుకు నిం
డం గ్రమ్ము చండాన దు
ష్టనపాపాగ్ని శిఖాపరంపరల సం
ఘా దించె నద్దిక్కులన్.

'బలయుతమైన జాతి యిలఁ
బాలనసేయు; నధర్మమయ్యు భూ
తలపతి ముద్రవడ్డ నది
ధర్మము యౌను, ప్రజాళి సౌఖ్యముం
దలఁపక యాత్మభోగ పర
తం జరియించు వసుంధరాపతుల్
పంచవృధు లోకకంటకులు
పాలనసేయఁగ శాంతిగల్గునే?

* * * *

'కడుపునకుఁ గూడుదొరకక గాసిఁజెంది
అన్నమును దొంగిలించిన యతఁడుదొంగ;
రాజ్యలోభంబునను బరపిజల హత్య
సలుప నసిపూన ధర్మశాసనుఁడతండు!

* * * *

అందఱును గూటిపేదలై యడలుచుండ
నెవరొ కొందఱు ధనికులై యేమిఫలము?
మత్తమాతంగమున కాకలెత్తి పఱవ
ముండ్లకంచె లడ్డంబులే ముందు కేఁగ?

* * * *

'సంఘసరసి దురాచార శైవలములు
గప్పివైచెను నీరంబు కంపుపట్ట;
సతము స్వాతంత్ర్యముం గోరు సారసములు
నిలువ నొక యాంగుళంబైనఁ దలము లేదు.

'పాలకత్వ చక్రం బొకవంక, వేఱు
ప్రక్క నాచారచక్రంబు ప్రజల నెప్పుడు
గానుగను ద్రిప్పినట్టులఁ గదిపి రాచు
మానవత్వ స్వభావమే మఱపు రాఁగ.

'ధరణి తలమెల్లఁ గంటక తరు లతలకు
నాకరంబయ్యెఁ బూలంటు లసుగు పట్ట;
దుంప మొదలంట నాఁగట దున్నకున్నఁ
దల్లిపూజకుఁ గుసుమంబు లుల్లసిలవు.

అనవిని, మోమునందు దర
హాస రసాంకురముల్ చిగుర్ప న
జ్జనని విపంచి తంత్రులను
జక్కఁగ దిద్దుచు నన్నుఁ గాంచి; 'నీ
మనమున వల్లకీ రచిత
మంజులగానము నాటె; నింక మే
ళన మొనరింపుమీ పదము
లన్ మధురంబగు మద్విపంచికన్.'

అన, నిటులంటి నేను విన
యాంజలి: 'నే భువనంబునుండి యీ
వనధికి యానపాత్రమున
వచ్చితివమ్మ? నినుం గనుంగ నా
మనముఁబరీక్ష సేయవిను
మానపువీణియమీటు దేవతా వనితవొ,
లోకమాతవోకొ, వాణివొ, యే
మియుఁదోప దూహకున్.

'నీదు కనుచూపు సోఁకిన నిద్రనుండి
లేచుఁ జైతన్యజగతి చలించు నటుల,
నెవ్వతెవో గాని; పసలేని యెమ్ములందు
జీవకళల నుట్టించెదు చిత్రగతిని '

నే నిటు వచియించిన విని
యా నవనీతమృదుహృదయ యాదరమున నా
యాననముఁ జూచి పల్కెను
మానసమున జ్ఞానదీప్తి మల్లడిగొనఁగన్:

' బాలుడవు నీ వెఱుంగవు ప్రకృతిగర్భ
మందు నెంతటిశక్తి పెంపొందునదియు
నణువునందున్న తేజస్సె యధికమగును
ఒక్క భువనంబుఁ జూర్ణించి యూఁదివైవ.

' ధర్మము నడంచి దుర్జనత్వము పెరుంగ
జగతిఁ బ్రతికారశక్తియు జన్మమెత్తు:
ఆస్వరూపము నేను; జనాళి నిద్ర
మేలుకొలుప విపంచిక మీటుచుందు.

'నాకు సహకారిణియై యాజ్ఞ నడపుచుండు
నిరత మీ శిల్పమూర్తి-నిర్ణిద్రశక్తి;
అతఁ డెచ్చోటఁ గాలూను నా స్థలంబు
అభినవోద్యానాంశుల నందగించు.

'అఖిలలోకంబుఁ గాలచక్రానుసరణి
యాత్ర సేయుదు మిరువుర: మింత యేల?
జనుల స్వాప్నికబంధంబుఁ జదిపి నైచి
మానవసమత్వ మొనరింప మాతలంపు.

*   *   *   *

'పాంచభౌతిక జగతిఁ బెంచికొంటి
ననుచుఁ గడు విఱ్ఱవీఁగుచున్నాఁడు నరుఁడు;
ప్రకృతి హసియించుచున్నదా పరమమూఢ
దైన మనుజుని గర్వంబు నరసియరసి.

'బాలకా, యింకఁ జాలు నీపాటిభావ
వినిమయం; బర్ధరాత్రము వెళ్ళిపోయె;
వచ్చెదే నీలనీరధి భంగములను
నావ నడుపుచుఁ బోదము రేవుఁ జేర.

మనము చరించుమార్గమున
మంజులమహా నౌకయంతరీప ముం
డు; నచట నొక్కహర్మ్యము క
డుం బొడవై గగనంబునంటుచుం
గనక మణి పరిభాసితము
గాఁ గనుపట్టును; జూడఁగోరు నే
రును జనరానిరీతి నము
రుం బోలమెక్కొడి వేఁటకుక్కలుఁ గా.

'నేలఁ బ్రాఁకు చీమయున్నైన నింగినెగురు
ఖగములైనను గుక్కల కంటఁబడను,
పోతుటీఁగయుఁ జొరరాక పొంచియుండు
శ్వానముల మోసగించి పోవలయు మనము.'

'ఏల యీకష్టమంతయు? నింతశ్రమకుఁ
బ్రతిఫలంబుగ మనమేమి పడయఁగలము?
తూర్పునకు ననుకూలమైదోఁచె గాలి,
యెత్తెదను దెరచాపల నింకజనని.'

'కాదు కాదోయి, యచ్చోటఁగలదు నాకుఁ
దలఁపులంటిన బాల్యబాంధవి యొకర్తు;
ఎవ్వతెయొయన్న సంశయంబేల నీకు?
వెలఁది మీతల్లియేసుమ్ము వెట్టివాఁడ.'

ఎన్నడెఱుఁగని యావార్త విన్నయంతఁ
బిడుగడఁచినట్లు నామది బ్రీలిపోయె;
మొలకలెత్తెను. బులకలు, గలఁగెఁ దలఁపు;
సుంతసేపిట్లు మాఱిన్నడి చూచుచుంటి.

అంతట దేవిపాదముల

యం దలికమ్మును మోపి మ్రొక్కి, నా

చింతలువాపు తల్లి, యని

చిత్తమునన్ భజియించి పాదప

ద్మాంతర రేణువుల్ శిరము

నందువహించి వచించినాఁడ: 'ము

న్నింతను నీరహస్యమును

నెప్పుడు నేవిననైతి నెచ్చటన్.

'తల్లిమరణించె నాచిన్నతనమునందు
ననుచుఁ గల్లరులెవ్వరో వినిచినారు; ।
స్తన్యమాధురి, మాతృ శీతలకటాక్ష
ములకు నెడఁబాతి నని మున్ను తలంచుచుంటి.

'అట కేటుపోయె మాజనని?
హార్మ్యము నెవ్వరుగట్టినారు? న
న్నిటు చరియింప నొంటరిగ
నేల త్యజించెను దల్లి? చిత్తసం
పుటమునఁ బ్రేమ జీర్ణమయి
పోయెనె? జాగిలముల్ సతంబు న
చ్చటఁ బరిముట్టి కాఁపుఁదల
సల్పుటయేల? వచింపుమమ్మరో'.

'జనని స్వేచ్ఛావిహారంబు సలుపునదియొ
కాక, నిర్బంధవాసంబు గడపునదియొ!
తెలుపుమమ్మ, తల్లి ఋణమ్ముఁ దీర్పలేని
కొడుకునై పుట్టితిని, కన్నకడుపుచేటు.

'హృదయముఁ గోసియిత్తుఁ గను
లేనియుఁ జేతులఁదీసియిత్తు, నా
పదలకు నగ్గమైనను న
పాయముగల్గినఁ దాళికొందు; నా
యెద సుఖియింపఁ దల్లి మొగ
మెట్టుల నుంతునొ చూడనిమ్ము; నీ
పదముల నమ్మినాఁడ, నను
బాలను ముంచెదొ నీటముంచెదొ.

అనవిని, దేవిపల్కె మన
మం దనుమానము తీఱకున్కి: 'నీ
జనని గాంచు నాతురతఁ
జల్పితివో శపథంబు లేక, ధ
ర్మనియతి గారవించెదొ కుమా
రక, నిశ్చలదీక్షఁబూని మా
తను గనుఁగొంక పీడనని
తాఁకుము నా పదపంకజంబులన్.

చెప్పెనో లేదొ యంతలోఁ జేరవచ్చి
పాదతలమునఁ దలమోపి ప్రతిన సల్పి
నంత, నానందపరవశయైన దేవి
'కొడుక, రమ్మని' కౌఁగిటఁగ్రుచ్చె నన్ను.

అనుకూలంబుగ వాయువుల్ దెరలరా
యట్ నావ కల్లోలవీ
థిని నుయ్యాలల నూఁగు నంచచెలి రీ
తిం బోవుచుండెన్ నభం
బున నక్షత్రములెల్లఁ గల్యరుచి నిం
పుల్వాసి శుష్కించి పో
యినదాఁకం; దదనంతరంబు గనన
య్యెన్ దీవి యల్లంతటన్.

భూతల స్వర్గమట్టులఁ బూర్వమందుఁ
గాంతిలిన దీవిఁగన నేఁడు వంతగొలుపుఁ;
బుష్పలాకులు రాలిన పూలచెట్లు
జలములేక విశీర్ణమై చచ్చు నకట!

అమృతదుగ్ధంబు పితికిన యావుపొదుగు
నెత్తురుం బాలు గురిపించు నేఁడు చూడ;
నిర్మలాంబులు పాఱిన నిర్ఝరిణులు
అశ్రుశీకర కశ్మలనై స్రవించు.

లతలు పులకింపఁ దోఁటపాలాల మేను
మఱచి పాడిన కోయిల లురులఁజిక్కె;
భావ భేదక శోక రావంబు దక్క
మధురగానంబు వినరాదు మావులందు

అస్థిమూర్తిని బోతంబునందు నిలిపి
హార్మ్యశ్రీమును జేరుమార్గంబు నరయుచుండఁ
గాలిబాటలన్నియు ముండ్లకంపతోడఁ
బరులు రాకుండ మూసిన పగిదిఁ దోఁచె.

పారా దిరిగెడు కుక్కల
బారిం బడకుండ గూఢపథమున నేఁగం
జారుమణి ద్యుతిఁ గను సాం
పారెడు సౌధంబు మాకు నగపడె నెదుటన్.

యువకస్వప్నము ... . .. .. . . ....... . . .

లోనికిఁ బోయిచూడ నతి
లోకమనోహరమైన చిత్రముల్
గానఁబడెన్, సువర్ణమణి
కల్పితమై సకలంబు వీక్షణా
నూన ముదంబుఁగొల్పె; నట
నొక్కెడఁ బట్టు తివాసిపైనఁ జం
దారినన యొత్తుగూలఁబడి
నట్టుల నిద్దురఁ గన్నొగిడ్చెన్.

ఒడలెఱుంగని నిద్దుర నున్నకాంతఁ
గాంచి దేవి శోకాశ్రులు కనులజాఱ
మూర్ఛయో నిద్రమో యని ముక్కుక్రిందఁ
జేయిపెట్టి చూచి నిరంత చింతఁ బొగిలె:

'కనుము కుమార. మీజనని
గాంచిన యీదురవస్థ! మూర్ఛవో
యెనో, నిదురించెనేమొ, చలి
యింపవ యంగములెల్లచూడ, ము
క్కున నొకకొంతయూర్పుగలు
గున్, మరణంబును గాదు; ద్రోహచిం
తనమతు లెవ్వరో యిటులఁ
దన్నొగిలించినరీతిఁదోఁచెడిన్,

దేవి వచించుమాటలు మ
దిం గరఁగించిన యుక్కువోసిన
ట్లై వెతఁ బిచ్చిపట్టినటు
లమ్మ పదంబులపజ్జఁ బొర్లుచుం
జేవదొలంగి వెంద్రుకలు
చిందఱవందఱ లాఁగికొంచు శో
కావిల బాష్పబిందు నిచ
యంబులు గాల్వలుగట్ట నేడ్చితిన్.

అంతట వీణాతంత్రులఁ
గాంతామణి మీటి దివ్యగానము సేయం
గొంత యెడకుఁ గనుఱెప్పల
నంతింతగ విచ్చి చూచె నమ్మ్రయు యమ్మ్రన్.

బ్రదికెఁగదా యటంచు మది
పట్టని సంతస ముప్పతిల్ల నా
యదవదమాని తల్లివద
నాంబుజముం గనుచుండఁ బల్కనో
రోదవమి మాకుఁ గన్పటిచె
నుల్లమునంగల భావ ఘర్షణా
స్పద చిరకాల శోక దవ
వహ్ని దృగంచల చంచలాకృతిన్.

ఎన్నఁడో పట్టెఁడన్నముఁ దిన్నయటుల
గరము కృశియించియుండెను గాయమెల్ల
నూఱుగాలపు ముదియవ్వ తీరుగాఁగ
ముడుత వడియుండెఁ జర్మంబు మోమునందు,

హార మణిమయ కోటీర భారమునకుఁ
గంత మొక్కింత వ్రాలినగతిఁ దనర్చు ;
హస్త వలయంబులును గాలియందియలును
రత్నకాంచీకలాపంబు రవళిగొల్పు.

వల్లకిని మీటుటను మాని, యుల్లమందుఁ
జిన్నతనపు నేస్తంబు క్రొంజివురు వెట్టఁ
దల్లి మేన సుఖస్పర్శ దవుల నిమిరె
నంగుళీ పల్లవంబుల నా మృగాక్షి.

స్పర్శవేది యంట నినుము బంగరటుల
మాఱుపగిది శోభిని సుకుమారమైన
చే దవిలి పునర్జీవన చిహ్నా లమరి
యెప్పటి మెఱుంగుతో నమ్మ యిట్టులనియె:

'రెండు తటములమధ్యఁ దరింపరాని
నీల నీరధి సలిలంబు నెగడునటుల
నెన్నియోయేండ్లు మనలను నెడము సేసెఁ
గంటి చూపైనలేని యీ కఠిన శిక్ష.

'విూ ప్రబోధము విన్న నిమేషమందె
తరలిపోయిన జీవంబు మరలివచ్చె;
స్వప్న బాధంబులు నలక్ష్య సరణివదలె
సారసాప్తునిఁ గన్న తుషారమటుల.

'క్రిమ్మఱ నాకు బాల రవి
కాంతులు గాంచెడి భాగ్యమబ్బునో
యమ్మ' యటంచు దీన వద
నాంబుజనై హృదయంబు నేర్చు వా
క్యమ్ములు పల్కఁ దల్లి, యిటు
లంటిని: 'నిన్నుఁ దపింపఁజేయ హీ
నమ్మగు నిట్టి శిక్షణ మొ
నర్చిన వారెవరో వచింపుమా.

అనవిని తల్లి వచించెను:
'తనయా, రక్తంబుఁ గ్రాఁచు దారుణ దుఃఖం
బును గదలింపఁగ ఫలముం
డునె? నైననువినుము విధి కఠోరపుఁజేష్టల్.

'అరుణ మయూఖ చిత్రితము
లై దిశలెల్లను సాంధ్యమంజిమ
స్ఫురణము గొల్పువేళ నల
వోకఁ జరించెడు పూలతావి ప
య్యెరలటు వీచుచుండ మది
హాయి జనింపఁగ నల్లఁ గాననాం
తర నలినీతటాక సిక
తాస్థలి నే విహరించుచుండఁగన్.

'కోరని కోర్కెగానటకుఁ
గోఁతి యొకం డరుదెంచి మ్రొక్కి యా
తీరునఁ బల్కెఁ: ''తల్లి, వన
దేశము పూవులుగాయ పండ్ల నా
హా! రమణీయనందన వ
నాంశము నా విలసిల్లుఁగాని, శృం
గారము నిమ్మడింప నిటఁ
గానము వానర మేడఁజూచినన్.

' "మానివాసము కిష్కింధ, మధురసంబు
నెంతగోరిన నంతమీ కియ్యఁగలము;
కాలఁ జూపిన హీనంపుఁ గార్యమైనఁ
జేతఁ గావింతు మమ్మ విశేషభక్తి.

' "ఈవనంపు సౌభాగ్యము నెఱిఁగియున్న
వన్యమృగములు నిందుండ వాంఛసేయు
మేము వసియింప నెంతటి మెకము గాని
వనిఁ బ్రవేశింప వెఱచును భవ్యహృదయ."

'అని వసియింపనాజ్ఞగొని
యంతఁ గ్రమంబుగఁ గోఁతిమూఁక యా
వనముననిండి పక్వ ఫల
భార వినమ్రములైన వృక్షముల్
గనఁబడుచోట్ల నెల్లఁ దమ
కాఁపురముల్ నెలకొల్పి, మోసపుం
దనమునఁ బండ్లకాయల
దినంబును మెక్కుచుఁ గొల్లగొట్టిరన్.

ఫలభారంబున వ్రొగ్గుచున్న తరువుల్
పాడెత్తి నట్లాయెఁ గా
యలుపిందెల్ పువు లాకులుం దటిగి హే
యంబైన రూపంబునం
బాలు పేదన్ వన మేనుగాంచి యిఁక దా
పుం జేర రాదంచుఁ గోఁ
తులకుం దెల్పిన భక్తి మ్రొక్కి యిటు నా
తోఁ బల్కె దీనమ్ముగన్.

'' తెలిసి తెలియక మేమిట్లు సలిపినాము
తప్పు మన్నించి కావంగఁ దగుదు వీవు;
ఐన మాంచేతనైన సాహాయ్య మొండు
పొనరిచి కృతజ్ఞతం దెల్ప బుద్ధి పుట్టె.

'' రమ్ము తల్లి, పూఁదోఁట పాలమ్ము నందు
హేమ హర్మ్యంబు గల దందు నిష్టమైన
రత్న భూషణములు దాల్చి రాణి వగుచు
మమ్ము నేలుచు నుందువు సమ్ముదముగ.''

'అన. నిది కొంతభాగ్యమని
యాసయు దొడ్డదిగాన మాఱుమా
ట నుడువ కేను సమ్మతప
డన్ ముదమందుచు నన్నుఁదెచ్చి యీ
ఘన భవనంబునం దునిచి
కాంచన పీఠము వెట్టి రత్న మం
డనములఁ గొన్ని యేర్పఱచి
నన్నలరింప నలంకరింపఁగన్.

'ఒక్క ముదికోఁతి రత్న హీరోజ్జ్వలంపు
ముకుటమును నాశిరంబునఁ బూన్చి నంత
నేమి సెప్పుదు భరము! నా హిమగిరీంద్ర
శృంగ మూఁదలఁ దాల్చినరీతి నొప్పె.

'మఱియొక వానర ముఖ్యుఁడు
కరముల వలయములఁ బెట్టెఁ గదలుటయును దు
ష్కరమై దారుణ శిక్షను
జిరము ననుభవింపఁ జేయు శృంఖలములటన్.

'బంగరువుటందె వేఱొక వనచరుండు
కాలఁ దగిలించినంతనే కదల మెదల
లేక యురులలోఁ జిక్కిన లేఁడి యుసుల
నింతదశ కగ్గమై విలపింతుఁ దనయ.

'కప్పయెలుఁగు పాములు, బూజగప్పియున్న
బావులును, మేఁకతోల్పులుల్ వానరములు;
కపటరీతిని నన్నల్లు గట్టివైచి
స్తన్యమును గ్రోలసాగెను సంతసమున.

'పాలను ద్రావుచు నవియుం
జాలక రుధిరంబుఁ గూడఁ జవిగొనుచుండన్
మూలములు దెగి ధరాస్థలి
వ్రాలెడు వృక్షంబు పోల్కిఁ బడితిఁ గుమారా!

'అంత మైమరచితి, నేమి యైనదియును
దలఁపలేను; వీణానినాదంబు విన్న
యంత లోకంబు దెలిసె' నంచమ్మ పలుక
విని యిటంటిని దుఃఖ గంభీర సరణి:

'కనులం గాల్వలు గట్టె నశ్రుజలముల్,
కంఠంబట్టెన్ గద్గద
ధ్వని, నీ పూర్వమహత్వ మిప్పటి యధః
పాతంబు చింతింప నే
మనఁగన్, బంక నిమగ్న ధేనువటు లా
హాకారముల్ సల్పె నిన్
గన, నేపుత్రుని హృత్పుటం బగిలి క్ర
క్కల్గాదొకో మాతరో,'

* * * *

అని నేను శోక కుంఠిత
మనమున మాటాడ లేక మాతృ పదములా
గని బాష్పంబులఁ దడుపుచుఁ
బనవుచు నుండంగ దేవి వాకొనెఁ గరుణన్:

'చెల్లెలా, నీవు నింత దుఃస్థితిని నుంట
దెలియరాదాయెఁ బశ్చిమ తీరమునకుఁ;
గాకయున్న మున్నెన్నఁడో గాంచియుందు ;
శయ్య విడుమమ్మ, తరుణ మాసన్నమయ్యె.

'తలుపుఁదీయుమ, బాలసూర్య రుచి ని
ద్రాళయ్య వెల్గించి నీ
తలఁపుఁ గల్యసరోజినీ వికచతన్
దర్పింపఁ జేయంగ; రా
త్రులు వర్షాగమమందు దీర్ఘములుగాఁ
దోఁచంగ నేమాయెఁ! దు
ర్జ్వల చండార్క కర ప్రచారముల సం
బాధించునే బాంధవీ.

'నిదురం గూరిన నిన్నుఁగాంచి యిహీహీ
నీకిప్డు రూపాంతరం
బుదయం బయ్యెను; బూర్వరూపిణివి గా
వోఁ బేలయుం జెన్ను దు
ర్మద మాయూవుల మంటనమ్మి యవె సం
భావించితే, పుత్రులీ
యదనన్ దర్పణ మెత్తువారు గనుమా
స్వాకారముం జెల్లెలా.

'నిరతంబున్నిశయే చెలంగునె? తమో
నిర్మూలి హేతిచ్ఛటా
భరణుండై యుదయింపఁడే? కుముదమే
భాసిల్లునే? తేపు దు
ర్భరమౌ తప్పులగోడువోదె? హిత చ
క్రంబుల్ ముదంబంద వే
ధర నెవ్వారికిఁ గష్టకాలభర మం
తంబొందదే సోదరీ.'

అని వినినంతనే మేలుకు
వాయె; సరస్సున కేఁగుతల్లి స
న్నని 'నిదురింపనేల కొడు
కా, తరుణారుణ కాంతి దిక్కులం
దనరె జపా సుమంబులటు;
దామెన లాఁగుచు లేఁగదూడ యాఁ
కొనియఱచుం, గులాయములఁ
గూసెడు పక్షులు లెమ్ము' నావుడున్

యువకస్వప్నము

కనులెత్తి చూడఁ దల్లియుఁ
జనుచుండెను నీటికొలకు; శయ్యను నేనుం
టిని. తరువుల రవికాంతులు
గనన య్యెను ప్రొద్దుపొడుపుఁ గన్నె తనమునన్.

ప్రతినిశను నిట్టి స్వప్నంబు వచ్చునేని
స్వప్నము యదార్థ రూపంబుఁ బడయునేని
దీనదాస్యాస్పదంబగు దినముకన్న
నాస గొలిపించు నిశయె సౌఖ్యావహంబు!



# కడపటి వీడుకోలు

(పద్య కావ్యము)

గ్రంథకర్త :

కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

కవికోకిల పబ్లికేషన్స్

నెల్లూరు

# సవరణపట్టిక

| పుట | - | పంక్తి | ముద్రిణ | — | సవరణ |
|---|---|---|---|---|---|
| 5 | - | 5 | ఆకసపుభత్తి | — | ఆకసపుటత్తి |
| 5 | - | 7 | బొదలునుండె | — | బొదలుచుండె |
| 7 | - | 16 | విభాన | — | విధాన |
| 8 | - | 3 | పుక్కిళి | — | పుక్కిలి |
| 9 | - | 7 | యురియాడు | — | నురిమాడు |
| 13 | - | 1 | దౌలకఁణ | — | దౌలఁకణ |
| 15 | - | 4 | నూతఁకజ్జ | — | నూఁతకజ్జ |
| 16 | - | 9 | కాలమునందుం | — | కాలమునందు |
| 17 | - | 4 | విపుగ్ధుఁడై | — | విముగ్ధుఁడై |
| 17 | - | 10 | కలను | — | కనుల |
| 18 | - | 2 | జదుపం | — | జదుపం |
| 19 | - | 11 | మధురబాషి | — | మధురభాషి |
| 21 | - | 3 | నీటికోళుల | — | నీటికోళులు |
| 21 | - | 6 | మునిరి మునిరి | — | మురిసి మురిసి |
| 21 | - | 18 | యెనిమిదేండ్ల | — | ఎనిమిదేండ్ల |
| 24 | - | 7 | కనుల | — | గనుల |
| 24 | - | 10 | జెవులగ్రఁమ్మ | — | జెవులఁగ్రమ్మ |
| 25 | - | 5 | మాభవి | — | మాధవి |
| 27 | - | 9 | జుసుదెఁచ | — | జుసుదెంచ |
| 29 | - | 4 | నిష్ఠరిణి | — | నిర్ఝరణి |
| 31 | - | 2 | నాసన | — | వాసన |
| 31 | - | 9 | తెఁపితివి | — | తెంపితివి |
| 32 | - | 2 | ట్టనియె | — | ట్లనియె |
| 32 | - | 3 | కల్గుట | — | గల్గుట |
| 32 | - | 4 | జతసఁబులు | — | జతసంబులు |
| 32 | - | 5 | వాంఛలకుఁ | — | వాంఛలకుం |
| 35 | - | 13 | దలంచు | — | దలఁచు |
| 33 | - | 3 | కాండమ | — | కాండము |
| 33 | - | 9 | గడుపులోన | — | గడుపులోన |

క వి కో కి ల

స్వర్గీయ

# దువ్వూరి రామిరెడ్డిగారి

గ్రంథములు

1. నలజారమ్మ (పద్యకావ్యము)
2. వనకుమారి ,,
3. కృషీవలుడు ,,
4. జలదాంగన ,,
5. యువకస్వప్నము ,,
6. కడపటి వీడుకోలు ,,
7. పానశాల ,,
8. పలితకేశము ,,
9. కవి - రవి ,,
10. మిత్రార్ధశతకము
11. మాతృశతకము
12 గులాబితోట (కథలు)
13. పండ్లతోట (ద్విపదకావ్యము)
14. నక్షత్రమాల (ఖండకావ్యము)
15. నైవేద్యము ,,
16. భగ్నహృదయము ,,
17. ప్రథమకవిత్వము ,,
18. సీతాపనవాసము (నాటకము)
19. మీరాబాయి ,,
20. మాధవవిజయము ,,
21. కాంగ్రెసువాలా ,,
22. సారస్వతవ్యాసములు
23. తెలుగుకవితలో క్రొత్తతెన్నులు
24. రేడియో వ్యాసములు
25 The Last Farewell
26. The Voice of the Reed

అరుణా ప్రెస్ — నెల్లూరు.

అమరపట్టణ మణిమయ ద్వారములను
తెఱవఁ బురలక్ష్మి పెండ్లికూఁతురు విధాన
పసుక తెరనొత్తి దొంగి చూచెడినో యనఁగ
నావరించె నుషశ్శోభ లంబరమున.

ఆకసపుభత్తి నదికిన యట్లు లెదిగి
వాఁగుగట్టుల నీడలువాఱు వెదురుఁ
బొదలు తరుణారుణాంశులఁ బొదలునుండె
జీవకళ లుట్టిపడియెడి చిత్రమతుల!

కొండ సెలయేళ్ళఁ, దుంగలు మొండుకొన్న
గఱికపట్టుల, మెడలు ఱెక్కల నిమిడ్చి
కూర్కుచున్న యడవిబాతుగుంపు లిపుడె
పాఁచి మేఁతకు రెపరెపఁ బఱుగులెత్తె.

పండుటాకు పఱుపులఁ బన్నుండియున్న
లేటికొదమలు నిద్దుర లేచి పొద్దు
పొడుపుటెండల మూల్గుచు నొడలుసాఁచి
క్రేళ్ళు దాఁటుచుఁ బచ్చబయళ్ళ కరిగె.

స్నాన మొనరించి, దర్భాసనములు పఱచి
భూతిరేఖలు సవరించి పుణ్యమతులు
ఋషులు గాయత్రి జపియించి యినునకర్ఘ్య
మొసఁగి తరలిరి మునిపల్లె వెసకునిపుడె

కలువల పుప్పొడిఁ వలచు కమ్మనియూఁటలఁ దోఁగి మానిక
న్య లొడలు పుల్కరింపఁ దడియారని చీరలతోడఁ గుంతలం
బుల జలబిందువుల్ దొరఁగ, బుంగలు సందిటఁబూనియాశ్రమం
బుల జరుదెంచుచుండిరి తపోవన చూత తరూపవాటికన్.

తెలుపఁగరాని భావముల తియ్యదనాలకు నార్ద్రమైన కో
మలహృదయంబుతో ఋషికుమారికయొక్కతె వచ్చి నాఁచుతీ
వెలఁ దలలం దవిల్చికొని పెల్లుగ ఱెక్కలు తట్టియార్చు బా
తులపయిఁ జల్లు దోసిళులఁ దోయముఁ గన్నతనం పుటాటలన్.

వాఁక నీట నీడలువాఱ వంగియున్న
మావికొమ్మను కోయిల మధురగీతిఁ
బాడుచుండఁగ, నామ్రద్రుమశిఖి నేర్వ.
దాని ననుకరించును ముగ్ధ గానలుబ్ధ

సరసంబైన నవీనయౌవనపు వాసంతోదయశ్రీలు ని
బ్బరమై పూచినవో యనంగ. నతిలావణ్యంబునం బొల్చు సుం
దరి క్రీడించుచుఁ బ్రొద్దుపోయినది ధ్యానం జూడకే పిల్ల ప
య్యెరకున్ రేఁగు కరళ్ళ బుంగనిడి నీరాడన్ వినోదంబుగన్.

నీటిముత్యాలు చిలికెడి నిడుపుకురులు
అలలకౌఁగిట సారూప్య మందియాడ,
నొడలి నిగ్గులు తడిచీర నుండి వెడల
సలిల లక్ష్మి విభాన నా వెలఁది దోఁచె!

జలకములాడియాడి, యింకంజాలును, బారెడు ప్రొద్దువోయెనా టలం; జెలు లెవ్వరైనను దటంబునలే, రనురాగలాలనం బులం జివురాకు క్రొన్నెమరు పుక్కిళితో నను నంటివచ్చి యం చల నిలుచున్న యా హరిణశాబము పిల్చినరా దెటేఁగెనో?

అని తలపోసి, చేతులకు నందిన తామరపూలు గోసి, బుం గను గనుగొన్న నయ్యదియు గాలికిం దేలుచు వాంకమధ్యకుం జన, నింక నేమి సేయుటకుం జాలక దిక్కులుచూచుచుండి తూ ళ్ళను వలకేల బాల యవలంబముగాంగొని లోంతుసొచ్చినన్.

పాంచి పట్టిన బండలం బదము లిడిన
సట్టు సట్టునం గ్రిందికి జాఱుచుండె,
సన్న తూండులు మోంపున సడలియాడ
విఱుచుకొని నట్టనడివాంక వెలంది పడియె.

పడి యాబిత్తరి తత్తరంబునం గటా! వాపోవుచుం జేతులన్ వడి నట్టిట్టుల నీటదాంచు, మునుగుం బైపైనం దేలున్, నెఱుల్ జడలై ప్రక్కలం దేలియాడ, నురులై శైవాలవల్లుల్ కడుం గడుం గాళ్ళేతులు చుట్టుకొన్న మెదలంగాలేక తేలంబడెన్.

సమిధల నేరవచ్చి తరుశాఖ నిలంబడి, నవ్యయావనం
పు మధువులొల్కు కమ్మవిరిబోణి వినోదములెల్లఁ గాంచుచుం
బ్రమదమునొందు సుందరతపస్వికుమారుఁ డొకండువచ్చి వే
గమొ, దురవస్థఁ జూచి చెలిఁ గావఁ దటాలునదూఁకె నీళులన్.

పసరు టాకుల పోలిక మిసలు గులికి
యంటినను మెత్తగిలు సకి యంగకములు
నీట యురియాడు నలసట నిలువలేక
చలనహీనమ్ములై కొంత చల్లవడియె.

కన్నులుతేలిపోయి కసిగందిన మోమునఁ గ్రమ్మియున్న యా
పెన్నెటిగుంపుఁ జేనొడిసి వీలగునంతకుఁ దేలలాఁగుచుం
గన్నియ నెట్టులో యిసుకగట్టునఁ జేర్చి కుమారవర్యు డా
పొన్నతితోడ నొక్కనిడియూర్పు నిగిడ్చె, మఱేమియెంచెనో!

అంసకీర్ణంబులును నితంబాశ్రితములు
సమద భృంగపతాంకుర శ్యామలములు
శిథిలసుమముల వాసించు చెలియ కురులు
పిడిచి ముడివైచె దయతోడఁ బడుచుతపసి.

తనయురంబునఁ దన్వంగి తలను నాన్చి
వల్కలము పిండి తడియార్చి వాడుపసలఁ
దోఁగు వదనంబు మెల్లగఁ దుడుచుచుండ
నంకురించెఁ జైతన్యచిహ్నములు మేన.

రేకులువిచ్చు పూమొగడ రీతిఁ గనుంగవ విప్పి చూచు మఱ్
ఆ కమనీయరూప తలఁ పాకులపాటున శూన్యమౌటఁ దా
నేకడ నేయవస్థ నిటు లెందుకు నుంటయు నూహసేయఁగా
లేక సగంబు మోడ్చెఁ గదలింప భరంబగు కంటిఱెప్పలన్.

'లలనా! యెంతటిమందభాగ్యుఁడనొ, భాగ్యంబందునీవాఁకయుం
చల నెంతే నెడసైఁపలేని వలపున్ సఖ్యంబునుంగా నెడా
టల లేసంజలు జాఱినట్టి మన కీడ న్నేఁడు నీలాంటి న్యా
ద్దళనానోన్య విరక్తదర్శనము ప్రాప్తంబయ్యె నీనాఁటికిన్.

కన్ను ఱెప్పల నెత్తి నీ పిన్ననాఁటి
యనుఁగుఁ జెలికానిఁ జూపుల నాదరింపు ;
చెలిమిపూదండఁ బసినాఁడె నులిపి చిర వి
వాసినైన నా ఋణ మిందుఁ బాపుకొంటి.'

పూర్వపరిచిత మధుర సంబోధనములు
వెలఁది వీనుల విందుగా విన్నయంత,
నటు దిరిగి చూచె బాష్పకణార్ద్రనయను
బాల్యసఖుని గౌతముని విభ్రాంత యగుచు.

కలయౌనో ! మోహమౌనో !
తలఁపులు చెదరినవో ! లేక తథ్యమొ ! యని యా
చెలి తలపోయఁగ మెఱుఁగటు
జలపతన స్మృతియు మదిని సరగున మెఱసెన్.

తన సురనష్ట కన్నులకుఁ దట్టిన పోలిక మేను కంపిలం,
గనుఁగవ నశ్రుపుల్ దొరఁగ గౌతముఁగాంచి వచించె: 'మిత్రివా
తెను బడనున్న నెచ్చెలిని ధైర్యముతోడ సముద్ధరింప దై
వ నియతి నీవనంబునకు వచ్చితివోయి, యతర్కితంబుగన్ !

'అడనునకు నీవు నిచ్చోట మొదలనున్న
నకట ! యింత కే స్మరణీయ నయ్యెయుందు ;
బుంగ నడియేటి కరడులఁ బోవ, దాని
నందికొన నేఁగి యీగతి కగ్గమైతి.

'మున్ను తొలిసంజ పువ్వులు పూచు వేళ
నిరుపురకు నాటపట్టైన యీతలంబు
దైవహతి ననురాగబంధములు దెగిన
యనుఁగుఁ జెలి హృచ్ఛ్మశాన మట్లయ్యె యుండు.

'పసితనపుఁ జెల్మి కలలెల్ల భగ్నపఱచి
మనల నెడవాపిన ప్రవాసదినము లేండ్లు
బాల్యలీలాస్మరణ బాష్పపావనములె?
తలఁపవేమి నికృత్తచిత్తముల తెఱఁగు?

'మునుపటి బాల్యసఖ్యములు బొత్తిగ వీడితి వేమిగాని, మీ
జననిని జూడనైన నొకసారియుఁ జేరవు పర్ణశాల; నీ
వెనిమిది వత్సరంబు లెడ మెట్టుల సైఁచితివో యి, ప్రేమబం
ధనములఁ గోయఁజాలిన మనస్వి, రుచించునె యన్యవాసముల్!

'వ్యాసవేదాంతసూత్రభాష్యములు చదివి
యర్థముల నభ్యసించు విద్యార్థి యింక
వలపు సూత్రంబులం ద్రెంపి పాఱవైచు
టెంతలోనిది? నిజమున్న నింతెగాదె!'

అని ఋషికన్యక, ముకుళిం
చిన కడగంటి రుచులు వికసింపఁగ సఖునిం
గని వచియింప, నతండును
మనమున గుర్తింపరాని మాధురి దోలకఁ.

పలికె: 'బాల్యప్రియసఖి, ప్రవాసఖిన్న
హృదయమును అంపకోఁతఁ గాఁజింపఁదలఁతె ?
పండుటాకుల రాల్చెదు వన్యలతలు
కిసలయింపవె వాసంతరసము వోడమ.

'పసితనంబున విడివడ్డ పాపినయ్యు
నంతరింపదు చెలిమి తియ్యముల తలఁపు;
పడుక తలగడయైన యీ బాహు వలెవ,
శాష్పతప్తముగాని శర్వరులు లేవు!

'పగలు బాలురతో నాటపాట లందు
ననఁగిపెనఁగిన మనసు యామినులలోన
బాల్యచర్యల వాసనల్ పట్టియాడ్వఁ
దిరుగుచుండెను స్వప్నవీధికల నబల!

'దూరవనభూమిమార్గముల్ తొయ్యలీ, ప
రస్పరేక్షణ మిడని విరక్తవిధుల
మనల నెడపె; నైనను భావమార్గచరుల
నాఁపఁగలవె యీలాటి యభ్యంతరములు

'వేదవేదాంగవిద్యల విధిహితముల
నలవఱుచుకొంటి బ్రహ్మచర్యంబు నడపి;
యిపుడు యౌవన జీవనం బెదురు చూచుఁ
బ్రబల ఝంఝాకులాంభోధి పగిది నన్ను!'

అనవిని: 'గౌతమ' నన్నుం
గొనిపొమ్ము కుటీరసీమకుఁ, వృద్ధులు మా
జననీ జనకుల యాశీ
స్సునొంది పోవచ్చు; నెదురు చూతురు నన్నుఁ.

'ప్రాణదాతవు; నాకథ వారు విన్న
బాష్పగద్గదకంఠులై వత్సలత్వ
మునఁ గవుంగిట నినుఁ జేర్చి ముదమునొంది
యాతిథేయ సపర్యల నాదరింతుర్.

అని సకి చెప్పెనో లేదో
జనకుఁడు వృద్ధుండు పలితజటలభరమునన్
వినమితశిరుఁడై వణఁకుచుఁ
గనఁబడె వనవీథి నూఁతకఱ్ఱ పొడుచుచున్.

రమణి యంతట, గౌతమ బ్రహ్మచారి
భుజము నాలంబయష్టిగఁ బూని యల్ల
నడుగులిడి, తండ్రి కెదురేఁగి యశ్రునయన
[illegible] వినిచె జలపాన వృత్తాంత మంత.

ఆ యతర్కితోపనత దైవాపకృతిని
వృద్ధముని యానుపూర్విగ విన్నయంతఁ
గదిసి ప్రవహించె హృత్తట కషణాభంగి
గంగ యమున లట్లు సుఖదుఃఖస్రవంతి

'నాయనా' నీవు చిన్నతనంపుఁ జెలిమి
ఋణము నీఁగితి వీబాల యెడఁ; జిరప్ర
వాసతప్తుఁడవై యలవఱుచుకొన్న
యుపనిషద్విద్య తుదిముక్తి నొసఁగుఁగాత!

'అతిథివైతివి రమ్ము, దయానురక్తు
లైన తపసిపుత్రులు సపర్యార్థు లెంచు;
క్షత్రియోచిత కార్యంబు సలిపినావు,
వంశవాసన లెపుడైన వదలిపోనె?'

అని పలికి వృద్ధసంయమి
తనయయు గౌతముఁడు వెనుకతట్టుగ నల్లం
తన దన్ను ననుసరింపఁగఁ
జనుచుండె వనాగ్రసరణిఁ జల్లని నీడన్.

ఔరా! కాలమునందుం నెంతటి విపర్యాసంబు గన్పట్టు! బా
ల్యారంభంబున నెట్టి స్త్రీపురుషభేదాధ్యాయము ల్విప్పకే
యారణ్యావని నాడినట్టి సఖు లేలా నేఁడు క్రీగంటి శృం
గారాలోకములం బరస్పరముఁ గాంక్షల్ సల్ప వ్యాజంబునన్?

తనకు నందని పువ్వులఁ దపసిసుతుఁడు
కోసి యిడ ముద్దుమురిపెంబు గురిసినట్టి
బాల, వలచియు, దనపత్రిక వచ్చుచున్న
నెయ్యు నొకమాఱు కన్నులనిండఁ గనదు,

ఇదివఱకెన్నఁడైన నుదయింపని యేవో యనూహ్యరాగముల్
గదలుపఁ జిత్తవల్లకి నిగారపు బంగరుతంతులన్, రసా
స్పదహృదయుండు గౌతముఁడు చంచలనేత్రమనోహరాంగసం
పదకు విముగ్ధుఁడైనయటు భావనసేయును హృద్యరూపమున్.

'ఎనిమిది వత్సరంబులకె యెంతటిమార్పు ఘటిల్లెనోర! యౌ
వన మదిరాలసంబులయి వ్రాలెడు ఱెప్పల నెత్తలేక యె
త్తి నిశితముల్ సతృష్ణములు దీప్తములున్ హృదయానురాగబం
ధనములు నౌకటాక్షములఁ దన్వి ననుంగను గాంచనట్లుగన్.

'వన్యరామణీయకము రూపము ధరించి
కలను కమృతంపు వర్తియై కానిపించె
ననఁగఁ, గన్నియ సగము సత్యంబు, సగము
స్వప్నలీలగఁ దోఁచు నాభావమునకు.

'ఆమదిరాక్షి పాణికిసలాగ్రము నాయెడ లంటినంత నే
దో మధురానుభూతిరుచి దోఁచె నపూర్వసుఖంబుఁ గూర్చుచా
హా! మధుమాసయామినులయం దిటువంటి వికార మబ్బ నిం
కేమయిపోనొ సంయమితమేని మనంబు కుశాగ్రబిందునాన్.

లలనకుఁ బూర్వమీ వనతలంబుల గౌతముతోడ నాటపా
టల దినముల్ క్రమించె వికటంబులుగాక; కుమారుఁ డాగమం
బులఁ జదువం బ్రవాసియయి పోయిన నాఁటనుగోలె వేదనా
దళిత మనస్కయై పెరిగెఁ దా జతఁబాసిన గువ్వపోటినాఁ.

ఇరువదినాలుగేడులకు నెక్కుడు లేవు తపస్వి. కామనో
హారి పదునెన్మిదేండ్ల నవయౌవనలాలస; ప్రేమ యన్ననో
విరతి నెఱుంగనట్టి యటవీ రసకుల్య, సమాగమంబు నం
తర పరపీడనప్రియము; దర్శన మెంత సుఖప్రదంబొకో!

పాడు లజ్జాభరంబున బాహిరముగ
నొండొరులఁ గాంచలేమిఁ దా మొకరునొకరి
నోర క్రీఁగంటఁ గనఁ, జూపు లొకటిమైన
తోడ, బట్టబయలు వారి దొంగతనము.

వారు పర్ణశాలకుఁ బోవువఱకు జనని
వెతలఁ గుందుచు ముంగిట వేచియుండి
తనయునుం గాంచి మాతృవాత్సల్యరసము
లుబుక ముమ్మారుఁ గౌఁగిట నొత్తికొనియె.

తనయుఁడంతముఁ దల్లికిఁ దరళబాష్ప
గద్గదంబుగ వినిపించెఁ గలువకంటి;
జననియును గౌతముని మోముఁ జక్క నిమిరి
ప్రమద మిగురొత్త మేలు దీవనలు గురిసె.

ఆ తపస్వి కృష్ణాజినం బరుగు మీఁదఁ
బఱచి గౌతముఁ గూర్చుండ బతిమలాడి
యతనికి నధీతమైన విద్యావిశేష
ముల విచారించుచుండె నామూలముగను.

ఇన్నియేండ్లకుఁ దమయింటి కేఁగుదెంచు
బాల్యసహవాసి, సరస కావ్య ప్రసూన
మధు కషాయిత కంఠుఁడు, మధురభాషి
నాతిథేయ సత్కృతుఁ జేయ నభిలషించి;

వంటయింటి కార్యములెల్ల స్వయముగానె
యతివ గనుచుండె జాగరూకత వహించి
తెలిగలువలట్లు విలసిల్లు చెలువ కనులు
పొగకుఁ జెంగల్వలై నీరు వోడముచుండ;

చిఱుచిఱుచెమ్మటల్ నొసటఁజెక్కిళులం దలసూపఁ, బూవులం
దుఱిమిన వాలుగంటు నడతొందరకున్ సడలంగ, బొమ్మలం
గరఁగి విభూతిరేఖ దిగఁగాఱఁగఁ, గోమలి వంటసాలలోఁ
దిరుగు-మొగిళ్ళ చాటువడి తేజుదొలఁగిన చంద్రరేఖనాన్.

మును లివ్వేళకు నారగించి, కుసుమామోదాతి రమ్యంబుగన్
మనముం దన్పు రసాలసాలములక్రిందన్ శీతలచ్ఛాయలం
దును లేఁబచ్చికఁ గూరుచుండి గురువృద్ధుల్సేయు వేదాంతబో
ధనము ల్వొందుదు జీవితాశ్రిత సమస్తక్లేశము ల్బాయఁగన్.

పల్లవ పరిమళములు చి
ప్పిల్లఁగ హరిణములు నెమరు వేయుచునుండెం
జల్లని నీడలు వాఱుచు
నల్లిన దట్టంపుఁ బొదరుటంచుల క్రేవన్.

బాలికల చేగలందు నివ్వరులు దిన్న
సాఁకుడు నెమిళ్ళు పూఁదీవ చప్పరములఁ
జేరి యఱగన్ను మోడిచి చిత్రితముగ
నెండవేళను గడు సుఖియించుచుండె.

మట్ట మధ్యాహ్నమున సరోమండుకములు
కమలినీ మండపంబుల కడ వసించె;
నీటికోళుల తుంగలు నిండియున్న
చల్లపట్టులఁ గొంత విశ్రాంతిగొనియె.

జతలు జతలుగ పుల్లులు శాఖలెక్కి
ముక్కుతో నీఁకలను నొత్తి ముసిరి ముసిరి
లలితమైన దాంపత్యలాలసత తోడ
నొకటికొకటి పేల్ గ్రుక్కుచునున్న విపుడు.

గౌతమ బ్రహ్మచారియుఁ గన్యకయును
సిగ్గుపడి పొడిమాటలు సెప్పుకొనుట
జనని గాంచి. 'యిదేమిటి తనయ యన్యుఁ
డమ్మెనే పసినాఁటి సయ్యాటకాఁడు?

'యెనిమిదేండ్ల యెడంబునకే కుమారి,
సకుల యన్యోన్యమమతలు సడలిపోవు;
తలపు లెడయక పెరిగిన చెలులు మీరు
చాలు చాలు లజ్జాభగ్న లాలనములు!'

అని జనయిత్రి పల్క విని యాచెలులిద్దఱు పిన్ననవ్వు మో
మున నొకవింత తియ్యఁ దనముం బొలిపింపఁ బరస్పరంబు ల
జ్జను నరికట్టు యత్నములు సల్పుచునుండ నలక్షితంబుగన్.
దినము సగంబునుం గడచి దిక్కుల నెఱ్ఱన దోఁచినంతటన్.

'కనుమో ప్రియసఖి, దెసలం
గననయ్యెఁ బ్రదోషరాగకాంతులు; నింకం
జనియెద మా పర్ణాలయ
మున కిప్పుడనుజ్ఞయిమ్ము; ప్రొద్దున వత్తున్.'

అని గౌతముఁ డాడిన నం
గన వచియించెను: 'ప్రవాస కథనంబని నా
మనము దలంపకు; మిటకుం
జనుదెమ్ము ప్రభాతపూజ సలిపిన పిదపన్'

సఖులు నడుమంతరపు సిగ్గు సడలిపోవ
మునుపటి సమేలముల ముద్దు ముచ్చటలను
నెట్టి ఖారపొచ్చె మెఱుఁగక యిచ్చ వచ్చి
నటు తపోవని విహరింతు రమల మతుల.

కడచెం గొన్నిదినంబు, లీచెలులసాంగత్యంబు నానాంటికిం గడుం బెంపారుచునుండె; నొక్కదిన మాకళ్యాణి యాగౌతమున్ విడలేకుండుం, దపస్వియుం బ్రియతమ న్వీడంగనోపండు; పుష్పాదిరస్తాయటు జీవితం బగపడుంబో! వారి కిప్పట్టినన్.

విమలంబైన తపోవనీ రుచులు శోభిల్లంగ, లేమావులన్ గముళ్లై యింపుగం గోకిలాతిథులు రాగాలెత్తి పాడం, బ్రదోషమనోజ్ఞంబగు చైత్రపౌర్ణిమను వాసంతార్చనల్ సల్పాయత్నములందుండిరి తాపసాంగనలు నుత్సాహంబు దీపింపగన్.

నేఁడు వనదేవతలు రమణీయమైన
యాకృతులు పూని విహరింతు రనఁగఁ, దపసి
తనయ లార్ద్రవన్య ప్రసాదనముతోడ
నలరి రీవని నుత్సవ వ్యగ్రలగుచు.

మున్నుగను గౌతముని గేహమునకుఁ బిలిచి
యా వసంతార్చనకు సిద్ధమగుచు నుండెఁ
బసపునం బెట్టి యుతికిన వల్కలంపుఁ
జీర ధరియించుకొన్న బంగారుపడుచు.

తలకుఁ జేరెఁడు నిఁగుడిత్తైల మంటి
చిన్నగా గోళ్ళఁ బెన్నెఱుల్ చిక్కుఁదీసి
నాలుగంటెడి, క్రొంబూల మాల దుఱిమి
నుదుట యావరాగపు బొట్టు కుదురు పఱచె.

గోరంటాకు రసానఁ బాణితలముల్ గోళ్ళున్ పదాబ్జంబులున్
సారాశోక కిసాల రోచి రుదయస్థానమ్ములై రక్తిమల్
వాఱం, గాటుకచీకటిం కనుల క్రేవఁ జేర మోహాంబు, శో
భారాజ్యంబును నేలు రాణియుఁబలె వాలుం గురుగాత్మీయున్.

అలరున్ దండలు తమ్మిమొగ్గలను గ్రీవాలంకృతుల్ చేసి కా
మలతోఁ దెచ్చిన కల్వలం జెవులఁ గ్రమ్మ న్మాటి, వాసంతపు
ష్పలతారమ్యతఁ జెరుచున్ నయన నిర్వాణమ్ముఁ గావించు నా
కలకంఠిం గని గౌతముండెదను జిక్కంబట్టు యత్నంబునన్.

తామరాకున నుంచి గంధంపుముద్ద
పసపు కుంకుమ యక్షతల్ పాలజిగురు
పూల నిడుకొని జడదాకి పూవుఁబోఁడి
గౌతముని వెంటఁ దోఁటకుఁ గదలి వచ్చె.

మునికన్యల్ తమ్మనెచ్చెలింగనుచు 'నబ్బా! కాంచుఁడీ లేమ! మో
హన లావణ్యకళాపి లీలఁ గమనీయంబైన రూపంబునం
జనుదెంచున్ మదమంథరంపు నడతో! సౌందర్య మీయమ్మ పె
ట్టిన భిక్షంబని చేరి రాకలువకంటిన్ మందెమేలమ్మునన్.

మావిగున్న నశోకము మాధవీ ల
తా నికుంజము నర్చించి తలిరుబోండ్లు
బండ్ల తొరులపైనఁ బువ్వుల చెండులును వ
సంతములు పుష్పొడులుఁ జల్ల సాగినారిరి.

నందనంబున నప్సరో నలినముఖుల
యాటలను విందుమే గాని యరయ మెపుడు;
తపసిచెలుల లీలావినోదముల వలన,
భూతలస్వర్గ మయ్యెఁ దపోవనంబు!

ఇంతదనుక నిశ్శబ్దమై శాంతమైన
పరమఋషు లున్న యారణ్యపరిసరముల
బాలికల యాటపాటల భాషణములఁ
గడలి భోర్కొట్టినటు రేఁగెఁగలకలంబు.

లేమలు కొందఱు లేఁత పచ్చిక బైలఁ
గూడి 'కోకోలంక' లాడుచుండఁ,
గొందఱు బాలలు క్రిందికి వంగిన
మావులఁ 'గోఁతికొమ్మంచు' లాడ,
ఋషికుమారులు కొంద ఱేకతమ్మున సఖీ
జనముతో ముచ్చటల్ సలుపుచుండ.
వృద్ధ పురంధ్రులు ప్రియముగ బిడ్డల
యాటపాటల మోద మందుచుండ,

మండల భ్రమణంబుల మడఁతు లొకటఁ
దఱిసి నృత్యంబుతో గొబ్బి దట్టుచుండఁ
గడచె సాంధ్యారుణద్యుతి గడలుకొనెడు
నంతదనుక వాసంతోత్స వాతిశయము.

చెట్లనీడలు తొలిదిక్కుఁ జేరఁ బాఱి
యాత్మహత్య నశించె సంధ్యాంతరమున;
గిరుల నీలిమ మఱికొంత విరివి యయ్యె;
చుట్టుపట్టులు మసి నల్కినట్టు దోఁచె.

గూళులకు వచ్చుచున్న పక్షుల రవంబు
అడవిమేఁకలు కొదమల కఱచుటయును,
కొండలను జాఱుసెలయేళ్ళ ఘుంఘుమముల
సందడులు సొక్కపై రేఁగె సందెవేళ,

యామినీరామ చమికీల నతికియున్న
నీలిమకుమల్లు పావడనిగ్గు లొలయ
వరునికై వేచు సొయ్యారి వాలకమున
దర్శనీయగఁ దోఁచె నీతరుణమందు.

ఇఁకఁ జనుదెంచఁగావలయు నింటికి, సంజయు మాసిపోయెఁ దారక లుదయించ రాదని పరస్పరముం దముఁ బిల్చుకొంచు నా కొంకకబుషీకుంతు రేఁగ రుచిరోజ్జ్వలతారల తీరుతియ్యముల్ సకియయు గాంతిముండు వికసన్నయనంబులఁగాంచుచుండఁగన్.

తూరుపుదిక్కు పుల్లగిలి తోఁచె, మఱింతగఁ జేవురించె, నా పై రమణీయగైరిక సువర్ణరుచిన్ శశిబింబ మొంతొ సొంపారుచుఁ గానిపించె, దెసలందు మొలంగెడు సందె చీఁకటుల్ దారెఁ, గ్రమక్రమంబుగ సితప్రభ వెల్గె సరోజవైరియున్.

చదలఁ వెన్నెల కందుకం బలర, విశ్వంబెల్ల నానంద సంప్రదమై తేలెడు స్వప్నమట్లయి సుఖప్రాచుర్యమై శాంతి కాస్పదమై యింద్రియమోహనంబయి రసవ్యాప్తంబునై జీవలోక దశల్ శీతకరైంద్రజాలిక మనోజ్ఞస్పర్శలఁ మాఁటెడిఁ.

'శారదా, రమ్ము చంద్రికాస్పర్శనముల
మత్తహృదయులమై మేను మఱచినాము;
తాపసాంగన లెల్లరుఁ దరలినారు
ఉటజముల, కింక మన కిట నుండఁ దగదు.

'ఏమొ రాలేదె యమ్మయ్య యింటి కనుచు
మాటి మాటికి నారణ్యమార్గ మరసి
కాంచనట్టి యాపదల శంకించుకొనుచు
వృద్ధులౌ తల్లిదండ్రులు వేచుచుండ్రి.'

తన నామము తొలుసారిగ
మునితనయుని నోటనుండి ముద్దొలుకుచు జా
ఱిన ముగుద యంతరంగం
బున గాఢప్రమద మొంది పొరవిడి పలికెఁ.

'నో రెఱులాడె గౌతమ, మనోహరచంద్రిక లాశలందు శృం
గారపుంబూఁత పూవఁ గసిగాటులు దిన్న మనోనురాగముల్
సారెకుఁ జెమ్మగిల్ల, మృదులస్వన మెత్తి రహస్యవల్లకిం
దీటక మీటు నిర్ఝరిణి తీరములం జరియింప కేఁగదె?

'సౌరభోచ్ఛ్వాసి శిశిర కిశోరపవనుఁ
డాతిథేయ సపర్యల నర్చ సేయ
సఖుఁడ, మన చేతి కలయికల్ సడలి పోక,
యిరుపురము వాఁకగట్టులఁ దిరుగుదామొ!

'వాఁక దాఁటంగ నైజపు వంతెన యటు
వ్రాలియున్న మామిడికొమ్మఁ బసితనానఁ
జేరి యాటాడుచుంటి, మా చిన్నె లెల్ల
నిపుడు తలపోతమోయి, యామెడకుఁ బోయి.

అని మఱుమాటలాడ నెడమైనను నియ్యక చేయిపట్టి యీ
డ్చిన సుకుమారుఁ డా సకియ చెంగటఁ బోవున గాని స్వానుగా
డని వచియింపనోపఁడు; విహార వినోద కుతూహలత్వ మా
తని మొగమందుఁ దోఁపని కతం బరయంగ సమర్థు లెవ్వరో!

హృదయముఁ గ_త్తికోఁత నలయింపుల సౌఖ్యముఁ జేయు వేదనా
స్పద పటుభావ ఘర్షణము పాటిలెనో యన నీరసంబుగన్
వదనము మబ్బువాఱఁ జెలిపల్కులతోఁ దనపల్కుఁగల్పి నే
పదరును దోఁపనీని యొకవాలక మూని చరించు నాతఁడున్.

ఒకరి మనముల భావంబు లొకరి కొకరు
నెఱుక పడనీక దాఁచిన హేతు వేమొ?
మనసు తడిసేయు పసినాఁటి మమత లెల్ల
నిపుడు తలపింప నేల యా యిందువదన?

పండి రాలిన యాకులఁ బదను లిడన
'గలుగలు' మటంచు నలుకుడు గడలుకొనఁగ
శారదయు గౌతముఁడు ప్రశాంతవిపిన
పథమునం బోయి చేరిరి వాఁకతటము.

వెన్నెల గిలిగింతలకుం
జెన్నొలయుచు విచ్చుచున్న చెంగలువల నా
కన్నియ తూఁడుల తోడం
గొన్నిటిఁ దెగఁ దెంపి చేతఁ గుచ్చుగఁ బట్టెన్.

తొగలపై మూఁగు తుమ్మెద తుటుముఁ జోపి
సొగయుచు నొకింత నాసన చూచి సకియ
'క్రొత్త చెంగల్వ లివిగో గైకొమ్మ' టంచుఁ
దపసి కొమరున కందీయఁ దమక పడఁగ.

చెలియిటు స్నఁతకుం గరఁగుచిత్తముతో ఋషిపుత్రుఁ 'డయ్యో! క
ల్కల నగుచున్న చెంగలువలం దెగఁదెంపితి వేల? బాల్యచా
పలమున రామణీయకము భగ్నముచేసితె గోల? దర్శనీయ వ
స్తులునయనానుభావ్యములుసుమ్మస్వకమ్ములుగాకపోయినన్?

'తెంపితివి కాని, నవనవల్ దేలుచున్న
కలువపూల సౌభాగ్యంబుఁ గావఁగలవె?
జీవకళల సౌందర్య మాశించినావు
దళము లెడలు చిత్తక్షోభఁ దలఁపవేమొ!

'రమ్య రూపముఁ గన్న కారణము వలన
నిక్షి శిక్షు సువస్తుల కేల సకియ?
సరళసౌందర్య మాత్మనాశకమ యేని
మాఱెడే శ్మశాన మటుని మధుర పరిష్కృతి.'

అనవిని యాకుమారి హృదయంబున రాగరసంబు లూర ని
ట్టనియెను: 'దృశ్యలోకమునయం దలరారు మనోహరార్థముల్
గనఁబడినంతఁ గోరికలు కల్గుట న్యాయముగాదె? కల్గినం
దనయవిగా నొనర్చు జతనంబులు మానవనైజముల్ గదా!

ప్రేమ వాంఛలకుఁ గల భేదములను
వేఱుపఱుపఁగ లేని యో వెఱ్ఱిదాన,
పుణ్యమతులకు సౌందర్యపూజనంబు
ఎపుడు నానంద మిడుఁ; గామ మెత్తనీదు.

'ప్రకృతి చిత్తంబుఁ జీలిచి భావములను
గన్నసృష్టి తత్త్వవిదులె గాంచ వలఁతు
లీరహస్యముఁ గోమలీ, యింక నేల
రమ్ము, వ్యర్థతర్కపుఁ బరిశ్రమలు మనకు.'

అని కుమారతపస్వి యాయతివ యిచ్చు
కలువ పూగుత్తిని సనిష్టకౌతుకమునఁ
గైకొని వెలార్చె మనసు కక్కసముఁ దెల్పు
నొక్క నిట్టూర్పు; నరయ దాయువతి దాని.

ఇరువురి భావబంధముల నేసడలింపులు గల్గుచుండెనో యెఱుఁగఁ దరంబుగాదు మనకిత్తఱి, నింతియు గౌతముండు బంగరు టీసుముం బొరత్మెఱయు గట్టున జంటగ నేఁగు వారు క్రచ్చఱు పసినాఁటియాటలకు సాక్షియనం దగు మావిక్రేవకుఁ

వార లామావికడఁ జేరి, వాఁగు మీఁద
వంగి వంతెన యట్టుల వరలు కొమ్మ
పైనఁ గూర్చుండ నుయ్యాల పగిది, నదియు
నల్ల నల్లన జివ్వాట లాడుచుండె.

వాఁగుపైఁ జంద్రబింబము ప్రతిఫలింప
లలిత జలభంగ తరళలౌల్యముల నరయ,
నుర్వి నమృతంపుఁ బెన్నూఁట లుబికి కెరలి
పైకిఁ బొంగెడివో యను భ్రాంతి గొలుపు.

వారి యిరువురి నీడలు వాఁగు నీటఁ
గానవచ్చి యొండొకటినిఁ గదిసికొనుచు
ననునిమిష భిన్నరూపములను వహింప
యువతి నిశ్శబ్దతాభంగ మొనరఁ బల్కె:

కనుమోయీ యనుఁగుంజెలి,
మన యిద్దఱి నీడ లిపుడు మధురాశ్లేషం
బునఁ దమమాతృక లెఱుఁగని
యనుభూతినిఁ బొందు జడములయ్యెను నహహా

'చెలికాఁడా, చిన్నప్పుడు
వలపులు వికసించియుం బరివాసము నీకుం
గలుగుటఁ గృశియించిన పు
వ్వుల పోలిక నయ్యెఁ బచ్చిపొలపము సడలన్.

'నిన్నుఁ జూచినప్పటి నుండి నిగ్గువాఱు
చిన్ననాఁటి తలంపు పుష్పించెనోయి!
భగ్నమైన యాశాలతల్ పల్లవింప
వచ్చినాఁడవు ఋతురాజు పగిది సఖుఁడ.

'పసితనమునాఁటి యాటల పాటలకును
సాక్షులైన యివ్వాఁక రసాల తరువు
వద్ద నాచేతఁ జెయివైచి వలచితి నని
బాస చేయుము ''నిన్నెడఁబాయ ననుచు''

చకితుఁడై ఋషికుమారుఁడు, 'సకియ, యేల
మనసుఁ గసిగాట్ల నొంచు నీమాట లాడ?
నమృత పాత్రంబు పెదవుల నంటియుండ
విషకణాస్వాదనస్మృతి విడువలేవా?

'విశ్వ మెల్లఁ దనదిగ భావించు ప్రేమ
గలుగ, నేకాశ్రితంబైన కామ మేల?
చిన్ననాఁటి యజ్ఞానంపుఁ జిన్నె లెల్ల
మఱచిపొమ్ము: ప్రేమింతు నిన్నిరతమతివ.

'ఇట్టి నిశ్శబ్దతాశాంతి యెసఁగు రాత్రి
నైందవ మయూఖ చుంబితంబై, రసార్ద్రి
కల విపంచీహాస్య తంతులిలను మీటు
ముద్దు సెలయేటిఁ బ్రేమింతు మోహనాంగి,

మధుర మధుమాస నిశ గున్నమావి యందుఁ
గొమ్మలాకుల నేడనో గూరుచుండి
ముగ్ధమగు నాటవిక గానములను జేయు
గోకిలను నేను బ్రేమింతుఁ గువలయాక్షి.

'చిత్ర కిమ్మీరవర్ణ రంజితము లైన
జలద శకలంబు లరరారు సంధ్యలను వి
శుద్ధహృదయుఁడనై ముదశ్రువులు వీడి
ధ్యానమొనరింతుఁ బ్రేమింతు నతివమిన్న.

'అవియు నివి యన నేల విశ్వాలయమున
నలరు రమ్యప్రకృతుల నిరంతరంబుఁ
గాంచి యానంద మొందుదుఁ గాని, వాని
నెపుడుఁ గామింపఁ గామింప నిందువదన.

'పసిఁడిలంకెల గొలుసులు పస లొలికియు
భరములగుఁ గాదె ఖగముల పాదములకు;
నేల నాస్వేచ్ఛ హరియింప నెంచెదమ్మ,
వలపు టురులను జిత్తమ్ము నిలువఁబట్టి?'

అనవిని మాళికన్య హృదయంబు తటాలునఁ జీలిపోవఁ దా
మును రచియించుకొన్న నవమోహనభావగృహంబు భగ్నమై
చన, నిడీయూర్పు ల్వెడల, జల్లలఁ గన్నుల బాష్పబిందువుల్
దొనకఁగ, గద్గదస్వనముతో వచియించె మనోవికారముల్:

'వెతల కోరిచి నీకయి వేచియున్న
బాల్యసఖిని గక్కసపెట్ట భావ్యమగునె?
ప్రేమసూత్రంబులకుఁ జిత్తభేదక మగు
కఱకు వాదర యుండునే కత్తికటుల?

'పవలు రేయు గ్రంథాంతరపాంతరముల
నర్థమృగముల వేఁటాడు నట్టి బోయ
యంతరంగంబున రసార్ద్రమైన వలపు
తొలకరించునె తాపంబు దొలఁగిపోవ?

'ఎడలు సైపని కూరిమి నిన్నినాళ్ళు
ననఁగి పెనఁగిన నెయ్యంబు నవల నెట్టి
ప్రియుఁడ. నేఁడు వైరాగ్య లవిత్రమూని
గోయఁ దలఁతె యాశాలతల్ క్రూరముగను.

'పూఁచెనోయి, చక్కఁదనాల పూవొకండు
మల్లికావల్లి నెత్తావి వెల్లి విరియ;
నదియు నిర్భుక్తమై తోఁట వ్యర్థమైన
సృష్టి యాశయ మేమిటో చెప్పఁగలవె?

తప్పు దలఁచితివమ్మ, స్వార్థపరహృదయ
మీ జగం బెల్ల, నిరత మాత్మైకభుక్తి
కనియె తలపోయుఁ గాని బ్రహ్మాండసృష్టి
వ్యర్థమనునది లేదు, సత్యంబు సకియ.

'కానఁ బూచిన పువ్వులు మానవునకుఁ
దోఁచియు నిరర్థకములుగఁ దోయజాక్షి,
మధులిహంబు లే వేళల మధువు లాను
బంగరుం బాత్రి లట్టులఁ బరగుఁ గాదె.'

'ఔను గాని, కఠినచిత్త, నీయాశయంబు
లనువుగా విహాలోక జీవనము నందుఁ;
గామగంధంబు లేని యేకణము గాని
యన్యభుక్తంబుగా భువి నంతరించు.

'ఏల యేల నిండేఁటికి నెదురు లేఁద?
ననుసరింతము ప్రకృతి సవ్యంపు సరణి,
ఆలుమగ లట్లు సంసార మాచరింప
కామకర్పూరఖండముల్ కనలిపోవె?

'ముళ్ళ రెమ్మను నున్నంత ముద్దులొలుకు
పడుచుఁ బన్నీరుపువ్వు దుష్ప్రాప్యమగునా!
బ్రతుకుటాసల కెదలకు బందమేయ
వలపుఁ దలఁపులు పూల సంకెలలు గావె?'

'యౌవన మని కామ మని సవ్యార్థ్య మనుచు,
నేమొయేమొ వచించితి వింతసేపు;
ఇంద్రధనువు చిరంబని యెంచినావె?
చాలు చాలు సంసారవాసనలు సకియ!

'ప్రతినిమిష భిన్నమైన ప్రపంచ మందు
శాశ్వతానంద విషయాసక్తి గలదె?
గృహమునకు నన్ను బంధించు నెట్టిరాగ
లతల నేఁ బ్రోదిసేయను లలితవదన!

'జలదమాలతోడఁ బయనింపఁ దలంచుకొందు,
అబ్ధి తరంగలతో నాటలాడ వలతు,
గాలి పోలిక స్వచ్ఛందగతులఁ దిరుగ
నాసపుట్టెడు కాంత, యనంతజగతి!

'శ్యామలాకూలజలనిధి సంక్రమింప
రయమునం బ్రవహించు నిర్ఝరిణివోలె
నామనము సంకుచిత జీవనంపుటెల్ల
దాఁట నున్ముఖమయ్యెడిఁ దరుణి, యిపుడు,

'అమల తృణభూమి నాకు శయ్యాతలంబు,
గగనభాగంబు నాయింటికప్పు, సూర్య
చంద్ర నక్షత్రములు దీపచయము, సాంధ్య
జలదములు పడుకింటి బొమ్మలపటాలు!

'పూలు మన్మందిరాంతర పుణ్యభూమిఁ
బరిమళము చల్లు సాంబ్రాణివత్తు లయ్యె;
మందపవనుండు దేహాళీమార్జనంబు
సలిపి సేవించు నన్నిరుసంజ లందు,

'ఇంతటి విశాల రమణీయ గృహమునందుఁ
గుతుకమున వసించు నను సంకుచితమైన
పర్ణశాలాంగణంబున బందిసేయు
టేటిమాటలు? పొమ్మింకఁ బాటలోష్ఠి, '

అని గౌతముఁ డాడిన, నం
గనకుఁ బ్రపంచంబు శూన్యగర్భంబయి చీ
ల్చినను మొగంబున నెత్తురు
గనరాని విధానఁ గమలి కటకటపడుచుఁ:

'భగ్నమయ్యె నిందార్యుధ భవ్యదృశ్య,
మాత్మ యాశాశ్మశాన ధూమాంకితంబు,
బ్రతుకు నాకు దుర్వేదనాభారభూత,
మింకఁ గడపటి వీడుకోలిమ్ము సఖుఁడ.'

అని ఋషికన్య కొమ్మపయి నల్లన లేవ, దపస్విపుత్రుడుం
గనుఁగవ నశ్రుపూరములు గ్రమ్మగ లేచి 'సుఖంబు లొందుమీ
యనవరతంబు ప్రాణసఖి' యంచు వచించెడు నంతఁ గాలబం
ధనములు వోని బాహువులఁ దన్వి బిగించెను మిత్రుకంఠముఁ

ఆకుమారుఁడు నాశ్లిష్టుఁడై నెలంత
భుజలతాగ్రంథి సడలింపఁ బూనెఁ గాని,
కాలసర్పంబు లట్టులఁ గదిసి యొకటఁ
బెనఁగియున్న యాచేతులు వీడి రావు!

కాళ్లు జాఱెనో, లేక యాకన్నెపడుచు
కౌఁగిటం బట్టి యీడ్చెనో గానలేము
కాని, యావాఁగులో వారకాండము గను
బడిన శబ్దంబు వీనులఁ బర్వె నకట !

ఎన్నఁడో యాకు పుట్టక యెండియున్న
కొమ్మపైఁ గూసె నొక పెద్ద గుడ్లగూబ ;
ముదురు నాఁచుటురులఁ గ్రుంగు కొదమ యంచ
కవ యటుల వారు నడివాఁకఁ గదలువారు.

ఎడలువాయని సఖులను గడుపుఁగొనఁ
బెట్టుకొన్న క్రొవ్వాఁక తుంపెసలుగొట్టు ;
నెంతపుణ్యంబు చేసెనో యీస్రవంతి
ప్రేమవాంఛల రెంటిఁ జీర్ణించికొనగ!



# పానశాల

ఉమ్రఖయ్యాము పారసీ రుబాయతులోని
ముఖ్యమైన రుబాయీలకు అనువాదము

గ్రంథకర్త :

దువ్వూరి రామిరెడ్డి





యౌవనారంభమున మధురానురాగ
బద్ధహృదయునై పదునెంపువత్సరముల
పాటు నా కష్టసుఖములఁ బంచికొన్న
నతికి స్మరణీయ కిడితి నీకృతిని వాణి

భారతిలో ప్రకటితము : 1928

ప్రథమ ముద్రణము : 1935

రెండవ ముద్రణము : 1944

మూడవ ముద్రణము : 1951

నాల్గవ ముద్రణము : 1952

ఐదవ ముద్రణము : 1952

# ఉపోద్ఘాతము.

## 1

### పారసీక సాహిత్యము: చారిత్రక సింహావలోకనము.

ప్రపంచ వాఙ్మయములయందు పారసీక సాహిత్యము చుక్కలలో శుక్రుఁడట్లు కనుతగులుచున్నది. మృదుమధుర శబ్ద సారస్యము గలిగి శ్రుతిహితముగనుండు ప్రాచ్యభాషలలో పారసీక భాష యొకటి యని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. ఛందస్సులోని వివిధగతుల వలన పాదాంతాక్షర నియమమువలన పారసీక పద్యములు గేయములై చదువునపుడు వినునపుడు మనోహరముగ నుండును.

పారసీక నాగరకత యెట్లు రెండుశాఖలుగ విభక్తమై యున్నదో అట్లే వాఙ్మయముకూడ పురాతనమనియు ఆధునికమనియు పరిస్ఫుటభేదములతో రెండుపాయలుగ చీలియున్నది. అరబ్బులు పారసీకమును జయించి, మహమ్మదీయ మతమును వ్యాపింపఁజేయుటకు పూర్వముండిన వాఙ్మయము వేఱు; అటు వెనుక పుట్టిన వాఙ్మయము మఱొకతీరు.

పారసీకు లార్యులు; అగ్నిపూజకులు. హిందువులకు వేదములవలె వారికి 'అవెస్తా' యను పవిత్ర మత గ్రంథముకలదు. ఆ గ్రంథము పురాతన పారసీక భాషయగు జెందు నందు వ్రాయఁబడియున్నది. జెందుభాషలో మతసంబంధములగు రచనలు తప్ప లౌకికములగు కావ్యములగపడుటలేదు.

పూర్వమొకప్పుడు పారసీకమున నాగరికత, శూరత్వము, సంగర కళా కౌశలము అత్యున్నత దశయందుండినవి. డేరియసు వంటి మహావీరు లచ్చట నుద్భవించి పరాక్రమవంతులగు గ్రీకులకు ప్రతిస్పర్థులై నిలచిరి. నేఁటికిని భగ్నావశిష్టరాజ ప్రాసాదములు మంటపములు* సూస, పెర్సిపోలిసు, బెహిస్తూనులయందు పారసీక నాగరకతను ప్రాభవమును వేయి నోళ్ళ చాటించుచున్నవి.

ఆరవ శతాబ్దియందు మహమ్మద్ ప్రవక్త అరబ్బీదేశమునం దవతరించెను. ఏడవశతాబ్ది ప్రారంభమున అరబ్బులు పారసీకమును జయించి పరిపాలనముతోడ మహమ్మదీయ మతమును ప్రవేశపెట్టిరి. భిన్ననాగరకతలు గల రెండుజాతులకు రాజకీయ సాంఘిక సంబంధ మొనగూడినప్పుడు అజ్ఞాతముగ కొన్నిమార్పులు ఇరుతెగల యందును పొడకట్టుచుండును. అయినను బలవీర్యములుగల జాతి ఆచారవ్యవహారములు బలహీనులకు అనుకరణీయములగు చుండును. నిర్జితులైన పారసీకులు మహమ్మదీయ మతమును స్వీకరించిరి. సమ్మతింపనివారు ఇతరదేశములకు వలసపోయిరి. ఇప్పటి మనపార్సీలు అట్లు వలసవచ్చినవారే.

అరబ్బీ రాజభాషయైనది. పండితసభలయందు, రాజస్థానములయందు అరబ్బీ వ్యవహరింపఁబడుచుండెను. అరబ్బీకవిత్వము, శాస్త్రగ్రంథములు క్రొంగ్రొత్తలగుటవలన పారసీకుల చిత్తముల నాకర్షించినవి. అచిర కాలముననే పారసీక కులీనులు అరబ్బీపాండిత్యము నలవఱచికొని రాజాస్థానమునందు ఉన్నతోద్యోగముల నిర్వహింపసాగిరి. విజయగర్వప్రమత్తులగు అరబ్బులకు పారసీకుల విజృంభణముపై అసూయపుట్టి వారిని నీచముగ చూచుచు సమయముదొరకినపుడెల్ల నిరుత్సాహపఱచుచుండిరి. అట్లయ్యు పారసీకుల విజ్ఞానతృష్ణను వారరికట్టజాలకుండిరి. క్రీ. శ-715 వ సంవత్సర

* పెర్సిపోలిసునందలి సుప్రసిద్ధ శతస్తంభ రాజప్రాసాదమును అలెగ్జాండరు తగులఁబెట్టించెను.

మునందె ఉమయ్యాద్ వంశీయుఁడైన కలీఫా' సులేమాను ఇట్లు వెలుగు పడె నట: "పారసీకుల విజృంభణము నాకు ఆశ్చర్యము కొలుపుచున్నది. వారు వేయిసంవత్సరములు రాజ్యపరిపాలన మొనరించినను ఒక్కక్షణమైన మన తో వారి కక్కఱపడియుండినదిలేదు. కాని, మనము నూరుసంవత్సరముల నుండి రాజ్యము చేయుచున్నను ఒక్కక్షణమైన వారిసాహాయ్యము పొం దక తప్పినదికాదు."

బాగదాదు 'కలీఫు'ల రాజ్యపరిపాలనమున చక్కని అరబ్బీ కవిత్వము చెప్పిన వారందఱు పారసీకులే. కాలక్రమముగ అరబ్బీ పదములు పారసీక భాషలోనికి యథేచ్ఛముగ ప్రవేశించినవి. ఇప్పుడేదైన నొక పారశీ నిఘంటు విప్పిచూచినయెడల ఒకటికిమూడుపాళ్ళు అరబ్బీ పదములుండును. ఈ విషయమునందు పారసీకిని తెలుఁగునకును సామ్యము గోచరించు చున్నది. గ్రాంథికాంధ్రము సంస్కృత పురాణముల యాంధ్రీకరణముతో ప్రారంభమైనందున నిరంతరాయముగ సంస్కృత పదజాలము తెలుఁగున ప్రవేశించెను. అట్లే అరబ్బీపాండిత్యముగల పారసీక విద్వాంసులు కవిత్వ మల్లుటవలన అరబ్బీపదములు విచ్చలవిడిగ పారసీక కావ్యముల నాటు కొని పోయినవి. పాదాంతాక్షరనియమముగల పారసీ కవిత్వమునకు అరబ్బీ పదజాలము మఱింత సౌలభ్యము చేకూర్చినది.

అరబ్బీ దండయాత్రకు పూర్వము పారసీకమున కవిత్వములేదని చెప్పుదురు. వాల్మీకి మహాకవికి పూర్వము సంస్కృతమునను నన్నయకు ముందు తెలుఁగునను కవిత్వములేదని చెప్పునట్లు ఇదియు నొక వివాదాంశ ము. ఈ విషయమున పారసీక వాఙ్మయ చరిత్రకారులు భిన్నాభిప్రాయ ముల వెలిపుచ్చియున్నారు. కొందఱు క్రీ-శ- అయిదవ శతాబ్దియందు పంచమ బహ్రాము ఛందోబద్ధమగు కావ్యము రచించెనని చెప్పుదురు. మఱి కొందఱు అబుల్‌హాఫ్'స్ ఆదికవియని యందురు. మెర్వు పట్టణమున

అబ్బాసునవతఁడు మామూనును కీర్తించుచు క్రీ-శ- 809 వ సంవత్సరమున ప్రథమ పారసీ కావ్యము రచించెనని మహమ్మద్ ఊఫి' వ్రాసియున్నాడు.

కాలక్రమముగ క్షీరనీరములటు ఆర్య ఇస్లాము నాగరకతలు సమ్మిళితము లైనవి. పారసీక జాతీయ జీవన ప్రభాతము దేశము నావరించియున్న గాఢాంధకారమును పటాపంచలు గావించెను. ఖురాసాను రాష్ట్రమున జాతీయోద్యమము తలచూపి నలుదిక్కులకు ప్రసరించెను. కాలార తిరుగ నేర్చిన బిడ్డ యెంత కాలము దాది నిర్బంధమునకు లొంగియుండును ? పరాయి రాచఱికము జాతీయజీవన వికాసమునకు ప్రతిబంధకమని పారసీకులు తెలిసికొనిరి. అరబ్బులపై ద్వేషము ప్రజ్వలించెను. రహస్యముగ సంభాషించుచున్నపుడు మహమ్మదును సైతము " అరబ్బీప్రవక్త " యని ఖేరడించు నంతటి నిర్లక్ష్యము జనించినది. పారసీకులకు పలుకుబడి హెచ్చినది. ఉమయ్యాద్వంశీయ కలీఫా'లకు ప్రతి స్పర్ధులైన అబ్బాసీదులకు పారసీకులు సర్వవిధ సాహాయ్యము లొనర్చి అరబ్బీ పరిపాలనము నామ మాత్రావశిష్టము గావించిరి.

మెసపొటేమియా, ఆఫ్'ఘనిస్థానము, ఖురాసాను రాష్ట్రములందు పూర్వము బౌద్ధులు హిందువులు నివసించుచుండిరి. ఇప్పటికిని అచ్చట శిథిలములైన బౌద్ధ విహారములు విగ్రహములు కనుపట్టుచున్నవి. హిందూ బౌద్ధమత భావములు అచ్చటచ్చట వ్యాపించియుండెను. మానవుని సుఖ దుఃఖములు విధినిర్ణీతములనియు పునరావృత్తి, అవతారములు, ఈశ్వరుని సర్వవ్యాపకత్వము, సర్వాంతర్యామిత్వము, అగ్నినుండి విస్ఫులింగములు బయలు వెడలినట్లు ప్రాణికోట్లు సర్వేశ్వరునుండి వెలికుఱికి యెప్పుడైన నొకప్పుడు నైక్యమగునను నిట్టిభావములు, విశ్వాసములు పూర్వ పారసీకులందు వేళ్ళునాటుకొని యుండినవి. పారసీకమున ఇస్లాము మత మిట్టి యన్యభావములతో సమ్మేళించి నూతనాకారముఁ దాల్చెను. ఇట్టి పరస్పర సమ్మేళనమునకు ప్రతిఫలముగ తొమ్మిదవ శతాబ్దియందు

* వేదాంతము (సూఫీ'మతము) తలచూపినది. భావికవితా విజృంభణమునకు పోషకములగు పరిస్థితులు, సన్నివేశములు ఈశతాబ్దియందొనగూడినవి.

పదియవశతాబ్ది పారసీక కవితాలతకు వసంతసమయము. జాతీయ జీవనమున నూతనఘట్టము. మహమ్మదు గజ్నవీ రాజ్యపరిపాలనమున లలిత కళలు, శాస్త్రములు, భోగభాగ్యములు సర్వతోముఖముగ వ్యాపించినవి. స్వభాషపై అరబ్బీభాషకుగల ప్రభుత్వము జాతీయాత్మగౌరవమునకు లోప మని దీర్ఘదృష్టులగు కొందఱి పండితులకు కవులకు తోచినది. మృదుమధుర శబ్దసంపన్నమగు పారసీ పదజాల మడుగంటి అరబ్బీ పదములు వాని స్థానము నాక్రమించుట అసహ్యముగ కనుపట్టెను. మణిప్రవాళభాషను త్యజించి పరిశుద్ధమగు తమిళ్ భాషనుద్ధరించవలయునను ఉద్యమ మిప్పుడు దక్షిణదేశమున పొడచూపినట్లు "శుద్ధపారసీ" యుద్యమము బయలుదేరినది. పూర్వపారసీకముపై కవులదృష్టి మరలినది. పూర్వవీరులు జాతీయ జీవన కాద్దర్పణమున ప్రతిఫలించిరి. ఫిర్దౌసి మహాకవి యీ యుద్యమమునకు నాయకుఁడు. స్వభాషాభిమానముతో "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁజొన్ప" నని తిక్కన మహాకవి నిర్ణయించుకొని ఆ దృష్టితోనే భారతమంతటి గొప్పయితిహాస ప్రబంధమును నిర్వహించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రుఁడయ్యెను. ఫిర్దౌసియింతకంటె నుదారుణమైన దీక్షవహించి శుద్ధ పారసీభాషలో షానామావంటి బృహదితిహాస ప్రబంధమును రచించి పారసీకజాతిని ఋణబద్ధను గావించికొనెను.

---

* "That Sufism proper, as it finds expression in the different Dervish orders (which I sharply distinguish from the simple ascetic aim which already appeared in the earliest Christianity, whence it passed over to Islam) arose essentially from Indian ideas and in particular from that school of Indian philosopy known by the name of Vedanta'

*Von Kremer, (Literary History of Persia by E. G. Brown)*

ననుసరించి వస్తుభేదము నిర్ణయింపఁ బడియు వాడుకయందు అట్టి నియమములు పాటింపఁ బడకుండినవి.

మస్నవి:—ఇది మంజరీ ద్విపదకు సరిపోలును. ఈ ఛందస్సు మన ద్విపదవలె "ఎల్లమరాజునడక యేకనడక" అను సామెత యట్లుకాక గణభేదము వలనను పాదాంతాక్షర నియమము వలనను వివిధగతులతో నొప్పియుండును. ఈ కావ్యమున వీరరసము ప్రధానము; తరువాతిది శాంతరసము. క్రమక్రమముగా ఈ నియమము నశించినది. ఫిర్‌దౌసీ షానామా, రూమీ మస్నవి ఈ ఛందస్సునకు ఉత్తమోదాహరణములు.

కసీదా:—విషయమునుబట్టి దీనిని స్తోత్రపాఠములకు సరిపోల్పవచ్చును. పాదుషాలు, పెద్దమనుష్యులు, ప్రవక్తలు మున్నగువారిని స్తుతించుట ఈ కావ్యమున ప్రధానాంశము. సాధారణముగ అర్థాపేక్షగల కవులు పాదుషాలను పొగడిన పొగడ్తలే ఈ కావ్యమున నిండియుండును. దీని నే ఛందస్సులోనైన వ్రాయవచ్చును. అయినను మస్నవీ ఛందస్సులో వ్రాయుట ఆచారమై యున్నది. పదు నేడు పాదములకంటె తక్కువగను నూటయిరువది పాదములకంటె హెచ్చుగను ఈ కావ్యమును రచింపకూడదను నియమముగలదు. పాదాంతములన్నియు సమాన శబ్దాక్షర నిబద్ధములై యుండవలయును.

ఈ కావ్యము ప్రకృతి ప్రియావసంతములలో నేదైన నొకదాని వర్ణనముతో ప్రారంభమయి కవిస్తుతింపఁ దలఁచుకొన్న పాదుషా వర్ణనములోనికి దిగును. సాధారణముగ ఈస్తుతులన్నియు కవిసమయ బద్ధములై ప్రబంధకవులు కృతినాథుల వర్ణించిన విధముగ నుండును. ఈ తెగ కావ్యములు రచించిన వారిలో అన్వరి, ఖాఖాని, జహీర్ ఫార్యాబి సుప్రసిద్ధులు.

గజల్:—దీనికిని మన సీసమాలికకును కొంత సాదృశ్యము గోచరించును. "కవికి కంసాలికి సీసము తేలిక" అన్నట్లు విద్యార్థులు

మొదలు పండితుల వఱకును కవులైనవారును కానివారును ఈ గేయముల నల్లుచుందురు. 'గజల్ వ్రాయనివాఁడు ఖుమర్ త్రావనివాఁడు పారసీపేరు పెట్టుకొనఁడ''ను సామెతయే యీ రచనయొక్క సౌలభ్యమును దెలుపుచున్నది. ఒక తెగ గజలులో ప్రియావిరహము, వసంతము, ద్రాక్షాసవము, ఉద్యానవనము, గులాబి, బుల్బులి, ప్రియునిత్యాగము, ప్రియురాలి సౌందర్యవర్ణనము మున్నగు శృంగార విషయములు వర్ణింపఁబడి యుండును. మఱికొన్నిట సూఫీ'మతతత్త్వములు నీతులు ప్రకటింపఁ బడియుండును. ఈకావ్యమున ఐదు మొదలు ఇఱువదిపాదములవరకుండవచ్చును. కసీదాకువలె పాదాంత నియమము కలదు. షంస్ తబ్రీజ్, సాది, హాఫీ'జ్ గజలు కావ్యరచనమునందు ప్రముఖులు.

**రుబాయి**—ఇది మన తేటగీతికి సరిపోలును. తేటగీతివలె ఇదియు దేశ్యచ్ఛందస్సని చెప్పుదురు. దీనిపుట్టుకను గుఱించి దౌలత్ షా హ సమర్ఖండి ఇట్లు వ్రాసియున్నాఁడు: "పారసీకమున యాకుబ్ బిన్ లైస్ సఫా'రను పాదుషాయుండెను. అతనికొక చిన్న కుమారుడుండెను. వానిని చాల గారాబముతో పెంచుకొనుచుండెను. ఈద్ పండుగనాఁడు ఆబాలుఁడు తోడిబాలురతో కలసి గింజలాట ఆడుచుండెను. వినోదము చూచుటకొఱకు తండ్రియు అచ్చటకువచ్చి నిలఁబడెను. ఇతర బాలురవలె నే రాజకుమారుఁడును గింజలను దొరలించెను. ఏడుగింజలు చెందును ముట్టినవి; ఒకటి తప్పిపోయినది. అందుకా బాలుఁడు హతాశుఁడయి మఱియొకతూరి గింజను దొరలింపఁగా అది చెందుదగ్గరకు దొరలిపోయెను. సంతోషము పట్టలేక ఆ రాజకుమారుఁ డిట్లనియెను: "ఘల్తాన్ ఘల్తాద్ హమిరవద్ తా లబెగో'' అనగా దొరలుచు దొరలుచు (ఆగింజ) చెందు అంచునకు పోవుచున్నదని అర్థము పాదుషా కీమాటలు వినసొంపుగా నుండెను. అంతట ఆయన ఆస్థాన సచివులను రావించి ఆవాక్యమును వినిపించెను. అది కవిత్వమని వారు చెప్పిరి, అట్టిపాదము మఱియొకటి

వ్రాయఁబడినది. అది కొన్నాళ్ళవఱకు ద్విపదగనే వాడుకలో నుండినది. కాని భావము లిముడ్చుటకు రెండు పాదములు చాలవని రెండు ద్విపదల నొకటిగా చేర్చిరి. అదియే రుబాయి యైనది."

రుబాయికి నాలుగు పాదములుండును, (పారసీక లాక్షణికులు అర్ధపాదములని అందురు) ఒకటి, రెండు, నాలుగవ పాదములకు అంత్య నియమము కలదు. వేమన గీతములందువలె రుబాయిలలో తత్త్వములు, నీతులు సంక్షేపించి చెప్పుటకు అనువుగానుండును. ఖయ్యాము రుబాయతు హాఫీ'జు సాఖీనామా యీ తెగ కావ్యములలో గణ్యము లైనవి.

## ప్రతిబంధకవుల పోకడలు.

ప్రపంచ మందంతటను మానవ స్వభావ మొకేతీరుగ నున్నది అరిషడ్వర్గము లనఁబడు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు జగదేకములై సృష్టిస్థితి లయములకు బాహ్య హేతువులై ప్రాణికోట్లను ఐహిక మార్గమున నడుపుచున్నవి. ఇట్టి ప్రకృతిని ఆశ్రయించిన కవిత్వము కూడ అన్ని దేశములందు ఒకే విధముగ నుండును. అయినను దేశకాల భేదములు ప్రత్యేక జాతీయశీలము, భిన్నాచార వ్యవహారములు ఆయాదే శీయ కవిత్వములకు అనితర సాధ్యమును అననుకరణీయము నగు విశిష్టతను చేకూర్చును. పారసీ సాహిత్యముకూడ ఈ న్యాయమునకు బాహ్యము కాదు.

పారసీ కావ్యములందు సున్నితమైన శృంగారము కలదు. ఆకవుల దృష్టి ప్రియురాలి ముంగురులను చెంప జుల్ఫాలను, నర్గిస్ పూలవంటి కన్నులను, గులాబిరంగు చెక్కిళ్ళను, తేనెయూరు వాతెఱను, కపోల తిలకమును, నవ్వినపుడు చెక్కిళ్ళపై నేర్పడు పల్లమును దాఁటి క్రిందికి ప్రసరింపలేదు; దగ్గరున్న పాలింతలపై దుముకలేదు; అటనుండి నున్నని నూగారుపై జారి పొక్కిలిలో పడలేదు; సాధారణముగా పారసీక విలాస

వతులు కుడితిసీ తొడుగుకొని గాగరా కట్టుకొని యుండుటయే దీనికి కారణమైయుండును.

ప్రబంధ యుగమునాఁటి ఇతర దేశముల కవులందఱివలె పారసీక కవులును కవిసమయ సంప్రదాయ బద్ధులు, కున ప్రబంధకవుల నాయిక నడుము మొట్టమొదట పంచానన మధ్యమయి, కృశించి, పసచెడి, సన్నగిల్లి అస్తి నాస్తి విచికిత్సకు లోనయి తుట్టతుదకు గగనమువలె శూన్యమైనట్లు పారసీక కవుల నాయిక * నోరు మొట్టమొదట బిందువంతయయి క్రమముగా పూడుకొనివచ్చి, చీమ హృదయ మంతయయి, సూది మొనయంతయయి కడపటికి అర్థముగాని సూక్తిలో దాగియున్న భావమువలె శూన్యమగును! ప్రణయ కలహముచే మాటలాడకున్న నాయికను గాంచి నాయకుఁడు "నినోరు చీమహృదయమంత చిన్నదైనందున మాటలాడఁజాలకున్నావని" వ్యాజస్తుతి చేయును.

పెదవిపైని పుట్టుమచ్చను వర్ణించునపుడు "హిందు" అను పదమును శ్లేషించి చమత్కరింతురు. (హిందు = దొంగ, నల్లని బానిస. విగ్రహారాధకుఁడు అని అర్థము) "నీపెదవిపై నిరవుకొన్న తిలకమునుదప్ప కౌసరు నదీతీరమున హిందువు నెవరుచూచిరి. (సర్ షుష్ నామా) కౌసరు స్వర్గమున ప్రవహించు తేనెవాఁగు. పారసీయందు "లబ్" అను పదమునకు వాతెఱయనియు ఏటిగట్టనియు, అంచు అనియు అర్థములు కలవు. ఇచ్చట పెదవి కౌసరునకు పుట్టుమచ్చ హిందువునకు పోల్పఁబడినది. మహమ్మదీయుల స్వర్గమునందు హిందువు ఉండడనియు ధ్వనించును. "ఓ ప్రేయసీ, నీ చెక్కులపై నుండునది పుట్టుమచ్చ కాదు; సూర్యోపాసకుఁడగు హిందూబాలుఁడు," అని మఱియొక కవి వ్రాసెను. పుట్టుమచ్చ

---

* నోరు చిన్నదిగ నుండిన చాల రమణీయమని మంగోలియా జాతుల అభిప్రాయము.

యను హిందూబాలుఁడు ముఖమను సూర్యుని అర్చించుచున్నాఁడని భావము. విరహ విహ్వలుఁడగు కాముకుని దీపమునఁబడి మాడిపోవు మిడుతకు సరిపోల్తురు, ప్రేయసికొఱకు ప్రియుఁడు నిశ్చింతముగ ప్రాణపరిత్యాగము చేయును. ప్రణయసాహిత్యమునందు లైలా మజ్నూనుల కథయూ, షీరీను ఫ’ర్హాదుల కథయు కఠిన చిత్తుని హృదయమునైన కరఁగింపఁజాలినంత కరుణరస భరితములుగ నున్నవి.

షానామా వంటి రాజచరిత్రలు షీరీనుఫ’ర్హాదులవంటి కథా కావ్యములుతప్ప తక్కిన గజలు వాఙ్మయమున భావనవ్యత యగపడదు, ఇతరులకు అనగా మనవంటి వారికి కొన్ని గజలులు చదువునప్పటికి విసుగు పుట్టును. ఒకేవిధమైన భావములు వివిధములుగ ప్రకటింపఁబడి యుండును. పారసీక కవులు పునరుక్తిని దోషముగ పరిగణింపరు. ప్రబంధకవుల పోకడలు కొన్ని దిక్ప్రదర్శనముగ చూపించితిని. మొత్తము మీద పారసీక సాహిత్యము గుణమునందును రాశియందును ఏ సాహిత్యమునకును దీసిపోదు.

## ఉమ్రిఖయ్యాము.

పారతంత్ర్యము వదలి పారసీక జాతీయ జీవనము పూర్ణవికాసము చెందియున్న కాలమున, ఉమ్రిఖయ్యాము నిషాపూరున జన్మించెను. అప్పటి నిషాపూరు శిథిలమైనది. ఇప్పటి నిషాపూరు వేఱు. ఈతని జన్మ సంవత్సరము ఫలాని దని నిర్ణయించుటకు తగిన సాధకములు లేవు. * క్రీ-వె-1015 మొదలు 1035 లోపల నేదియైననొక సంవత్సరముగ నుండవచ్చును. ఖయ్యాము సంపూర్ణనామము గియాసుద్దీన్ అబుల్ ఫతహ్ ఉమ్రిబిన్ ఇబ్రాహిమ్. తఖల్లుస్ నామము (Pen-name) ఖయ్యాము. పారసీకులు తమ పేరులకు తండ్రి పేరును జోడించుకొందురు. అందువలన ఖయ్యాము తండ్రి పేరు ఇబ్రాహీమని తెలిసికొన వీలైనది.

---

* హైదరాబాదు దొరతనమునందు అబ్కారీశాఖలో ఉద్యోగిగా నుండిన వి. యం. దాతారుగారు (ఇప్పుడు సన్న్యసించి గోవిందతీర్థ స్వాములవారని పేరు పెట్టుకున్నారు) కొంతకాలము ఉమ్రిఖయ్యాము జీవితమును గుఱించియు అతని కృతులను గుఱించియు పరిశోధన సలిపిరి. అట్లే జర్మనీలో ఖయ్యాము కృతులను గుఱించి పరిశోధన చేయుచున్న డాక్టరు రెంపిసుగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపిరి. ఆ పరిశోధనలకు ఫలితముగా వారు 1941 వ సంవత్సరమున "The Nector of Grace" అను పేరుతో 1030 పద్యములు గల రుబాయతును, ఒక పెద్ద యుపోద్ఘాతము తోడ ప్రకటించిరి. ఈ పద్యములలో షుమారు 700 పద్యములు ఇతర పారసీక కవుల గ్రంథములలో కానవచ్చు చున్నవని దాతారుగారును ఇతర పరిశోధకులును నిర్ణయించిరి.

పారసీక కవులందఱును తఖల్లుస్ నామము పెట్టుకొనుట సామాన్యాచారమై యుండినది. ఫిర్‌దౌసి, హాఫీజ్, అత్తారి, సాది, జామి, అనునవి యిట్టి మాఱుపేరులే. సంస్కృత కవులలో కూడ రత్నఖేటుఁడు, కోటిసారుఁడు, భవభూతి అను మాఱుపేరులుగల కవులుండిరి. ఇటువంటి లాంఛనములనుబట్టి వారి వారి వృత్తులు నిర్ణయింప సాహసించుట చూడ, బేకర్, బార్బర్, స్మిత్ అను పేరులుగల ఆంగ్లేయులందఱు ఆయావృత్తులకు సంబంధించినవారని చెప్పినట్లుండును. అయినను పారసీక

---

ఆ యుహోస్నాతమునందు విడదీయబడిన చిక్కులలో ఖయ్యాము జన్మదిన నిర్ణయము ముఖ్యమైనది. జహీరుద్దీన్ అబుల్ హాసన్ బైహకి రచించిన "పారసీక తత్త్వవేత్తల జీవిత చరిత్రములు" అను గ్రంథమునందు ఖయ్యాము జన్మదినమును తెలుసుకొనుట కొక యాధారము దొరకినది. దానిని బట్టి దాతారుగారు ఖయ్యాము జన్మదినము నిర్ణయించుటయేగాక, లగ్నకోటినిగూడ తయారు చేసిరి.

1048 మేనెల 18 వ తేదిన సూర్యోదయ కాలమున జన్మము. లగ్నము మిథునము. రవి, బుధ, శుక్రులు లగ్నమందున్నారు. ద్వితీయమున చంద్రుడు. పంచమమున రాహువు. అష్టమమున శని. నవమమున గురువు. ఏకాదశమున కేతువు. ద్వాదశమున అంగారకుడు. జన్మాది 1064-2-24 తేది వఱకు గురుదశ.

ఇంతకన్నను ప్రబలమైన ఆధారము దొరకువఱకు ఈ నిర్ణయమె సత్యమని తలంప వచ్చును. సర్, ఇ-డి రాస్ మహాశయుడు ఖయ్యాము జన్మ సంవత్సరము 1040 అనియు, సయ్యద్ సులేమాన్ నద్వీగారు 1048 అనియు ఇదివరకు నిర్ణయించి యుండిరి.

వాఙ్మయ చరిత్రకారులు కొందఱు, అత్తారి అత్తరమ్ము చుండెననియు, ♦ ఖయ్యాము డేరాలు కుట్టుచుండెననియు, ఫిర్‌దౌసి తోటమాలి యనియు వ్రాయుట చిత్రముగనున్నది. ఇట్టియూహాలు విశ్వాసనీయములు కావు. "జ్ఞాన పటాలయమ్ము నొడికమ్ముగఁ గుట్టు ఖయాము నేఁడు దుఃఖానల దగ్ధుఁడయ్యె" నని ఖయ్యామె చెప్పకొని యున్నాఁడు! గుడారములు కుట్టి జీవించు పేదవాని కుమారుఁడు ఆ కాలమున, సుప్రసిద్ధ విశ్వ విద్యాలయమున సర్వశాస్త్ర పారంగతుఁడయి పాదుషాలతోను వజీరులతోను కలసి మెలసి ఆచార్య స్థానము నలంకరింప తగినంత వీలుండి యుండునా యను సందేహము పుట్టక మానదు.

సాధారణముగ పూర్వకవుల చరిత్రములవలె ఖయ్యాము చరిత్రము కూడ కాలగర్భమున దాఁగియున్నది. అతని గార్హస్థ్య జీవితమును గురించి తెలిసికొనుట కెట్టి యాధారములును లేవు. హాఫీజుకవి తనభార్య తల్లిగారింటికి పోయినపుడు తాను అనుభవించిన విరహ వేదనను, శిశువు మరణించినపుడు తానుపొందిన దుఃఖమును కొన్ని గజలులలో జాలిపుట్టు నట్లు వర్ణించి యున్నాఁడు. కాని, * ఖయ్యాము ఒక్క రుబాయి యందైనను భార్యపుత్రులను గురించి ప్రస్తావించి యుండలేదు. నిజాముల్ ముల్కు వంటి సమకాలికులును, నిజామి ఉరూజివంటి శిష్యులును, దౌలత్ షాహాసమర్ఖండివంటి తరువాతి గ్రంథరచయితలును వ్రాసిన

---

♦ ఖయ్యామునకు పూర్వమె ఖయ్యామను పేరుగల కవులు పండితులు ఉండిరి. అబుసాలె ఖలాప్ ఖయ్యాం (బుఖారా), అబ్దుల్లా మహమ్మద్ ఖయ్యాం. ముదహాబుద్దీన్ మహమ్మద్ బిన్ ఆలిఅల్ ఖయామి (ఈరాక్) ఈ ఖయాము పేరు డేరాలు కుట్టుటవలన ఏర్పడినది కాక, పూర్వమునుండి వచ్చుచుండిన పేరులలో నొకటి.

* వి. యం. దాతారుగారు ప్రకటించిన రుబాయతులో ఈ క్రింది రుబాయి యొకటి కలదు.

వ్రాతలవలన ఖయ్యాము జీవితములోని కొన్ని యంశములు మాత్రము మనకు తెలిసికొన సాధ్యమగు చున్నవి.

ఉమ్రిఖయ్యాము విద్యాభ్యాస కాలము నాఁటిదొక చిత్రమైన కథగలదు. నిజాముల్ ముల్క్ 'వసాయా' యను పారసీక గ్రంథమున వ్రాసిన సంగతులను సంగ్రహముగ నిచ్చుట అనువదించు చున్నాను: "నిషాపూరునందు సుప్రసిద్ధ శాస్త్రవేత్తయగు ఇమాం మువఫి'క్ అను ఆచార్యుఁ డుండెను. ఆయనయొద్ద చదువుకొన్నవారు అదృష్టవంతులగుదురను వదంతి లోకమున వ్యాపించి యుండెను. నేను తూస్ నగరము నుండి నిషాపూరునకు వచ్చి యిమాంమువఫి'క్ గారికడ విద్యార్థిగ చేరితిని. ఆయన నన్ను చాల దయతో నాదరించు చుండెను. నాకును ఆయనపై భక్తిశ్రద్ధలు కుదిరినవి. నాలుగు సంవత్సరముల వఱకు నే నాయన వద్ద చదివితిని. నేను విద్యార్థిగ చేరిన వెనుక కొంతకాలమునకు ఉమ్రిఖయాము, హాసన్ బిన్ సబాహ్ అను ఇద్దరు విద్యార్థులు ఇమాము గారియొద్ద చదువ వచ్చిరి. ఉమ్రిఖయ్యాము బుద్ధి బలము నందును విషయగ్రహణ శక్తియందును అందఱికంటె మిన్నగనుండెను. మేమిరువురము ప్రియస్నేహితుల మైతిమి...........ఒక నాఁడు హాసన్ బిన్ సబాహు నాతోడను ఖయ్యాముతోడను ఇట్లు చెప్పెను: 'ఇమాం సాహేబు దగ్గఱ చదువుకొన్న వారు అదృష్టవంతులగుదురని లోకులు చెప్పు కొందురు. అథమపక్షము మన ముగ్గురిలో నెవఁడైన నొకఁడు ఉన్నత స్థితికి

---

"నా దుష్కీర్తి మిన్నుముట్టినది,
ప్రియమైన నా జీవితము ముప్పది దాటినది,
సంతోషములేదు, పెండ్లి తప్పిపోయినందుకుగా, వీరైనయెడల,
ఎడతెరపిలేక నూరుగిన్నెల ద్రాక్షాసవము త్రాగెదను."

"ఖయ్యామునకు సంతానములేదు. అతడు పెండ్లి చేసుకొనలేదు" అని తరబ్ ఖానాలో వ్రాయబడి యున్నది.

రావచ్చును. అట్లు ప్రాభవము సంపాదించిన వాఁడు తక్కిన యిద్దఱిని తనతో సమానులనుగ నొనర్ప వలయునను ఒప్పుదల మనము చేసికొన వలయును.' ఈమాటలను మేము సమ్మతించి మువ్వురమును అదేవిధముగ సమయ బద్ధుల మైతిమి.

కొంతకాలము జరిగిన వెనుక నేను నిషాపూరునుండి వెడలిపోయి అల్ప్ ఆర్సలాన్ ప్రభువునొద్ద మంత్రిత్వము నిర్వహించు చుంటిని. హాకీం ఉమ్రిఖయ్యాము నాయొద్దకు వచ్చెను. మేము పూర్వము కావించుకొన్న యొప్పుదలను నాచేత నైనంతవఱకు నెరవేర్ప తలంచి గౌరవ పురస్సరముగ నిట్లంటిని. 'మీరు చాలా మేధావంతులు. మీరేదియైనా నొక రాజోద్యోగము నిర్వహింప వలయునని నాకు కోరికగ నున్నది. ఏలన, ఇమాంమువఫి'క్ గారి యొద్ద విద్యార్థులమై యుండిన పుడు మనము ఇటువంటి షరత్తు చేసికొని యున్నాము. మీపాండిత్యమును ప్రతిభను గుఱించి పాదుషాకడ విన్నవించెదను. తరువాత మీరును నావలెనే యున్నత స్థితికి రావచ్చును.' ఈమాటలకు ఖయ్యామిట్లు చెప్పెను: 'మీరాడిన మాటలు మీకులీనతకును హృదయ కారుణ్యమునకు గొప్పతనమునకు తార్కాణముగ నున్నవి. అయినను పూర్వపశ్చిమ రాష్ట్రముల వజీరులు మీవలెనె నాబోటి యల్పుని గుఱించి తలపోయుదురని ఏమి నమ్మకము కలదు. ఎట్లయినను తమవంటి గొప్ప వారికి అసాధ్యమగునది యేదియులేదు. నాబోటి సామాన్యునిపై తమరింతటి శ్రద్ధవహించినందుకు యావజ్జీవము నేనుమీకు కృతజ్ఞుఁడను. తమ కరుణయున్న యెడల నేనొకమూల కూర్చుండి గ్రంథకాలక్షేపము చేయుచు విద్యార్థులకు పాఠము చెప్పుచు తమరి ఆయురారోగ్యైశ్వర్యములు ఇతోధికముగ అభివృద్ధి చెందునటులు దేవుని ప్రార్థించు చుండెదను. హాకీముగారికి ఉద్యోగాపేక్ష లేదని నిశ్చితముగ నెఱింగి సాలీనా 1200 తోమానులు ఆదాయము వచ్చు జాగీరును నిషాపూరున నొసంగితిని. అంతట హాకీం

ఉమరుఖయ్యాము ప్రకృతి శాస్త్రములు కళలు మున్నగు వానియందు ప్రావీణ్యము సంపాదించుచుండెను.

"హసన్ బిన్ సబాహు ఆల్ప్ అర్సలాన్ రాజ్యకాలమున నెచ్చట నుండినదియు నెవరెఱుంగరు. అర్సలాన్ మరణానంతరము నేను మలిక్షా ప్రభుత్వమున మంత్రినిగానున్నపుడు అతఁడు నన్ను సందర్శించి యొప్పుదలను జ్ఞప్తిపఱచెను. నేను పాదుషాయొద్దకు అతనితీసికొనిపోయి రాజాస్థానమున నొక యుద్యోగ మిప్పించితిని. కొన్నిదినములకతఁడు పాదుషాకు స్నేహపాత్రుఁడయి ఆయనబుద్ధిని తప్పుదారులకు లాగుచుండెను. పాదుషా ఆ సవ్వడికనిపెట్టి అతని పదభ్రష్టుని గావించెను."

నిజాముల్ ముల్కు వ్రాతను బట్టి ఖయ్యాము ఉద్యోగాపేక్ష లేని వాఁడనియు విజ్ఞానసంపాదనమునందె నిమగ్నుఁడయి శాంతముగ కాలము గడపుచుండెననియు తెలియవచ్చుచున్నది.

## ఖయ్యాము బాల్యయౌవనములనాఁటి కాలపరిస్థితులు.

మతనిర్బంధములు, ఆచారముల కట్టుఁబాటులు, ఇహలోకద్వేషము, వైరాగ్యము పెచ్చుపెరిగి మానవజీవితము యంత్రప్రాయమైనపుడు తిరుగుఁబాటుకూడ తలచూపుచుండును. పారసీకమున ఇట్టితిరుగుఁబాటు పదియవ శతాబ్ది ప్రారంభమున పొడకట్టినది. గ్రీకు అరబ్బీ ప్రకృతిశాస్త్ర గ్రంథముల మూలమున భౌతిక విజ్ఞానము విద్యావంతులలో క్రమ క్రమముగ వ్యాపించినది. మూఢభక్తియు అర్థములేని మతాచారములపైని విశ్వాసమును సన్నగిల్లఁ జొచ్చినది. స్వాభావికముగ హేతువాద పరమైన ఖయ్యాము మనస్తత్త్వమునకు ఈపరిస్థితు లనుకూలమై యుండినవి.

ఖయ్యాము జన్మించిన సంవత్సరముననో లేక యొక సంవత్సరము ముందుగనో ఇబిన్ సీనా మరణించెను. అతఁడు మహాప్రతిభాశాలి; కవి;

పండితుఁడు; విజ్ఞాన శాస్త్రవేత్త; గణిత శాస్త్రజ్ఞుఁడు; జ్యోతిష్కుఁడు; వైద్యుఁడు; రాజకార్య నిర్వాహకుఁడు; భోగప్రియుఁడు. ఇబిన్‌సీనా రసాయన శాస్త్రమునందు పరిశోధనలు కావించెను. ఒక ప్రసిద్ధ వైద్యగ్రంథమును, ఆత్మావతరణమను ఖండకావ్యమును, అష్షఫా అను తత్త్వశాస్త్రమును రచించెను. దేవుఁడద్వయుఁడనియు, ఇంద్రియ గోచరుఁడు కాఁడనియు, ఇట్టి వాఁడని నిరూపించుటకు వీలుకాని వాఁడనియు, సృష్టికి హేతుభూతుఁడనియు, అతఁడు తన తత్త్వశాస్త్రమున వ్రాసియున్నాఁడు. ఆత్మ మబ్బులో మెఱుపుతీగవలె ప్రజ్వలించి అంతర్హితమౌనని ఆత్మావతరణమను కావ్యమునందు వ్రాసియున్నాఁడు.

ఒకరాత్రి భోగానుభవమునందు, మఱియొకరాత్రి విజ్ఞానార్జనమునందు ఇబిన్‌సీనా కాలము గడుపుచుండెనని యొక లోకవాదము కలదు. రాజకార్యలంపటత్వమునతప్ప ఇబిన్‌సీనాకును ఉమ్రఖయ్యామునకును భావములందు, మనఃప్రవృత్తులందు ఏమియు భేదములు గోచరింపవు. ఖయ్యాము యౌవన కాలమునాఁటికి ఇబిన్‌సీనా తత్త్వములు, బోధలు, భావములు కఱకు మాయకుండెను. ఖయ్యాము అతనిని ఆదర్శకవ్యక్తిగ గ్రహించి యుండవచ్చును.

ఇఁక అప్పటి రాజకీయ పరిస్థితుల నరయుదము; సుల్తాను మహమ్మదు గజ్నవి క్రీ. శ. 1030 వ సంవత్సరమున కీర్తిశేషుఁడాయెను. అతని కుమారుఁడగు మాసూదు సింహాసన మధిష్ఠించెను. నాలుగు సంవత్సరములు గడచిన వెనుక సెల్జూకు వంశీయులగు తొగ్రుల్ బేగ్, చకిర్ బేగ్ అను ఇరువురు తురుష్క నాయకులు అతని నోడించిరి. అదిమొదలు ఇరువది సంవత్సరముల వఱకు సెల్జూకుల విజయధ్వజము అప్రతిహతముగ పారసీకమున సమరయాత్ర సలుపుచుండెను. దేశమున శాంతి యంతరించెను. మెర్వ్, నిషాపూరు, హేరాత్, సేస్తాన్, బాగదాదు మున్నగు

ముఖ్యపట్టణములు ఆ యిరువురి తురుష్క నాయకుల వశమైనవి. వీరి మరణానంతరము అల్ప్ అర్సలాన్ పారసీక సామ్రాజ్య సింహాసన మధిష్ఠించెను. తొమ్మిది సంవత్సరములు గడచిన వెనుక అతఁడు విప్లవకారులచే హత్యకావింపఁబడెను. అటుతర్వాత మలిక్ షా రాజ్యభారము వహించెను. అల్ప్ అర్సలానుకు మంత్రిగ నుండిన నిజాముల్ ముల్కు మలిక్ షాకును మంత్రియాయెను.

మలిక్ షా పారసీక చరిత్రమున ప్రసిద్ధుఁడు. అతనికి జలాలుద్దీన్ అని మఱియొక పేరుండెను. జలాలీశకము అతని రాజ్యకాలమున, అనఁగా క్రీ. శ. 1079- మార్చి- 15 వ తేదీన ప్రారంభింపఁబడెను. ఉమరుఖయ్యాము మలిక్ షాచే స్థాపింపఁబడిన జ్యోతిషాలయమునందు ప్రధాన జ్యోతిష్కుఁడైయుండి పంచాంగమును సంస్కరించెను.

నిజాముల్ ముల్కు గొప్పవిద్వాంసుఁడు; నీతివేత్త. ఈతఁడు మలిక్ షాకొఱకు 'సియాసత్ నామా' యను ప్రసిద్ధమైన పాలనా శాస్త్రమును రచించి పాదుషా పేరుప్రతిష్ఠలు చిరంజీవము కావించెను. నిజాముల్ ముల్కు మంత్రిత్వకాలమున క్రొత్త పట్టణములు నిర్మింపఁబడినవి. ప్రాఁత పట్టణములు శృంగారింపఁబడినవి. కళాశాలలు నెలకొల్పఁబడినవి. వేయేల, ప్రజలు సంపన్నులై అభివృద్ధినొందిరి. భోగములు కళలు పెంపొందెను. భావస్వాతంత్ర్యము ప్రబలెను. మఱియొకమాఱు పారసి రాజభాషయైనది. దేశమున శాంతి నెలకొనినది. ఇట్టి అనుకూలపరిస్థితులలో ఉమ్రఖయ్యాము బాల్యయౌవనములు సుఖమయముగ కడచిపోయెను.

## ఖయ్యాము పాండిత్య విశేషములు

ఖయ్యాము బాల్యము బల్ఖులోగడచెను. అతనికి బాల్యమునుండియు గణితశాస్త్రమునందు ప్రీతియు నైపుణ్యము హెచ్చుగనుండెను. జ్యామితి, అక్షరగణితములందు ప్రవీణుఁడయి జోతిశ్శాస్త్రము నభ్యసించెను. ఈ శా

స్త్రమునందు సమకాలికులలో ఎవ్వరును ఖయ్యామును మించినవారు లేరcట! పంచాంగమును సంస్కరించుటకు మలిక్‌షా ప్రసిద్ధ జ్యోతిష్కులను సమావేశపఱచినపుడు ఖయ్యాము వారికి నాయకుcడయి ప్రశంసనీయముగ ఆకార్యము నెరవేర్చెను.

ఖయ్యాము అరబ్బీభాషలో అక్షరగణితమును రచించెను. ఆ గణితము చాలకాలమువఱకు ప్రమాణగ్రంథముగ పరిగణింపcబడుచుండెను. పూర్వమీ అరబ్బీ గ్రంథము ఫ్రెంచిభాషలోనికి ననువదింపcబడినది. ఇదికాక, ధాతురసాయనశాస్త్రము, యూక్లిడ్ జామెట్రీకి వ్యాఖ్యానము, ఒకతత్త్వశాస్త్రము, రుబాయతు, అన్నియు కలసి తొమ్మిదిగ్రంథములను అతcడు రచించెను. అక్షరగణితము, రసాయనశాస్త్రము, జ్యామెట్రి వ్యాఖ్యానముల మాతృకలు ప్యారిస్, లేడన్, ఇండియాఆఫీసు లయిబ్రరీల యందు భద్రము చేయcబడియున్నవి. తక్కినవి (రుబాయతుతప్ప) నామమాత్రావశిష్టములు.

గ్రహగతుల ననుసరించి వాయువర్షముల ముందుగ తెలిసికొను శక్తి కూడ ఖయ్యామున కుండినదని నిజామిఉరూజి సమర్ఖండి ఇట్లు వ్రాసియున్నాcడు: "సదరుద్దీన్ మహమ్మద్ బిన్ ఉల్ మజఫ'ర్ పాదుషా, తాను వేటాడcబోవలయుననియు వర్షముకాని మంచుకాని కురువని యొకదినము నిర్ణయించి తెలుపవలయుననియు మెర్వుపట్టణమునుండి ఖయ్యామునకు చెప్పి పంపెను. అంతట ఆయన రెండుదినములు గ్రహగతులు లెక్కించి ముహూర్తము నిర్ణయించి స్వయముగా పాదుషాయొద్దకుపోయి ఫలానిదినముబాగుగ నున్నదని తెలిపెను. పాదుషా వేcటకు ప్రయాణమగుచుండcగ నే నలుదెసల మబ్బుక్రమ్ముకొని మంచు కురువనారంభించెను. లోకులుహాకీంసాహెబును నిందించిరి. పాదుషాయును వెనుకకు మరలcదలcచు కొనెను. అంతట ఖయ్యాము "నిర్భయముగ ప్రయాణముకండు. మబ్బువిచ్చిపోవును; అయిదు

దినములవఱకు నేలచెమ్మయైనకాదు'' అనిచెప్పెను. అట్లె పాదుషా ప్రయాణము సాగించెను. కొన్ని నిమిషములకు గాలి వీచి మబ్బు చెల్లాచెదరై పోయెను. మంచు పడుటయు నిలిచెను. అయిదు దినములవఱకును చినుకు చిటుక్కుమని పడలేదు.

ఖయ్యాము జ్ఞప్తికూడ చాల అద్భుతమైనదని చెప్పుకొందురు. అతఁడు ఇస్పహాన్ మఖామునందు విడిసియుండగా ఒక పుస్తకమును ఏడు మాఱులు చదివెను. నిషాపూరునకు వచ్చినవెనుక తాను చదివిన పుస్తకమును జ్ఞప్తిపెట్టుకొని తిరుగవ్రాసెను. తఱువాత కొన్నిదినములకు మాతృకతో ఆపుస్తకమును పోల్చిచూడ ఏవో కొన్నిమాటలు తప్ప గ్రంథమంతయు మాతృకకు సరియైన నకలుగ నుండెనఁట!

## ఖయ్యాము మధ్య వయస్సు.

నిజాముల్ ముల్కు ప్రసాదించిన జాగీరువలనను, మలిక్ షా ఆదరణము వలనను ఖయ్యాము మధ్యవయస్సు సుఖముగ గడచెను. రాజాస్థానమునందు, పండితగోష్ఠులందు, సరససల్లాపములాడుచు, శిష్యులకు పాఠము చెప్పుచు, ప్రకృతి రామణీయకమును తనివారగ్రోలుచు, ఇష్టమున్నపుడు ఒక్కొక్క రుబాయి శిష్యులయెదుట ఆసువుగ చెప్పుచు, సాఖియందియిచ్చు ద్రాక్షాసవమానుచు, పచ్చబయళుల విహరించుచు, సెలయేటి పాటల నాలకించుచు, వనభోజనము లారగించుచు, వెన్నెలగోష్ఠులు సలుపుచు ఖయ్యాము నిర్విచారముగను శాంతముగను జీవితముగడుపుచుండెను. మెర్వ్పట్టణ పాలకుడగు సదరుద్దీన్ మహమ్మదు ఆతని హెచ్చుగ నాదరించుచుండెను; సంజరుషాహి అర్థాసనమిచ్చి గౌరవించుచుండెను. ఈవిధముగ ఖయ్యాము జీవితము కొంచెమించుమించు ఏబదివత్సరముల వయస్సువఱకు పేరుప్రతిష్ఠలతోను, భోగభాగ్యములతోను పెంపొందుచుండెను. ''భోగముల ననుభవింపుము, మధువానుము. గతముగతంబె; భవిష్యదర్థము

సంశయాంధ సంవృతము; వర్తమాన మొక్కటే అనుభావ్యము. జీవితము వాతూలము లోనిదివ్వె. ప్రాయము ప్రతిక్షణము గతించిపోవుచున్నది. రాలిన పూవులు మరలవికసింపవు. త్వరపడుము" అను నిట్టి భావములు గల రుబాయీలు ఖయ్యాము మధ్య వయస్సునను, తత్పూర్వమును రచింపఁబడినవని మన మూహింపవచ్చును. ఆనాఁటిజీవితము ఈక్రింది పద్యమున మూర్తీభవించి యున్నది.

మన ప్రియజీవితంబు కుసుమంబుల పోలికఁ జంచలంబుగా
వునఁ బువులట్లు కాలమును బుత్తము నవ్వుల నాటపాటలన్;
గొనగొనబాఁటు కాలువల కోవలఁ దియ్యని పాన మాని జీ
వనభరణ పరియాస మొకప్రక్కకు రువ్వవమోసి, ప్రేయసీ

## ఖయ్యాము అపర వయస్సు.

ఈలోకమున నెవ్వరికిని "కాల మొక్కరీతిఁ గడవఁబోదు" మానవుని యదృష్టము చక్రనేమిక్రమముగ తిరుగుచుండును; హెచ్చులొచ్చులు సుఖదుఃఖములు మానవజీవితమునకు సహజములు. పండితులు పామరులు రాజులు రయితులు, కలవారు లేనివారు అందఱును ఈన్యాయమునకు బద్ధులైయుందురు. ఖయ్యాము సుఖమయ స్వప్నము భగ్నమైనది.

ఖయ్యామునకు మిత్రుఁడును ప్రధానామాత్యుఁడునగు నిజాముల్ ముల్కు క్రీ-శ-1092 వ సంవత్సరమున * 'ఇస్మయీలియాల'చే హత్య కావింపఁబడెను. తర్వాత కొలఁది కాలమునకే మలిక్ షాహియు భూగ

* నిజాముల్ ముల్కునకును ఉమ్రఖయ్యామునకును సతీర్థ్యుఁడయి వారితో ఒప్పందలకావించుకొన్న హసన్ బిన్ సబాహు ఇస్మయీలియాల సంఘమునకు నాయకుఁడు. ఇదియొక మతరాజకీయ సంఘము. ఇస్మయీలియాలను "హంతకు" లని చరిత్రకారులు పేర్కొనియున్నారు.

ర్భమున పవళించెను. రాజ్యమున అంతఃకలహములు, విప్లవములు చెలరేఁగినవి. సెల్‌జూకు సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. ఖురాసాను, ఈరాకు విభక్తమైనవి. సిరియా, కర్మన్ రాష్ట్రములు సామ్రాజ్యమునుండి విడివడినవి. పుట్టగొడుగులవలె ఊరు పేరులేని రాజులు బయలుదేరిరి. అన్నివిధములైన స్వాతంత్ర్యములు అడుగంటినవి. ఇస్మాయీలియాల దౌర్జన్యము నానాఁటికి హెచ్చుచుండెను. సెల్‌జూకురాజ్యమున దాఁగియుండిన మూఢభక్తి, అజ్ఞానము, మతపాషండత్వము, నేఁడు మరల తలచూపినవి. ఖురాను ధర్మములు, తు, చ, తప్పకుండ బాహ్యమునకు అనుసరణీయములైనవి. ఖయ్యామువంటి స్వతంత్రభావులు స్రోతువాగులు ప్రాణాపాయస్థితియందుండిరి. ఖయ్యాము తన అపరవయస్సును ఇట్టి మతసాంఘిక రాజకీయ దుఃస్థితులలో కడపవలసివచ్చెను.

వీరభద్రారెడ్డి స్వర్గస్థుఁడయి రెడ్డిరాజుల యాశ్రయము తొలఁగిన వెనుక కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు "కాశికావిశ్వేశుఁగలసె వీరారెడ్డి రత్నాంబరంబులేరాయఁడిచ్చు" నను పద్యమున తన హృదయ తాపమును వెలిపుచ్చినట్లు ఖయ్యాముకూడ తనదుఃస్థితి నిట్లు చెప్పకొనెను:

మనమున కెక్కినట్టి యభిమానులు మిత్రులుఁ జెల్లినారు; యౌ
వనమధు మాసమున్ గుసుమభారము రాలిచిపోయె; జీవితం
బను సరసంబునందు సగమింకె మధూళియు; నేదినంబు వ
చ్చెనో మఱియెప్పు డేఁగెనో దిపింపడు హర్షవిహంగ మిప్పుడున్.

పూవులకారు రాకలకుఁ బోయెడి సీతులకున్ రసోజ్జ్వల
జీవిత కావ్యపత్రములఁ జెప్పెఱ ద్రిప్పితి; శోకసర్పద
ష్టావిలమౌ హృదంతరము నాసవమున్ బ్రతియోగమొక్కటే
కావ సమర్థ; మింక ముదికాయము లేఁతగిలంగఁ ద్రావెదన్.

అయ్యో! ఖయ్యాము తన దుఃఖమును పానపాత్రయందు ముంచివేయ దలంచెను. అతఁడు పూర్వాచారపరాయణుఁడు కాఁడనియు, మహమ్మదీయ మతాచారముల పాటించుటలేదనియు ఒక వదంతి ప్రజలలో వ్యాపించెను. ఇస్మాలియాలు తన ప్రాణమున కెప్పుడు ఎసరుపెట్టెదరోయని తలంచి 'హాజీ' యనిపించుకొన్న ఇట్టి యాపద తప్పించుకొనవచ్చునని ఖయ్యాము మక్కాయాత్ర చేసెను. కాని పవిత్రమైన 'కాబా' అతని భక్తివినమ్రుని కావింపలేదు. తిరిగివచ్చినప్పుడు ఇట్లు చెప్పెను:

శిలపయి మట్టిపాల నిడి కట్టిన దేవళమందు నీకు నే
ఫలము లభించు? ప్రేమరస భావయుతుండవయేని కామినిన్
వలపుము; ప్రాణహీనమగు బండలు వెయిటికన్న శ్రేష్ఠమై
యలరుఁగదా మనుష్యహృదయంబు ప్రతిప్రణయానురక్తులన్.

స్వప్రయత్నము విఫలమైనపుడు, కష్టములు తలతాఁకినపుడు ధీమంతులుసైతము ఒక్కొక్కప్పుడు ఆత్మవిశ్వాసము కోలుపోయి నిరుత్సాహవంతులగుచుందురు. ఖయ్యాము హృదయముకూడ కాలసర్పదంష్ట్రదష్టమైనది. జీవితములోని లోఁతుపాఁతులు కానవచ్చినవి. కవితావిహంగము భావనా కల్పిత ప్రపంచమున నక్షత్రమండలమున ఎగురుట మాని భూమిపైనున్న గూటియందు కూలఁబడెను. "కాలశరాసనోత్పతిత కాండముతీక్ష్ణ" మని తెలిసినది. ఈ ప్రపంచము నందనవనమయ్యు ధనము లేని వారికి బంధన మగునను సత్యము గోచరించినది. మరణభయముకంటె జీవసంభరణభయమె మిక్కుటమని తోఁచినది. "కోరికలన్నియుం గుదుపుగూరవు సౌఖ్యముదుఃఖ మెప్పుడంగూరు రసంబుచేఁదటులు కూడియె యుండు" నను జీవితరహస్యము బోధపడినది. విధి యనివార్యమను భావమువలన తృప్తి యాలపడినది. ఖయ్యాము సహజముగ ధీమంతుఁడు కావున నిరుత్సాహపడక ఇట్లు చెప్పెను:

విధి నిబద్ధములై వచ్చు వెడలిపోవు
నఖిల సుఖదుఃఖములు నీ కయాచితముగ;
బడియ( బోకు దుస్తుముజాలు శత్రుఁడైన;
తాయి పక్షుఁడైన విందులఁ దలఁపఁబోకు.

ఈనాఁటి ఖయ్యాము జీవితము ఈ క్రింది పద్యమున ప్రతిఫలించుచున్నది.

జ్ఞానపటాలయమ్ము నొడికమ్ముగఁ గుట్టు ఖయాము నేఁడు దుః
ఖానల దగ్ధుఁడయ్యె; యముఁడా బెనుకత్తెర జీవితంపు బి
ట్టూను గుడారు మోకుఁ దెగనొత్తెఁ; బ్రపంచపు సంతలోన దు
గ్గానికి నమ్మెనిన్నుఁ బలుగాకిదలారి విధాయి యయ్యెయో!

ఖయ్యామునకు శిష్యప్రాయుఁడైన నిజామి ఉరూజి యిట్లు వ్రాసెను: "ఇమాం ఉమ్రఖయ్యాము బల్ఖు బట్టణమున అమీర్ అబూ సాద్ గృహమున అతిథిగ నుండినపుడు నే నాయనను సందర్శించితిని. ఒకనాఁటి సాయంకాలము తోఁటలో విహరించుచుండి ఆయన నాతో డ నిట్లనియెను: 'ఇటువంటి స్థలములో నా గోరి యుండును. సంవత్సరమునకు రెండు మాఱులు వృక్షములు లతలు నాగోరిపై పువ్వులు ఆకులను రాల్చును.' ఈమాటలలోని భావము నాకు బోధపడినది. అయినను యిటువంటి శాస్త్రవేత్త నిరర్థకముగ నేదియు మాట్లాడడని నేను తలంచితిని. తరువాత కొంతకాలమునకు నేను నిషాపూరునకు పోయియున్నపుడు హకీం ఉమ్రఖయ్యాము కీర్తిశేషుఁడాయెనని విని ఆయన సమాధిని దర్శించుటకు వెళ్ళియుంటిని. ఒకతోఁట గోడప్రక్క చల్లని చెట్లనీడ ఆగోరి కట్టఁబడియుండెను. గాలివీచినపుడెల్ల పువ్వులు, ఆకులు దానిపై పడుచుండెను. పూర్వము ఇమాం ఉమ్రఖయ్యాము చెప్పియుండిన మాటలు నాకు జ్ఞప్తికి వచ్చి ఆకాంక్షితముగ నాకన్నులు చెమ్మగిల్లెను." ఉమ్రఖయ్యాము క్రీ- శ- 1123 వ సంవత్సరమున నిషాపూరున భూగర్భము నలంకరించెను.

---

111

## ఖయ్యాము కవిత్వము.

ఖయ్యాము ఇతర పారసీక కవులవలె గొప్ప కావ్యమేదియు వ్రాయలేదు. అరబ్బీ కవిత్వముకూడ కొంత వ్రాసియుండెను; కాని, ఏవో కొన్ని పద్యములు తప్ప మిగతవి కాలగర్భమున జీర్ణించి పోయెను. ఖయ్యాము శాస్త్రపరిశ్రమయందు విసుగెత్తిన మనస్సునకు వినోదముకల్పించుటకొఱకు అప్పుడప్పుడు పద్యములు రచించి శిష్యులదగ్గఱనో, మిత్రులకడనో లేక పండిత గోష్ఠులందో చదువుచుండెను. ప్రత్యేకగుణ విశిష్టములును అంతస్సారయుతములునైన ఆపద్యములు ప్రజల హృదయములందు నాటుకొని పోయినవి. అయినను పారసీక పండితులు ఖయ్యామును గొప్ప కవిగా పరిగణింపలేదు. పారసీక వాఙ్మయచరిత్రమును వ్రాసిన బ్రౌనుగారును ఆపండితుల యభిప్రాయమునే గైకొని ఖయ్యామును మూడవతరగతి కవులలో చేర్చుట ఎంతయు విమర్శనీయము.

హిమాలయ పర్వతమునకున్న గభీరసౌందర్యము, వైశాల్యము సానదీరిన వజ్రఖండమునకు లేకపోవచ్చును. అందుచేతనే అది గర్హ్యము కాదు. కాళిదాసుని మేఘసందేశము వాల్మీకి రామాయణ మంతటి బృహత్ ప్రబంధము కాదను కారణము వలననే ఆకావ్యము నిరాదరణీయము కానేరదు. కళాసృష్టులను ఒకదానితో నొకటి సరిపోల్చి హెచ్చులొచ్చుల నిర్ణయించుట తగదు. ఒక్కొక్కదానికిని ప్రత్యేకస్థానము కలదు. "నిగ్గుగల్గు జాతినీలమొక్కటి చాలు తళుకుబెళుకురాలు తట్టెడేల" అనునట్లు రాశికంటె గుణమే ప్రధానము. గుణము కలిగిన రాశియు హెచ్చుగునేని అది యింకను శ్రేష్ఠమే.

ఒకశతకమును రచించి మయూరుఁడు గొప్పకవియనిఅనిపించుకొనెను. ఒక "మొలిజీ" వల్లనే థామస్ గ్రే యను ఆంగ్లేయకవి ప్రఖ్యాతుఁడయ్యెను. 'భాషో' అనుజపాను కవి కొన్ని 'హొకూ' పద్యములను (మన ద్విపదకంటెను చిన్నవి) వ్రాసి ప్రసిద్ధుఁడాయెను. ఖయ్యాము ఒకపద్యము వ్రాయకుండినను తనకీర్తి విజ్ఞాన ప్రపంచమున శాశ్వతముగ నుండదగియుండెడి. అతనికీర్తియంతయు రుబాయతుపై నాధారపడియున్నది. 'సత్కవి సౌందర్యస్ఫూర్తి రాజ్యేవకీ'మ్మ నెడు భర్తృహరిసుభాషితమున ఎంతగభీరసత్య మిమిడియున్నది! పురాతనపాంథశాలయగు నీప్రపంచమున బహరాం జమిషీదులవంటి పాదుషాలెందరో కొన్నియేండ్లు కొలువాని, గతించిరి. రాజ్యముల హద్దులు మారినవి. ప్రపంచబహిఃస్వరూపమే మారినది. అట్లయ్యును కవితాప్రాణితమైన ఖయ్యాము యశశ్చంద్రికలు నేఁడు నానాదేశములు వ్యాపించి హృదయాహ్లాదకరములై విలసిల్లుచున్నవి.

ఒకటిరెండు విషయములఁదప్ప తక్కిన యన్నిటియందు ఖయ్యాముతో సరిపోల్చ తగినవాఁడు ఆంధ్రకవులలో ఒక్క వేమనయే యగపడుచున్నాఁడు. ఖయ్యాము భోగి, వేమన యోగి. ఖయ్యాము శాస్త్రోపాసకుడు, వేమన ఆత్మసాధకుఁడు. ఆయనది రక్తిమార్గము, ఈయనది విరక్తిమార్గము

పారసీక పండితులు ఖయ్యాము నవగణించినట్లే ఆంధ్రపండితులును వేమన్నను కవిగ లెక్కింపలేదు. ఏలయన, వేమన అష్టాదశ వర్ణనములు గలిగి నాయికా నాయకుల శృంగార చేష్టలకు ఆకరమైన యొక ప్రబంధమును వ్రాసియుండలేదు. రసహీనమయిన శబ్దాలంకార భూయిష్టమయి బంధగర్భ కవిత్వములతో బచ్చెన బొమ్మలవలె కనుపట్టు నిర్జీవ కావ్యము రచించిన వానిని సైతము గొప్పకవియని పండితులు సమ్మానింతురు; కాని, నిరాడంబరమయి సహజసౌందర్యము కలిగి నూటిగా ప్రజల హృదయములోనికి ప్రవేశింపఁగల ముచ్చటయైన పద్యములు చెప్పిన కవి వారి దృష్టికి తాళఁడు! ఐననేమి? పూర్వము ప్రబంధకవులు రచించిన

కావ్యము లెన్నియో విస్మృతములయి పోయినవి పోగా మిగిలినవి యెన్నియో పుస్తక భాండాగారములందు రామ బాణముల వాతఁబడి అర్థానర్థరూపములతో కొసయూపిరితో బ్రతికియుండగా వేమన పద్యములు సజీవములై ఆంధ్రుల హృదయపీఠము నధిష్ఠించి ప్రమాణీకరింపఁదగిన సూక్తులై సామెతలై వాడుకలో నుండుటయే వాని యోగ్యతకు ప్రబల నిదర్శనము. సాంఘిక దురాచారములను, కపట గురువుల మత వ్యాపారములను, భక్తుల వేషధారిత్వమును నిర్భయముగ ఖండించుట యందు ఇరువురును మోమోట లేనివారు.

వేమన విరాగియగుటవలన ప్రకృతి సౌందర్యమును వర్ణింపలేదు. ఖయ్యాము భోగలాలసుఁడును రసార్ద్ర హృదయుడు నగుటచేత ప్రకృతి రామణీయకమును అద్భుతముగ వర్ణించెను. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దము" కావ్యమను సూత్రమున కీతని కవిత్వము ఉదాహరణ ప్రాయముగ నున్నది. ఒక్కొక్కప్పుడు అలంకార ప్రియులకు "ఇదియు ఒక కవిత్వమా!" అను సందేహము పొడముననట్లు "ప్రొద్దుపొడిచినది. పూతోటల మంచు బొట్లు రాలుచున్నవి." అని పొడిమాటలతో నిరలంకృతముగ ఉన్నది ఉన్నట్లుగా చెప్పును. ఈ నిరాడంబరత్వమె ఖయ్యాము కవిత్వమున నొక విశిష్టగుణమై యలరారుచున్నది.

వేమనయందు గోచరింపని హాస్యప్రియత్వము ఖయ్యామునం దగుపడుచున్నది. ఈ గుణమువలననే జీవితభారము తేలికయాయి, దుఃఖము చులుకనయి జీవన ప్రయాసము భరించుట సులభమగుచున్నది. సాధారణముగా ఖయ్యాము అందఱి మహమ్మదీయులవలె మసీదుకు పోయి నమాజుచేసి యెఱుఁగఁడు. ఒకనాఁడు వినోదార్థము మసీదుకు పోయెను. 'నమాజుచేయుటకు రండు' అని ఒక స్నేహితుఁడు పిలిచెను. అందుకు ఖయ్యామిట్లు బదులుచెప్పెను:

మునుపు మసీదు వాకిటను ముచ్చెలు దొంగిలిపోతిఁ; బ్రాఁతవై
చినిఁగెను; నేఁడునున్ మరలఁ జెప్పులకోసము వచ్చినాఁడ ; నె
మ్మనము నెడంగ నియ్యెడ నమాజొనరింపఁగరాను ; నీవు చ
చ్చినయెడ వీడిపోయెదవు చెప్పులువోలె నమాజు సైతమున్.

ఖయ్యాము చమత్కారమును హాస్యప్రియత్వమును తెలిసికొనుటకు 28, 30, 47, 81, 96, 115, సంఖ్యలు గల పద్యములు చదువుఁడు.

ఖయ్యాము గతించిన వెనుక ఆయన పద్యములు క్రమ క్రమముగ ప్రజలలో వ్యాపించినవి. తరువాత కొంతకాలమునకు అవియొక సంపుటముగ కూర్పఁబడినవి. ఖయ్యాము పద్యములను గుఱించి అక్బరు పాదుషా యిట్లు చెప్పెనని 'అయిని అక్బరి' అను గ్రంథమున వ్రాయఁబడియున్నది: "ఖాజా హాఫీ'జుయొక్క ప్రతిగజలు క్రిందను ఒక్క ఖయ్యాము రుబాయి వ్రాయఁబడవలయును; అట్లు కాదేని (హాఫీ'జు గజలుతో కూడ ఖయ్యాము రుబాయి చదువమేని) రుచి ననుభవింపకుండ ద్రాక్షసవపాని నట్లుండును." ఈ మాటలనుబట్టి ఖయ్యాము రుబాయితు ఎంత ప్రజానురంజకమై యుండినదో మన మూహింపవచ్చును.

వేమన పద్యముల సంపుటమువలె రుబాయతుకూడ గలగూరగంప. కథయుండదు. విషయైక్య ముండదు. ప్రతిపద్యమును పూర్వోత్తర నిరపేక్షకమై స్వతంత్రముగ నుండును. ఇందలి పద్యములు విషయమునుబట్టి కాక, పాదాంతాక్షరముల ననుసరించి అకారాదిగా కూర్పబడి యుండును. శిష్యులు ప్రశిష్యులు అభిమానులు రచించిన పద్యములు కాలానుసారముగ వేమన పద్యములలో చేరి షుమారు ఇన్నూటినుండి మూడువేల వఱకు పెరిగినటుల ఖయ్యాము రుబాయీలు కూడ నూటయేబది మొదలు వేయివఱకు పెరిగినవి. రుబాయతు యొక్క పురాతనమైన వ్రాతప్రతి 'అక్సుఫ'ర్డులో బోడ్లీయన్ పుస్తక భాండాగారమున నున్నది. ఆప్రతి

క్రీ. శ. 1460 లో అనగా ఖయ్యాము మరణానంతరము 337 సంవత్సరములకు షిరాజు పట్టణమున వ్రాయబడినది. దానిలో 158 రుబాయీలు మాత్రమె కలవు. 1528 లో అనగా ఖయ్యాము గతించిన 404 సంవత్సరములకు వ్రాయబడిన మఱియొక ప్రతి ప్యారిసు నగరమునందలి బిబ్లియోతిక నాసియోనాల్ (Bibliotheque Nationale) అను పుస్తక భాండాగారమున నున్నది. దానియందు 349 రుబాయీలు కలవు. ఖయ్యాము మరణానంతరము 500 సంవత్సరములకు వ్రాయబడిన మఱియొక ప్రతి బ్రిటిష్ మ్యూజియము లయిబ్రరీలో నున్నది. దానియందు 540 రుబాయీలు కలవు. హిందూదేశమున వ్యాప్తిలోనున్న ప్రతులలో 700 మొదలు 900 రుబాయీలు కలిగియుండును. నావద్దనున్న రెండు ప్రతులలో హైదరాబాదులో ప్రకటితమైన దానియందు 692 ను, లాహోరు ప్రతియందు 800 రుబాయీలును కలవు. కాలము గడచుకొలది రుబాయీల మొత్తమెట్లు పెరుగుచూ వచ్చినదో పైసంఖ్యలవలన మనము తెలిసికొనవచ్చును.

## రుబాయతు ఆవిష్కరణము

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున చరిత్రాధ్యాపకుడుగా నుండిన ఇ. బి. కోవెల్ అను నతడు బోడ్లీయన్ లయిబ్రరీలో ఖయ్యాము రుబాయతు ఉన్నదని 1856 లో కనుగొనెను. దానిని గుఱించి 1858 లో 'కలకత్తా రెవ్యూ' యందొక వ్యాసమును ప్రకటించియుండెను. తరువాత ఒక సంవత్సరమునకు ఎడ్వర్డ్ ఫిట్జ్ గెరాల్డు (Edward Fitz Gerald) బోడ్లీయన్ లయిబ్రరీలోని రుబాయతును డెబ్బదియైదు పద్యములుగా ఇంగ్లీషులోనికి తర్జుమా చేసెను. 1867 లో పారసీక రాజస్థానమున ఫ్రెంచి రాయబారికి ద్విభాషిగా నుండిన జె. బి. నికోల రుబాయతును ఫ్రెంచి

భాషలోనికి తర్జుమా చేసెను. తరువాత మఱియొక సంవత్సరమునకు ఫిట్ జెరాల్డు ఇంకకొన్ని రుబాయీలను ఆంగ్లీకరించి నూటొక్క పద్యములుగల ద్వితీయ సంస్కరణమును ప్రకటించెను. మొట్టమొదట ముద్రింపబడిన తర్జుమా ఎక్కువ వ్యాప్తిలోనికి రాలేదు. ఖరీదు ఒక అణా వఱకు తగ్గింపఁబడినది. అప్పటికిని కొన్నిపుస్తకములు మాత్రమె వెలపోయినవి. ద్వితీయ సంస్కరణము ప్రకటింపఁబడునప్పటికి ఖయ్యాము పేరు పాశ్చాత్యదేశములలో అందు ముఖ్యముగా ఇంగ్లాండున ప్రతిధ్వనింపసాగెను. ఒక అణా వఱకు ఖరీదు తగ్గింపబడిన 36 పుటల గ్రంథము తుట్టతుదకు 16 రూపాయలకు వెలపోయినది. అమెరికా దేశమందు ఈ తర్జుమాను మొరాకో చర్మముతో బైండుచేయించి బైబిలు గ్రంథమువలె నారాధించుచుండిరి. ఉమ్రఖయ్యాము సంఘములు స్థాపింపఁబడినవి. రుబాయతు చదువుట యొక నాగరికాచారమైనది. ఖయ్యాము బ్రతికి యుండిన యెడల తన రుబాయతునకు కలిగిన లోకవ్యాప్తికి తానే ఆశ్చర్యపడి యుండునేమొ!

ఫిట్ జెరాల్డు తర్జుమా ప్రజాదరణ పాత్రమయి లక్షలకొలది పుస్తకములు వెలపోవుచుండుటవలన మఱికొందఱు ఆంగ్లేయులు రుబాయతును ఆంగ్లీకరించిరి. కాని కళానైపుణ్యమునందును కవితా మాధుర్యమునందును అవి ఫిట్ జెరాల్డు తర్జుమాకు సరిరావు. అతని కృతి మక్కికి మక్కి అనువాదము కాక మాతృకయందలి రమణీయములును సున్నితములు నైన భావములను ఏర్పఱచి స్వతంత్రముగ సృజింపఁబడిన మనోహర పద్యకావ్యము. కావుననే ఆ పద్యములలో చాలవఱకు, మాతృకలోని ఏ రుబాయీకి ఏ పద్యము వ్రాయఁబడినదో తెలిసికొనుటకు వీలు కాకయున్నది. కొన్ని రుబాయీలలోని భావములను ఏర్చికూర్చి యొక పద్యముగా వ్రాసితినని ఫిట్ జెరాల్డు తన జాబులలో తెలిపియున్నాఁడు. పారసీక కావ్యములలో పునరుక్తులు తప్పతిప్పలుగ నుండును. ఈ దోషము 'సెమిటిక్'

భాషాకావ్యములకు సహజముగ నున్నది. ఖురాను ఆంగ్లీకృతికి ఉపోద్ఘాతము రచించిన మార్గోలియత్ (Margoliouth) అను ప్రాచ్యభాషా పండితుఁడు ఇట్లు వ్రాసెను: "సెమిటిక్ మనస్తత్త్వమునకు సహజమగు పునరుక్తిదోషము ఖురానునందు ఉత్ప్రేక్షింపఁబడినది." ఖయ్యాము రుబాయాతునందు కూడ ఈ దోషము విచ్చలవిడిగ వ్యాపించినది. కాని, యిందుకు కారణము కలదు. రుబాయాతు ఏకధారగా వ్రాయఁబడిన కావ్యము కాదు. అప్పుడప్పుడు వివిధ మనఃస్థితులలో వ్రాయఁబడిన పద్యసముదాయమందు భావసామ్యము గల పద్యములుండుట అసహజము కాదు. భాషాంతరీకరించువారు ఈ లోపమును గుర్తించి భావములను ఏర్చి కూర్చుట అత్యావశ్యకము. ఖయ్యాము రుబాయాతు తేనెతెట్టె. ఫిట్జ్‌గెరాల్డు ఆంగ్లీకరణము తేనెనింపిన గిన్నె.

## ఖయ్యాము : యూరపు

పాశ్చాత్య దేశములలో, అందు ముఖ్యముగా ఇంగ్లీషు మాతృభాషగానుండు దేశములలో ఖయ్యాము రుబాయతు ఇంతటి యపూర్వవ్యాప్తి నొందుటకు హేతుభూతములైన పరిస్థితుల నారయుదము. పదునెనిమిదవ శతాబ్దిని పాశ్చాత్య దేశములందు విజ్ఞానప్రబోధ మంకురించినది. శాస్త్రవ్యాసంగమును పరిశ్రమల కృషియు ప్రారంభమాయెను. ఆవిరియంత్రము నిర్మింపబడిన వెంటనే పారిశ్రామిక యుగము అవతరించినది. ఫారడీ (Farady) అను విద్యుత్తత్త్వ శాస్త్రజ్ఞుఁడు ఈశతాబ్ది అంతమున జన్మించెను. పందొమ్మిదవ శతాబ్దియందు విద్యుచ్ఛక్తి యంత్రములు నిర్మింపఁబడినవి. వానిమూలమున పరిశ్రమలు దినదిన ప్రవర్ధమానములగుచుండెను. డార్విన్, హక్స్లీ, స్పెన్సరు మున్నగు శాస్త్రజ్ఞులుద్భవించి సృష్టితత్త్వవిచారము గావించి పరిణామ సిద్ధాంతమును వెల్లడించిరి. ప్రజల

యందు పరచింతకంటె ఐహిక చింతయే హెచ్చినది. హేతువాదము ప్రబలినతోడనే మూఢవిశ్వాసము నశింపఁజొచ్చెను. ప్రకృతి శాస్త్రములకు విరుద్ధములైన పురాణమతముల పునాదులు సడల నారంభించినవి. సృష్టికర్త యీ విశ్వమును ఆరుదినములలో సృజించి ఏడవనాఁడు విశ్రాంతిగొనెనను బైబిలు సూక్తి హాస్యాస్పద మాయెను. క్రైస్తవ మతముపై విశ్వాసము సన్నగిల్లు చుండెను. విద్యావంతులకు ప్రకృతి శాస్త్రములపై ఆదరణము హెచ్చుచుండెను. స్వర్గ నరకములు భావనా కల్పితము లనియు భౌతికశరీరము నశించిన వెనుక ఆత్మ శేషించునని చెప్పుట ఉత్త కల్లయనియు, దైవమున కారోపింపఁబడిన శక్తులన్నియు ప్రకృతివే యనియు, పరిణామవాదులు బోధించుచుండిరి. ఇట్టి క్రొత్తప్రాఁతల సంధి సమయమున విద్యావంతుల చిత్తములు సంశయగ్రస్తములయి చంచలములయి అభినవసందేశముకొఱకు నిరీక్షించు చుండినవి. ఇట్టిఅనుకూలసమయమున ఖయ్యామురుబాయతు పాశ్చాత్యవాఙ్మయమున నవతరించినది. దానియందు అభినవ వైజ్ఞానిక భావములు ప్రతిఫలించునట్లు పొడకట్టినవి. కావుననే రుబాయతు కంతటి వ్యాప్తి కలిగినది.

మానవులందు జ్ఞానమంకురించినది మొదలు “నేనెవ్వఁడను? ఎచ్చటనుండి వచ్చితిని? ఎచ్చటకు పోవుచున్నాను? మరణమే నాస్థితికి అంత్యమా లేక మరణానంతర జీవితముకలదా? మానవకోటియందు ఇట్టి వివిధత్వమునకు విపర్యాసమునకు కారణములేమి? సృష్టికర్త యొకఁడున్నాఁడా? ఉండిన ఏ యుద్దేశములో నిట్టి విచిత్రమైన సృష్టిని గావించుచున్నాఁడు? ఒకడు సుఖింపనేల, మఱియొకఁడు దుఃఖింపనేల?” అను నిట్టి ప్రశ్నలు, విచారములు, సంశయములు పొటమరించు చుండెను. నాఁటినుండి నేఁటివఱకు ఇట్టి ప్రశ్నలడుగఁబడుచున్నవి. సమాధానములు చెప్పఁబడు చున్నవి. ఒక్కొక్క దేశమున ఒక్కొక్క కాలమున ఒక్కొక్క మతమును ఇటువంటి సమస్యల చిక్కు విడఁదీయ ప్రయత్నిం

చినది. అయినను ఈ ప్రశ్నలు సందేహములు అనుదిన నవ్యములై చిరంతనములై వివేకవంతుల బుద్ధిపరిశ్రమకు హేతువులై, నికృత్తములయ్యు రావణుని శిరస్సులవలె మరల మరల పుట్టుచున్నవి. తనపుట్టు పూర్వోత్తరములఁ దెలిసికొను నిచ్ఛ ప్రతిమానవునకు సహజముగ నుండును. ఇట్టి విషయములనే ఖయ్యాము తన రుబాయతున చర్చించి యున్నాఁడు.

## ఖయ్యాము మత విశ్వాసములు.

సూఫీ'మత పరిభాషలో ద్రాక్షాసవము బ్రహ్మానందమునకు సంకేతము. ఖయ్యాము కాలమునాఁటికి సూఫీ'మతము బాగుగ వ్యాపించి యుండెను. సూఫీలు లౌకిక భోగములు త్యజించి దారిద్ర్యము ననుభవించుచు నిరంతరము దైవధ్యాన లగ్నచిత్తులయి ఆత్మపరమాత్మల ఐక్యముకొఱకు పాటుపడు చుందురు. ఎట్టిమత మైనను కొంతకాలమునకు కరుడు కట్టి ఆచారబద్ధమయి అనేక విధములగు కపట వ్యాపారముల కాలవాల మగుచుండును; ఆధ్యాత్మిక సమస్య ఆర్థిక సమస్యగా పరిణమించును. ఖయ్యాము కాలమునాఁటికి సూఫీ' సమాజమునందు వేషధారులు బయలు దేరిరి. వారి స్వయమారోపిత పావనత్వము, వైరాగ్యము వేషధారిత్వముగ మాఱినది. ఖయ్యాము సూఫీ'లను ఎగతాళి చేయుటకో యనునట్లు వారి మత పరిభాషనే గ్రహించి సాంప్రదాయిక సంకేతములను లౌకికార్థమున ప్రయోగించెను. దీనిని తెలిసికొనక కొందఱు ఖయ్యాము రూమీవలె సూఫీ'యని పొరబడిరి. అయిదారు రుబాయీలు చదువగనే ఆతడు వర్ణించిన ద్రాక్షాసవము సాంకేతికము కాదని మనకు స్ఫురించును.

పాశ్చాత్య విమర్శకులు కొందఱు ఖయ్యామును ఎపిక్యూర్ (Epicure) అని పేర్కొనిరి. వాడుకలో ఎపిక్యూర్ అనఁగా పరచింత లేని భోగలాలసుఁడు. ఎపిక్యురస్ సిద్ధాంతములు ఒకటి రెండు విషయము

లలో తప్ప ఖయ్యాము నమ్మకములకంటె భిన్నముగ నుండును: "శరీరము భౌతికము. ఆత్మ భౌతికమైన సూక్ష్మశరీరము. నీటిలో కరఁగిన ఉప్పు నీటియందంతయు వ్యాపించి యుండునటుల సూక్ష్మశరీరము (ఆత్మ) దేహమున వ్యాపించి యుండును. దేహముతోడ ఆత్మయు నశించును. మరణానంతర జీవితములేదు. సంతోషమె జీవితప్రయోజనము. ఇంద్రియ గోచరమగు ప్రపంచమె యదార్థమైనది. ప్రత్యక్ష ప్రమాణమె గ్రాహ్యము. మనశ్శరీరములకు ప్రతికూలములైన విషయములను తొలఁగించుటయె సంతోషము. సృష్టిప్రకృతి కార్యము. విధి యనునదిలేదు. మానవుని యదృష్టము తన చేతిలోనున్నది" అని ఎపిక్యురస్ చెప్పెను. అతఁడు అనుమాన ప్రమాణము నమ్మనందువలన జ్యోతిశ్శాస్త్రము (Astronomy) అబద్ధమని భ్రమపడెను.

ఎపిక్యురసు, ఖయ్యాముల భావములు చాలవఱకు పరస్పర విరుద్ధములు. ఎపిక్యురసు నిరీశ్వరవాది, ఖయ్యాము ఈశ్వరవాది. అతఁడు విధి లేదని చెప్పెను, ఇతఁడు మన సుఖదుఃఖములు విధి నిర్ణీతములని సిద్ధాంతీకరించెను. అతఁడు ఖగోళశాస్త్రము కల్పిత మనెను, ఇతడు గొప్ప జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు. మరణానంతర జీవితములేదను విశ్వాసము ఇరువురకు సమానమె. ఖయ్యాము ఎపిక్యురస్ సిద్ధాంతముల నొకటి రెండు తప్ప అన్నిటిని అంగీకరింపలేదు.

ఒక్క ఈశ్వరుని విషయమందు తప్ప చార్వాక మతమునకును ఖయ్యాము మతమునకును ఏలాటి భేదముండదు. ప్రబోధ చంద్రోదయ నాటకమున ద్వితీయాంకమున మహామోహునకు చార్వాకునకు జరిగిన సంభాషణమునందు చార్వాకమతము వివరింపఁబడినది. బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయకవిగారి ఆంధ్రీకరణమునుండి ఉదాహరణముగ్రహింపఁబడినది. "సర్వదా లోకాయతమే శాస్త్రమనందగినది; దానియందు ప్రత్యక్ష

మొక్కటియే ప్రమాణము. పృథివ్యప్తేజో వాయువులె తత్త్వములని, అర్థకామములే పురుషార్థములని, భూతములే జ్ఞానజనకములని పరలోక మున్నది సున్నయని మరణమే మోక్షమని........వాచస్పతి........ తచ్ఛాస్త్రమును........రచించిన వాఁడయ్యెను.'' చార్వాకుల అభిప్రాయములతో సరిపోవు భావములుగల పద్యము లెన్నియో "పానశాల" యందున్నవి.

ఖయ్యాము మతము చిత్రమైనది. ఆత్మ ఈశ్వరాంశము కావున ఈశ్వర వాదులందఱు ఆత్మయున్నదని నమ్మెదురు. నిరీశ్వరవాదులు ఆత్మ శరీరమువలె నశించునని చెప్పెదురు; ఖయ్యాము మాత్రమె ఈశ్వరుఁడు న్నాఁడనియు, ఆత్మలేదనియు చెప్పియున్నాఁడు. "దేవుఁడే సృష్టికర్త. కుమ్మరి కుండలు చేయునట్లు ఈశ్వరుఁడు లోకమును సృజించును. కుండ పగిలిన వెనుక మన్ను మంటిలో కలసిపోవునట్లు ప్రాణము పోయిన వెనుక శరీరము భూమిలో జీర్ణించును. ఆమృత్తిక మరల వేఱొక శరీరనిర్మాణమునకు వినియోగపడును. ఆత్మ కలదను నమ్మకములేదు కావున ఖయ్యాము భౌతిక పునరావృత్తిని మాత్రమిట్లు చెప్పెను.

జలజల మంజులార్భటుల జాల్కొను నీ సెలయేటి కోవలన్
మొలచిన లేఁతపచ్చికల మోటుగఁగాలిడఁబోకు. దేవదూ
తల రుచిరాధర ప్రకృతి దాల్చెనొ సుందర మందగామినీ
లలిత శరీర మృత్కణములం జిగిరించెనొ యేమొ కోమలీ!

ఇట్టినమ్మకము ఆంగ్లేయకవియగు షెల్లీకికూడ ఉండినట్లుతోఁచుచున్నది.

There is not one atom of yon earth
But once was living man,
Nor the minutest drop of rain
That hangeth in its thinnest cloud,
But flowed in human vein.

మానవులొనరించు కార్యములకు తాము బాధ్యులు కారు. ఏలయన దేవుఁడే శరీరమును మనస్సును సృజించెను. మన మొనర్చు ప్రతికార్యములకును మనస్సే ప్రేరకము. కావున, పాపకార్యము లొనర్చితిమని దేవుఁడు మనలనెట్లు శిక్షింపఁగలఁడు? అట్టి మనస్సు నాతఁడేల సృజింపవలయును? కుండ సొట్టపోయిన తప్పెవరిది? కుమ్మరిదా, కుండదా? అని ఖయ్యాము ప్రశ్నించును. పాపము చేసితినని అనుతాపము నొందకుము. దేవుఁడు తన తప్పును తానే దిద్దుకొని నిన్ను మన్నించునని ధైర్యము చెప్పి యూరడించును.

సృష్టి కాలబద్ధము. విధి యనివార్యము. గతము కన్నులఁగట్టిగు, భవిష్యదర్థము సంశయాంధ సంవృతము. వర్తమాన కాలమొక్కటియే అవశ్యభోగ్యము. కావున,

ఆమనిలేఁతమబ్బులు ప్రియంబుగ రాగవతీ కపోలముల్
తేమగిలంగఁ దుంపురులు తియ్యని వేళల లేచిరమ్ము చా
నా, మధురాసవంబుఁ దమినానఁగ; నేఁడు విహారభూమి శో
భామయమైన యీగటిక పచ్చగిలుంగద రేపు పీపయిన్.

అనియు "మిత్రా, రారమ్ము, సఖింపు, మీ యదను వ్యర్థంబైన రాబెన్నడన్" అనియు మనల ప్రబోధించును.

స్వర్గనరకములు లేవు; మానవునకు ఆనందదాయకములగు వస్తువులే స్వర్గముననుండునట్లు ఊహింపఁబడుచున్నవి. వానిని ఈ లోకమునందే యనుభవింపుము, అని ఖయ్యాము చెప్పును. సృష్టికర్తయగు దేవుఁడు కరుణామయుఁడా? అట్లయిన లోకమున కనుపట్టు దుఃఖమునకు, దౌర్జన్యమునకు విపర్యాసమునకు కారణమేమి?

తన చేచేత నొనర్చినట్టి యొకపాత్రన్ భగ్నముంజేయ నే
మనుజుండైనఁ దలంపఁ; డంగములు నిర్మాణంబుగావించి మో
హనరూపంబులు మోవిఁదేనె యెదలో నత్యంతరాగంబుఁ గూ
ర్చిన దేవుండు మఱేలయిట్లు నిజసృష్టిం గూల్చు నున్మత్తుఁడై?

ఈ అకారణ ధ్వంసమునకు దేవుఁడేల పూనుకొనును? ఈ సందేహము ఖయ్యాముని బాధించుచుండెను. అతనికి సందేహము కలిగినేగాని తన్నివృత్తి గోచరింపదు.

ధారుణినుండి యుచ్చశని దాఁకఁ గలట్టి కఠినంది చిక్కులం
బూరితిగా సడల్చితిని: మోసపుటక్కుల బందెగాను; దు
ర్వార నిరోధముల్ గడచివచ్చితి: నయ్యును సాయశక్తులం
బోరి వదల్పకే విసిగిపోయితి మృత్యు రహస్యబంధమున్.

అనుతాపమువలన నేమియు ప్రయోజనములేదు. పూజలు నమాజులవలన నీకష్టములు తొలగిపోవు. ఏలయన:

విషము నమృతంపు మనిబుడ్ల విధికలంబు
ముంచి లోకుల నుదుట లిఖించు మొదటఁ;
గరఁగ దఱఁబేద కన్నీటికాల్వ నదియుఁ,
బరమభక్తుని అనుతాపవహ్నిఁ జెడదు.

కాన, నెది ప్రాప్తమైనను గారవించు,
వలయు వలదని యేర్పఱపంగ లేవు.

విధి యనివార్యమని ఖయ్యాము మాటికి మాటికి హెచ్చరించుచుండెను. ఖయ్యాము జీవితములోని దుఃఖాంశమునే యూది చెప్పెనని కొందఱు ఆయనను Pessimist అని పేర్కొనిరి. జీవితము సుఖదుఃఖ విమిశ్రమము. వీలైనంతవఱకు సంతోషము ననుభవింపుము. మరణ మని

వార్యము; దానికిగా చింతపడకుము. దుఃఖములుకూడ విధి నిబద్ధములు గావున ధైర్యముతో ననుభవింపుము అని ఖయ్యాము చెప్పెను. ప్రకృతి తత్త్వమును గుఱించి తలపోసిన వారు లోకములోని దుఃఖమును మానవ జీవితముయొక్క అస్థిరత్వమును ఎట్లు గుర్తెఱుంగకుందురు ?

కారేరాజులు. రాజ్యముల్ గలుగవే. గర్వోన్నతిం బెందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే. యుర్విపై
పేరైనంగలదే………………

అని పోతన వాకొనెను.

The boast of heraldry, the pomp of power,
And all that beauty, all that wealth e'er gave
Await alike th' inevitable hour
The paths of glory lead but to the grave.

అని థామస్ గ్రే వచించెను.

అంతములేని యీ భువనమంత పురాతన పాంథశాల ; వి
శ్రాంతి గృహంబు; నందు నిరుసంజలు రంగుల వాకిళుల్; ధరా
క్రాంతులు పాదుషాలు బహరామ్ జమిషీదులు వేనవేలుగాఁ
గొంతసుఖించి పోయిరెటకో పెఱవారికిఁ జోటొసంగుచున్.

అని ఖయ్యాముకూడ వచించెను. ఇందు సత్యములేదని యెవరు చెప్పఁగలరు? పానశాల చదువునప్పుడు జీవితము దుఃఖభాజకమని తోఁచుటకంటె సంతోషమయమనియే స్ఫురించును.

# ఆంధ్రీకరణము.

పూర్వము ప్రియావియోగ దుఃఖసమ్మూర్ఛితమైన నాచిత్తమును కాళిదాసుని మేఘసందేశము, ఖయ్యాము రుబాయాతు సంజీవ నౌషధముల వలె పునరుజ్జీవింపజేసినవి. నామిత్రుఁడు పిశుపాటి వేణుగోపాలు (ఇప్పుడు స్వర్గస్థుడు) హైదరాబాదునుండి ఖయ్యాము రుబాయతును నాకు పంపెను. ఆకాలమున వివక్తమైన సౌధోపరిస్థలము, రుబాయతు, నాకు ఏడుగడగ నుండినవి. 1926 అక్టోబరు నెల 10-వ తేదీనాఁటి రాత్రి ఒంటిఘంట గడచినను నిద్రపట్టక యుండెను, ఏపుస్తకము చదువఁబోయినను మనస్సు దానిపై లగ్నమగుటలేదు. హృదయము కలకపాటి నిరయ సదృశమయి హేయములును ఘోరములునగు భావములకు ఆలవాలమై యుండెను. నాహృదయముతో సరిపోలుటకో అనునట్లు ఆకాశముకూడ మేఘాచ్ఛన్నమై యుండెను. పైమేడగోఁది బయలులో కూర్చుండి దీపము పెట్టుకొని రుబాయాతు చదువు చుంటిని. రుబాయతును ఆంధ్రీకరించిన బాగుగ నుండునను ఉద్దేశము కలిగినది. ఒకటి రెండు రుబాయీలు తర్జుమా చేసితిని. అంతలో వానచినుకులు పడ నారంభించెను. పడుకగదిలోనికి పోయి తలుపువేసికొని నిదురపోవ ప్రయత్నించితిని. ప్రయత్నించుకొలఁది నిదుర దూరమగు చుండెను. ఏమి చేయునదిలేక ప్రొద్దుపొడుచువఱకు రుబాయతు తర్జుమా చేయుచుంటిని. తరువాత రెండుదినములలో నేను గుర్తుపెట్టిన రుబాయీలన్నియు ఆంధ్రీకరించితిని. పానశాల భారతిలో ప్రకటింపఁబడిన యనంతరము మఱికొన్ని రుబాయీల నాంధ్రీకరించి ఇటీవల నె భారతిలో ప్రకటించితిని.

నావద్దనున్న రుబాయతునందు 692 రూబాయీలు కలవు. వాని నన్నిటిని తర్జుమా చేయుట అనావశ్యకము. ఏలయన ఒకే భావము వివిధములుగా పది, లేక ఇరువది రుబాయీలలో ప్రకటింపఁబడి యుండును.

అవి యన్నియు ఖయ్యాము వ్రాసినవికావు. ఖయ్యామును అనుకరించి వ్రాసినవారి పద్యములు అందుచేరియున్నవి. అందువలన నేనొకపద్ధతి నవలంబించితిని. ఒకేవిధమైన రుబాయీలను కొన్నిటి నేర్పఱచి, వానిలో మనోహరములైన ఒకటి రెంటిని మాత్రము గ్రహించితిని; మఱికొన్ని రుబాయీలలో ఒకపాదము మాత్రము క్రొత్తభావమును వెల్లడించును. తక్కిన మూడు పాదములు చర్వితచర్వణముగ నుండును. అట్టియెడ రెండుమూడు రుబాయీలు కలిపి ఒకపద్యముగ వ్రాసితిని, అట్లు వ్రాసినవి షుమారు అయిదారు పద్యములు మాత్రమే యుండును.

నా ఆంధ్రీకరణము మూలమునకు టీకవలెనుండదు. తిక్కన శ్రీనాథుఁడు మున్నగు అనువక్తలు వహించిన స్వాతంత్ర్యమును నేనును వహించితిని. అట్లనుటవలన నాతర్జుమా మూలమునకంటె భిన్నముగ నుండునని చెప్పుటకాదు. పారసీక జాతీయములలో ప్రకటింపబడిన భావము తెలుఁగులో అట్లే స్ఫురించుటకు ఆవశ్యకములైన మార్పులను రసపోషణమునకు వలయు కూర్పులను కావించితిని. సహృదయులు నా సేవను ఆదరింతురు గాక!

తెలుఁగుం దోఁటలఁ బచ్చబీళ్ళ ననురక్తిం బానశాలాప్రతి
ష్ఠలు గావించి ఖయాము కావ్యరసభాండంబుల్ గులాబీలు బు
ల్బులిపిట్టల్ మధుపానపాత్రికలు సొంపుల్ గుల్కు సాకీయు, భూ
తల నాకం బొనరింప నిల్పి రసికాంతఃప్రీతి గావించితిన్.

పెమ్మారెడ్డిపాళెము.
10—8—1934

దువ్వూరి రామిరెడ్డి.

# ఖయ్యాము ప్రశంస

ఓఁహో ఉమ్రఖయామ, నీవుచని యెన్నోయేండ్లుపూండ్లాయె; తేఁ
ప్రాయంపుం జెలి సాఖియున్ ధరణిగర్భంబందు నిద్రించె; గు
ర్తే యౌపట్టక నీ నిషాపురము జీర్ణించెం గదా! నీదు గో
రీమైనన్ సడలున్; రుబాయతొకటే స్మృత్యంకమై నిల్చెడున్.

పంచాంగంబును సంస్కరించు గణితప్రావీణ్యమున్నన్ సలా
మంచున్ సంజరు షాహి ప్రీతిమెయి నీ కర్ధాసనంబిచ్చి మ
న్నించంగల్గియు, గ్రీకుశాస్త్రముల పాండిత్యంబు నార్జించియుం
గాంచంగల్గుదె నేఁటికీర్తి కవివే గాకుండినన్ ఖయ్యమా?

ఎందఱులేరు జోస్యులు? మఱెందరు నీవలె హేతువాదులై
మ్రందిరి? వారి పుట్టువుల మాటయె లోక మెఱుంగఁబోదు; నీ
నందనవాటికన్ గఱికనట్టులఁ బూఁబొదరిండ్లనీడ మా
కందఱకున్ రసార్ద్ర కవితాసవమిచ్చితి వాసదీఱఁగన్.

నీతత్త్వంబులు మాకుఁ బూజ్యములు కావీ, కాకపోనీ, మఱే
మీ, తత్త్వాలకునేమిగాని, మధురస్మేరాస్యయౌ సాఖి దృ
క్పాతం బైహిక జీవితార్తి పరితప్తస్వాంతులౌ వారికిం
జేతఃప్రీతినొసంగు; మాకదియె యాశీర్వాద మిప్పట్టునన్.

బ్రతుకు టెడారిలో విసుకబాటలఁ ద్రిమ్మరి నీరువట్టి దుః
స్థితి మరణింపనున్న యొకజీవి కదృష్టపువాఁగువోలె సం
తతముఁ ద్వదీయ దివ్య కవితారస నిర్ఝరిణీ ప్రపాత మ
ద్భుతముగఁ జిత్తతాపమును బోనడచున్ శిశిరాంబుసేచనన్.

తెలుఁగుందోఁటలఁ బచ్చబీళ్ళ ననురక్తిం బానశాలాప్రతి
ష్ఠలు గావించి త్వదీయకావ్యరస భాండంబుల్ గులాబీలు బు
ల్బులిపిట్టల్ మధుపానపాత్రికలు సొంపుల్ గుల్కుసాకీయు భూ
తలనాకం బొనరింప నిల్పి రసికాంధ్రప్రీతి గావించితిన్.

పారసికన్న శ్రావ్యమయి పల్లవ కోమలమై సుధారసం
బూరెడు మాతెనుంగునుడి నొప్పిదమౌనటు నీదు భావముల్
ఏరిచి చేర్చికూరిచితి నింపగు కావ్యము నోఖయామ, నీ
పేరిఁక యావదాంధ్రవృథివీస్థలి శాశ్వతమై తనర్చుతన్.

అలరెడు నాణిముత్యముల యాశ్రయగౌరవ మొందిసూత్రముల్
గులుకుమిటారి జవ్వనపు గుబ్బల నాట్యములాడుఁ గాదె యే
కలిమియు లేకయుండియును, ఖయ్యమ, నీ మృదుముగ్ధభావ మం
జులత సమాశ్రయించు కృతి సొంపిలదే రసికార్చనీయమై.

తెల తెలవాఱి, సంజకడఁ, దెమ్మెర కమ్మగవిచ్చు పూల తా
వులఁ బువుబేకులన్ విసరిపోయుత నీదు సమాధిపైని; బు
ల్బులులు గులాబిపూఁబొదలలోఁ జిరకాలము నీదు కీర్తి నిం
పొలయ నుతించుఁగాక ! సెలవోయి ఖయామ, సలాము, వచ్చెదన్.

---



# పానశాల

లెమ్మోయి మదిరాతపస్వి, దిశలా
లేఖ్యంబుగామాఱెఁ; బా
త్రమ్ముల్ నింపుము గోస్తనీరసమునన్
రాగోదయశ్రీలు పైఁ
గ్రమ్మన్ జీవితభాజనంబు పరిపూ
ర్ణంబౌటకున్ మున్నె; కా
లమ్మా నన్నరవంబు వింటి మధుశా
లన్ మొన్న లేఁబ్రొద్దు నన్.

౨

అరుణుఁడు యామినీవిభవమంతయు గెల్చి జయాంకమట్లు క
ర్పూర రమణీయ కేతనముఁ బూర్వదిశం బయికెత్తె లెమ్ము; ని
ద్దుర విడి తమ్మిపూవులటు తొంగలిఱెప్పల నెత్తిచూడు; నీ
వెలుఁగవొ తొయ్యలీ, చిరమునియ్యులఁగన్నులు మూయుకట్టడన్

3

పారదమట్లు జీవితము పట్టిన నిల్వదు; శీఘ్రగామి; ద్రా
క్షారసమిమ్ము, తాపమునఁ గందెను జిత్తము; జాగరూకసం
చారము నిద్రదౌలతు వశంబయి రూపఱు; యౌవనంపుటం
గారము నీటఁ జల్లవడుఁ; గన్నుల నెత్తుము, లెమ్ము నెచ్చెలీ.

౪

పొలముల పూలగాలి వలపుల్ కలఁబోయుచు వీచె; గాజు గి
న్నెలఁ జిఱుచేదుపానకము నింపుము; నశ్వరమైన ఈస్థితిం,
దెలియుమ యీక్షణం బెరవుదెచ్చిన సొమ్మని; జాఱఁబుచ్చినం
గలికి, మఱెప్పుడిట్టితఱి క్రమ్మఱ రాదు; నిజమ్ము; నమ్ముమా!

౫

కనుఁగొమ్మా నినుబోలె రాగవతియై కాంతిల్లెఁ బూర్వాశ, మో
మున నీలాలకరేఖ లొత్తుచు, నిశాభుక్తావశేషాసవం
బును సీసాలకు నింపి యొక్కపరకంబున్ ముంచియుందిమ్ము;
క్కని యారేపటి మాటలేటి కనుభోగ్యంబైన నేఁడుండఁగన్.

౬

తరుణార్కుఁడు సువర్ణవాగురులచేతం బాదుషాహా దివం
భర హర్మ్యోపరి గర్భగోళ శిఖరవ్రాతంబు బంధించె; వా
సర కైఖుస్రువు రక్తిమాసవము నాశాపాత్రఁ బూరించె; ని
త్తఱి ఘోషించె మునాదియెల్లరకుఁ బ్రాతఃపానగూఢార్థముల్.

౭

విరియు గులాబిపూలు తన ప్రేయసులౌట మెగంబు లన్యులె
వ్వరుఁగనరంచుఁ జిన్కువలిపంపుముసుంగుల దాఁచె మేఘుఁ; డా
విరిగొను కెంపుపానకము వేగమ గిన్నెలనింపు; జీవితాం
బరమున నొక్కతార గనుమా సెను లెమ్మని కూయుఁ బుల్గులున్.

౮

చేవల్ చచ్చిన కోరికల్ మరల నుజ్జీవింప నవ్యాబ్దశో
భావాల్లభ్యము వచ్చె; భోగులకు సేవ్యంబయ్యెఁ గుల్యాజల
స్రావంబుల్ వను; లొత్తెఁ గొమ్మలను మూసాశ్వేతహస్తప్రభల్;
ఈ విశ్వంభర క్రీస్తునూర్పులఁ బునర్జృంభించె నాఁ గాఁతిలున్.

౯

చెలియ, గులాబిమోముపయిఁ జిందె నుగాదిహిమాంబుశీకరం
బులు; ప్రమదాంఘ్రిచిహ్నములు పొల్చె హృదంతరశాద్వలంబునం;
దలఁచెదవేల నిన్నటివెతల్; మఱి నేఁడు ముదంబుగూర్ప, ర
మ్మెలమిని బచ్చబైల సెలయేటి తటాలఁ బచారుసేయఁగన్.

౧౦

ఎఱుఁగవె కాలవల్లి మనయిద్దఱి మృత్యువు లల్లుఁగొయ్యఁగాఁ
బెరుగు; సుదారమౌను మనవేడ్కకు నీభువనంబు; జంటగాఁ
గరముల వారుణీభరిత కాంచనపాత్రిక లందికొన్న న
ద్దిర! మనచేతఁ జిక్కువడదే చిరకాలపుసత్య మంగనా!

౧౧

చెలులను బంధులన్ మధురశీధువు నామనితోఁట వీడి యూ
హలు నెగఁబ్రాకఁ జాలని రహస్యపుఁ జోటికిఁ బోదువీవు; నేఁ
బలికెదఁ దెల్పరాని యొకభావము; సంధ్యలఁ దూలి రాలుపూ
వులు కృశియించుఁగాని విరఁబూయవుక్రమ్మఱ; నమ్ముమో సఖీ.

౧౨

కాల మహర్నిశంబనెడు కత్తెరతో భవ దాయురంబర
శ్రీలహరించు; మోముపయిఁజిల్కను దుమ్ముదుమార; మేలొకో
జాలిపడంగ? నీక్షణము సంతసమందుము; నీవువోదు; నీ
రేలుఁ బవళ్ళు మున్నటు చరించు నిరంతర మండలాకృతిన్.

౧౩

ఆమని లేఁతమబ్బులు ప్రియంబుగ రాగవతీకపోలముల్
తేమగిలంగఁ దుంపురులు తియ్యనివేళల లేచిరమ్ము చా
నా, మధురాసవంబుఁ దమినానఁగ; నేఁడు విహారభూమి శో
భామయమైన యీగఱిక పచ్చగిలుంగద రేపు నీపయిన్ :

౧౪

అల బహరాముగోరి మధువానిన సుందర భోగమందిరం
బుల మృగరాజు నేఁడు భయమున్విడి క్రుమ్మరు; జంబుకంబు పి
ల్లలఁగను; వన్యరాసభములన్ మృగయారతిఁ బట్టినట్టి భూ
తలపతి గోరి పట్టువడెఁ దానొకగోరి, నెఱుంగుదే చెలీ.

౧౫

అయయో! యెందఱిమానవోత్తముల కంఠాంకూరముల్ దుంచె ని
ర్దయమౌకాలము; యౌవనంబు, తను సౌందర్యంబు లావణ్య, మ
వ్యయమై పిల్చునె? యెన్నియెన్ని కసుగాయల్ రాలె నీనేల; నా
రయలేదో వింటూయకే యురలి వ్యర్థంబైన లేమొగ్గలన్.

౧౬

నీవూ నేనను తారతమ్య మిహమందేగాని భూగర్భ ర
త్నావాసంబున లేదు; దుర్జనుఁడు పుణ్యాత్ముండు భిక్షార్థియున్
శ్రీవాల్లభ్య ధురంధరుండు నొకచే శ్రేణిన్ సుఖాసీనులై
యావిందున్ భుజియింతు; రంతఁగనలే మామృత్తికన్ భేదముల్.

౧౭

కాలిడినంత గ్రుచ్చుకొనుకంటకముల్ ప్రియురాలిమోమునన్
వ్రేలిన ముద్దుముంగురులొ! ఖిత్తరికన్నొపమ లౌనొయేమొ! రా
జాలయ భగ్నగోళశిఖరావళిఁ గన్నులఁ గట్టు నిష్టకా
మాలలు పూర్వభూభుజుల మస్తములౌనొ! వజీరు వ్రేళులో!

౧౮

ఝలఝల మంజులార్భటుల ఝాళ్కొను నీ సెలయేటికోవలన్
మొలచిన లేఁతపచ్చికల మోటుగఁ గాలిడఁబోకు, దేవదూ
తల రుచిరాధర ప్రకృతిఁ దాల్చెనొ! సుందర మందగామినీ
లలిత శరీరమృత్కణములం జిగిరించెనొ యేమొ కోమలీ!

౧౯

పొలమున నేత్రపర్వముగఁ బూచిన రాగవతీ సుమంబు శో
భల విలసిల్లెఁ బూర్వనరపాలుర రక్తకణాలనుండి; యే
చెలియ నిగారపుం దళుకు చెక్కులనేలిన పుట్టుమచ్చపై
వెలసెనొ నీలకాంత కనువిందొనరించును బూలరెమ్మలన్.

౨౦

గతము గతంబె, యెన్నటికిఁ గన్నులఁగట్టదు; సంశయాంధ సం
వృతము భవిష్యదర్థము; వివేకవతీ, యొక వర్తమానమే
సతత మవశ్యభోగ్యమగు సంపద; రమ్మ విషాదపాత్ర కీ
మతమునఁ దావులేదు; క్షణమాత్ర వహింపుము పానపాత్రికన్

౨౧

పాఱెడువాఁగు నీరమటు, పైఁబయి వీఁచు నెడారిగాలి నా
జాఱె మఱొక్కరోజు వరుసన్ మనయిద్దఱి జీవితంబులన్;
ఊరుపు మేననుండువఱ కుమ్మలికంగొన, రూపహీనమై
యారయరాని 'రేపు' నకు, నంతమునొందిన 'నిన్న' కున్ సఖీ.

౨౨

పరిశుష్కంబగు జీవనంబు రస సంపన్నంబు గావించు ని
ర్జర పానీయము వారుణీరసముఁ బాత్రన్నింపి యందిమ్మ యా
తురదీక్షం జవిగొందు; జీవితము వాతూలంబులో దివ్వె! చె
చ్చెరఁ గానిమ్మ; గతించుఁ బ్రాయమదిగో శీఘ్రంబుగం బ్రేయసీ.

౨౩

సమశీతోష్ణత హాయినించె; సుఖసంస్పర్శంబుగన్ గంధవా
హము వీతెంచె; గులాబితోఁటపయి సాయంకాల చిత్రాబ్దముల్
ప్రమదాశ్రుల్ చిలికించె; బుల్బులియు 'నీర క్తాస్యముల్ ద్రాక్షసా
రమునం గెంపిలఁ జేయుఁ' డంచుఁ జపులూరంబలెన్ రోజాలకున్.

౨౪

నలుదిక్కుల్ కమనీయచంద్రికల సుస్నాతంబులై దోఁచెఁ; జి
త్త లతాంతంబును బూచె; ద్రాక్షరసపాత్రం జేతికందిమ్మ యో
లలనా, వింటిని కాలసూక్తి: ఫలమెల్లంగాల్చు నిర్ఘాతచం
చలయౌ మృత్యువు ధాన్యశాలకిపుడే సంధించె నంగారమున్.

౨౫

ఈ మధుమాసశర్వరుల నిందుశిలా రమణీయవేదిఁ గాం
తామణిఁ గూడి రాగవతినా వహియింపుము పానపాత్ర నా
రామమునందు; నీ వెఱుఁగరాక లయింతు; వనాదికాల హిం
సా మలిన ప్రవృత్తి మధుసారమునం గడుగంగఁ జెల్లదే?

౨౬

జిలిబిలి కమ్మగప్పురపుఁ జిన్నెల వెన్నెలగుత్తితావులం
జిలుకుచుఁ జైత్రయామవతి చీరచెఱంగునఁ బూతఁపూచె: నె
చ్చెలి, యిటువంటికాలమిఁకఁ జిక్కదు; భోగ్యముమద్య: మెన్ని ల
క్షల సమలీనిశాప్రియుఁడు కాంతిలునో మన గోరిమిట్టలన్.

౨౭

జీవితసార్థవాహము విచిత్రగతిం బయనించు; నందులో
నీ వొకతెప్పపాటయిన నెయ్యురతో సుఖముందువేని మో
దావహ మంతకన్నఁ గలదా? మధుపాత్రిక నందియిమ్ము సా
ఖీ, వివరించెదేల తిలకింపని రేపును? రేయి జాఱెడిన్.

౨౮

యామిని నొక్కపాత్ర మధువానెద; రెంటను భాగ్యవంతుఁడన్
నామతమున్ వివేకమును నాలుగిటన్ విడియాకులిత్తు; నా
పై మది యుండిలేదను తపస్వి యవస్థ మునింగితేలి ద్రా
క్షామణి ముద్దుకూఁతురివి శయ్యకుఁ దార్చెద లేఁతవెన్నెలన్.

౨౯

మనమునఁ దెల్వియున్నపుడు మాటువడుం బ్రమదంబు; మేనెఱుం
గనియటు కైపుసేయఁ దుదిఁ గాంచువివేకము; వీనిరెంటిమ
ధ్యను జెలువౌ నవస్థయె సుఖాస్పదజీవిత; మట్టిజీవితం
బునకు గులామునై వెగలఁబుత్తు దినాలు ఖులాసగా సఖీ.

౩౦

ప్రతిదినముం దలంచెదను రాత్రులయం దనుతాపమొంద; సం
తత మధుపాన భోగపరతన్ మఱునాఁటికి మార్చికొందు; నీ
వితముగఁ గొన్నినాళ్లు కడవెళ్ళ వసంతమువచ్చె నిప్పు డా
తత సుమనోభరంబుఁ దలఁదాలిచి; నే వగపిల్లు టెట్లొకో!

౩౧

తారాశుక్తులు రాల్చినట్టి జిగిముత్యాలట్లు పూఁటేకులన్
జాఱెన్ సన్నని మంచుతుంపురులు: వాసంతోదయశ్రీకిఁ గాం
తారత్నం బనువైన నెచ్చెలిగ నుద్యానంబునం దోఁచె మి
త్రా, రారమ్మ సుఖింపు, మీయదను వ్యర్థంబైన రాదెన్నఁడున్.

౩౨

విరులను బచ్చపూరి కనువిందొనరించి సుఖదంబుఁ గూర్చు ని
త్తఱిఁ, బరికింపు మందమును; దప్పక యింకొక నాలుగైదువా
సరముల మంటిలోఁగలయు, సాఖి, సుమంబులఁ గోసికొమ్మ; బం
గరు సరకంబునన్ మఱిరఁ గమ్మగ నానుము నిర్విచారతన్.

౩౩

విరహ రహస్యవేదనలు వీడుఁ దమంతన రేపొమాపొ; నిన్
మఱవ దదృష్టరేఖ; మధుమాసము; కాలముగూడివచ్చె; సుం
దరి హృదయానుసారిణి వనంబున నీకయి వేచియుండ నీ
తరుణమునన్ సుఖింపక వృధా పరచింతనలేల మర్త్యుఁడా?

౩౪

మన ప్రియజీవితఁబు కుసుమంబుల పోలికఁ జంచలంబుగా
పునఁ బువులట్లు కాలమును బుత్తము నవ్వుల నాటపాటలన్;
గొనగొనఁబాఱు కాలువలకోవలఁ దియ్యని పానమాని జీ
వన భరణ ప్రయాస మొకప్రక్కకు ద్రొబ్బుదమోసి ప్రేయసీ

౩౫

కమ్మని పిల్ల తెమ్మెరల కౌఁగిళులం బులకించి వాసనల్
చిమ్ము గులాబి; బుల్బులి హసించుసుమంబుల రామణీయకం
బిమ్ముగఁ గ్రోలి మైమఱచు; నేలవిలంబము? పాత్రనింప రా
రమ్ము లతాంగి, యిద్దఱము రాలకపూర్వమె పూలపోలికన్.

౩౬

ముదురన కెంపువన్నె మధుపూరము దప్ప మఱేమిగాని యీ
యదనున నంటబోకుఁడని హాయిగ బుల్బులిపాడుఁ; బూఁబొదల్
మృదుల సుమాధరంబులను మెల్లగ విచ్చి వచించు "రండి, మా
సదనములందు విందులయి సంతసమొందుఁడు మూఁడునాళ్ళ"నన్.

౩౭

పంపుఁబొలంతి, యీ ప్రకృతి వన్యపథంబులఁ బూలపండువుం
జలుప నుపక్రమించెఁ విరసంబగు శుష్క విరక్తి మార్గముల్
పలుకకు; మూఁడునాళ్ళ మురిపంబుగదా మనజీవితంబు; పా
యలువడి పాఱు నిర్ఝరమునంటిన పూఁబొదరిండ్లఁ జూచితే!

౩౮

ఆసవపూర్ణమౌ కలశ, మామిషఖండము, వెన్నరొట్టె, ది
వ్యాసమరూప యౌవనగుణాలయ వీణియ మీటుచుక్ దినా
యాసముఁ దీర్ప నిర్జసవనాంతర సీమల నబ్బెనేని వ
హ్వా! సులతాను భోగవిభవంబులఁ గోరెడిమూఢుఁడుండునే।

౩౯

పచ్చబయళ్లు, నేటిదరిపట్టులు, నొక్కక్షణంబు శ్రాంతియుక్.
అచ్చరవంటి నెచ్చెలి, రసాంకితకావ్యముఁ గెంపుపానకం
బిచ్చగ నామనిక్ దొరకెనేని మసీదులు గుళ్ళ దాస్యముక్
మెచ్చక ముక్తులై సుఖముమీఱఁ జరింతురు జాగరూకులుక్.

౪౦

తలఁపక్ లౌకిక కార్యకల్పనల గంతవ్యంబు శూన్యత్వ; మీ
వు లయంబొందిననప్లెయౌను; పసువుల్ వో నాటకుక్ మున్నెమం
జుల వల్లీనిలయంబులం జెలుల మోజుల్ దీర్చి ఖయ్యామ; త
ల్లలనామండల భుక్తశేష వసముక్ ధన్యుండవై గ్రోలుమా.

౪౧

వాదులమాని నాసరస వారుణినానుము, దానితో మహ
మ్మాదు సమస్తరాజ్యరమ వోలదు! వేణువినోదగీతి దా
వీదు గళస్వనంబటుల విశ్వ రసోదయ హేతువయ్యె శా
తోదరి, నేఁటి సమ్మదము నోడకు రేపసు జూదపాటలోక్.

౪౨

కను మెపుడో యకాండముగఁ గాలము నీపయి దొమ్మిపోటు సే
యనియపుడే గులాబిజిగులారెడు ద్రాక్షరసంబు నానుమా;
తనువు నశించి దుమ్మగుట తథ్యము; నీవు పసిండిముద్దవా
జను లొకసారి పూడ్చి మఱుసారి వినుం బెకలించి యెత్తఁగన్?

౪౩

చెలియరో, నిన్ను నన్ను విరచించిన యప్పుడు సృష్టికర్త ముం
దల లిఖియించెనేమొ సురఁద్రావి సుఖింపఁగనాకు: హృత్తటం
బులు దెగిపాఱు ప్రేమరసపూరము గిన్నెలనింప నీకు; నా
శలుఫలియింప మద్యకలశంబును నీవుఁ జిరంబువెల్గుతన్.

౪౪

కౌసరునిర్ఝరంబు సురకాంతలు నాకమునందు సుందరం
చాసపడంగ నేల చెలియా? తొలిసంజల నీవు పోయు ద్రా
క్షాసవ మా నదీజలము నంతటి కన్నను దీపుగాదె! నీ
దాసులు పాదుషాలను పదంతియె చాలదె రూపుదెల్పఁగన్.

౪౫

చానా, నీసరసాస్యబింబమునకున్ జమ్షీదుపాత్రంబు దీ
టౌనే? నీపద మార్గమందు మృతి పూర్ణాయుష్యలాభంబుకం
టే నేటౌగద। కోటిబాలరవులే నీపాదరాగంబునన్
స్నానంబాడ, మదీయజీవితము భాస్వద్ధామ మౌటబ్రిమే!

౪౬

వనిత, యనుంగు ముంగురులపైఁ జెయివైచితి నంచు నూరకే
కనలెదవేమొ; నాయెదఁద కట్టువడెన్ నెలవంకయుచ్చులం;
జెనఁటి తమాషకై యురులఁ జేయిద; నాహృదయంబునేవె కో
రినయటు బుజ్జగింప బెదరించెదవేల తుటారి చూపులన్.

౪౭

అమృతరసాయనోష్ఠి, స్ఫటికాసవపాత్రము నాకుమాఱు నీ
సుమరదనచ్ఛదంబున నసూయ రగుల్కొన ముద్దువెట్టెఁ; బం
తముమెయి దాని నెత్తురును ద్రావకయుండిన నన్ను ఉగ్రమఖ
య్యమ యని పిల్వఁబోకు, తగవౌనె పరాంగన మోవిముట్టఁగన్.

౪౮

చెలియ, మనోహరప్రణయ శీతలతన్ సుఖియించు నామనం
బలమటతోఁ దపించు నకటా! భవదీయ వియోగకీలలన్;
దెలియదొ, సాఖియార్తులకుఁదియ్యని మందని; ప్రాణముల్ త్వదం
ఘ్రుల విడిపింతు; రమ్మి, బ్రదుకున్ విలఁబట్టెద నిట్టియాసలన్.

౪౯

వలపులదివ్వె, నీ మృదుల పాద లతాంతము ముద్దుగొందు; న
న్యల మధురాధరంబులయినం దులఁదూఁగవు దానితోడ; రా
త్రుల సహవాసకామినయి రోసియువిన్ గనలేక భగ్నవాం
ఛలఁ జివురించు లజ్జ పెలుచం బవలెల్లను బుత్తు దీనతన్,

౫౦

చెలియరో, నీవియోగమునఁ జిత్తము చీకి కృశించె; నీవు నే
వలనికిఁ బోయినన్ విడువఁ బయ్యెదకొంగు; నిరంతరంబు ని
న్వలచినవార లెందఱో వనారిలి కూలిరి నీవు పోవ; నేఁ
డెలమి దొలంక వచ్చితివి; ఎందఱు నీబలిపీఠిఁ జత్తురో!

౫౧

లలనా, కోమలమైన నీతనువు నేలన్ లీనమైపోయి య
వ్వల నానావిధ భాండభాండికల రూపంబెత్తుఁ; దత్త్వజ్ఞులీ
చల వృత్తంబును నమ్మఁబోరు; నిరయ స్వర్గాను సంధాన క
శ్మల చిత్తంబుఁ బురాతనాసవమునన్ స్నానంబు గావింపుమా.

౫౨

అంతములేని యీభువనమంత పురాతనపాంథశాల; వి
శ్రాంతి గృహంబు; నందు నిరుసంజలు రంగుల వాకిళుల్; ధరా
క్రాంతులు పాదుషాలు బహరామ్ జమిషీడులు వేనవేలుగాఁ
గొంత సుఖించి పోయిరెటకో పెఱవారికిఁ జోటొసంగుచున్.

౫౩

అంబరం బొక చిత్రదీపంబు; రవియు
దీపమున్ శెమ్మె, లోకంబు తెరపటంబు;
నీడబొమ్మలు మనుజులు; నిఖిలమునకుఁ
గాలచక్రంబు విన్నేత; గతి యనాది.

౫౪

ఆదిమధ్యాంత రహితమై యలరుచుండు
కాలయవనిక భేదింపఁ గలమె మనము?
ఇటకు నెందుండివచ్చె నింకెటకుఁ బోవుఁ
బ్రాణి యను ప్రశ్న కెవ్వఁడు బదులు సెప్పు?

౫౫

కానలేము కాలపు మర్మమేను నీవు;
ఆ జిలుగు వ్రాఁత చదువ సాధ్యంబెమనకు?
తెరవెనుక నేను నీవను పొరపుగలదు;
ఆ విభేదము తెరయెత్త నంతరించు.

౫౬

అణుజునై యెగిరితి రహస్యాంబరమునఁ;
బిన్న పెద్దల శుశ్రూషవేత్త నైతిఁ;
గాని, లోగుట్టుదెలుపు నొక్కనిని గనను;
మఱలివచ్చితిఁ బోయిన మార్గమందె.

౫౭

సతముఁ దత్త్వవిచారంబు సలిపిసలిపి
మూలసూత్రంబు నెవరైన ముట్టినారె?
వేఁడు విన్నట్లు; రేపును నేఁటియట్లు;
అందనిఫలంబు చేచాఁప నందుటెట్లు?

౫౮

అఖిల శాస్త్ర పురాణ తత్త్వాబ్ధి లీఁది
పరమ విజ్ఞానదీపమౌ పండితుండు
కాళరాత్రిని మార్గంబు గానలేక
యల్ల మామూలుకథఁ జెప్పి యంతరించు!

౫౯

జీవితంబెల్ల బహుశాస్త్ర సేవలందుఁ
గడిపితి, రహస్యములు చాల గ్రాహ్యమయ్యె;
నిప్పుడు వివేకనేత్రంబు విప్పిచూడఁ
దెలిసికొంటి నాకేమియుఁ దెలియదంచు.

౬౦

మనకు ముందేఁగినట్టి యా మాన్యులెల్లఁ
బ్రబలగర్వాంధనిద్రానిబద్ధులైరి;
నెలఁత, మధు వాని నావల్ల నిజము వినుము:
వారు చెప్పిన చదువెల్ల వట్టి కల్ల!

౬౧

నే నొకతత్త్వవేత్తనని నిందయిునర్చిర కాని వారు; నా
మానసవృత్తి వార లణుమాత్ర మెఱింగిన నట్టులందురే!
కాని, మఱేమి దేవుఁ డెఱుఁగండె మనంబు; వ్యథాకులాయమౌ
ఈ నిలయంబుఁ జేరితి; గ్రహింప నసాధ్యము జన్మమర్మముల్.

౬౨

పూవుఁ జెక్కిళ్ళ లందంబు దావి రంగు
నిక్కునీటును గలదు వర్ణింపనేల;
బోధపడదేమొ యైహిక భోగశాల
సృష్టికర్త యిట్లేల చిత్రించె నన్ను:

౬౩

ఏమిప్రయోజనంబు గన నిష్టములేనిదె నన్నుఁదెచ్చె; నిం
కేమి యశంబు గౌరవము హెచ్చును నన్ సమయింప; దైవలీ
లామహిమోన్నతిన్ మదిఁదలంప నసాధ్యము; రాకపోకలే
లా? మన జీవితంబునకు లాభము కేవలజీవితంబెకా!

౬౪

లలనరో, మున్ను నస్థితిజలంబున "నే"నను విత్తునాటి, య
వ్వలఁ బరి వేదనాగ్నిశిఖఁ బ్రాణము వోసెను; గాలిపోల్కని
య్యలసకలంబుఁ గ్రుమ్మరుదు; నెచ్చటి మృత్తికతోడఁ జేసెఁ గ్రం
తల కిరవైన యీతనువుఁ? దాఁకినఁ దప్పిన మన్నుదుమ్మగున్.

౬౫

ఇలకు రాకపోకల నాకు స్వేచ్ఛయున్న
రాకయుండుదును; వచ్చినఁ బోకయుందు;
వీలుపడునేని యీపాటు నేలయందు
ఉనికి పుట్టువు చావు లేకున్న మేలు.

౬౬

అయయో! మూలధనంబు హస్తగళితంబౌచుండె నానాఁటికిన్;
వ్యయమైపోయిరి మానవుల్ మరణశయ్యాసుప్తులై; తన్మృతా
లయ వృత్తాంత మెఱుంగ గోరి వయసెల్లన్ వేచుటేకాని యా
రయ లేనైతి దివంబునుం డిటకు యాత్రల్ సేయు దేశాటులన్.

౬౭

తన చేచేత నొనర్చినట్టి యొకపాత్రన్ భగ్నముం జేయ నే
మనుజుండైనఁ దలంపఁ: డంగములు నిర్మాణంబు గావించి మో
హన రూపంబులు, మోవిఁదేనె యెదలో నత్యంతరాగంబుఁ గూ
ర్చినదేవుండు మఱేల యిట్లు నిజసృష్టిం గూల్చు నున్మత్తుఁడై?

౬౮

ధారుణినుండి యుచ్చశనిదాఁకఁ గలట్టి కడింపి చిక్కులం
బూరితిగా సడల్చితిని; మోసపుటక్కుల బందెగాను; దు
ర్వార నిరోధముల్ గడచివచ్చితి; నయ్యును, సాయశక్తులం
బోరి వదల్పకే విసిగిపోయితి, మృత్యురహస్య బంధమున్.

౬౯

మానవులైనవా రెపుడొ మ్రిందుట నిశ్చిత మౌట బాగదా
దైనను బల్లియైన సమమౌను; సితాసిత పక్షమధ్య యా
త్రా నియతిం జిరంబుగ సుధాకరుఁడున్ మన మట్టిమీఁద ము
గ్ధానన, సంచరించు; మధువానుము; మానుము తక్కుచింతలన్.

౨౦

సమయపుఁ బాత్రి లోఁతుఁగన శక్యముగాదు; జగంబు దుర్జన
త్వముపయి నూనియుండు మగువా, వగపేటికొ మద్యముండఁగన్,
గుములకు వెళ్లఁబోకు విషకుండిక మృత్యువు దెచ్చియీయుఁ; గా
లముబడి నీవునేను సకలప్రజ యీరుచిఁ జూడఁగా వలెన్.

౨౧

మరణభయంబు నాకు నణుమాత్రములేదు; మదీయ జీవ సం
భరణభయంబె మిక్కుటము; ప్రాణము దైవము నొద్ద వడ్డి బే
హారమున కప్పుగొంటి; ఋణమంతయు నిమ్మని తల్పు దట్టినన్
సరసర హేమనిష్కముల సంచులు ముందఱ విప్పిపోసెదన్.

౨౨

కాలము రోషసంకులవికారముఁ జూపకపూర్వమే సుహృ
త్ప్రాళులఁ గూడిమాడి జరుపందగు వెన్నెల పానగోష్ఠి; చం
డాలయముండు ద్వారముకడన్ నిలుచుండినయప్డు తెప్పపా
టాలము సేయునే? గుటికెఁడైన జలంబును ద్రావనిచ్చునే?

౨౩

పరమొ గిరమ్మొ దానితలపై నొక దోసెఁడు మన్నుచల్లి సుం
దరి మెఱుగుంగపోలములు దాఁచిన ముద్దుల దొంగిలించి సం
బరముగ శీధువానుము; నమాజులు పూజలుఁ జేయనేల? యె
వ్వరయిన వచ్చినారె మృతివాటిక కేఁగిన పూర్వ యాత్రికుల్?

౭౪

మాటికి మాటికిం దెలివిమాలి తలంతువు స్వర్గమంచు; న
చ్చోట నిలింపకామినులుఁ, జొక్కు పుటాసవముల్, గులాబిపూఁ
దోఁటలు నుండునన్న భ్రమతో మనకేటికొ యవ్వియియ్యెడన్
నీటిలఁ; జేతివెన్న విడి నేతికిఁదోదురు మూఢమానవుల్.

౭౫

కొందఱు దేవకన్యకల కూటమి పండుగ యంద్రుగాని నే
నందు మధూళి పానమె ప్రియంబని; తీరని యప్పుబేర మిం
కెందుకు? ముందుచేత గ్రహియింపుము రొక్కముఁ; దూర్యరావమా
నందముఁ గొల్పుదవ్వుల వినంబడినం; దడవేల మిత్రమా?

౭౬

ఎవఁడో భగ్నమనోరథుం డిహమునే హేయంబుగానెంచి భా
వ వినోదంబుగ నందనంబు, దివి, రంభాభోగ మూహించుకొ
న్న విధానంబగుపట్టు; బైళుల ఝురీనాదంబు, ప్రత్యూషవై
భవముల్ సంధ్యల రక్తికన్నఁ గలదే స్వర్గంబు యోచింపఁగన్?

౭౭

అలవడ దస్తినాస్తుల యథార్థత, నాకము సత్యమన్న పె
ద్దలనుడి యొప్పుకొన్నను, బదంపడి నమ్మకమేమి యందఱా
స్థలమున కేఁగువారలని? చచ్చిన నెవ్వరి కెవ్వరో! వృథా
పలుకు లిఁకేల భూతలము స్వర్గమొనర్పుమ సాకి, పాత్రికన్.

౭౮

చకచకలాడు ద్రాక్షఫలసారము వేణురవంబు, గానముల్
నికటముననే విలింపరమణీమణిఁ బోలిన యెమ్మెలాఁడి! నా
కిఁక మఱియేమిలోటు? సగమెత్తియు వ్రాలెడికన్నుదమ్ములన్
సకియ, జయింపనే సమయ సంకటముల్ త్రుటిలోన వారెవా!

౭౯

నాదు యశోవగుంఠనమునం గనుపట్టెను జిల్లుచీలికల్;
పైదలి, యైనఁగాని మధుపానము మానను ప్రాణ ముండఁగన్;
ఆ దరిబేసు లాసవము నమ్మి మఱేమి యమూల్యవస్తు సం
పాదన సేయువారొ విసుమానము నొందుదు వారి చేతకున్.

౮౦

నిరతముఁ బానమత్తులము, నీతులు గీతులుఁ దెల్పఁబూన కో
విరసుఁడ, పానపాత్రి నులివెచ్చని ద్రాక్షరసంబుదప్ప మా
సరసపు గోష్ఠి వేఱొక విచారములేదు, ప్రియాంగనా మనో
హర మధురాధరామృతము నానుటొ, యాసవ మానుటోగదా;

౮౧

వారుణి నానుచుండఁ బ్రతిపక్షులు పల్కిరి: "వద్దు ఛీ! మతా
చారవిరోధి పానకలశం" బని; యయ్యది సత్యమేని వ
హ్వారె! మతాపకృద్రుధిరపానముఁ జేసెద; ధర్మశత్రుసం
హారము శాస్త్రసమ్మతము నౌనని చెప్పరె పండితోత్తముల్!

౧౨

త్రావము జాహిదీలమని డంబముఁ గొట్టెదవేల ? యంతక
న్నా విపరీతకృత్యము లొనర్తువు నిత్యము; మాయవేషముల్
భావములోని కల్మషముఁ బాపునె ? మానవసంఘ రక్తముం
ద్రావెదవీవు; ద్రాక్షఫలరక్తము మాకు రుచించు నెప్పుడున్.

౧౩

చిరిగిన బొంతలం దొడిగి సిద్ధుల మంచవివేకలోకమున్
మొఱఁగి చరించు దుర్జనుల మోసముకంటెను మేలుగాదె యో
గురువర, కామినీ ప్రణయగోష్ఠుల నాసవసేవ; త్రావినన్
నిరయము దప్పదన్న, మఱి నీ సురలోకము పాడుగాదొకో ?

౧౪

గురువ, సలాము, దైవమునకున్ మము పీఁచుము; మీకు మౌనమే
పరమ హితంబు; అజ్ఞతను బల్కక యుండినఁ జాలు; మేము గ్రు
మ్మరుసది సత్పథంబు గసుమా, నయనార్తుఁడవౌట దారి వ
క్కరముగఁదోఁచుఁ; గన్నులకుఁ గాటుకవెట్టుము, చూపు మేలగున్,

౧౫

తెలవ కడాని తొమ్మొలగుదిండున మే నరమోపి పూవుఁజ
ప్పరములఁ గూరుచుండి మధుపాన వినోద విపంచికా రవ
స్ఫురిత ముదాత్ములైన [illegible] గవచ్చుఁగాని, నే
ర్చిరె యలరెంటికిం జెడిన [illegible] నుజా నెఱుంగఁగన్.

౮౬

కనుఁగొను; శబ్ద రూప రస గంధములన్ సుఖమైనస్పర్శ మో
హనమగు నీ ప్రపంచము ననంతముగా సృజియించి ధాత చే
సెనె శిలతోడ మానవుని చిత్తము? సద్హృదయంబులేనిచో
జనులఁ బరస్పరప్రణయ సఖ్యము పందున కైనఁజిక్కునే?

౮౭

కలపయు మట్టి ఱాల నిడి కట్టిన దేవళమందు నీకు నే
ఫలము లభించు? ప్రేమరస భావయుతుండవయేని కామినిన్
వలపుము; ప్రాణహీనమగు బండలు వేయిటికన్న శ్రేష్ఠమై
యలరుఁగదా మనుష్యహృదయంబు ప్రతి ప్రణయానురక్తులన్,

౮౮

దేవ, నీవులేని గుడిఁ బ్రార్థించుకంటెఁ
పానశాలను సత్యంబు పలుక మేలు;
సృష్టి కాద్యంతములు నీవె; స్రష్టవీవె;
పాలముంచ నీటను ముంచఁ బ్రభువు నీవె.

౮౯

కొందఱు ధర్మమున్ మతముఁ గూర్చి నిరంతము చింతసేయ నిం
కొందఱొ సత్యసంశయము లేర్పఱుపం దలదిమ్ము గాంచ, నా
సందున మాటు వీడి "యిఁకఁ జాలును లెందు వెడంగులార, మీ
కందును నిందు లేదు పథ" మంచు మునాది వచించువారికిన్.

౯౦

మునుపు మసీదు వాకిటను ముచ్చెలు దొంగిలిపోతిఁ; ప్రాతవై
చినిఁగెను; నేఁడునుఁగా మరలఁ జెప్పులకోసము వచ్చినాఁడ; నె
మ్మనము సెడంగ నియ్యెడ నమాజొనరింపఁగరాను; నీవు చ
చ్చినయెడ వీడిపోయెదవు చెప్పులవోలె నమాజు సైతముఁగా.

౯౧

సలలితగోస్తనీఫలరసంబును గ్రోలెడువారు, దేవళం
బుల నిశియెల్లఁ బ్రార్థనలఁ బుచ్చెడువారు, జలప్రవాహవీ
చులఁ బడి మున్గినారు; పొడిచోటి కొకండును జేరఁ; డొక్కఁడే
యలరుఁ బ్రబుద్ధుఁడై; మిగతయందఱు మత్తులు పెద్దనిద్దురఁగా.

౯౨

మితిసెడ, సృష్టివేళఁ దనుమృత్తిక నెవ్వఁడు మేళవించె; జీ
వితనిచయింబునం బతుగుపేకల నువ్నియుఁ బట్టు గల్పె; దు
ష్కృతులను బుణ్యకార్యములఁ జేయఁ లిఖించెను నొష్ట, వాఁడె మ
త్కృతులకు మూలకారణము; కీడును మేలును వాని సేఁతలే.

౯౩

పాపముఁ జేసితంచుఁ దలఁపం బనియేమి ఖయామ? దుఃఖ సం
తాపము నిష్ఫలంబగు; వృథా వగపిల్లుట మాను; మెవ్వరుం
బాపము సేయకున్నఁ దన మన్నన యెందుకు? కల్మషాత్ములఁగా
"రేపు" క్షమించుఁ; బాపము హరించును దైవము; సంతసింపుమా,

౯౪

ఎవ్వఁడు తప్పుసేయఁ; డిల నెట్టుల జీవిక సాగుఁ. జేయఁదేన్;
అవ్వలఁ బాపి వీఁడనుచు నక్రమశిక్ష విధింతు వయ్య। యీ
రవ్వయు రచ్చ యేల యపరాధుల మిద్దఱ మాట; నీకు నా
కెవ్విధమైన భేదము రహించునొ కా స్తవచింపు మీశ్వరా?

౯౫

మునునే నస్థితి విదగ్నుండ నిలకుం బోఁదోలి దుఃఖంబులం,
దను సౌఖ్యంబుల నందఁజేసి మరలం దర్జింతు వౌరౌర। పా
పిని శిక్షింతు వటంచు; నీ చతురతన్ వేనోళ్ళఁ గీర్తింతు రీ
వినయార్తుల్; మఱి శిక్షకర్తుఁడవు నీవేకావె లోకేశ్వరా?

౯౬

కరుణావార్ధివి నీవు. నే నిఁకను దుష్కర్మంబు వర్జించి ని
ర్భర వైరాగ్యముఁ బూన నీవు కృపఁజూపం బాత్రులెవ్వారు? నీ
బిరుదున్ నిల్పుట కే నొనర్చితిని నిర్భీతిన్ సమస్తాఘముల్;
నరకం బంటకయున్న పీలగునె పశ్చాత్తాపముం బొందఁగన్.

౯౭

నీవు కృపాంబురాశివఁట! నిక్కమయేని ఇరాముఁతోటకుం
బోవఁగనీక పాపిజనమున్ మరలించుటయేల? భక్తులం
గావఁగ వత్తునేని కృపగాదది, బేహర; మింద నున్న మీ
యావుల కన్నఁ, బాల్యలయునా పసిపాప కటన్న సామెతౌ!

౯౮

అంబరు ముంగురుల్ నొసలి యంచుల వ్రేలఁగఁ జూచినంత మో
హం బొసకొల్పు కోమల లతాంగినిఁ గల్పనచేసి నీకు న్యా
యంబె మఱెవ్వరున్ మొగమునారయరాదని యాజ్ఞపెట్టఁ; బూ
పంబును జేతికిచ్చి తినవద్దని చెప్పుట యేల దైవమా ?

౯౯

మనుజుని వారుణీం బ్రణయమాధురి సుందరిఁ జేసి ఘూనినం
దనమున కంపినాఁడవు; మనంబగుఁ బ్రేరక మెల్లకర్మకున్;
వెనుక నదేల మాతలను వేసెద వీ యపమాఱు ? నీవె శా
సన మపరాధియున్ మఱి విచారణకర్తయుఁ; జిత్రమీశ్వరా !

౧౦౦

అలరె విమర్శనంబు ! కననయ్యె వివేకము; సర్వశాస్త్రముల్
దెలిసిన పండితోత్తములనే నిఱుపేదలఁ జేసినాఁడ; వం
జలిని బ్రసాదమై పిడుగు జాఱును భక్తుల; కింతయేల ? దు
ష్టులకు సుఖంబు సంపదలు చొప్పడు, నింపగునీకుఁ బాపముల్.

౧౦౧

నెలఁతా, దేవునికట్లు నాకును జగన్నిర్మాణమర్మక్రియల్
గలవేని, దుర్విషమప్రచారి యగు లోకంబున్ యథేచ్ఛామతిం
జెలువంబౌనటు సంస్కరించి నవసృష్టింగూర్తు సన్మార్గవ
ర్తులు ప్రాజ్ఞుల్ భువి సర్వసంపదల సంతోషంబుగన్ వర్ధిలన్.

౧౦౨

ఈ విషవృక్షలోకమును నింకొకరీతిఁ బునః సృజింపుమం
చే వినతిన్ వచింతు; నది యిష్టమయేని రచించు వెచ్చెరన్;
దేవ, మదీయ నామమును దెప్పునఁ బట్టికఁ గొట్టివేతువో,
నావయసున్ శతాధిక మనన్ సవరింతువొ చూడఁగావలెన్.

౧౦౩

కోరిక లన్నియుం గుడుపుగూరవు, సౌఖ్యము దుఃఖమెప్పు డం
గూరురసంబుఁ జేఁదటున్ గూడియెయుండు, గులాబి కంటకాం
కూరము లంటియుంట మనసం బరివర్జ్యమె? అంపకోఁతలం
జీరికలౌట దువ్వెనయుఁ జేకొను జవ్వని తావిముంగురుల్.

౧౦౪

ధనము నలక్ష్యభావమునఁ దత్త్వవిదుండు నుపేక్షచేసినం
దినగతిలేని పేదలకు, దివ్యవనంబగు నిజ్జగంబు బం
ధనమగుఁ; బైఁడిసంచుల ముదంబున విప్పి గులాబి నవ్వఁగం
బనవును నీలకొంత వని బాయలుచాఁపుచు నుత్తచేతులన్.

౧౦౫

కనుల హిమాంబు బాష్పములుగా జవచించె గులాబి, ముద్దు మో
మును నగుసోయగంబుఁ దలపోయక, నన్ను సుగంధకారి కా
చునకట యన్న, బుల్బులియు, సుందరి, సా[illegible] వేఁడుపిం
దును నొకయేఁడుకుండు; విధిదుష్టమవార్యము[illegible]న్.

౧౦౬

కాలశరాసనోత్పతితకాండము తీక్ష్ణము; తచ్ఛిలీముఖ
జ్వాలల మాడకే మనుము; వాదనిపుంటను జౌడుఁ జిల్లు దు
ష్కాలము నీకు నోటఁ బులకండము బాదముఁ బెట్టవచ్చినన్
నాలుకఁ జాఁపఁబోకు మొకనాఁ డయినన్, విషదిగ్ధ మద్దియున్.

౧౦౭

విధి నిబద్ధములై వచ్చు వెడలి పోవు
నఖిల సుఖదుఃఖములు నీ కయాచితముగ;
జడియఁ బోకు రుస్తుముజాలు శత్రుఁడైన,
తాయి సఖుఁడైన విందులఁ దలఁపఁబోకు.

౧౦౮

రెండుదినములకొాకతూరి యెండురొాట్టె
బోసిముంతెఁడు చలినీళ్ళు పుట్టునేని
ఏల నినుఁబోలువానికిఁ గేలుమోడ్పు ?
నొకనికి గులామవై యెందు కూడిగింప ?

౧౦౯

విషము నమృతంపు మసిబుడ్ల విధి కలంబు
ముంచి లోకుల నుదుట లిఖించు మొదటఁ;
గరఁగ దఱుఁబేద కన్నీటి కాల్వనదియుఁ,
బరమభక్తుని యనుతాప వహ్నిఁ జెదదు.

౧౧౦

కాన నెదిప్రాప్తమైనను గారవించు,
వలయు వలదని యేర్పఱపంగ లేవు;
అంబరంబును నీకు సహాయపడదు,
తానె తలక్రిందుగా వ్రేలుఁ; దడవు నిలదు.

౧౧౧

ఇల చదరంగ; మందు జనులెల్లరు పావు; లహస్సులుఁ నిశల్
దెలుపును నల్పుగళ్ళు; కదలించును రాజును బంటుఁ దక్కు పా
వుల విధియాటకాఁడు; పలుపోకలఁ ద్రిప్పును గళ్లమార్చు. న
వ్వల నొకటొక్కటిం జదిపివైచు నగాధ సమాధిపేటికన్.

౧౧౨

జ్ఞానపటాలయమ్ము నొడికమ్ముగఁ గుట్టు ఖయాము నేఁడు దుః
ఖానలదగ్ధుఁ డయ్యె; యముఁడన్ బెనుకత్తెర జీవితంపు బి
ట్టూను గుడారుమోకుఁ దెగనొత్తెఁ; బ్రపంచపుసంతలోన దు
గ్గానికి నమ్మె నిన్నుఁ బలుగాకిదలాలి విధాయి, యయ్యయో!

౧౧౩

మనమున కెక్కినట్టి యభిమానులు మిత్రులుఁ జెల్లినారు; యౌ
వన మధుమాసముం గుసుమభారము రాలిచిపోయె; జీవితం
బను సరకంబునందు నడుగంటె మధూళియు; నేదినంబు వ
చ్చెనొ మఱియెప్పుడేఁగెనొ దిసింపదు హర్షవిహంగమిప్పుడున్.

౧౧౪

పూవులకారు రాకలకుఁ బోయెడి సీతులకున్ రసోజ్జ్వల
జ్జీవిత కావ్య పత్రములఁ జెచ్చెఱఁద్రిప్పితి; శోకసర్పద
ష్టావిలమౌ హృదంతరము నాసవమున్ బ్రితియోగ మొక్కటే
శాంప సమర్థ; మింక ముదికాయము లేఁతగిలంగఁ ద్రాపెదన్.

౧౧౫

విమల మనంబుతోఁద మధుపత్రయిశాలకుఁ బోతి విన్నరే
యి; మధురవాణి, సాఖి, హృదయేశ్వరి పాత్రిక నింపితెచ్చి త్రా
వు మనిన వద్దటంచు సరిపుచ్చితిఁ; గ్రమ్మఱ "నాదు ప్రేమపై
రమణుఁడ, యానవెట్టితిని ర" మ్మనఁ దెమ్మని యానతిన్ బలే!

౧౧౬

ఆసవ కుండికం బెదవులానఁగఁ బట్టినయప్డు దీర్ఘ ని
శ్వాసముతో వచించెఁ దనసంగతి: "నాకును నీకుఁ బోలె రో
జా సుమనోధరంబు వికసన్నవహాసము లుండె; జీవముం
బాసిన మానవుల్ మగిడివత్తురె? పీడకు నాదుసఖ్యమున్."

౧౧౭

ఆకూజాయును నన్నుఁబోలె ప్రిణయవ్యామోహముంజెంది కాం
తాకమ్రాలక శృంఖలావలయ బద్ధంబయ్యెఁ గాఁబోలు మున్;
నాకుందోఁచుఁ దదీయకంధరను లగ్నంబైన చేకొందె యో
షాకంఠ ప్రిమదోప గూహనమునన్ వంసక్తమంచున్ సఖీ.

౧౧౮

విన్నటిరోజు కుమ్మరిని నేఁగనుఁగొంటి బజారువీథిలో
మన్నొక ముద్దఁజేసి మదమం జెడఁద్రొక్కుచు నుండ. వానితోఁ
దిన్నగ మందలించె నది దీనత "మెల్లఁగ నల్లఁ ద్రొక్కుమో
యన్న. యెఱుంగవే నను? నొకప్పుడు నీవలె నందగాఁడనే!"

౧౧౯

మానగదోయి. యెందుకు మానవమ్మృత్తికఁ దెచ్చి ముంతలున్
బానలుఁజేసెదీవు; మఱవందగ దందఱు నట్లెయౌట; య
జ్ఞానముచే నిజంబెఱుఁగఁ జాలవు; నేను గ్రహించితిన్: ఫరీ
దూను శిరంబుఁ గాంచుమ యదో! దరిబేసి కరంబు దగ్గఱన్.

౧౨౦

పొలుపుగ మాట నేర్చినవి మూగవి కుండలు రెండువేలు లో
పల నొకమూలనుండి యిటువల్కె ననుంగవి "కుంభకారులున్
విలిచినవారు, మమ్ముఁ బురవీథులనమ్మిన వారలేరి? యే
తలమున కేఁగినారలు? వదంతి యెదేనియు విన్నఁదెల్పుమా."

౧౨౧

ఎందుకుఁజూచిన న్గొనకయేఁగెదు? చక్కని గిండిగానొ, న
న్నందఱు వ్రేలుచూపి పరిహాసముచేయుదు; రైపు నాది గా
దిందుఁ, గులాలశిల్పి నను నిట్లొనరించె; రచించు నప్పుడుం
దఁదరలాడె నేమొ చెయి త్రావుడుమత్తున, నొక్కె సొట్టగన్.

౧౨౨

ఓరికుమ్మరి, పిల్పువచ్చె; వినుమా యొక్కింత నాకోర్కె; నా
గోరిమృత్తికఁ బానపాత్ర లిటికల్ కూజాలు జాడీలు సొం
పారం దీరిచి యమ్మవోయి మదిరాపణ్యంబులన్; గోస్తనీ
సారస్పర్శఁ బునఃప్రబోధితుఁడనై సత్యంబుఁ జాటించెదన్.

౧౨౩

కడుగుఁడు నాశవంబుఁ దడిగా మధుదారల: ద్రాక్షపల్లలుం
బుడకలు పెట్టెయల్లి ననుబూడిచి పెట్టుఁడు; శీధుబిందులన్
వడిసెడి నాదుమృత్తికల వాసన గుత్తగుమీకు; “రేపు” నన్
బడయుదురాసవాలయము వాకిటనో, చెలి కాలిధూళినో!

౧౨౪

ఉత్తమోత్తమ గురుల శిష్యుండ నైతి,
గురువునైతిని సచ్ఛిష్య కోటులకును;
మరణశయ్య నంత్యార్థము మందలింతు;
ధూళి జనియించితిని; గాలిఁదేలి పోదు!

౧౨౫

ఖయ్యమా నీ గుడారము గగనసీమ
కవల నాటియు, మౌనమభ్యాసమయ్యె,
ఊఁదివేయు సమయసాక్షి యున్కిపాత్ర
కమ్మ నీర్పుగ్గలటు వేయి ఖయ్యములను.



# వివరణము

పద్యము. పదము.

3. దౌలతు—ప్రాభవము.

4. సరకము—పానపాత్ర.

6. కైఖుస్రు—కయానీవంశీయుఁడైన ఒక సుప్రసిద్ధ పాదుషా.

8. మూసాస్వేతహస్త ప్రభల్—మూసాప్రవక్త (Moses) చేతులకు తెల్లకుష్ఠువు పొడలుండెననియు, అవి చాల రమ్యముగ నుండిన వనియు చెప్పుదురు. కొమ్మలలో మూసా చేతులవలె పూలు పూచెనని భావము.

మునాది—రేపుమాపులు మసీదునందు గొంతెత్తి దైవప్రార్థన చేయు నతఁడు.

13. రాగవతి—ఇదియొక పూలమొక్క: దీనిని ఇంగ్లీషులో Tulip అని అందరు.

14. బహరాముగోరి—పూర్వ పారసీకరాజు; గోర్ అనఁగా అడవిగాడిద. అతఁడు అడవిగాడిదలను వేఁటాడుచుండినందువలన ఆపేరు వచ్చినది. గోర్‌ను పట్టినయతఁడు గోర్‌లో పట్టుపడెను అని చమత్కారము. ఇచ్చట గోర్ అను పదము శ్లేషింపఁబడినది గోర్ అనఁగా సమాధియనియు అర్థముగలదు.

15. వజీరు—మంత్రి.

19. నీలకాంత — ఇదియొక పూలమొక్క. పారసీకో ' బనఫ్ ' షా ' అనియు ఇంగ్లీషులో Voilet అనియు పేర్కొందురు.

23. బుల్బులి — వసంత ఋతువున పాడుచుండు ఒక చిన్నపిట్ట. ఆకారమునందు కాకపోయినను కూతయందు, కవులచే వర్ణింపఁబడుటయందు అది మన కోయిలకు సరిపోలును.

నీరక్తాస్యముల్ — నెత్తురు లేక పాలిపోయిన మొగములు.

26. సమలు — సంవత్సరములు.

27. సాఖి — పాత్రివాహిక.

28. ద్రాక్షమణి ముద్దుకూఁతురు — ద్రాక్షాసవము.

41. మహమ్మూదు — మహమ్మదు గజ్నవి. ఈతని రాజ్యకాలమున పారసీకదేశము సకల భోగభాగ్యముల నోలలాడుచుండినది. ఇతఁడు వాఙ్మయ పోషకుఁడు: సోమనాథ దేవాలయమును ఈతఁడే విధ్వంస మొనర్చెను.

దావీదు — ఈతఁడు యాకూబు పుత్రుఁడు. సుప్రసిద్ధుఁడైన గాయకుఁడు; బైబిలులోని (Psalms) కీర్తనలు రచించెను.

44. కౌసరు — స్వర్గమున ప్రవహించు తేనె వాఁక.

45. జంషీదు పాత్రము — ఈ పాత్రములో చూచిన భూతభవిష్యద్వర్తమానములు దెలియవచ్చును. ఇది జంషీదను పూర్వ పారసీక ప్రభువువద్ద నుండెనని ప్రతీతి.

46. నెలవంక యుచ్చులు — సాఖినొసలు నెలవంక. ముంగురులు అది పన్నిన ఉచ్చులు. ఆఉచ్చులలో (ఖయ్యాము) హృదయము పట్టుబడియున్నది. అక్కరలేనిదే ఎవడుగాని తమాషాకుగా ఉచ్చులలో చేయిపెట్టడు. నా హృదయము వానిలో చిక్కుపడి ఉన్నది గావున దానిని ఓదార్చుటకు నేను చెయివేసితిని. నీవు బెదిరించుట యెందుకు అని చమత్కారము.

53. చిత్రదీపము — మాజిక్ ల్యాంటర్న్.

56. అణుజా — దేగ.

68. ఉచ్చశని — ఇచ్చట ఉచ్చశనియనఁగా తులాశనికాఁడు. గ్రహ కక్ష్యావృత్తములలో శనికక్ష్యావృత్తము చాల యెత్తున నుండును ఒకరాశిని చంద్రుఁడు షుమారు రెండున్నర దినములో దాఁటు చుండగా, ఆ రాశినే శని దాఁటుటకు రెండున్నర సంవత్సరము పట్టును. ఇందువల్లనే శని కక్ష్యావృత్తము యొక్క వైశాల్యము మనకు బోధపడును.

69. బాగదాదు — బల్ఖ — ఇవి పారసీకములోని పట్టణములు. బాగదాదు ఉమయ్యాద్ వంశీయ కలీఫా'లకు ముఖ్యపట్టణము. బల్ఖమందు ఖయ్యాము తన బాల్యము గడపెను.

68. జాహిది — భక్తుఁడు.

97. ఇరామతోఁట — పారసీకుల నందనవనము.

103. అంగూరురసము — ద్రాక్షాసవము.

107. రుస్తుముజాలు — జాలుకుమారుఁడైన రుస్తుము — శతఁడు భీముని వంటి బలశాలి.

తాయి — హాతింతాయి — ఇతడు గొప్పదాత; అతిథి సత్కారము నందు పేరువడసినవాఁడు.

111. పావులు — ఆటకాయలు.

112. పటాలయము — డేరా.

119. ఫరీదూన్ — పూర్వ పారసీక ప్రభువు.

దరివేసి — దరిద్రుఁడు. ఒకతెగ ఫకీరు.

122. ఇటికలు — సారాయి బుంగలపయి ఇటికరాళ్లు మూతపెట్టు ఆచారము పారసీక దేశమున సామాన్యమై యుండినది.

---

# రానున్న గ్రంథములు

సాదీ మహాకవి రచించిన

"గులిస్తాన్"

మరియు

"బోస్తాన్"

అను పారసీ ప్రబంధములకు

తెనుగు అనువాదములు.

"గులాబితోట"

మరియు

"పండ్లతోట"

★

అనువక్త

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి.



కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు నవంబరు తే 9 ది 1895 లో నెల్లూరు జిల్లాలోని గూడూరున జన్మించారు. వీరు తమ జీవితమంతయు గడపినది పెమ్మారెడ్డిపాళెంలోనె. వీరి స్కూలు జీవితం చాల కొద్ది. చిన్నప్పటినుండి వీరికి విజ్ఞానశాస్త్రం అంటే మక్కువ. వీరు పందొమ్మిదవ సంవత్సరమున కవి అయ్యారు. కవిగాకపూర్వం వీరు చిత్రలేఖనం, శిల్పములు తయారుచేస్తుండే వారు. వీరు స్వయంకృషితోనే ఇంగ్లీషు, ఫ్రెంచి, బెంగాలీ, సంస్కృతము, జర్మన్, పెర్షియన్, ఉరుదు, తమిళంలో పాండిత్యం సంపాదించారు.- వీరు చిత్రకారులుగా, సినిమా డైరెక్టరుగా, శిల్పకారుడుగా మనకు పరిచయమయ్యారు.

వీరు కొన్ని ఖండకావ్యములను యింగ్లీషులోకి తర్జుమాచేసి "Voice of the Reed" అనే పేరుతో ప్రచురించారు. అది యితర దేశాలలోకూడ అందరి మన్ననల నందుకొన్నది. Samadarsana అనే గ్రంథంలో Dr. James H. Cousins గారు రెడ్డిగారు మనదేశంలోని ముగ్గురు భాషాకవుల్లో ఒకరని పేర్కొన్నారు. వీరు 1947 సెప్టెంబరు 11-వ తేదీన పరమపదించారు.

# పలితకేశము

కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

కవికోకిల పబ్లికేషన్స్
నెల్లూరు

# అర్పణము

మరవగారాని తొలుప్రేమ మరవజేసి
చీకటింట గప్పురదివ్వె సెమ్మె నిలిపి
వలపుచితిభూతి మల్లికావల్లి నాటి
బ్రతుకుబాటల పుష్పాళిపరచి, మరల
జీవితాశలు రెక్కొని చేవగిల్ల
భగ్నహృత్పాత్ర సంధించి ప్రణయమధువు
అంచుపొరలగ నింపిన అన్నపూర్ణ
కర్పణమొనర్తు నీకృతి నమలరక్తి.

## పలితకేశము

అహమత్వము మీయందు నలరెనేమొ!
మానపద్వేష మొక్కింత మతిని బడెనొ?
నాగరకజీవనము కొన్నినాళ్లనుండి
పపలితిరి; లేక మి మ్మడి వదలెనొక్కొ? ౫

కవులు సౌందర్యరసపిపాసవు లటంచు
జెప్పితిరి మీ రొకప్పుడు చిత్తమలర,
అట్టి రసపేయతాప్రీతి యట్టితలపు
ఎటుల నావిరియైపోయె నింతలోన? ” ౬

అని తన యభిరుచి దెల్పుచు
అని యనునటు నన్ను దాకనాడుచు గోపం
బున కెడమీయని చిరునగ
వొనరిచి నను విగతబాణు నొనరిచె సతియున్. ౭

కని గ్రంథంబుల నోటుబుక్కుల దిరస్కారంబు సూచింప వి
గ్గున నొక్కుమ్మడి సందిటన్ జవిరి ప్రోగుంబెట్టి మేజాపయిన్;
వినయాచ్ఛాదనరక్షితంబగు దురావేశంబు వీక్షించి స్త్రీ
జననైజంబు బ్రతిక్రియారహితచేష్టా నైపుణిన్ మెచ్చితిన్. ౮

# పలితకేశము

ఏమనుకొందునో యమునను నింతల సంతల వారసిల్లి నా
మోమున గొపచిహ్నములు మానిసికొంటకు సంతసించుచుం
గామిని నిరమున్ బురుసుకత్తిని నమ్మెను దర్పణంబు దా
నే మనుసు సద్దుపెట్టి యునునేని కపంగుడు 'మెప్పు' కంపనన్. 9

అనరము సద్దమున గాంచు, నతిపరాయువు
లన్నియు సహోతుకముంగ నాత్మవచె;
బురుసు గద్దంబుపై బెట్టి సునుగు వెర
వేయుమున్నంటిని; భామంబు తసుగుచుంటె. 10

వారింపోయెడు బాటసారి యుత్తర ద్వారంబునం దుండ, గా
స్తారన్ మేల్కొనురీతి నామనము స్వేచ్ఛాపుష్పకం బెక్కి ది
క్పారంబుల్ కనుముట్టుచుండగ హరావ్ఛంగంబు చేనూరె; గ
న్నారం గాంచితి వెల్లనై యొక కేశాంకూరమున్ మిసలన్. 11

షరముగ గుండెలో నెగిరి పడ్డటు లయ్యెను; జవ్వనంపు బం
గరు కల లెల్ల రెక్క లెదుగం బరతెంచెడు పక్షిణాబయుల్
కరణి గులాయమున్ విడుట కన్నుల గట్టె; క్షణంబునన్ మనో
హరమగు జీవితాంబరము సంబుదకర్మలమై కనంబడెన్. 12

## ప లి త కే శ ము

. . .

విరియు రేకుల మంచుతుంపురులు జార
బ్రొద్దుపొడుపున జలిగ్రాగు పూవునందు
జిడపురు పెండు చేరిన జాడ తోచె
మినుమున దెల్లవెంట్రుక మోసుగాంచ. 13

మున్ను ఎన్నెన్ని మార్లు మోమోట లేక
కత్తిరించితి మీసంబు; కలుగ వెట్టి
మార్పు లాందోళనంబులు మానసమున;
అది నిరర్థకపరభృత మనుచునుంటి. 14

ఒక్కొకప్పుడు ఎందుకు నొచపనట్టి
యల్పవస్తువె ప్రముఖమౌ సదనుబట్టి;
నల్లవెంట్రుక మొట్టిక తెల్లనౌట
సకలమానవ దుర్వార శత్రువయ్యె. 15

చెలి యది గాంచి నం బరిహసించునొయేమొ! జపాకుసుమాంతరో
జ్జ్వలమధురాధరాంచల లసన్మృదుహాసము మంపగించునో!
యలకువ చూపి వచ్చె ముసలాత డటన్న నిరాకృతిఁ సనుం
ఝాలకనసేయునో యనుచు స్రుక్కనిమేషము, ధైర్యమూనితిఁ. 16

.............................. ..... ... . . ... ... ..... ..

## పలితకేశము

ఏమి పొరపొచ్చె మెరుగక యిన్నినాళ్ళు
ఆలుమగలము దాంపత్య మనుభవింప
జానకములోన బుడకట్టు వచ్చినావె
తెల్లవెంట్రుక, నీతస్సదియ్య, నేడు. 17

దానిని గాంచినయంతనె
మానసమున ద్వేషవహ్ని మల్లడిగొన నే
బూనితి చేతం గత్తెర
ఖూనిసేయంగ వొడరు క్రూరునిభంగిన్. 18

"ఆకుమరుంగు పండటుల నక్షులకుం గనరాక యొంటివై
నా కను బ్రామి మాటున మనం దలకొంటివె యిన్నినాళ్ళు; నా
సాకతమైన నెంచవు; విచారము లేక వధింతు" నంచు నే
వాకొని కత్తిరింప, నది పాయక లోపలజిక్కి వ్రేలుచున్. 19

నను గని "యోవెడంగ, యిది నాయమె యొంటరినైన నన్ను లో
గనికర మేమి లేక చిరు కత్తెర నొత్తితి వంత బోయెనే?
దినదిన జృంభమాణమయి తేజు దొలంకెడు మచ్ఛరీర ప
ల్లిని మొదలంట గోసి వెడలింపగ సాధ్యమె యెట్టివానికిన్? 20

నేడుఛేదించితివి, రేపు చూడు నన్ను
వేలువిధంబున మోసెత్తి తొంగిజూతు ;
పృథివిజనులకు గాలంబువేయుచున్న
ప్రశ్నగుర్తును, బదులేమి పలుకగలవు ? 21

శత్రువనుగాను ,మానవమిత్రమౌదు;
సత్య మెరుగ, వయోవృద్ధ పథులైన
వారికి వెలుంగు జూప నవ్యాజకరుణ
గాగడా పట్టుచుందును గాలినియతి, " 22

అని యిటు పేర్వెదు వెంట్రుక
తునుకం గని యంటి " నేను, తొరపుగర్వం
బున దేవదూత వీవే
యనుకొని రక్షించుమాట బాటెద వదరె! 23

కొలదియెరుగని యుద్ధతి ! గర్వితేక
యెంతయెదిగిన లోడితెడ ! యింకనైన
బుద్ధితో నేరువాగక పోదువేని
పరువు దక్కదు; లేక, దెప్పరము దక్కు. " 24

. ....... .

పానరస్, సర్వము శాశ్వతం బని తృష
లోలాంతరంగంబునన్
దినముల్ పుచ్చెదు మూఢమానవునకుఁ
దీపంబు నందిచ్చెదన్. 28

చెలువలు ప్రేముడింగడుసు చిక్కని కౌగిళులన్ సుఖించి ని
చ్చలు మధురాధ రామృత రసంబున మత్తిలి యౌవనంబు ని
శ్చల మని యెంచి కామపరిచర్య యొనర్చెడు భావికాల చిం
తలు తలపెట్టబోని పశుతత్త్వుని నిద్దుర లేప వచ్చితిన్ 29

కాలరథప్రచార మొక ఖండనిమేషము నాగ బోదు భూ
పాలుని యాజ్ఞకుం, బరమభక్తుని మ్రొక్కుకు, దిక్కులేని చం
డాలుని కంటినీటి కెరటాలకు; గాల మమూల్యమోయి, యా
కాలుడు రాకమున్నె వెదుకందగు విస్మృత జీవితార్థముల్. 30

ధనధాన్యంబులు కూడబెట్టి కుడుపన్ దానంబు సేయన్ మనం
బున రాకున్కి శ్రమంబె నీకు దుదకుం బ్రోగౌను; నిట్లెందరో
ధనికుల్ దాచిన పెన్నిధుల్ పరులచేతం జిక్కి భోగింపరే ?
తిను, వెచ్చింపుము, దానమిమ్ము ప్రమివన్ దీపాంకురంబుండగన్. 31

## పలితకేశము

ధనము గలవార లెందరో
మని చచ్చిరిగాని వారి మాటయు గలదే ?
జనహిత కార్యంబులకై
తను ధనము లొసంగ గీర్తి దనరదె చిరమై ? 32

గడియారంబున టక్కుటక్కుమని వేగం గొట్టు శబ్దంబు వెం
బడి నాయుష్యము ఒక్కటొక్కటిగ సోపానంబులన్ డిగ్గు; నె
త్తురులన్ శక్తియు సన్నగిల్లె; జరసందేశంబు రానున్న దో
బడుగా, యాపదినాళ్ళకైన విడకే పాథేయ మార్జింపుమా. 33

పరులను మోసగొట్టి పలుపాపముల న్నిరతం బొనర్చి ని
ష్కరుణముగా దరిద్రులను గారియవెట్టి ధనంబు గూర్చి కొ
ప్పెరలకు నింపి చూచుకొని ప్రీతి వహింతువు; వారసుల్ నిరం
తరమును నీదుచావునకు దైవము వేడుదురోయి లుబ్ధుడా. 34

అర్జనంబున నెప్పుడు వ్యయంబె లెక్క
వ్యయమునకు మంచి వినియోగమౌట లెక్క;
అది యిదియు లేని యధమ నిరర్థ జీవి
పుట్టి చచ్చిన లాభంబు కట్టిరాదు. 35

# పలితకేశము

ఎందరు నెందరో మహితు లియిల బుట్టియు గిట్టినారు; వా
రందర పాదలాంఛనము లంకితమయ్యె యుగఃపథంబునన్;
ఇంచుకన్ సగంబు గతియించెను జీవిత; మే మనస్ప్రకే
మ్రింపిన నేమి నిల్చును ధరం జెనుపోనెడు మాడి చప్పనన్ ? 36

ధనము గడింపవచ్చు, సతతంబు సుఖింపగవచ్చు, జీవితం
బున నివియే సమస్త మనబోలునె? యిందుల గాటిగటు వా
టిన గొరయౌన దెయ్యది? గడించినజ్ఞానమె యాత్మ నంటి ప
చ్చును బరలోకమందయిన; జొప్పరిపై చరియింప మేలగున్. 37

దైనికావశ్యకంబులు తక్కువైన
జ్ఞానసంపాదనమునకు గాల మబ్బు;
పూరిగుడిసెల నివసించి పూర్వఋషులు
ఉపనిషచ్ఛాస్త్రముల బ్రజ కొసగలేద ? 38

ఆసలు పెంచి తీర్చుకొన నర్థము నెట్టులొ సంగ్రహించు నా
యాసముతోడ జీవితము నంతయు బుత్తువు; నీదుచర్య వ్య
త్యాసము లేని యంత్రగతి యౌ; జననంబును బెండ్లి బిడ్డలున్
గ్రాసనివాస; మంత దుదగాంచు జరిత్రము మృత్యుపూర్తిగన్ 39

## పలితకేశము

దినమున కొక్కపూటయిన దిండికి లేక దరిద్రపూసపుల్
పనరుచు నుండ నీధనము వాసనకట్టు బిగించికట్టి యే
యనుభవ మొందబోయెదవొ? యందర బిపల వేడియూర్పులం
పనరు దవాగ్ని నీబ్రతుకు దగ్ధముసేయదె యొక్కపెట్టునన్? 40

తేటనీరము పైదెలె, డిగెను జిడ్డు
అడుగునకు; నెల్లకాలంబు నటుల నుండ ;
దించుమించుల సరిదిద్ద నెప్పుడైన
విశ్వవిప్లవశక్తి యావిర్భవించు. 41

కాల మెన్నడు నొకరీతి గడపబోదు
తారుమారులు సహజంబు ధరణియందు ;
అతిగ మెక్కి యజీర్తిని అడలువాని
మెసవుటకు లేనివా డాక్రమింపవచ్చు. 42

ఎందరెందరో నరపాలు లేలినారు
మినరు ఫారోహు కనుబొమ్మ మెరయుచుంటి;
సీజరుని బట్టతల నొంటి జేరియుంటి
కైసరులదాయిమీసాల గడలుకొంటి. 43

## పలితకేశము

నాటినుండియు నేటికి నాకు దెలియ
నట్టి రాజులు రాజ్యంబు లపని లేవు;
అరసినంతకు నొక్కసత్యంబు గలదు
జనుల బాధించు నృపుని రాజ్యంబు గూలు. 114

ఈ ప్రబోధమెల్ల నితరులకే యని
యనకు, నీకు సైత మన్వయించు;
బరహితోపదేశ పాండిత్య మని యెంతు
వేని, దాన నాకు హాని లేదు. 115

పది పదునాల్గు వర్షముల పాటు కలంబును ముట్టనే సుఖా
స్పదమును నిర్విచారమగు వ్యర్థపు సోమరి జీవితంబు నీ
కొదవెను; నేనుగూడ మొనయొత్తితి; నిద్దుర మేలుకొమ్ము; నీ
యెద జిగిరించు భావముల కిమ్ము మనోహరరూపసంపదల్. 116

ఒకవేళం బదునైదువత్సరములన్ యుష్మద్ఝరీపూర మిం
కక యున్నం బదివేలు; గాలిజయులం గంపించు దీపంబుగా
వొకొ జీవాత్మ; యవజ్ఞచేసి యవకాశోత్సాహముల్ కాలహిం
సకు గాల్ చాపితి, వింకనైన గవితాసాంగత్యముం గోరుమా. 117

## పలితకేశము

పలిత కేశము నన్నిట్లు పలుకరించి
మరణభయము ప్రదర్శించి మందలింప
నిట్టులంటిని నవ్వుచు: "ఎంతపెద్ద
వేత్త వైతివె సీబూది పెన్నగలయ! 48

ఒనన మొందిన ప్రాణికి జావు నిజము;
చావు చావని భయ పెట్టలేవు నన్ను;
జావకే యుండినన్ శిలాశాశ్వతముగ
దాతముత్తాత లెచ్చట దాగినారు? 49

మరణము భౌతికంబయిన మారుపు; దానికి జింతయేల? యీ
ర్వర ధనధాన్యభోగవిసరంబుల బంధుల నాలుబిడ్డలం
దిరముగ వీడలేని యెపతీపులు వాంఛలు నందడింప ని
ర్భరమయితోచు మృత్యుపరిరంభము నత్యమెరుంగకుండుటన్. 50

ఐన ననురాగసూత్రాల నలవికొలది
లాగినను దెగ్నిపోవక సాగుచుండు;
కణ్వునంతటివానికి గరగె మనసు
అత్తవారింటికి గుమారి నంపునపుడు. 51

## ప లి త కే శ ము

బాతు జలమున నీదియు బక్షములకు
అంబుబిందువు లెపుడైన నంటుకొనవు;
కార్యమధ్యస్థుడయ్యు నిష్కామకర్ము
డంటి యంటక యాశల నతకరించు. 52

నేను మరణింప బోనోయి, మేను మడియు;
అదియు మొదలంట నాశనమగుట లేదు;
మొదటి యణుయోగమున మార్పులొదవె;
నంతె; కాటిబూడిద సత్తువ గరిక పొదలు. 53

హిమశిలను నీరు నావిరి యిమిడియుండు
పగిది స్థూలాంగమున సూక్ష్మభాగ మమరు;
దృశ్యమూర్తి నశింప నదృశ్యమూర్తి
మిగిలియుండును, మనసుతో దగిలియుండు. 54

నాట్యరంగమునం దెర నడుమ దింపి
మరల నెత్తెడునందాక తెరపిరుంద
జరుగు కార్యములన్ని ప్రేక్షకులకంట
బడనియటు మరణోత్తరాశ్వాస మలరు. 55

# పలితకేశము

'మరణభయంబు నాకు నణుమాత్రము లేదు; మదీయజీవనం
భరణభయంబె యెక్కు' డని పల్కెనుఉమ్రఖయాము, దానిలో
బరమయథార్థభావము ప్రపంచితమయ్యె; జగత్సమస్యలం
బురి విడదీయలేక కనుమూసిన నయ్యవి వీడిపోవునే? 56

ఇష్ట ముండియొ లేకయో యే నియతినొ
చెదరిపడినార మైహికజీవితమున;
పరిసరంబుల కలవాటుపడకయున్న
నిల జనించినఫలము గ్రహింపగలమె? 57

అన్నమో రామచంద్ర యం చడలువాడు
పరసుఖంబుల జూప సంబరముపడునె?
ప్రాణికోటుల కన్న మావశ్యకంబు;
గాలిపిడికెళ్ల నెవ్వరి కడుపు నిండు? 58

పుట్టిపెరిగితి; మొకకొంత పోయె వయసు;
ఈప్రపంచానుభూతి యంతింతొ కలిగె;
ఎన్నొ మాతాతముత్తాత లెరుగనట్టి
యంత్ర తంత్రము లక్కరయయ్యె నేడు. 59

ఫోను రేడియో కారు విమానములును
దేశకాలదూరత్వ సంస్థితుల మార్చె;
మున్ను కూపస్థమండూకములుగ నున్న
యఖిలజాతుల భావైక్య మవతరించె.

రామరావణరణము, కౌరవుల పోరు
సర్వనాశకముగ నేడు జరుగుచున్న
రూసుజర్మనుసమర నిర్యాసనమున
గడలిలో నీటిబుడగలకరణి దోచు. 61

ఇట్టి వెన్నెన్నొ యనుభూతు లిలనుగలిగె;
బాల్యముననుండి యలవాటుపడుచువచ్చె;
జచ్చి పరలోకమున గ్రొత్త జన్మమెత్త
నలవరచుకొందు నచటిమర్యాద లిట్టులె. 62

పరము సత్యంబె యైనను బరముకొరకు
నిహసుఖంబుల బలియీయ నేల చెపుము
పరము లేదని ఖయ్యాము పల్కెగాని
అట్టి యవకాశ మే నెన్న డవగణింప. 63

# పలితకేశము

ఇహపరంబులరెంట గ్రహింపగలుగు
సఖిలసుఖదుఃఖముల నేను అనుభవించి
పుట్టెదను మళ్లి మా మాతృభూమియైన
భారతాఖండమండలభవ్యసీమ. 64

జాతి ముకుళితభావవిషప్రయుక్తి
స్వార్థపరతంత్రమైయున్న సమయమందు
మరణభీతి దుర్వారమై మల్లడించు;
గర్హ్యదాస్యంబు స్వాభావికముగ దోచు. 65

ఉపనిషత్సారసందేశ ముజ్జ్వలాసి
కఠినధారాతళత్తళల్ గలసి పారు
సమ్మృతగీతస్రపంతి రూపందుకొన్న
అప్యభువి మృత్యుభీతి నింద్యంబుగాదె? 66

ఇప్పుడప్పుడె ముక్తి నే నిచ్చగింప;
ఎన్నికోటుల యేండ్లొ యీపృథివి ప్రబలు;
వేయిమార్లైన జన్మింప వీలుపడిన
ప్రతితడవ గోరుకొందు నీ పావనోర్వి. 67

## ప లి త కే శ ము

అన్నికోట్ల ప్రజలు బద్ధులై శ్రమింప
నేనుమాత్రము ముక్తి వాంఛింపనేమి?
అవయవంబులు కొన్ని దేహంబునందు
బ్రమద మొందునె మిగతవి బాధపడగ?" 68

అని పలుకగ విని వెంట్రుక
నను బరిహాసంబుచేసి నవ్వుచు ననియెం:
"గనుగొంటి నీదుకోర్కెలు;
మనుజుడు స్వర్గంబుగోర మానునటోయీ? 69

యజ్ఞములు చేసి కర్మల నాచరించి
సురపతిని దృప్తిపరచిన సోమయాజు
లెల్ల రంభాదిభోగినీపల్లవాధ
రా పరీరంభ కాంక్షులై రారె దివికి? 70

తరళకిసాలకల్పకలతాసుమజాలము రాల్చు పుప్పొడిం
బొరలుచు స్వర్ణదీజలజపుంజములం జెరలాడి శీతశీ
కర పరిసేచనంబుగొని కమ్మనితెమ్మెర వేగుప్రొద్దులన్
నెరసెడు నాకలోకరమణీరజనీశ్రమతాపహారియై. 71

దురమున గోపుతూపు వెనుదూయగ బాయగ లాగి దాని గ్ర
మ్మర సరి నేయు బాహుబలమాన్యులుశూరులుయుద్ధభూములన్
మరణము నొంది నిర్జరవిమానములన్ దివి జేరి జారిణీ
పురమున వాడవాడలను బొంచుదు రచ్చరపూవుబోండ్లకై. 72

గాంగసైకతముల దెరగంటిచెలులు
కాముకులగూడి చరియింతు రకమలషండ
మండితోత్తుంగవీచిప్రకాండపటలి
శిశిరశీకరమౌక్తికశ్రీలు చల్ల. 73

అమరవనాంబుజాకరమునందు దిగంబరలైన యప్సరో
రమణులు క్రీడసల్పుచు దరంగములం జెరలాడగన్ సమీ
పమున మెలంగు కాంతు లగపట్టి సరోరుహిణీకదంబ మ
ధ్యమున మొరంగి పుష్పనిచయంబుల గన్గొనరా రభిన్నతన్. 74

పొలుపుగ బూలు పాలపలవుల్ చిలికించుచు రెమ్మరెమ్మలన్
బలుకొన, సల్లిబిల్లిగొని వల్లిక లల్లులు వెట్టుటన్ రహః
స్థలు లయి, ప్రేయసీప్రణయదాస్యము గోరెడి వల్లభాళికిన్
నెలవులుగా సరోవరమునీటి రహించు లతాంతరీపముల్. 75

# పలితకేశము

అంచబోటి సరస్తీరమందు మంద
మందగమనంబునం బోవు చంద మరసి
యచ్చరనెలంత నడకయొయ్యార మరసి
యించు మించుల దేల్పలే కేగు బ్రియుడు. ౭౬

చల్లవెన్నెల గాయు ప్రశాంతనిశల
బూలతేపలపై నెక్కి పూవుబోండ్లు
కాముకులు తెడ్లువేయ గంగాస్రవంతి
జలవిహార మొనర్తురు చెలువ మొలయ. ౭౭

ఉంగరాల్దిరిగి లే బంగారునొసలిపై
    దొరలు కస్తూరి ముంగురుల తీరు,
కాటుకచీకటిం గలసి రెట్టించిన
    కడగంటి చూపుల కమ్మదనము,
పరికిణీ వలిపెంబుపయి వెల్లివిరిసెడు
    నొడలిచాయల దేటపడిన సొబగు,
చిగురాకువాతెర యెగబోయు కెంజాయ
    చెక్కుల బ్రతిఫలించిన పసందు. ౭౮

## పలితకేశము

చెలువ మొందొందు వలరాచములికిగాఁగ
గాముకణిగెసతో రంభ కదలినపుడు
ఒక్కక్షణమైన బరికించియుందువేని
సురల భువి బుట్టు మాటలుమానుకొనవె. 79

హరిణి, మనోహరి, చంచల
హరిణప్లుతనేత్రి, నందనారామమునం
దిరుగుచు బూవులుగోయుచు
మురియుచు హరియించు మునిముచ్చులమనసుల్. ౮౦

పలుకుపలుకున దేనియ లొలుకుచుండ
నవ్వునవ్వున మాధురి నివ్వటిల్ల
జూపుచూపున వలరాజు తూపులేయ
గులుకులాడి తిలోత్తమ వలపు జూపు. ౮౧

జరిపుతాణీపైట జలతారుపావడ
కుచ్చెళ్లు గుబురులై గునిసియాడ,
చెండంటి పరుగెత్తు చిడిముడిపాటులో
నొరపయ్యెద కాపుదారి నడల,

## ప లి త కే శ ము

తలవెంట్రుకలు వీడి యెలవేటి తెరలట్లు
తరగలై గాలిలో దెరలుచుండ,
చిరుచెమ్మటలు ముత్తెసరులఁబోలిక చెక్కు
టద్దంబులకు వింత యంద మొసగ, 82

కాముకుల గుండెనే చెండుగా నొనర్చి
యాడుచున్నయా యూర్వశి యనునిమేష
ఛిన్నభిన్నాంగభంగుల జెన్నుచూపి
కొల్లగొను నెట్టిసంయమియుల్లమైన. 83

శాపానుగ్రహశక్తుని
కోపోద్దీపిత మనస్కు ఘోరసమాధి
వ్యాపృతు విశ్వామిత్రుని
లోపరుచుకొనెఁ క్షణంబులో మేనకయున్. 84

ఎర్రగుట్టిన గాలంబు నేసి చేప
లాగు రీతి ఘృతాచి విలాసవీచి
ఎర్రవాతెరతరితీపుటెరను జూపి
మునువుకాండ్ర యెడందల నపహరించు. 85

గోచి బిగియించి తపసులై కూరుచుండి
పవన పర్ణాంబు భక్షులై బ్రతుకు మునులె
యచ్చరల మోహవాగురలందు జిక్కి
కలుచవారక నిర్ముక్తి గాంచినారె? 86

నీపస నెంత. నాకరమణీమణి యొక్కతె యోరచూపులం
జేవిరితో గపోలముల జిట్టకముల్ పచరించి నొక్కమో
హావిలమై హృదంతరము, అంగము కాకరకాయచందమై
చేప బొలంగి వే పయటచెంగును బట్టవె? రంగు చూపవే? 87

అమృతము పానముసేయుట
అమగులకున్ క్షుత్పిపాస లడగు నతంబుం
గమనీయభోగ మొదవును;
కుమిలి జరామరణబాధ గుందరు వారుణా. 88

అరు ఋతుదశ లేకమై యలరుచుండు;
రేలు కలనాళ్లు వెన్నెల పాలు చిలుకు;
దుఃఖ మన మందుకేనియు దొరకదచట;
అంతరము లేని ప్రణయసౌఖ్యంబు లొదవు". 89

అని యేమేమో పర్విం
పను గుటకలు మ్రింగుచున్న పండిన నెరకం
గనియుంటి: "నీవు యొసం
చిన యాజీవితము నాకు జీపరగాలిపెఁ. 90

ముక్తివాంఛింతుగాని యామొగముమొత్తు
అమరపురి జేతికర్త్రైన నంటు;
వలపు వస్తులు. కడుపుకొంచలము గన్న
చెనటి కవిగాడు దాని సృజించియుండు. 91

ఆ కవికి వివేకింప లోకానుభవము
లేక యుండు యథార్థమౌ; లేకయున్న
ఏకతానంబునఁ పూర్వులేవి లేని
యట్టి కొరగానిబ్రతుకున కాసపడునె? 92

దుఃఖముండక సౌఖ్యంబు దోచుటెట్లు?
కాంతి యెటు లూహ్య మౌను చీకటులులేక?
తారతమ్యము కనుగొన వరమె మనకు
డుదకు సరిపోల్చ రెండువస్తువులు లేక? 93

## పలితకేశము

భూపతుల కోశములు కొల్లబోవ ధనము
గాంచి, మేకల జంపి యజ్ఞము లొనర్చి
నేయి త్రాపక పంటపాల్సేయు టెల్ల
దంతులంబెల పశుకల బంధుకొనసె? 94

యుద్ధమున జచ్చి వచ్చిన యోధు లచట
గత్తి డాలు తవాలుతో గంతుమెరసి
వెల్గు చెలువింట్లు ముట్టడవేయు, వృద్ధ
సోమయాజుల కవకాశ మేమి యుండు? 95

దానుజర్మనుదురమున గోసయాక
రెత్తుపోర్డారి యొక్కని నెరుగబోము;
అచట గోటానుకోట్లుగా సంతరించి
స్వర్గమునకు వచ్చెదరొ యుచ్చరలకొరకు? 96

నెలలకాలము రణభూమి నిలచి యుండి
ఆరుమోముసు గలసైన నరయనట్టి
మొరకసోల్దారిమూక నాముద్దుబోడు
లారుగురు ఎంత యెంతని యరసికొండ్రు? 97

అలతులపుప్పొడిం బొరలి యల్లన గమ్మని తావు లీనుచుఁ
మెలగెడు గాంగశీకరసమీరము వారి నిశాపరిశ్రమల్
పొలియ జరించు నంటి; విక బోటుల తాపము దీర్ప గాద్రవే
యు లయకరుండు రెక్కల నహర్నిశముం గడలింప రావలెఁ. ౯౮

ఖరములై తోచు నిట్టియుపద్రవముల
దెచ్చిపెట్టిన హిట్లరు దిట్టిపోసి
పడుక తప్పించుకొనెడు నుపాయములను
అరయుచుందురుపో వేల్పుటతివ లిపుడు. ౯౯

అమరపురీవిహారముల నచ్చటి తోటల నాటపాటలఁ
రమణుల యందచందముల రమ్యములౌ జలబాకరంబులఁ
విమల వియర్ఝురీ చలిత వీచుల, సైకతవీథులఁ మనో
జ్ఞముగ వచించినాడ; వవి కంటికి గ్రొత్తలె భూతలంబునఁ? ౧౦౦

పుడమిపయి సౌఖ్యములులేని పూర్వకాల
మందు సృజియింపబడియె సురాలయంబు;
దాని నేటి ప్రపంచంబుతోన బోల్ప
వ్రాబడినరీతి గన్పట్టు బ్రభదొలంగి. ౧౦౧

నీవు నోరూరునట్లు వర్ణించినట్టి
వాసవపురీసుఖంబు మద్రాసుబీచి
యిసుకపరపుల బన్నుండ నెదదొరంగు
హాయికంటెను గమనీయమగునె చెప్పుమ. 102

కరము విశాలమై మెరుగు గారెడు తారుపథంబు కిరువలం
దరువులు, పూలుపూచిన లతావలయంబులు, తోటమాలి క
త్తెర మెదలించునేర్పుమెయి దీర్చిన పూవులచెట్ల రూపముల్
పరగును దర్శనీయముగ బ్రక్క విహారము సేయువారికిన్. 103

కురులను దువ్వి యల్లికల క్రొవ్వెదచుట్ట రచించి, పూవులం
దురిమి, మొగంబునన్ వలచు ధూళులనద్ది, హిమం బలంది, చం
దురతిలకంబు దిద్దికొని, తొంగలి రెప్పల యోర గాటుకం
జరిమి, కరాచిచీరలపసం దొలయం జరియింత్రుకోమలుల్. 104

హరువుగ బాహుమూలముల కప్పల నంతమునొందు ‘బ్లౌజు’ త
త్పరిసర మోహనప్రకృతి దాపక చూప, నిగారిపైటచెం
గరవిరి చన్నుచట్ట సగమందున నెక్కొని పిన్ను బాధతో
దెరలకయుండ బూటునడ తీరున పత్తురు కొంద రంగనల్. 105

జలజకర్ణిక జుట్టు కింజల్కము లటు
వెనుక జుంజురువెంట్రుకల్ గునిసియాడ
ఆడుమగతనంబులు నేకమైన పడుచు
వెడలు దెరచాపలెత్తిన పడవపోలె. 101

భాంకృతులతోడ మోటార్లు వచ్చి నిలువ
సొగసుసరకులు బీచికి దిగుమతియగు;
ముస్లిముగని రక్షణము వెక్కసముగొలుప
ఓర విడివడి మున్నేగు యువతి యొకతె. 107

అరుణుడు పశ్చిమాద్రిశిఖరాంతరుడైన రథాంగయుగ్మముల్
విరహమునం బరస్పరము వేచుచు రోసెడిభంగి బ్రేయసుల్
తిరుగుచు గుర్తుపట్టుల బడేపదిచూచి నెలంత రాని జా
డెరుగక దారిబోవు పెరయింతుల జూతురు కాంతకోసమై. 108

మగల వరియించు చదువరి మగువలకును
యువతులం గోరు విద్యార్థి యువకులకును
వలపు పందేరములు పంచు తలపుతోడ
రతిమగండు వసించు మద్రాసుబీచి. 109

అల రెల్ల ప్రాయపుంగొమెరె లాప్తుల పొంతల బీచి కాఫిహో
టలి నుపవిష్టులై తినుబెడంగుతెరం గరకంట జూచి క
ప్పుల నెలకొన్న కాఫి యల పూవులవిల్తుని మావిగుత్తులన్
జలజల నుట్టు తేనియల జాలని క్రోలుదు రచ్చటన్ యువల్ ॥౧౦

మినమినలాడు వర్ణముల మీనము లా జలజంతుశాల గూ
ర్చిన షెనుగాజుకొప్పెరల జెన్నొలయం జరియింప, దమ్ముగాం
చ నచటి కేగినట్టి యెలనాగల చీరల వర్ణసంపదల్
తనువుల బింబితం బయి ప్రతారణచేసె ననంగ సొంపిలున్. ॥౧౧

కాలేజివిటుపల గాంచుటే తడవుగా
 నలపోక నరుగు విద్యార్థితుటుము,
పగలెల్ల లేఖినీ బాంధవ్యమున బుచ్చి
 యూరడవచ్చు నుద్యోగిజనము;
ఆలుబిడ్డలకు దోడయి రేడియో విన
 నల్లన నేగు గృహస్థుగణము,
పట్నంబు వచ్చిన పనులెల్ల ముగిసిన
 హాయిగా దిరుగు పరాయిజనము,

కడలితరగల తుంపురుతడిని మోచి
మేన జందన మలదు తెమ్మెరలు వీవ
చిగురుటిసుకల బన్నుండి సొగియుచుండ
అమరలోకసుఖంబేల యాసపడగ? 112

గాలికిం జెలరేగి లోలమై కెరటాలు
తుంపురుముత్యాలు తొలకరింప,
దెరచాప లెత్తిన తేపలు రాయంచ
లంతలై యలల ద్రుళ్లింతలాడ,
సంజకెంజాయలు జంపుగా బింబించి
రుధిరాబ్ధి గగనసారూప్య మంద,
దెలుపారి తూర్పు మిన్నులువడ్డపట్టున
శీతాంశుబింబంబు జేవురింప, 113

పగటి వరుసన మెలమెల్ల బిగివి నడల
జల్లవెన్నెల లెల్లెడ నల్లుకొనగ
నవ్యరసవాద పరివర్తనంబు గాంచి
బీచి మోహనదృశ్యమై గోచరించు. 114

చంద్రబింబమునుండి యీ జలధితటము
వరకు వజ్రాలరస్తాను పరిచి రనగ
భంగముల బండువెన్నెల ప్రతిఫలింప
గడలి కొక క్రొత్తయందంబు గడలుకొనును. 115

తారకల తోరణంబులు బారుదీర్చి
చారి కిరువంకలం గట్టినారొ యనగ,
జారువిద్యుత్ప్రదీపకాస్తంభరాజి
కృత్రిమసుధాంశుకాంతి రహింపజేయు. 116

ధరపయి సూత్న నాగరకతావిభవంబులు యంత్రసృష్టి య
ద్భుతముగ వృద్ధిచెంద, నెటుపుట్టెనొ యట్టులె స్వర్గ ముండెఁ; స
త్వరముగ దానిలో నభినవంబగు మార్పులు సేయకున్న నా
క రమ ధరామనోహరతకంటె గృశించు గ్రమక్రమంబుగన్." 117

"ఇన్ని డంబాలు గొట్టితి వింతసేపు
జర స్మృతిని బాపు నమృతసరంపుటూట
కల్పతరువు చింతామణి గలదె మీకు?"
అనుచు వెంట్రుక ప్రశ్నింప, నంటి నేను. 118

"అప్పుడొక్క విశ్వామిత్రు డవనియందు
సృష్టికిం బ్రతిసృష్టిరచించెనంట ;
నేడు జరుగు గృత్రిమసృష్టి నేర్పుమెయిని
సకలదేశ రసాయనశాలలందు. 119

శాస్త్రవిజ్ఞాన మద్భుతసరణి బెరుగ
మానవు డొనర్పలేని దేదేని గలదె ?
మచ్చుక్రోవుల జీవాణుమార్గ మరసి
చేతనము - గొన్ని యేండ్ల సృజింపగలరు. 120

స్వర్గము నధఃకరించి మీచోటినేల
జుక్కలంటగ బైకెత్త జోద్యమయ్యె ;
నాక మొల్లవయేని యానరకమొకటె
మిగిలియుండు ; నదే నీకు తగినతావు. 121

జ్ఞప్తి చేసితి వన్నల్లె సమయమునకు ,
వాంఛ గలదోసి నాకును ; స్వర్గమందు
నిష్క్రియాజీవితముకంటె నిరయమందు
సత్యమార్గ ప్రచార సంసక్తి మేలు. 122

ఇచటి పల్లేరుగాయలు, నిచటినూనె
యిచటి మొసళులు పాములు వృశ్చికములు
ఎప్పు డెట్టుల నచ్చోటి కేగె నన్ను
విషయపరిశీలనము చేయు వేడ్కగలదు. 123

అదియే కాదు, మహాకఠోరతరశిక్షాభీలదౌష్ట్యంబునం
జుదుమై కష్టములొందు నానరకవాసుల్ స్వప్నబంధంబులం
జిదుమన్ లేక నిరాశులై యమభటోత్సేకంబు సైరించి యా
పదలం బొందెదువార లాత్మబలవిస్ఫారంబు నిద్రించుటన్. 124

మధ్యయుగ నిరంకుశచోర మండలేశ
వికృత శిక్షాస్మృతిప్రతిబింబ మైన
నరక రాజ్యంబు, ప్రజలు విజ్ఞానకాంతి
బడయువరకు బునాదులు సడలకుండు 125

ఆత్మకృత మోహనంబున నంధు లగుచు
దరళ పౌరాణికాశయతంతుజాల
జాలమున జిక్కి వెలువడు వీలులేక
పసిడికాయను బురుగట్లు పట్టువడిరి. 126

నరకమున కేగి యచటి మానవుల కొక్క
చిరరహస్యంబు జెప్పిన, జిదుగుబొదల
నిప్పు పడి నాలుకలు చాపి నెరయునట్లు
ఒక్క క్షణమున విప్లవం బుద్భవించు. 127

కాలుడను భీకరాకృతి కల్పితంబు;
భావమాత్రుక, మదిగాలిప్రతిమసుమ్ము;
పిట్టల నదల్ప జేలలో బెట్టినట్టి
గడ్డిబొమ్మకు మనుజులు కలగనేల? 128

కాల మనుమాట కొకరూపు కట్టిపెట్టె
వైదిక కవీశు; డది యెంతొ పండయయ్యె;
మరి పురాణయుగంబున మల్ల డించి
సర్వభీకరు డయ్యె బ్రసన్న ముఖుడు." 129

అని విని వెంట్రుక యిట్లనె:
"విన నయ్యెను వెఱ్ఱిమొఱ్ఱి వేదాంతంబుల్;
మనుజులకు నిటు వచించిన
మనమున విప్లవము రాక మానునె చెపుమా. 130

స్వర్గనరకంబు లొక్కట బాధుపడిన
దానధర్మము సేయు నుత్సాహ ముడుగు ;
బ్రజలలో బాపభీతి యభావమైన
న్యాయసత్యంబులకు నాశ్రయంబు తొలగు. 131

అడిగొ బూచి నిద్రింపరో రన్న యనుచు
జనని చిచ్చిగొట్టిన బిడ్డ కనుమొగుడ్చు ;
ఊగ దెలిసి పెద్ద పెరుగ వా డుదరిపడునె ?
చంటిపాపల వెరపులు శాశ్వతములె ? 132

ప్రజల భయపెట్టి కపటతంత్రములచేత
బసుల దోలెడుపగిది నిర్బంధధర్మ
దాస్యమున ద్రోయుకంటె సత్యంబు తెలిపి
స్వేచ్ఛతో ధర్మమొనరింపజేయ మేలు." 133

నాపలుకులు విని వెంట్రుక
రాపాడ కనిష్టమైన రాజీపడియెన్;
"ఈ పెడదారుల నొరులకు
నీ పుణ్యము, తెలుపబోకు నిష్ఠుర మొదవున్." 134

అని వచించెదునంతలో నతివ వచ్చి
" అరరె! యిదియేమి యింకను బురుసుపెట్టి
గడ్డమును రుద్దుచున్నారు గంటయైన ;
దెల్లగాగిన వేన్నీళ్లు చల్లపడియె.

గొరుగుకొనవలయు విషయము
మరచితి ; రన్నట్లె మీకు మతిభ్రమియించున్ ;
విరమించి పగటికలలను
గొరుగుకొనుండయ్యా మీకు గోటినమస్సుల్."

బరబర జంకక గొంకక
పరివాపనముం బొనర్చి పదపద మంటిం ;
జిరునవ్వు నవ్వి యింతటి
త్వరయా యని యెత్తిపొడిచె దరుణియు నన్నున్.

[ భారతిలో ప్రకటితము 1942. ]

కను లటు లెత్తి నే గిటికికమ్ముల నందుల జూడ, దూప్పుకొం
డను నవమోహనాంబుద పటంబులపై లిఖియించికొన్న నూ
తనజలవర్ణచిత్రముల దర్శనశాల నమర్చి, చూడరం
డమచు రసజ్ఞులం బిలుచు నర్కుడు రమ్యపికాప్ఫటీ మిషన్.

కరుణాపాత్రుడ వీవు భాస్కరుడ, యొక్కండుర ప్పదీయార్ధ్ర క
ర్బూర వర్ణాంకిత చిత్రశిల్పముల సొంపున్ నిల్చి వీక్షింప; గం
బరమార్గంబున గ్రుంకు మెట్టపయికిన్ మార్పించు నీశాల; న
గ్గిరి నేయక్షుడొ యేవరూధినియొ కాంక్షించుం గళాస్పృష్టులన్.

అనుదినముం బ్రదోషసమయంబున బ్రొద్దున వేయిచేతులం
బనిగొని పర్ణవర్తికలు వ్యర్థముగా క్షణభిన్నరూప క
ల్పనల సలౌకికాకృతుల బంకజమిత్ర, యయూచితంబుగం
బొనరిచి నీ యపూర్వకళపోడిమి జుల్కనసేయ పాడియే ?

అడుగకమున్న లభ్యమగునద్ది యమూల్యమె యయ్యు దానినిం
బొడగనినన్ నిరాదరము పుట్టక తప్పదు; చిత్రశాల పె
న్నడిగొనునాళ్ల మూయుము; గనంబడు నక్కర, లేనివాడు; ని
మ్మడియగు బ్రేమయున్ విరహమధ్యమయేని స్వభావసిద్ధమై.

అని వచియింప నేను, రుచిరారుణమూర్తి పసిండి క్రాగుమూ
నసు బురణింప బేశల లనస్మృదుహాసముతోడ బల్కె నో
మనుజుడ, స్వార్థతత్పరుల మానస మెప్పుడు లాభకాంక్షతో
బెనగొను ; త్యాగజీవనము విస్మృతమయ్యె ధరాతలంబునన్.

మనుజున కింత గర్వ ! మొక మర్త్యుడ వీవు ; అనంతసృష్టి నీ
మసుగడ నీవు నెంత ? అణుమాత్రము బోల ; వమేయతారకా
గణాభరితాంబరంబున కఖండ జగత్తున నేను చక్రవ
ర్తిని ; గ్రహముల్ నిరంతర పరిభ్రమణంబున నన్ను గొల్చెడున్.

నేను లేకున్న భువన మంధీకృతంబు ;
చేతన ప్రపంచమునకు జేటుమూడు ;
చంద్రుడాది గ్రహంబులు సరణిదప్పు ;
ఇరుసువిరిగిన బండినా నొరగు జగతి.

ఈయనంతసృష్టికి మోద మెసగజేయ
వ్రాయుచున్నాడ నాలేఖ్యపటము లెపుడు ;
కౌతుకముగూర్చు నిష్కామకర్మ నాది ;
అట్టి నాకు నీ కనికర మవసరంబె ?

చీకటిరేయి గొండపయి జేరి యొకండ వగణ్యతారకా
నీకము వ్రేలు శాంతమగు నింగిని జూడుము, నిన్ను జూచుకొ
మ్మోకవి, నీ మహత్వ మటు నూహకు దట్టు ; ననంతరంబు గ
ర్వాకులచిత్తవృత్తి కిసుమంతయు గారణ ముండ దెన్నడుఙా.

నీటిపురువులు చేపలు నిఖిలజలచ
రంబులును జెట్టుచేమలు ప్రబలఖేచ
రములు మృగములు సృష్టియై ప్రాంతవడిన
పిదప మనుజుండు పొడసూపె బృథ్వియందు.

జలజహితుండు ఈగతి బ్రసంగవశంబున బల్కె గోపసం
జ్వలనము రేగి మానవయశంబె తృణీకృతమైనయట్లు లో
దలచి యిటంటి : నీకు నిది ధర్మమె మా నరజాతియున్నతిఙా
మలినపడంగ దూరెదవు : మానవు డాద్యుడు గాడె జీవులఙా.

తిరుపతికొండ నెక్కి పురిదిక్కున జూచిన గ్రింది గుళ్లు గో
పురములు బొమ్మరిండ్లటు లపూర్వనవాకృతి దోచు ; మింటిపై
నిరతము సంచరించుటను నీ కగపటు హిమాలయం బిలం
బరిచిన మల్లుదుప్పటముభంగి ; మనుష్యుల మాట చెప్పనా !

సత్యమౌ, గ్రహనక్షత్రచక్రమునకు
అక్షదండంబ వౌట యోయరుణకిరణ ;
అయిననుం గాలిచెండంత యగ్నిగోళ
మటుల గన్పింతు నీవు మాయక్షులకును.

కేతుగ్రస్తుడ వౌదువు ;
పాతరలాడెదవు మింట బరతంత్రుడవై ;
సీతున రుజుకుం జిక్కెదు ;
యాతాయాతశ్రమార్తి నడలెద వెపుడున్.

గురిగింజసామెతయ్యెను
నరసృష్టినిగూర్చి నీవు నాకు వచింపన్ ;
సరి ! శిల్పి వగుటకంటెను
చరితాధ్యాపకుడ వౌట చక్కగ నుండున్.

మనసున కజీర్తి హెచ్చిన దినమునందు
వెఱికలల చిత్రంబుల వేయు దౌర !
నీకును రవీంద్రసత్కవి నేర్పినాడొ ?
లేక నేర్చెనొ నీ చిత్రలేఖనంబు ?

నా పలుకులు విని సూర్యుడు
కోపము రానీక లోన గొందలపడకే,
పాపము ! కుర్రడు నజ్జుడు
తాపమునకు దగడటన్న తలపు దొలంకఁ.

ముసిముసినవ్వు దొంతరలు మోమున, గన్నుల నెల్లిదంబునుం
గసిమసగంగ నాపయి నొకానొక హేయపు జూపువైచి, మూ
సినుల సమస్తతత్వమును నీ వలనం గనుగొంటి నోయి, వె
క్కసమును బ్రీతి మెప్పు నుడికారము నింపుయు మూరు, గాలికిఁ.

క్షణమునకుమున్ను నా శిల్పకౌశలంబు
పొగడి మెచ్చితి వింతలో దెగడు టేల ?
మూఢభక్తులు సత్యంబు ముట్టలేరు
మనసు ఊసరవిల్లి మీ మానవులకు.

పన్ను వేపింపదలచెనో, కన్నుగుట్టి
వేడ్క చూడంగ వలచెనో వెఱ్రితరణి
కొరివికట్టెను ఎదలోన గులికినట్లు
హత్యసేయంగ బోయినయట్లు పలికె.

కట్టకడసృష్టి నరు డన్న గనలనేల ?
యింక నొక సత్యసూక్తిని ఎరుగుమోయి,
వేసవేలేండ్లక్రిందట విపినచరము
లైన కోతుల సంతతి యపని జనము.

శీతవాతోష్ణములు మార్పుచెందు కతన
ప్రకృతి సర్వంబు కాలానుబద్ధసరణి
మసము కనరానియటు రూపుమారుచుండు ;
అట్టి పరిణామఫలమె నీయట్టి నరుడు.

తలుపుగుబ్బకు మోచేయి తట్టుకొనగ
గనులు పచ్చగ బోయెడి కరణి దోప
పిడు గడిచినట్టు లీ మాట వినినయంత
గొంతసేపు నిశ్చేష్టత గూరుచుంటి.

మతి యొకయింత తెప్పిరిలి మాంద్యమువాయ, నెడంద యగ్నిప
ర్వతశిఖరంబునా బొగలువారుచు మంటలుగ్రక్క, సూర్యుడున్
వెత యిసుమంతలేక నను వింతగ జూచి హసింప, జెట్టురోల్
స్రుతిశిఖిపైన జారినటు రోషము తాపము మల్లడింపగన్.

ఇను డనియును ఘనుడనియును
దినమణి యని సర్వసాక్షి దేవుండని నా
మనమున దలపక మానవ
ఘనతకా నిలబెట్ట బలుకగడగితి నిటులకా.

గౌరవ మిచ్చి పుచ్చుకొనగావలెగాని యదెంత మీకు మా
వారు ఋషిస్థులైన నొకపాటి ప్రియంబును జూప కిట్టి స్యా
త్కారము లాడి మాయశము గార్కొనజేయుదె? తిన్నయింటి కం
గారముగొల్పు నీచుడవు; గాముల రే డెటు లైతొ వింతయౌ.

నీకుశలంబు పెంపొందవ నిత్యము సంజ ద్వివర్ణపూరుషుల్
ప్రాకటభక్తి మ్రొక్కెదరు; భవ్యుడ వంచును విష్ణువంచు న
త్యాకృతి వంచు వేదఋషు లంచితరీతి నుతించుటెల్ల ని
న్నాకమలాప్త! దాని కివి యౌనె కృతజ్ఞతచూపు మార్గముల్,

బురదంబడ్డ చిరత్నరత్నమునకుం బోబోదు మూల్యంబు; ని
ష్కరుణావృత్తిసమస్తమానవమహాసంఘంబు దూషించినం
దరుగంబోదు తదీయగౌరవము; నీదౌష్ట్యంబు లోకంబునన్
స్థిరమౌకంటె మరేమి లాభములు సిద్ధించున్ మృషావాక్సుధీ?

నిన్నును నన్నును లోకము
లన్నియు సృజియించినట్టి యంబుజనాభుం
డిన్నరరూపము నొందిన
నన్నయె నీ కెరుకపడని సంగతి దోచున్.

ధర్మ మడుగంటి దుర్నీతి దౌష్ట్య మొకట
గలసి లోకంబు పాపపంకిలము గాగ
ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
మానవాకృతి గైకొను మాట వినవె?

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజుని సృష్టిచేసె నాదిమదేవుం
డని యెంతు; బ్రాణికోటుల
మనుజుడు మేదోవిశేషమాన్యుడు గాడే?

బుద్ధుడును క్రీస్తు మహమదు మొదలుగాగ
నెంద రాచార్యులో జన్మమంది రిలను
అట్టి మహనీయు లందరు నధమమైన
కోతిసంతతి యని చెప్ప గొంకు లేదె?

మునుపటినుండి మానవసమూహము గాంచిన యున్నతస్థితుల్
పొనరిచినట్టి కార్యము లపూర్వమనోబలసిద్ధులుం, జీవం
తనమగు దేశనాగరికతల్ బహుశాస్త్రసమార్జనంబు జె
ప్పిన బదియేండ్లు పట్టు; బృథివిం గల దంతయు జెప్ప సాధ్యమే ?

వీనికి మూలకారకులు విశ్రుతబుద్ధివివేకపూర్ణవి
ద్యాసిలయుల్ సమర్థులు సువారగుణాఢ్యులు పూజ్యులైన మా
మానవులేగదా, తెలివిమాలి వచించితి వింతసేపు నో
భానుడ, చాలుచాలు, నిక బల్కకు మేల వృథాప్రయాసముల్?

అన విని భాస్కరుండు మదియందు గలంగక నిండుకుండనా
దొనకక యెత్తిపోటులకు దుంచుడు కొందక కన్నబిడ్డ వా
కొను పలుకుల్ సహించు జనకుండటు మన్ననచేసి పల్కె నో
మనుజకుమార, సంక్షుభితమానస మారయలేమ సత్యమున్.

అన, సూర్యుని శాంతంబున
కును నా మిడిమిట్టి పాటుకును లో సిగ్గుం
గొని వెరగుచెంది శాంతిలి
వినయము యత్నమున గాంచి వింటిని చుదకున్.

తాతకు దగ్గులు నేర్పెడు
రీతిగ భూలోకచరిత్ర ప్రేలితివరరే!
మీ తాతాతంద్రుల క
జ్ఞాతము లౌ విషయముల ప్రసక్తియొసర్తున్.

ధరణి ముప్పదివేల వత్సరములపుడు
వదలె మనుజు డాటవికజీవనము మొదల;
నాటినుండియు నేటికి నాగరికత
లెన్ని, రాజ్యంబు లెన్ని మోసెత్తి నమసె!

అదియె యొక గొప్పగా జెప్పనేలనీవు
బిందు వంతౌను విశ్వజీవితపయోధి;
వృత్తమును నాదు పుట్టుపూర్వోత్తరముల
వయసు విన్న నీ వాశ్చర్యపడుదు వేమొ.

కూపస్థంబగు మండుకంబునకు దిక్కూలంకషాంభోధివే
లాపర్యంత జలావకాశమును దెల్పన్ దుర్లభం బౌను; న
ట్లాపద్మ ప్రభవాండసంచరణ నిత్యానిత్య యాదృచ్ఛిక
వ్యాపారంబు లెరుంగనీకు దరమే పల్మారు బోధించినన్?

అరయన్ నీకు స్వదేశ, మంత బరదేశానీక, మాపైని సా
గరవేలావలయాకృతోర్విని గనంగావచ్చు; నాదృష్టి దు
స్తరవేధోండకటాహమంతటను నంసర్పించు; నట్లౌట ని
ద్దరకున్ దృష్టుల జీవితంబుల విభేదంబుల్ నిరంతంబులౌ.

నావయ సెంతో తెలియునె?
నా విని, తల యడ్డమూప, నవ్వెను రవియున్
మీవయసు దెల్పి యవ్వల
జీవితముంగూడ నాకు జెప్పుడ యనినన్.

చెప్ప దేలికయయ్యె నీచిత్రగాథ
విన్నవారలు నమ్ముట యున్న వింత;
కాని, సర్వంబు జరిగిన కథయె దప్ప
అవగింజంత యత్యుక్తియైన లేదు.

ఎపుడు పుట్టితివో గాని యెరుగజాల
మూడువందలకోటుల యేడులపుడు
ఊగదెలిసె నన్ను జ్ఞాపక మున్న; దింత
బ్రతుకవచ్చు ద్విశతకోటివత్సరములు.

మున్ను నీ వంత పొగడిన భూతధాత్రి
పుట్టినాకన్నులెదుటనే పూర్వమందు;
ఎవతెయో యను సందేహ మేల నీకు?
కండలో గండ నా సయుగారిపుత్రి;

సుడిగాలి యెక్క పెట్టున
పడినన్నొక యన్యలోకవాసుల నడుమం
బడ రువ్వినట్టులయి నా
యొడలెల్లను గంపమొంది యూప్పుచునుంటిన్

తెరగన్నులు తెరనోరును
విరవిర తడియాను నాల్క వెరగుమనంబై,
వెరపుగొని పూర్వధైర్యము
తరుగన్ వినయంబులోన దండడిగొనగన్.

జలజాతాప్తుని భక్తినమ్రమగు వీక్షామాల సేవించి యం
జలిబద్ధుండనుగా వచించితిని: ఓ స్వామీ, జగత్సాక్షి, చం
చలచిత్తంబున బ్రేలుచుండిన ననున్ సంభ్రాంతు మన్నించి నా
కలుషంబున్ హరియింపుమంచుగరుణంగాంక్షించి ప్రార్థించితిన్.

అజ్ఞానతిమిరనష్ట
ప్రజ్ఞుడవై యల దివాంధభావంబున మీ
విజ్ఞానరోచిరుదయ మ
వజ్ఞత నరికట్టి హాస్యపాత్రుడ నైతిన్.

అని నే నీవిధి విన్నవింప గరుణాహాసంబు నెమ్మోమునం
దొనకన్, నీ వెపుడైన నామతము పొందుం బొడియుంగందు వం
చనుకొందుం, దడవేల, నాచరిత నెయ్యంబార వర్ణించెదన్
వినవోయీ, యని చెప్పసాగె హృదయావిర్భూత చిత్రంబుగన్.

జనకజనయిత్రి భావముల్ సమత గలసి
యర్ధనారీశ్వరం బైన యాదిశక్తి
ప్రకృతి పురుషసమ్మేళన భవ్యమూర్తి
విశ్వజనని వర్ధిల్లు దుర్వీక్ష్యకాంతి.

ఆ మహామాత యగ్నిగోళాండములను
పెట్టె, నం దొక్కటొకటియు బ్రిదిలి భాను
బింబములు పుట్టి యాకాశవీధి కెగసెః
అనుజు లందరలో నేన యల్పతనుడ.

అన్నల నొక్కడొక్కడు మహాప్భుతశక్తిసమున్నతాత్ముడై
మిన్నున సర్వసంపదల మీరుచు రాజ్యములేల, నీవు ఈ
తెన్నున బొల్లుగింజవయి దేనికి నెక్కకయుండ గాంచి నా
కన్నులు కాయగాచె గొడుకాయని తల్లి నడంచు మాటికిన్.

అది యటులుండ, నాయొడలియందు వికారపు నల్లమచ్చలుం
బొదలిన జూచి "యమ్మకడుపుం జెడబుట్టినవాడవంచు" న
న్నదవదపెట్టి కాలొడిసి యంతనె గిర్రని త్రిప్పిత్రిప్పియుం
జదలున బైకిబో విసరె జండసమీరము రేగి చుట్టగన్.

ఆదుర్వారమహోగ్రదిక్ప్రళయవాతాలోల కాదంబినీ
ప్రాదుర్భూత తమఃపరంపర దిశాభాగంబులంగప్పె; ను
ల్కాదండంబులు భాణవేగమున రాలంజొచ్చె; నక్షత్ర ధూ
ళీ దిగ్భ్రాంతి చెలంగె; నింగి రొదగొల్పెం గ్రిందుమీదైనటుల్.

మనసాతీత మనోజవంబున నభోమార్గంబునం బోవుచో
మును నం దాకిన తారకల్ పగిలి దుమ్ముం ధూళిగా రేగి నా
వెనువెంటం బరతెంచ, జాడవడియెన్ విస్వీధి స్వర్గంగ మ
త్తనుసంతాపము వాప శీతజలపాతంబై సమీపించెనా౯.

అప్పటి నామనోనుభవ మద్భుత మేమని చెప్పవచ్చు ! నే
నుప్పర మేగునప్పుడు నుడూత్కర మొయ్యన గ్రిందజారున
ట్లొప్పెను ; బోవబోవ ఖయి నోరల గ్రింద నమేయగోళముల్
గప్పిన యంతరాళము వికస్వరమై కనువిందొనర్చెదుఁ౯.

వారణము వారిమగ్న కుంభస్థలంబు
నెత్త, వలయంబు క్రమవృద్ధి నొత్తినటుల
బైకి జనుచుండ, మిన్నులు వడ్డచోటి
పరిధి, వామనరూపంబుపగిది నెదిగె.

పుష్కలావర్తకంబులు పొదలినట్లు
తారకాధూళి మొత్తమై తనర, నందు
సుడితుపానులు లోలోన సుడిసి రేగి
ప్రథిత నటరాజ తాండవ భ్రాంతి గొలుపు.

తేలెడు తెట్టెలౌ పగడదీవు లన౯ మెలమెల్ల దారకా
జాలము లేడకో చనెడు జాడ గనంబడు ; దోకచుక్కలు
ద్వేలరయంబున౯ గగనవీథి గ్రమించి నటన్మయూరపిం
ఛాలయ పుచ్ఛవిభ్రమము లన్నిదెసల్ ప్రసరింపజేసెడి౯.

తెలుపు పసుపును నెరుపు లేమొలక నీలి
రంగులం బొల్చు తారలు నింగి వేృల,
మాపు, బహువర్ణ విద్యుత్ప్రదీపకలను
అందగిలు పెండ్లిపందిరి యనగ దోచు.

ప్రళయవాత నిరంతరావర్తమందు
దోకచుక్క దగుల్కొని తొలగలేక
తిరిగె నన దారకారాశి దిరుగుచుండె
నుల్కలం గురిపించుచు నుప్పరమున.

పంక నిర్మగ్నమయి లేవ వలనుపడక
ధూమ్ర బృహవశ్వ మొక్కటి దోచె మింట;
దాని దప్పింప క్షణమైన దడవులేక
యతుల జవమున బైపైకి నరుగుచుంటి.

నిలువక కొంతకాల మటు నే బయి కేగుచు నుంటిగాని యు
జ్జ్వలదుడుఖండమండలనిబంధమునం బడి చిక్కుకొంటి; ఆ
స్థలము పరిక్రమింప బలదర్పము చాలమి గొంతకాల మా
కులపడి దారిచేయుటకు గుమ్మరిసారెగతిన్ భ్రమించితిన్.

పరిసరధూళి మేఘములు పాయలుగా బరికీర్ణమౌచు లో
బిరివిడి మత్తనుభ్రమణ వృత్తమునం బడి భీషణాగ్నికిం
గరగి మదీయదేహమును గ్రుచ్చుకొనంగ, దవాది రాశి దు
ర్భరమయి యన్నిలట్లు బలవంతుడనై యభివృద్ధి నొందితిన్.

ఇట్టు లుండగ నాకన్న నెన్ని రెట్లొ
ఘనతరం బగు తార నాకడకు రాగ
మించు భయమున మేను కుంచించి యొదిగి
గతుకులో బడ్డ బండినా గదలిపోతి.

బొదబొదగా లొదలొదగా
కదలెడు నాదేహమందు గణితలు పుట్టెన్;
ముదిరి యవి పెద్దవాయెను;
కుదుటును మెయి తూకువాసి గునుకుచు నుంటిన్.

భ్రమణ విస్తారవేగ దుర్వారహతికి
గణిత లెల్ల వృంతచ్యుతి గాంచి చెదరి
బహుళదూరంబునం బడి భ్రమయుచుండె;
అకమును జక్రమటు నన్ను నాశ్రయించి.

అందు నొక్కటి మీపృథ్వి యౌ గుమార ;
కాని, దానికి నొక పెద్ద కణిత పుట్టె ;
అదియు గాలక్రమంబున ముదిరి, వీడి,
సోమబింబంబునా భువిచుట్టు దిరుగు.

ఇవి యెల్లఁ వచియింప గొన్ని నిమిషాలే యైన, నెన్నెన్ని కో
ట్లవు వర్షంబులు చెల్లె దద్విషయముల్ సొంతంబుగా సృష్టికాఁ ;
కవి, నీభావవిహారఖేలనము విఖ్యాతంబుగా సాగ గొ్రి
త్తవిశ్వాద్భుత దృశ్యమార్గములు మోదస్ఫూర్తి సూచించితిన్.

మాటాడ దలచియును నా
నోటను దడి లేక యడ్డునుడివిన నేమో
లోటగు ననుకొని వెరగుం
పాటున రవిజీవితంబు బాయక వింటిఁ.

విని యిటు లంటిః నోప్రభువ, విస్మయచిత్తుఁడ నైతి మీచరి
త్రిను విని ; విశ్వదర్శనము తన్మయతం గలిగించి నామనం
బున నవవిజ్ఞతాంకురము మొసిడజేసెను ; మూఢభక్తివ
ర్తిని త్రుటిమాత్రి సత్యపరిధిన్ నిలబెట్టితి వయ్య భాస్కరా.

ఐనను సంశయములు నా
మానసమున నంకురించె ; మనవి యొనర్తున్ ;
భానుం డొకడే యని యా
మానితుడున్ మీరె యని భ్రమం గొనియుంటిన్.

మీమాటలు విన్నంతట
వ్యామోహము కొంత దొలగె, నైననుగానీ
వ్యోమము గాలించిన ది
క్సీమల బరసూర్యు డెవడు చిక్కడు దృష్టిన్.

నీదు సందేహమున గొంత నిజము గలదు ;
ఈ ప్రపంచమునకు నేన యినుడ నౌదు ;
తక్కు భాస్కరు లూహింప దరముగాని
దూరమున నుంట జుక్కలై తోచుచుంద్రు.

వారిచుట్టును గ్రహములు భ్రమయుచున్నె ?
వారలకు నిట్టి ధరణులు ప్రజలు గలరె ?
అంద రర్కుల గుక్షిలో నణచుకొన్న
విశ్వకర్త్రుర మది యెంత విస్తృతంబొ !

చాల సూర్యు లేకాకులై సంచరింత్రు;
కొందరను జుట్టి గ్రహము లందందు దిరుగు;
ఉష్ణ మనుకూలసిద్ధమై యొప్పుకతన
బ్రస్తుతము ధాత్రి గొనసాగు బ్రాణిసృష్టి.

పసుప నంతట నెందరు ప్రజలు గలరొ
అన్ని తారక లొప్పారు నాకనమున;
ప్రాత తారలు చల్లారి భస్మమైన
గ్రొత్త తారలు పుట్టు నేకోణమందొ.

విశ్వవైశాల్య మింతని విశదపరుప
వలనుపడబోదు నావంటివానికైన;
నిఖిల సౌరకుటుంబముల్ నియతి లేక
చెవర జల్లిన విధమున గుదిరియుండు.

అరయు, నిరువదిలక్షల యంతరీప
విశ్వములు గ్రాలు బ్రహ్మాండ విపులకుక్షి;
నందు నొక దీవి నారాజ్యమౌ గుమార,
యితర దీవుల కిట్టులే యినులు గలరు.

మనకు దగ్గరగా నున్న యినుని రశ్మి
ధరణి జేరంగ నైదేండ్లు జరుగవలయు;
దూరతములైన సూర్యుల దొరగు కాంతి
ప్రాకు బదునాల్గుకోట్ల వర్షముల నిలకు.

ఎనిమిది నిమిషంబులలో
ననయము మత్కాంతి భూమి కరుగుచునుండున్;
గనుగొనుమ పోల్చి యెంతటి
ఘనవిస్తృతి గలదొ విశ్వకర్పరమునకున్.

ధరణికన్న నే దశలక్షల తరము లెచ్చు;
మరియు నాకంటె దశలక్షతరము లెచ్చు
గలుగు నెన్నెన్ని తారలు గలవు చదల;
అన గొనయు లేని యీసృష్టి కంతు లేదు.

ఇది యెట్లు సంభవించును?
మొదలుం దుది లేని దొకటి మొనయునె? శంకా
స్పదమగు మీమాటలు; న
య్యది యెటు లూహింపవచ్చు నన, రవి యనియెన్.

♦ కాంతి ఒక సెకండునకు ౧౮౬౦౦౦ మైళ్ళదూరము ప్రసరించును.

దాగల్ పుట్టును, చచ్చి భస్మమగు; దద్భస్మంబె వేరొక్క యా
కారంబుం గొని నూత్నజీవనముతో గంపించు; గల్లోలినీ
పూరం బింకియు బాష్పమై జలదమై పూరించు వర్షంబు; నీ
దారిన్ విశ్వ మనంతరజ్జువటు నిత్యంబై భ్రమించుంగదా.

స్థితియు రూపంబు మారును జేటు లేదు
అసలు వస్తువునకు నెప్పు డరయుమోయి;
మంటిగోడ వాన గరంగి మన్నుగాగ
అదియె పరగృహనిర్మాణ మందు నొదవు.

సృష్టిలేని క్షణంబు నూహింపలేము;
విలయ ముండని త్రుటిని భావింపలేము;
ప్రతినిమేషము భిన్నాంబుపూర మగుచు
బారు జీవనది యగు విశ్వంబు సఖుడ.

భానుకుటుంబములకు నా
భానుల కటు తప్పకుండ ప్రళయము గల్గున్;
గాని, యిటు విశ్వమంతకు
నేనాడును లేదు విలయ; మిది సత్యంబౌ.

అన విని గర్వలేశము హృదంతరమందు జరింప, లోన నే
ననుకొనుచుంటి : సూర్యుని నియంతృత రాజ్యము విశ్వవీథిలో
అణురజమంత యౌ ననుచు; నంత వసుంధర జ్ఞప్తిరాగ సి
గ్గున దల వంచి నాతలపు గూఢముగా సవరించి పల్కితిన్.

ఇంతటి సత్యప్రియులను
ఇంతటి నిర్గర్వమతుల నెందును గన, మీ
స్వాంతంబున గాంతాళము
చింతాకంతయును లేక చెప్పితి రిటులన్.

నాకన్నన్ మహనీయులైన రవు లున్నా రన్న మీమాటకున్,
నాకుం జోద్యము గల్గె; నన్యరవి యౌన్నత్యంబు నిష్కైతవ
ప్రాకామ్యంబున పర్సనల్ సలుపు స్వార్థత్యాగసంపత్తి మీ
ధీకారుణ్యము గౌరవంబు దెలుపుం దెల్లంబుగన్ భాస్కరా.

పలుమరు నీరజాతహితు బ్రస్తుతియించి, యనంతరంబు మీ
వలన ననంతవిశ్వపరిపాలనగు ప్తసమస్త ధర్మముల్
వెలితి పొలంగ వింటి బహువిజ్ఞత చేకురె; నైనగాని మా
యిల మిము వీడి యవ్వల నెటెట్టుల నుండెనొ చెప్ప వేడెదన్.

తమకు ముద్దుల కూతురు ధరణిదేవి
చిన్నదయ్యును వయసులో జిన్నదయ్యు
ప్రాణికోటుల భరియించు భవ్యవృత్తి
మహితయశౌచు జెలంగు మా మాతృభూమి.

అని నే విన్నప మాచరింప విని నెయ్యంబార సూర్యుండు నీ
ఘనవిజ్ఞాన తృషాపనోదముగ వక్కాణింతు భూదేవి గాం
చిన మార్పుల్ పరిణామసంచరణ నిశ్రేణీవిశేషంబులన్
వినవోయీ కవితాతపస్వి, యని గావించెం గథారంభమున్.

ధరణి యిన్నూరుకోట్ల వత్సరము లప్డు
గండరించెను నామేనినుండి విడి;
నెత్తురుం గండ లొకటౌట నెలవుకొనియె
వంత్రి యత్యుష్ణతత్త్వంబు తనయయందు.

విధివశంబున దనువులు వేరుపడియు
ప్రేమసూత్రాలు తెగవు మాహృదయములను;
మచ్ఛరీరభరాకృష్యమాణ యగుచు
అవని నాచుట్టు దిరుగు జక్రానువృత్తి.

ఈవిధి నెక్కువత్సరము లేగిన బైకొను నగ్నికీలలుం
దీవరమైన క్రొంబొగలు దిక్కుల దాపము రేపు వేండ్రముం
జావ, గ్రమక్రమంబుగ బ్రశాంతత నొంది, తటాక మెండ బై
పై వడబారి కర్దమము పక్కలుగట్టెడుపోల్కి జూపెడెన్.

లోలోనం బరితప్తమై ద్రవము కల్లోలించి యుత్క్షిప్తమై
రాలం, గన్నుల పండువై తనరె ధారాయంత్రనాళోద్గిర
త్త్రాలోత్తాల జలప్రకాండ మన; దద్దారాతసంబుల్ పయిన్
జాలుల్వారి పటించి గట్టిపడి రాచట్టుల్గ మున్నేర్పడెన్.

దినదినము గల్గు భూకంపతీవ్రతలకు
పైని బెరడులు పెటలి లోపలకు గ్రుంగి
కాకకు గరంగి క్రమ్మర గల్లుగట్టి;
అట్టి కల్లులె గిరులకు నడుగుబందు.

తొలుసృష్టి బండ లెట్లగు?
జలమని కొందరు వచింత్రు; సత్యం బేదో
పలుకుమ యని నే వేడిన
జలజాతాప్తుండు నంతనంబున నుడెవెన్.

అతిగ దీండ్రించు వేడిమి నవని కాగ
నీర మచ్చోట నెట్టుల నిలువ నేర్చు?
బాష్పరూపంబుగా నభోభాగమందు
నంతరము లేక యెల్లెడ నాక్రమించు.

జరిగె బెక్కేడు; లుష్ణాతిశయము కొంత
తొలగె; నావిరి తడివారి తొలకరింప
అంతరాగ్నికి దప్తమౌ నవని బడిన
యంబుబిందులు చుయ్యని యావిరయ్యె.

గుంట మిట్టలు గండులు గుట్టలునుగ
ధరణి యెల్లను విషమమై పరుగుచుండె;
అగ్నిపర్వత శిఖరంబు లచ్చటచట
గడుపులో మంటలను వెళ్లగక్కుచుండె.

కరగిన శిలాద్రవంబు ఉప్పరము జిమ్మ
లోన గొన్ని తలంబులు లొత్తలగుచు
పైన గట్టిన రాచట్టు పగిలి క్రుంగి
వెడలుపైన పల్లంబులు గదలుకొనియె.

నిన్న జూచిన తలములు నేడు చూడ
గనుగొనగరానియటు మార్పుగాంచియుండు;
క్షణముక్షణమును భిన్నవికారములను
జెందుచుండెను ధాత్రి విచిత్రగతుల.

మొయిలుగట్టెను; వానలు మొదలువెట్టె
ధరణిపయి దాటిమానెత్తుపాక నెరసి
అవిరిం బొగ గాలి కుయ్యాలలూగి
మత్కరాంశుప్రసారంబు మరుగుపెట్టె.

అంతట నాదిమప్రకృతి యాకులభౌతికఖేలనంబు దు
ర్దాంతముగా జెలంగె; జలదప్రళయం బన వానపట్టె; ది
గ్దంతుల కుంభముల్ పగులదన్నెడునట్టుల వజ్రపాతముల్
ఇంతకు నంతకుం బ్రబలె; హెచ్చె సమీరవిహారదర్పముల్.

వాననీటను బల్లాలు పరశిలెల్ల
నిండి వారిధులయ్యె; ఆనీటియందు
అవని గల యుప్పు ధాతులోహములు గలసి
యొక యపూర్వరసాయనయోగ మొదవె.

శ్యామలోహిత కిరణ సంస్పర్శనముల
జలధియోరల క్షారపుష్పంబు పూచె;
మంచునీటను అపూత మాగి కరగి
జిగురునునుగుల పొర యొండు సృష్టియయ్యె.

అందుల నణుప్రమాణములైన సూక్ష్మ
జీవు లెన్నెన్ని ప్రభవించి చెదరిపోయె;
అలలపై దేలి యంచుల కరిగె గొన్ని
అడుగుభాగంబు మరికొన్ని యాశ్రయించె.

అనవిని నే బ్రశ్నించితి
వనజాప్త, యిదెట్లు సాధ్యపడునో! జీవం
బెనయునది సూక్ష్మమయ్యును
జనియించునె యొందు మృతరసాయనశక్తిన్.

చేతనాచేతనవిచారసిద్ధి గన్న
సత్యవిధులకు దీన సంశయము లేదు;
కాని, మనుజుల కింకె నాజ్ఞానరశ్మి
కలుగ; దొకవేళ నికముందు గలుగవచ్చు.

అట్టులైనను దేవుని కాటవిడుపు
నిచ్చి పంపించవచ్చు నోయినుడ! సృష్టి
యాదిశక్తికృతం బని యంటి వపుడు;
ఇటు రసాయనశక్తి యిందేల వచ్చె?

ఆదిశక్తి యన్నను దైవమన్న నొకటె;
మాటభేదమె యసలులో మార్పు లేదు;
ప్రకృతిపురుషులు క్షీరనీరంబులటుల
గలసి, యవిభాజ్యులై యైక్య మొలసియుంద్రు.

ప్రకృతిపురుష లన్నను రెండు వ్యక్తులటుల
వేరుగాదోయి యొకదాని భిన్నదిశలె;
ఆదిశక్తి యటంటి ముస్సృష్టిదాని;
అయిన, నిపుడేమి తల్రక్రించు లరసి నీవు!

* కాలావకాశములు ము
న్నేలిక భిన్నంబులయ్యె నుత్తమశాస్త్ర
జ్వాలాతప్తమయి కరగి
మేళకమయి యొక్కటౌచు మెలగవె నేడుక?

* కాలావకాశములు — Time and Space.

దైవమన సృష్టిబాహ్యమై తనర దెపుడు;
అణువునందును బ్రహ్మాండమందు నేక
సరణి నాశక్తి వ్యాపించి సర్వసృష్టి
హేతువయి నిత్యవిశ్వసంసృతిని నడపు.

అటు రసాయనక్రియలకు నడుగుబందు
అణువె యౌటను లేదె యం దాదిశక్తి?
కార్యకారణబంధంబు గడవరాని
సృష్టిసూత్రంబు; నిత్యమై చెలగునోయి.

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజుని సృష్టిచేసె నాదిమదేవుం
డని పలికి తీవు; మనుజుడు
తన రూపమె యంటగట్టె దైవంబునకున్.

పిల్లి యూహించు దేవుని బిల్లియటుల
నక్కకున్ దేవుడుండిన నక్కరూపె;
అన్ని రూపంబు లెత్తెడి యాదిశక్తి
కొక్కరూపమె ప్రియమయి యుండనేల?

అని యిటు సూర్యుడాడిన దదర్థము చక్కఁగ బోధగాక నా
మనము కలంగి రేగి విసుమానము సంశయ మూప్పతిల్లె; దే
వుని విషయంబు లెందు దుదిపోవవు, రావణు కాష్టమట్లు ని
త్యనవములై చిరంతనములై కనసౌ నెవరెన్ని చెప్పనన్.

పొద గదలు తీవ లాగిన.
మొదలిడ నీచర్చ యింక ముగియక సాగుం;
గదలెడు దరణియు, నూరక
వదలక శేషంబు వినుట భావ్య మటంచున్.

ప్రథమమున సూక్ష్మజీవులు ప్రబలె నంచు
నంటి రామీద నేమయ్యె నానతిండు;
చిత్రచిత్రంబుగా నొప్పు సృష్టిచరిత
వినవలతు నన్ను సూర్యుఁడు విచిచెనంత.

జననంబు మాతృకార్యము
తనుభంగము సంతువృద్ధి తత్క్షణమందే
కొనసాగు సూక్ష్మజీవుల
తనయుము; నిటు లక్షలేదు లరిగినపిదపన్.

పరిసరంబులు భేదంబుబట్టి వాని
యందు ప్రత్యేకతలు కొన్ని వ్యక్తమయ్యె
అంచు నున్నవి పచ్చని యణువులయ్యె;
క్రింద నున్నవి వేరె యాకృతులు వడసె.

అంచుల బచ్చని యణువుల
సంచయములు చేరి బూజు జాలకపుటు వ్వా
పించి చిరుపాచి పట్టిన
సంచున బయినీట విరివి సాగుచునుండెక్.

మిగత యణువులు కంటికి దగులునటుల
గృములుగా మారి పరిణామ మెనయుచుండె;
జీవనస్పర్ధ సామాన్యచేష్ట యౌట
బలము గలయవి దుర్బలములను మెసవు.

కడలినీగ మింకను ధాతుకలిత మయ్యె;
శీతవాతోష్ణపరిసరస్థితులు మారె?
అనువుపడని బహుప్రాణు లంతరించె;
అన్యజీవులు మార్పుల ననుసరించె.

నాచుతీవల గొమ్మలు ననలువెట్టి
వనధితరుజాతులై మున్ను పరిణమించె;
అడుగుబురదను సున్నంబు గదలుకొనుట
పగడతీగలు గుల్లజీవములు పుట్టె.

ఉదధి యప్పుడు గాధమై యుండుకతన
వర్షఋతువుల బెల్లుబ్బి పైకి బార
బ్రిక్కపడియలు గుంటలు పర్రలందు
బ్రాణికోటులు నాచుతీవలును జేరె.

అంత గాలానుసరణి నిరస్థికములు
పలుతెరగులైన జలచరములు జనించె;
జల్లిచేపల పీతలు సలిలవృశ్చి
కములు నత్తలు జలగలు గండరించె.

పడియలలోనదప్ప బేరపట్టుల వృక్షము లేవి లేవు; మీ
పుడమియు బచ్చవారక యపూర్వమరుస్థలమట్లు చూపడెం;
బొడవుగ దాటిబోదెలటు పుట్టియుఁ బ్రాకులు, పూలుపండ్లు చో
ప్పడవు; తరుప్రకాండముల బాచియె యాకులుగా జిగిర్చెడుఁ.

జల మింకిన పడియలలో
నిలిచిన ఝూజములు కొన్ని నెలలు వడివడఁ
అలవాటుపరచుకొని య
వ్వల నిర్జలభూమి మొలచి వర్ధిలుచుండెఁ.

జలనిధి బుట్టె వెన్నెముకచట్టము గల్గిన చేప, లవ్వియే
యిల గల సర్వజంతువుల సృష్టికి మూలమటన్న, వింతగా
దలచి యిటంచు నేతరణి, తథ్యమె? పూర్వము మానవావళుల్
కలిగిరి కోతిసంతతులుగా నని చెప్పితి రిందు కేమనఁ.

వినుమోయీ, సర్వంబును
వినుటకు మున్నెల యింత వేగిరపడగఁ;
గనుగొందు వీవె చేపలు
వననిధి విడి బయలు ప్రాకివచ్చినవిధముఁ.

పడియల నీర మింకి వడబారిన పంకము నందు గూరికొం
చడుగున నుండి గాలికయి యౌదల లెత్తుచు బీల్చుచుంట నే
ర్పడె దమ దేహమందు నిరుప్రక్కల నూపిరితిత్తు; లాపయిం
బొడమెను వానిసంతతుల బూర్వముకంటెను గొన్ని భేదముల్.

గాలిపీల్చుట పాడినేల గదలుచుంట
ఎండవేడికి దాళుట యెగిరిపడుట
నలవరుచుకొన్న నూత్నమత్స్యముల నంతు
బయట నీటను నడయాడ వలతు లయ్యె

అక్కరనుబట్టి రెక్కలయందు మార్పు
గలిగి లక్షల యేండ్లకు గాళులౌట
జలచరత్వము నానాట నమసిపోయి
భూచరత్వము సమకూడి పొదలె నపియు.

ఇలపయి వింతవింతల మహీజము లుద్భవమయ్యె; బోదెలం
గలిగె బెరళ్ళు; నాకు లొడికమ్ముల గొమ్మల నిమ్ముడించె; భూ
స్థలిని అరణ్యముల్ బలిసె; దామరతంపరగాగ దోమ లీ
గలు పురుగుల్ చిటారములు కాటుకచీమలు పుట్టివెల్వడెన్.

బయట నీట జరించెడు పాము తేలు
కప్ప తాబేటిజాతులు కానిపించె;
నవియు గొన్నేండ్లకు నరణ్యా మాశ్రయించె;
జలధిజీవులు మెట్టవానంబు గాంచె.

తొండలు బల్లులు నలికిచు
తండంబులు ఉద్భవించి తరములు మారెన్;
మెండుకొనె కొండచిలువలు
కొండొక యాసురమృగంబు గోచరమయ్యెన్.

దంతి కెనిమిది బారల గొంతుక్రోవి
యంత నిడుపైన వాలంబు నతుకుపెట్టి
నెట్టు లుండునొ యట్టి యాకృతిని గల్గి
యాబృహజ్జంతు వెసగు జలాశయముల.

వాలము త్రిప్పికొట్ట బెనుపత్రల నీరము పైకి లేచి మే
ఘాలయమంటి వర్షమటు లచ్చటి వాలును; తోక మోపి ముం
గాళుల నెత్తి యున్నతపు గంధర జాపిన జెట్టుపైని ప
త్రాలును నోటికందు; వనరా జన నాసురజంతు వేలెడిన్.

కాననమందు నాసురమృగంబు మరొక్కటి గానిపించ లో
నూనిన కోపవహ్ని వెలి కూర్చెడునో యన రోజి రొప్పుచున్
దానిబయిం బడం దరలు, దాకొని రెండు పరస్పరంబు నే
త్రాననముల్ రయంబున నఖాగ్రములన్ క్షతివార జీల్చుచున్.

తోకతోకలగించి తునుపంగమెలివెట్టి
యన్యోన్యబలశక్తులరయలాగు;
లాగి పట్టునడల్చి వేగంబపయినిక్కి
యొండొండు గొంతుక లొడసికొరకు;
కొరికి లోదనియక కుయివెట్టి గర్జించి
పొట్టలో దలపెట్టి నెట్టిపొడుచు;
పొడిచి క్రిందకునొక్కి పొర్లింప నదిలేచి
తోక గిర్రని త్రిప్పి తుక్కు రేపు;

రాతితిప్పల దొరగు నిర్ఝరములట్లు
కాయమున నెత్తురూటలు గారుచుండ
అలసి సొలసి యం దొక్కటి యంతరించు;
ఇంకొకటి తెప్పిరిలి పన మేలుచుండు.

గాలికి నెండకుం దరుచుగా జడివెట్టిన నీటి ఘాటికిన్
రాల గరంగు ధూళి కుఫలంబుల బేరిన బంకమన్ను ఇం
జాలము గాగ నెల్లెడల బారి కుజవ్రజ మున్న పల్లవున్
నేలలు నింద నందు రమణీయసుమంబులు పూచె వల్లులన్.

ఎగురగల పాము లుడుతలు వృద్ధిచెందె;
పలువిధములైన గబ్బిళములు జనించె;
ఆవల నీకలు రెక్కలు నంకురించి
గగనచరపక్షిజాలము గానిపించె.

నిసువులకు జన్నుగుడిపెడు
పసరంబులు కరితురంగవర్గంబులు ముం
గిసలుఁ జింకలు సింగము
లెసెగెను, పచియింప నలవియే యవి యెల్లన్?

విపినచరమర్కటంబులు వేసవేలు
తెగలుగా నయ్యె బహుసరస్థితుల బట్టి;
ఆకృతుల లావుపొడుగుల నాచరణల
నలవడియె భేదగతులు కాలానుసరణి.

వానిలో వాలహీనములైన నాల్గు
జాతులు క్రమక్రమంబుగ జననమొందె;
అందు నొక జాతి వానర మపయుపముల
బోలికల మానవునకు దాపునకు వచ్చు.

ఆ నవీనవానరసంఘ మన్నికడల
కేగి తెగలుగ విడివడి వృద్ధిగాంచె;
నందు నొకతెగసంతతి యవని నేడు
సంచరించెడు మానవజాతు లెల్ల.

వానరమునుండి యాదిమమానవుండు
పరిణమించుట కొక కోటివత్సరములు
పట్టె; ప్రారంభమాయెను వాని నాగ
రకత ముప్పదివేల వర్షముల నాడు.

ఆది చేతనాణువు జన్మమైనదాది
నూటపదికోట్ల యేడులు దాటిపోయె,
యేకమూలమునుండి యనేకరూప
వర్గములు భూతధాత్రిని బరిణమింప.

కలవిషయంబు లెల్ల సరిగా వివరించిన నెంతకాలమో
వలయును; నిందు నందు నొక పట్టును సూక్ష్మముగా వచించితిం;
దెలియుమ యన్న భాస్కరుడు, తృప్తుడనౌచు గృతజ్ఞతామతిం
దెలుప నమస్కృతుల్ సలిపితిన్ క్షమియింపు డటన్న రీతిగన్.

[ భారతిలో ప్రకటితము: 1943 ]